# పి.టి. 109
# ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో కెనెడి




మూలం:
రాబర్ట్ జె. డో[illegible]

అనువాదం:
ముళ్ళపూడి వెంకటరమణ




విజయవాడ-2.

# తొలిపలుకు

ఈ గ్రంథంలో పేర్కొన్న కథాస్థలాలను స్వయంగా సందర్శించి, ఆయా సంఘటనలలో పాల్గొన్న వ్యక్తులెందరినో కలుసుకోడానికి 30 వేల మైళ్ళు పర్యటనచేసి సమగ్ర సమాచారం సేకరించినమీదట ఇది రూపొందించటం జరిగింది. రెండవ ప్రపంచయుద్ధంలో దక్షిణపసిఫిక్ సముద్రంపై తమతమ అనుభవాలను గుర్తుచేసుకొని నాకు తెలియజెప్పి ఈ రచనకుతోడ్పడిన ప్రెసిడెంట్ జాన్ ఎఫ్. కెనెడీకీ, పి. టి. 109 ప్రమాదంలో ప్రాణాపాయం తప్పించుకొని బయటపడిన ఆయా నావికోద్యోగులకూ గాఢమైన కృతజ్ఞత తెలియజేసుకుంటున్నాను. అచ్చువేసేముందు వ్రాతప్రతిని, తరువాత గాలీ ప్రూఫ్‌లనుకూడా ప్రెసిడెంటు కెనెడీ తీరికచేసుకొని చదివారు.

1943 ఆగస్టులో పి. టి. 109 బ్రద్దలయిపోయినపుడు ప్రెసిడెంట్ కెనెడీ, ఆ బోటుసిబ్బంది అనాథులై తిరిగిన ద్వీపాలన్నిటికీ నేనూ, ఫొటోగ్రాఫర్ ఇలియట్ ఎర్విట్ వెళ్ళి ఆ ప్రాంతాలన్నిటినీ పరిశోధించాము వాళ్ళు కాళ్ళు బొబ్బలెక్కేట్టుతిరిగిన పగడపురాతిగుట్టలన్నిటిమీదా నేనూ నడిచాను. వాళ్ళు ఈదినప్రాంతాలలో ఆయావడులలో, సుడులలో నేనూ ఈది ఆనాటి వాళ్ళశ్రమదమాలను అర్థంచేసుకునేందుకు ప్రయత్నించాను.

ఆనాడు కెనెడీని, ఆయన సిబ్బందిని కాపాడేఉద్య మంలో ఏదోఒకరూపేణా పాల్గొన్న ద్వీపవాసులు పదిమందీ నేటికీ సజీవులై వున్నారని తెలిసి ఆ పదిమందినీ కలుసుకొని మాట్లాడాను. వారిలో చాలమంది మాతోపాటు మా 'కింగ్ ఫిషర్' బోటు (కొబ్బరిపట్టలతో కట్టిన పెద్ద తెప్పను, ఈప్రయా ణానికి అనువుగా యంత్రాలనమర్చి రూపొందించారు) మీద ఈ ప్రాంతంఅంతాతిరిగి, ఏయేస్థలాలలో ఎప్పుడు ఏదెట్లా జరి గిందో చూపించి తెలియజెప్పారు.

లుంబెరీద్వీపంపై నెలకొల్పిన పి.టి. స్థావరంలోముందు భాగం ఇంకా నిలిచివుంది. 1943 ఆగష్టు 1 వ తేదీన-పి. టి. 109 మీద ప్రమాదానికి గురిఅయ్యేనాడు కెనడీ బయలు దేరింది ఇక్కడనుండే. ఆనాటిమధ్యాహ్నం 'రెండోవా' హార్బర్‌లోని పి. టి. బోట్‌లు కాల్చికూల్చివేసిన జాపనీస్ విమానాలు నేటికీ నీటిఅడుగున పగడపుగుట్టలమధ్య పడి వున్నాయి. అవన్నీ మేము చూశాము.

మేము మొట్టమొదట సిడ్నీ వెళ్ళి ఆర్థర్ రెజినాల్డ్ ఇవాన్స్‌ను కలుసుకొన్నాము. ఆయన కెనెడీని కాపాడడానికి ఏర్పాట్లుచేసిన ఆస్ట్రేలియన్ కోస్ట్‌వాచర్. పి. టి. 109 కి జరి గిన ప్రమాదానికీ, కెనెడీ బృందాన్ని కాపాడడానికీ సంబంధిం చిన వివరాలు తెలుసుకోడానికి ఆయన తన 'లాగ్‌బుక్' (ఓడలమీద దినచర్యవ్రాసే పుస్తకం) చూసే అవకాశమిచ్చి సహకరించారు. అక్కడనుండి సాలమన్‌దీవులకు విమానంపై వెళ్ళాము. ఈ ఉదంతంలోవచ్చే రెండోవా, లుంబెరీ,

న్యూజార్జియా, గిజో, నారూ, ఓలసానా, ప్లమ్‌పుడ్డింగ్, వానావానా, గోము, కోలంబంగార, లియొరావా, వెలా లావెలా, మోలీ, ఛాయ్‌సూల్ ద్వీపాలన్నీ సందర్శించాము.

ఛాయ్‌సూల్‌లో ఒక పెద్దమేరైన్ గ స్త్రీదళాన్ని జపానీయులు చుట్టుముట్టివేశారు. వాళ్ళని కాపాడటంలో కెనెడీ చాలా అద్భుతమైన భూమిక నిర్వహించాడు. అప్పటికి పి. టి. 109 ధ్వంసంఅయినందువల్ల కెనెడీ పి. టి. 59 కి క్టెప్టెన్‌గా ఉన్నాడు. పసిఫిక్ ప్రాంతంలో ఆయన నడిపిన రెండో బోటు (అదే చివరిది) అది. ఆనాటి సంగ్రామానికి 'అంతిమవాక్యం' అన్నట్లుగా మాకు ఆ దీవిమీద ఇసుకతిన్నెలలో తుప్పుపట్టి పోతున్న ఒక జాపనీస్ హెల్‌మెట్ (ఉక్కుటోపీ), ఒకమానవ కపాలం దొరికాయి.

సాలమన్స్‌నుండి టోకియో వెళ్ళాము. 'బ్లాకెట్ స్ట్రెయిట్' లో పి. టి. 109 ని ధ్వంసంచేసిన జాపనీస్ డిస్ట్రాయర్ 'అమగిరి' పై ఆనాడు పనిచేసిన ఆఫీసర్లు, నావికులు, దాదాపు 30 మందిని కలుసుకొని ముఖాముఖిగా గోష్ఠిజరిపాను. వారిలో ఆనాడు ఓడపైఉన్న సీనియర్ ఆఫీసర్, 11వ డిస్ట్రాయర్‌దళం మాజీకమాండర్ కాట్సుమోరియామాషిరో స్కిప్పర్, కమాండర్ కోహీహనామి ముఖ్యులు. డిస్ట్రాయర్ 'అమగిరి' ఆనాడు పి. టి. 109 ను ప్రమాదవశాత్తూ ఢీకొన్నదా, కావాలనే గుద్దిందా అన్నది వివాదాస్పదవిషయంగా ఉన్నందువల్ల ఆ సమయంలో 'అమగిరి' స్టీరింగు

చేతపట్టుకొని సారథ్యంచేస్తున్న కాక్స్వేయిన్ కజూటో డోయ్‌ని కలుసుకొని ఆయన ముఖతః యథార్థం తెలుసుకోవాలని చాలా ఆదుర్దాపడ్డాను. నేను వెళ్ళేనాటికి అస్వస్థులుగా ఉన్నారు. కాని దరిమిలాను ఎంతో ఓపికతో వివరాలు తెలియజెప్పి సహకరించారు. వాటిలో మరువరాని సంఘటనలెన్నిటిలోనో ఆయనకూడా ఒకడు.

ప్రమాదంనుండి తప్పించుకొన్న సిబ్బందికాక, ఈక్రింది వారుకూడా ఎంతో సహాయసహకారా లందజేశారు. వీరు కూడా ఈ రంగంలో పనిచేసినవారే- ఆలెన్ పి. కాల్వెర్ట్, ఆల్విన్ పి. క్లస్టర్, థామస్ జి. వార్‌ఫీల్డ్, కమాండర్ హెన్రీ జె. బ్రాంటింగ్‌హామ్, రాబర్ట్ లీరోడ్స్ జూనియర్, పాట్ మన్రో జేమ్స్ ఎ. రీడ్, జాన్ ఎల్. ఐల్స్, పాల్ జి. పెన్నాయర్ జూనియర్, లెఫ్టినెంట్ గవర్నర్ ఎడ్వర్డ్ ఎఫ్. మెక్లాలిన్ (మాసాచుసెట్స్) డెప్యూటీ అటార్నీజనరల్ బైరన్ ఆర్. వైట్, రిచర్డ్ ఇ. కెర్సీ, లెఫ్టినెంట్ కర్నల్ వార్నర్ టి. బిగ్గర్, నౌకాదళం అండర్‌సెక్రటరీ పాల్ బి. ఫే జూనియర్. పి. ఎ. పోటర్, విలియం కలెన్‌బాటిల్, చార్లెస్ ఎఫ్. రాలీ జూనియర్, జాన్ హర్లీ, విలియం ఎఫ్. లిబెనా, జేమ్స్ ఎల్. వుడ్స్, కెప్టెన్ రోలిన్ ఇ. వెస్ట్‌హోమ్, బ్రియాంట్ ఎల్. లార్సన్, కారల్ ఎస్. లివింగ్‌స్టన్, ఇ. హెచ్. క్రూజ్, సిడ్నీరెబెకాఫ్, జో జి. ఆట్కిన్‌సన్, రెప్రజెంటేటివ్ టార్బెట్ హెచ్. మాక్డోనాల్డు ముఖ్యులు.

ద్వీపాలలో నాకు ముఖ్యంగా తోడ్పడినవారు ముగ్గురున్నారు. బ్రిటిష్ వలస వ్యవహారాల కార్యాలయానికి చెందిన అధికారి జాన్‌లీసీ, 'కింగ్‌ఫిషర్' బోటు కెప్టెన్ డిక్ హార్బర్, మిత్రరాజ్యాల తరఫున స్కౌట్ (స్థానిక సహాయకుడు) గా పనిచేసిన బెంజమిన్ కీవు. బెంజమిన్‌కు ఆంగ్లభాష తెలుసు. మిగతా స్కౌట్‌లతో నేను మాట్లాడినప్పుడు దుబాసీగా వ్యవహరించింది ఇతనే.

జపాన్ వెళ్ళినపుడు "అమగిరి" నౌకకు చెందిన ఎవరెక్కడున్నారో తెలుసుకొని వారితో ఇంటర్వ్యూలు జరిపించినది మిస్ హరుకో హసానో. ఈమె అద్భుతమైన దుబాసీ. ఈమె, ఈమెతండ్రీ కెనెడీకుటుంబానికి పూర్వమిత్రులని విని ఆశ్చర్యపోయాను. అధ్యక్షపదవీ స్వీకారోత్సవానికి వీరిద్దరూ ప్రెసిడెంట్ కెనెడీకి వ్యక్తిగతహోదాలో వచ్చారట.

యుద్ధతంత్రరీత్యా ఈ ఉదంతంలో ఆయాస్థలాలకు గల ప్రాముఖ్యం, వాటి వివరాలూ శామ్యూల్ ఇలియట్ మారిసన్ వ్రాసిన 'బ్రేకింగ్ ది బిస్మార్క్స్ బారియర్', 'ది స్ట్రగుల్ ఫర్ గొడాల్ కెనాల్' గ్రంథాలనుండి సేకరించాను. ప్రెసిడెంట్ కెనెడీ జీవితంలో చిన్ననాటి ముచ్చటలు కొన్నిటిని జేమ్స్‌మాక్ గ్రెగర్ బర్న్స్ వ్రాసిన జీవితచరిత్ర 'జాన్ కెనెడీ: ఎ పొలిటికల్ ప్రొఫైల్' నుండి తీసుకున్నాను. పోతే, ఈ వృత్తాంతం గురించి వ్రాసిన అందరిలాగా నేనూ జాన్ హెర్సీకి ఋణపడివున్నాను. 1944 లో ఆయన న్యూయార్కర్ పత్రికలో వ్రాసిన వ్యాసంలో, సౌత్‌పసిఫిక్ సాహస

యాత్రలు చేసిన వేళలు, కేనెడీ, ఆయన సహచరులు మాట్లాడు సంభాషణలు వాళ్ళకి బాగా గుర్తున్నరోజులలోనే సేకరించి అందులో పొందుపరిచారు.

ఇందులోని ప్రతిచిన్న వివరమూ- అక్షరాలా ఉన్నది ఉన్నట్టు వ్రాయడానికి నాశక్తివంచనలేకుండా ప్రయత్నించాను. విన్నదాన్ని స్థూలంగా తీసుకొని ఉజ్జాయింపుగా ఊహించి ఏ ఘట్టమూ వ్రాయలేదు. ఏ సంఘటననూ, పోరాటాన్నీ కథలో కల్పించి వ్రాయలేదు. సంభాషణలు - సందర్భాన్నిబట్టి ఔచితినిబట్టి ఊహించి వ్రాసినవే. కాని, సాధ్యమైనంతవరకూ- ఆయావ్యక్తులకు గుర్తున్నమాటలనే తీసుకుని వాటికి దగ్గరగానే వ్రాశాను.

పోతే, ఈగ్రంథరచనలో శమదమాలను లెక్కచేయకుండా, భావుకతతో, శిల్పప్రావీణ్యంతో నాకు ఎంతో తోడ్పడినవారు- మెక్‌గ్రాహిల్ బుక్ కంపెనీవారి వ్యాపార విభాగానికి చెందిన ముఖ్యసంపాదకుడు ఎడ్వర్డు కూన్ జూనియర్. ఆపైన విషయ పరిశోధనలో అమరికలూ, కూర్పులూ మిసెస్ మేరీమూరీ ఎంతో నేర్పుతో పనిచేసి తోడ్పడ్డారు.

చెలీచేజ్, మెరీలాండ్ రాబర్టు జె. డొనొవాన్.

సెప్టెంబర్ 7, 1961.

# ది వైట్ హౌస్

సెప్టెంబరు 20, 1961

డియర్ బాబ్ !

ఈ పుస్తకం చాలా ఆసక్తితో చదివాను. యుద్ధంలో జరిగిన సంఘటనలు చాలా జాగ్రత్తగా యథార్థమైన వివరాలు ఇందులో పొందుపరచి వున్నాయి. ముఖ్యంగా ఈ ఉదంతానికి సంబంధించి నీవు సేకరించి వ్రాసిన ఎన్నో అంశాలు— అవి జరిగినపుడు నాకు తెలుసుకునే అవకాశం లేనివి ఇది చదివి తెలుసుకున్నాను. అవి చాలా ఆసక్తికరంగా ఉన్నాయి.

సిన్సియర్లీ,
జాన్ ఎఫ్. కెనెడీ.

మిస్టర్ రాబర్ట్ డోనోవాన్
న్యూయార్క్— హెరాల్డు ట్రిబ్యూన్
వాషింగ్టన్ డి. సి.

**1943** ఏప్రిల్ 7 వ తేదీ. అమెరికా నౌకాదళానికి చెందిన ఎల్. ఎస్. టి. 449 గాడల్ కెనాల్ ఉత్తరాదికోస్తా చేరుకుంది. నౌక టొగామాపాయింట్ చేరుకున్న వేళకి- మధ్యాహ్నం 12-15 గంటలకి- నౌకాధిపతి లెఫ్టినెంట్ కారల్ ఎఫ్. లివింగ్‌స్టన్ ఎదురువేపునుండి ప్రవాహంలా వస్తున్న నౌకలనుచూచి భ్రుకుటి ముడిచాడు. రవాణా నౌకలూ, డిస్ట్రాయర్‌లూ (విమాన విధ్వంసకనౌకలు) అమితవేగంతో ఐరన్ బాటమ్ సౌండ్‌లోకి వెళ్ళిపోతున్నాయి. ఈ సింధుశాఖకి ఈపేరు రావడానికి కారణముంది. గాడల్ కెనాల్ జపాన్ చేతి నుండి అమెరికా వశపరచుకునేనాటికి, అక్కడ చాల నౌకలు మునిగి నేల చేరుకున్నాయి.

ఇంకో ఐదు నిమిషాల తరువాత- 12-20 కి- కోలీ పాయింట్‌లోని సిగ్నల్ స్టేషన్‌నుండి, "కండిషన్ రెడ్" అని హెచ్చరిక ప్రసారమయింది. అంటే శత్రువిమానాలు దాడి చేయబోతున్నాయనీ, ఏ క్షణంలోనైనా వచ్చి పడవచ్చుననీ తాత్పర్యం. కొద్దిక్షణాలలో ఎల్. ఎస్. టి. 449 ఎదురు వైపునుండి దూకుడుగా పోతున్న మరో డిస్ట్రాయర్ ఇదే

హెచ్చరిక చేసింది. కెప్టెన్ లివింగ్‌స్టన్ వెంటనే తన నౌకను వెనక్కి మళ్ళించాడు. ఉంగా రోడ్స్‌గుండా పోతున్న నౌకా వాహిని వెంటపడి తనూ జోరుగా పోసాగాడు.

ఎల్.ఎస్.టి. 449పూటుగాబరువు వేసుకొనివుంది. సరుకు, జనంకూడా ఉన్నారు. సరుకు సైనికదళానికి కావలసిన యుద్ధ పరికరాలు, 170 యంత్రాలు ఉన్నాయి. జనం, సాల్‌మన్ దీవులలోని వివిధ కేంద్రాలలో చేరవలసిన నౌకాదళోద్యోగులు. వారిలో లెఫ్టినెంట్ జాన్ ఫిడ్జిరాల్డ్ కెనెడీ ఒకడు. అతను బాస్టన్ రాష్ట్రీయుడు. ఛోట్, హార్వర్డ్ విశ్వవిద్యాలయాలలో విద్యాభ్యాసం ముగించి రెండుమూడేళ్ళయింది. రోడ్ ఐలండ్ మెల్విల్‌లోని మోటారు టార్పెడోబోట్ స్క్వాడ్రన్ ట్రైనింగ్‌సెంటర్‌లో అప్పుడే శిక్షణపొంది, ఉద్యోగస్వీకారానికి బయలుదేరాడు. ప్రస్తుతానికి ఈనౌకలో అతనికేమీ పనిలేనందువల్ల ఈవేళకి అతను తనగదిలో పుస్తకంఏదో చదువుకొంటూ పడుకొన్నాడు. బయట అవాంతర స్థితి అతనికి తెలియదు. కెప్టెన్ లివింగ్‌స్టన్ కంగారుగా ఉన్నాడు. శత్రువిమానాలదెబ్బ తగలకుండా, ఒక్కొక్క డిస్ట్రాయర్‌నౌకను అడ్డుచేసుకుంటూ ఒడుపుగా తన రవాణా నౌకను ముందుకు నడుపుకుపోతున్నాడు.

రక్షణకోసం అటూ ఇటూ పరుగులు పెడుతూ కుడికీ ఎడమకీ విసురుగా తిరుగుతున్న ఓడ కుదుపుకి గదిలో కెనెడీ కూడా అటూయిటూ దొర్లాడు. ప్రమాదస్థితి ఏర్పడినట్లు పైనుండి హెచ్చరికలేవీ రాలేదు. అందువల్ల హఠాత్తుగా ఈ

ఉపద్రవం ఎందుకువచ్చిందో అతనికి తెలియలేదు. అతనికే కాదు, ఆవేళకి ఆఓడలో విశ్రమిస్తున్న మిగతా ప్రయాణికు లెవరికీ కూడా- చారిత్రాత్మకం అనిపించుకోబోతున్న పెరల్ హార్బర్ దాడి ఆరంభమైందనీ- న్యూబ్రిటన్‌లోని రాబౌల్ కేంద్రంనుండి 177 బాంబర్ విమానాలతో జపాన్ గాడల్ కెనాల్‌మీదకు విరుచుకుపడుతోందనీ ఎవరూ కలలోకూడా అనుకోలేకపోయారు.

ఓడను టాగోమా పాయింటుదగ్గర నిలిపిఉంచాలనీ, దీనినీ, ఎల్. ఎస్. టి. 446నూ ఆదుకుని రక్షణగా రావడానికి ఒక డిస్ట్రాయర్ వస్తోందనీ, లెఫ్టినెంట్ లివింగ్‌స్టన్‌కు వార్త అందింది. కొద్దినిమిషాలలో, కనుచూపుమేరలో డిస్ట్రాయర్ 'ఆరాన్ వార్డ్' కనబడింది. పోట్లగిత్తలా తల బాగా నీటిలోకి వంచి, వెనుకభాగం పైకెత్తి అమితవేగంతో శక్తితో సము ద్రాన్ని చీల్చుకుంటూ వచ్చేస్తోందా నౌక. అప్పుడుగాని, తర వాతగాని ఎల్. ఎస్. టి. 446 కనబడనేలేదు. కొద్దినిమిషా లలో ఎల్. ఎస్. టి. 449, ఆరన్‌వార్డ్, సబ్‌ఛేజర్ 521 కలిసి ఒక బృందంగాఏర్పడి న్యూహెబ్రిడిస్ దాపులలో ఎస్పి రిటోశాంటోవైపు వేగంగా పోసాగాయి.

మధ్యాహ్నం 3 గంటలవేళ గాడల్‌కెనాల్‌లోని కేప్ ఎస్పిరాన్ ప్రాంతంమీద, ఆకాశంలో చుక్కలు కనిపిం చాయి. క్రమంగా అవి పెద్దవయ్యాయి. కొద్దినిమిషాలలో యుద్ధవిమానాలు వాల్స్, జేక్స్ వగైరాలు ప్రస్ఫుటరూపా లలో అసంఖ్యాకంగా కనిపించాయి. అవన్నీ గాడల్ కెనాల్

లోని హెండర్‌సన్‌ఫీల్డ్‌మీద విరుచుకుపడుతున్నాయి. ఇటు ఉత్తరదిశన ఫ్లారిడాకోస్తామీద 'టులగీ' దీవిపై మరికొన్ని విమానాలు దాడిచేస్తున్నాయి.

నౌకను చక్రాలుతిరుగుతూ నడపమని లెఫ్టినెంట్ లివింగ్‌స్టన్ తన నావికులకు ఉత్తర్వుచేశాడు. అలావెళ్తే శత్రు విమానాలకు గురిదొరకడం కష్టం. ఎల్. ఎస్. టి. 449 ఒక్క సారి గురికి దొరికినా ప్రమాదమే. కారణం యుద్ధపరికరా లతోపాటు రస్సెల్ ఐలెండ్స్‌లో అందజేయడానికి ఈ నౌక బాంబులనుకూడా తీసుకువెళ్తోంది. అందువల్ల పైనుండి ఒక్క బాంబుపడితేచాలు ఈ ఓడయావత్తూ క్షణంలో తుత్తునియలై పోతుంది. ఇంతవరకూఉన్న కుదుపుపోయి, చక్రభ్రమణం ఆరంభంకావడంతో గదిలో కెనెడీకి గట్టిగా అనుమానం తగి లింది. లేచి బయటికి వచ్చాడు.

ఇంచుమించు ఆవేళకి-అంటే 3 గంటల 10 నిమిషా లకి- ఎండతళుకులోనించి తళుక్కుమంటూ ఒక జాపనీస్ బాంబర్ విమానం హఠాత్తుగా దిగజారి నిప్పులుకక్కుతూ 449 నౌకదగ్గరగా వచ్చివెళ్ళింది. ఓడకుఎడమవైపుగా పది అడుగుల దూరంలో 500 పౌండ్ల బాంబు ఒకటి నీటిలో పడింది. నీరు చెదరిన ఒక్కక్షణంతర్వాత బ్రహ్మాండమైన ధ్వనితో బాంబు పేలింది. ఓడ అడ్డాటుగా ఉవ్వెత్తున లేచింది. కుడివైపుకు 20 డిగ్రీలు ఒక్కవిసురున తిరిగిపోయింది. ఓడ ముందుభాగంఅంతా నీటినివదలి పైకిఎగసిపోయింది.

ఆవేళకు డెక్ మీాదికివస్తున్న కెనెడీ ఈ ఉధృతానికి ఎగిరిపడిపోయాడు. పైన కొండంత కెరటం విరుచుకుపడి ఓడను ముంచెత్తివేసింది. అంతకోక్షణం క్రితమే లివింగ్‌స్టన్ ఓడఎడమ వైపుకువెళ్ళాడు. బాంబు పేలుడు తాకిడి ఆయనను ఓడకుడి చివరకు విసిరికొట్టింది. అదేక్షణాన పైకివిరిగిపడిన కెరటంలో పూర్తిగా తడిసి మునిగితేలాడు. అంతవిసురుగా వచ్చిపడినా దెబ్బ ఆయనకు నొప్పిఅనిపించలేదు. కారణం పడినతాకిడికి మెడఎముక (**concussion**) విరిగింది. మొత్తంఅంతా మొద్దు బారిపోయింది.

డెక్ మీాదకు ఎగబ్రాకిన కెనెడీ ఆకాశంలోకిచూాచాడు. ఆనాడు అతనికి కనపడిన దృశ్యం జీవితంలో ఎన్నటికీ మరువ లేనంత భయానకంగా అద్భుతంగా ఉందని కెనెడీ అనే వాడు.

పైన తొమ్మిది శత్రువిమానాలు ఎల్. ఎస్. టి. 449 నీ, ఆరన్‌వార్డ్‌ని భీకరంగా చుట్టుముట్టాయి. వాటిలో కొన్ని పైనించి ముక్కుసూటిగా మీాదకిఉరుకుతున్నట్టువచ్చి బాంబులువేస్తున్నాయి. మరికొన్ని దూరంనుండి ఏటవా లుగాదిగి ఓడని ఒరుసుకుపోతూ అగ్నివర్షం కురిపిస్తున్నాయి. ఎల్. ఎస్. టి 449 ని ఊపివేసిన మొదటిబాంబుతాకిడికి తట్టుకునేలోపలే మరోటిపడి ఎడమవైపు (పోర్ట్‌సైడ్) ముందు భాగాన 50 అడుగుల మేరను దెబ్బతీసింది. ఇంకోక్షణానికి కుడివేపున రెండుబాంబులుపడి ఓడను ఊపివేశాయి. ఆ వెను వెంటనే మరోటి పడి బ్రిడ్జిపక్కన పెద్దదెబ్బకొట్టింది. నీరు పైకి ఎగజిమ్మింది.

ఈ గం్రదగోళంలో అల్లాడిపోయాడు కెనెడీ. ఒక్కొక్క బాంబుతో ఒక్కొక్క జల్రపళయం చెలరేగి ఓడ మునిగిపోయినంతపని అవుతోంది. ఒక్కొక్క బాంబు ్రపేలి నప్పుడల్లా ఓడలో ఏదోఒకభాగం దెబ్బతింటోంది. లైఫ్ బోట్లుకొన్ని ముక్కలయిపోయాయి. ఒక పెద్దపంపు విరిగి ధ్వంసంఅయిపోయింది. లోపల గదులుకదలి విరిగిపోయాయి. యం్రతాలుకొన్ని అదటుకు చితికి చెడిపోయాయి. చుట్టూ ఎన్ని బాంబులుపడినా ఒక్కటీ మీాదపడకుండా తప్పించుకు బైటపడింది ఎల్. ఎస్. టి. 449. కాని డిస్ట్రాియర్ ఆరన్ వార్డ్‌కి ఆ అదృష్టం లేకపోయింది.

కనుచూపుమేరలో నీటిమట్టానికి దగ్గరగా దిగి వస్తున్న ఒకవిమానాన్ని పడగొట్టడానికి కాల్పులుజరుపుతూంది ఎల్. ఎస్. టి. 449. అంతలో పక్కనేవున్న డిస్ట్రాియర్ ఆరన్ వార్డ్‌నుండి పొగలుబయలుదేరడం గమనించారు నావికులు. చూస్తూవుండగా సన్నటిపొగలు చిక్కబడి నల్లటిమేఘా లయ్యాయి. చువ్వలుచువ్వలుచుట్టి పైకిలేస్తున్న ఆపొగలో ఎ్రరటి వెలుగూ, ్రకమంగా మంటలూ కనిపించాయి. ఆనౌక మీాద సరాసరిపడిన ఒకబాంబు ఇంజన్‌గదిని ధ్వంసంచేయ డంతో ఈ మంటలు ఆరంభమయ్యాయి. మరీదగ్గరగా ఓడని ఒరుసుకుపడిపేలిన బాంబులతో ఇంజన్‌కి పక్కగావున్న ఫైర్ రూమ్స్ రెండూ దెబ్బతిన్నాయి. నీరు లోపలికి చొచ్చుకు పోయి నింపేసింది.

ఓడ నెమ్మదిగా నీటిలోకి దిగబడడం మొదలుపెట్టింది. వెంటనే రవాణానౌకమీాదివారు చుట్టుముట్టిన విమానాలను

తరిమికొట్టి ఆరన్‌వార్డ్‌ను సమీపించబోయారు. అంతలోనే ఒక మైన్‌స్వీపర్ వచ్చి ఆ ఓడకు తాడుపోసి ఈడ్చుకువెళ్ళ సాగింది. డిస్ట్రాయర్ నౌక శక్తివంచనలేకుండా వీరోచితంగా పోరాడినా దానికి గండంగట్టెక్కే అదృష్టం లేకపోయింది. ఫ్లారిడాదీవికి మూడుమైళ్ళదూరాన జలగర్భంలో తలదాచు కుంది ఆరన్‌వార్డ్.

ఎల్. ఎస్. టి. 449 మీద క్వార్టర్‌మాస్టర్ కెప్టెన్ దగ్గరకు వచ్చి శత్రువిమానాలనుండి ఇద్దరు పైలెట్‌లు పారా షూట్‌లమీద సముద్రంలోదిగగా చూశానని చెప్పాడు. వారిలో ఒకడు ఓడకి తూర్పుదిశన ఈదుతున్నాడు. ఒకవిడత విమానాలు వచ్చివెళ్ళాయికాబట్టి ఈ పైలెట్‌ను కాపాడా లన్న ఉద్దేశ్యంతో అటువెళ్ళాడు లివింగ్‌స్టన్. కెనెడీ తదితర నావికులుకూడా ఆరన్‌వార్డును వదలి సముద్రంలో పైలట్‌ను చూడబోయారు.

ఓడ అతనిని సమీపించేసరికి ఎవరో హెచ్చరించారు. "శత్రువు లొంగకుండా ఎదిరించవచ్చు! జాగ్రత్త!" అని ఎగ్జి క్యూటివ్ ఆఫీసరు వెంటనే ఒక సబ్‌మెషిన్‌గన్ తీసుకొని కుడివైపు బ్రిడ్జిచివరకు వెళ్ళి ఎదురుగా నిల్చున్నాడు.

ఆ పైలట్ లైఫ్‌జాకెట్‌తో స్పృహలేనివాడిలా తేలు తున్నాడు. ఓడ బాగాదగ్గరకువచ్చి 'బా' తనను దాటగానే ఒక్కసారిగా లైఫ్‌జాకెట్ విడిలించుకొని ఈదుకుపారిపోసా గాడు. కుడివైపు ఇంజనులను వెనక్కినడపమని ఉత్తర్వు లిచ్చాడు లివింగ్‌స్టన్. అంటే ఓడఉన్నచోటేఉండి కుడికి

తిరుగుతుంది. పైలట్ ఈదుతూనేవున్నాడు. అతని ఈత కొంత వింతగా కనబడింది కెనెడీ ప్రభృతులకు. కారణం కుడిచెయ్యి మాత్రం నీటిమట్టం దాటి పైకెత్తడం లేదు.

చివరికి తాడువిసిరి ఉచ్చుతగిలించేటంత దగ్గరగా చేరింది ఓడ. కాని ఆ పైలట్ తాడుఅందుకునేబదులు ఒక్కసారిగా వెనుదిరిగి కుడిచేయి పైకెత్తి అంతవరకూ నీటికింద ఆ చేతిలో దాచిన రివాల్వరును గురిచూసి తాడువిసిరిన బృందంవేపు రెండుసార్లు కాల్చాడు. ఎవరికీ దెబ్బతగలలేదు. అతను మూడోసారి కాల్చడానికి గురిచూసేలోపల ఓడమీద వారినుండి అతనిమీద గుళ్ళవర్షం కురిసింది. సజీవదహనం అనిపించేటంత ఉధృతంగా అగ్నివర్షం కురిసింది. కొద్దిక్షణాల తరవాత ఆ పైలట్ బోర్లగిలపడి తేలిపోయాడు.

కెనెడీ ఈయాత్ర నెల్లాళ్ళనాడు శాన్‌ఫ్రాన్సిస్కోలో ఆరంభం అయింది. మార్చి 6 వ తేదీ సాయంత్రం 5-21 గంటలకు యు. ఎస్. ఎస్. రాషాంబో నౌకమీద బయలుదేరాడు. ఆస్ట్రేలియాకు ఈశాన్యంగా వెయ్యిమైళ్ళదూరాన వున్న న్యూహెబ్రిడ్స్‌దీవి గమ్యస్థానం.

మునిమాపువేళ కదలిన ఆ రవాణానౌక ఒక్‌లాండ్–శాన్‌ఫ్రాన్సిస్కో వంతెన దిగువగాపోయి అల్కట్రాజ్ దీవి–దాటేవరకు చీకటిపడింది. ఓడమీద బ్లాకౌట్ (దీపాలవెలుగు బయటికిరాకుండా) అమలుజరిపారు. ఒకప్పు డిది ప్రయాణికుల నౌక. దీనిపేరు మార్షల్ జాఫ్రే. పదేళ్ళనాడు తయారైంది. ఇది మెసేజరిన్ మారిటైమ్స్ అనే ఫ్రెంచికంపెనీవారిది. జాప

నీయులు ఫిలిప్పీన్స్‌పై దాడిచేసినవేళ మనిలాదగ్గర ఇది చిక్కుపడి అతికష్టంమీద తప్పించుకు బయటపడింది. దీనిని నడిపిన సిబ్బందిలో నానాజాతుల భాషలవారూ వున్నారు. అడుగడుగునా గండాలుతప్పించుకుంటూ డార్విన్ రేవు (ఆస్ట్రేలియా) చేరుకుంది. అక్కడనుండి నెమ్మదిగా యునైటెడ్ స్టేట్సుకు చేరింది. అక్కడ దీనిని రవాణానౌకగా మార్చివేశారు. పేరు కూడా మార్చి రాషాంబో అని నామకరణం చేశారు.

అమెరికా నౌకాదళంలో రవాణానౌకగా మారాక ఇది వెస్ట్‌కోస్ట్, సౌత్‌పసిఫిక్‌లమధ్య సరకు బట్వాడాచేస్తూ పదేళ్ళుగా పనిచేస్తోంది. ఈసారి యుద్ధరంగంలో ఆయా కేంద్రాలలో చేరబోతున్న నౌకాదళోద్యోగుల బృందాన్ని ఎక్కించుకొని బయలుదేరింది. దారిలో 'శాన్‌డియాగో' వద్ద రెండురోజులు ఆగి క్రొత్తగా నౌకాదళంలోచేరిన సిబ్బంది 1500 మందిని ఎక్కించుకొని అక్కడనుండి భూమధ్యరేఖ దాటి 'ఎస్పిరిటూ శాంటో' చేరాలని ఆ నౌకకు ఉత్తర్వులు వేశారు.

'శాన్‌డియాగో' లో 15 వందలమంది నౌకాదళం సిబ్బంది ఎక్కేవరకూ ఓడ దిగువఅంతస్థులలో సందడేమీ వుండదు. అవన్నీ ఖాళీ. బయలుదేరిన తొలిరాత్రి సందడి అంతా 'ఏ' డెక్‌మీదనే. అక్కడ ఆఫీసర్లంతా గదికి ముగ్గురు, నలుగురు-చొప్పున బసచేస్తున్నారు. వారిలో చాలామంది అప్పుడే కాలేజీలనుండి, సైనికశిక్షణ కేంద్రాలనుండి బయటికివచ్చిన యువకులు. సరాసరి యుద్ధరంగానికి వెడుతున్నారు. చాలమంది కిదే తొలియాత్ర. క్రొత్తఅనుభవం.

కొత్తఅనుభూతి. ప్రతివాళ్ళూ గదినుంచి గదికి తిరుగుతూ పరిచయాలుచేసుకొంటూ కళాశాలరోజులగురించి బయలుదేరే నాటి ముచ్చట్లగురించి కబుర్లుచెప్పుకుంటున్నారు. కొందరు గొప్పవ్యక్తులగురించి, సంఘటనలగురించి, సమస్యలగురించి తీవ్రంగా వాదోపవాదాలు జరుపుతున్నారు. వారు చర్చలలో చెరిగిపారేస్తున్న వ్యక్తులతో పరిచయంగాని, ఆ వ్యక్తులుచేసే నిర్ణయాలను మార్చేశక్తిగాని, కనీసం ముఖాముఖిని చర్చించే పలుకుబడిగాని వీరిలో ఏఒక్కరికీ లేవు. కాని ఆవ్యక్తులుచేసిన నిర్ణయాలకు వీరి జీవితాలమీాద, జీవన్మరణాలమీాద అమిత ప్రభావం ఉంది.

ఎన్సైన్ జేమ్స్ ఎ. రీడ్, ఎన్సైన్పాల్ జి. పెన్నాయర్ (జూనియర్) లు ఉంటున్నగదిలో పదిమందిచేరి యుద్ధానికిపూర్వం బ్రిటను అనుసరించిన విధానాలమీాద తీవ్రంగా చర్చిస్తున్నారు. పెన్నాయర్ జె. పి. మోర్గన్ మనుమడు. హార్వర్డులో చదువుకున్నాడు. ఇప్పుడు నౌకాదళంలో టార్పెడో బాంబరు పైలట్గా చేరుతున్నాడు. డీయర్ఫీల్డ్, ఆమ్హర్స్ట్ సైనికకేంద్రాలలో శిక్షణపొందినరీడ్ యుద్ధంలో చేరుతున్నాడు. కాని, అతనిదృష్టంతా ఈ యుద్ధం అయిపోయాక తిరిగి కళాశాలలోచేరి న్యాయశాస్త్రం చదువుకునే మంచిరోజుమీాదనే వుంది.

గదిలోకివస్తూపోతూన్న ఆఫీసర్లలో రీడ్, పెన్నాయర్ లిద్దరూ ఒక అపరిచితయువకుడిని గమనించారు. సన్నగా పొడుగ్గా వున్నాడు. చెదిరిన గోధుమరంగుజుట్టూ, ఆముఖం అంతా కుర్రతనం ధోరణిలో వుంది. ఖాకీచొక్కా, చీలమండ

లికి బాగాపైగావున్న ఖాకీపంట్లాం వేసుకున్నాడు. మనిషి చాలా నెమ్మదస్థుడులా కనిపించాడు. మిగతావాళ్ళలావచ్చి రెండుకబుర్లు చెప్పి నిలకడచాలక వెళ్ళేరకంగా కనపడలేదు. అక్కడ తారట్లాడుతూ చర్చలను నిదానంగా ఆలకిస్తున్నాడు.

ఓడమీద అందరూ తొలిరాత్రి సరదాగా సాయిలా పాయిలాగా ఉషారుగా వుండడంవల్ల పరిచయాల లాంఛనాల గురించి ఎవరూ పట్టించుకోటంలేదు. అందువల్ల ఆ వచ్చిన అపరిచితుడు లెఫ్టినెంట్ జాన్ ఎఫ్. కెనెడీ అని వారికి తెలియదు.

ఎన్‌సైన్ రీడ్ చాలాధాటీగా బ్రిటన్ ప్రధాని చాంబర్లేన్‌ని, ఆరోజులలో అతని ప్రభుత్వం అనుసరించిన 'ఎపీజ్‌మెంటు' (హిట్లరుని తృప్తిపరచడానికి అవలంబించిన రాజీ ధోరణి) విధానాన్ని తీవ్రంగా ఖండిస్తున్నాడు. ఆనాడు చాంబర్లేన్‌గనక హిట్లర్‌దగ్గర సర్దుబాటుపద్ధతిలో మెతకగా వ్యవహరించిఉండకపోతే హిట్లర్ యూరప్‌మీద వీరవిహారంచేసే వాడేకాడు. ఆ భరోసా అలుసు చూసుకొని జపాన్ ఇలావుంజుకొని పెరల్‌హార్బర్‌మీద విరుచుకుపడేదీ కాదు. ఇదీ అతని వాదం.

హఠాత్తుగా కెనెడీ కలగజేసుకొని మాట్లాడాడు. తప్పంతా చాంబర్లేన్‌నెత్తినే ఎందుకు వెయ్యాలి అని అతను ఎదిరించాడు. ఆయన బేరాల్కి రాయబారాలకి వెళ్ళేనాటికి గట్టిగా, ధాటీగా మాట్లాడేస్థితిలో లేదు. ఆ దుర్భలస్థితి అతనిది కాదు. దీనికి అతను ప్రతినిధిమాత్రమే.

అందుకు కారకులు చాలమంది ఉన్నారు. ఈనిందను అందరూ తలాకాస్త పంచుకోవాలి.

రీడ్ ఒప్పుకోలేదు. ఆనాడు హిట్లరు చెప్పిన షరతు లన్నిటికీ చాంబర్లేను తలొగ్గి లొంగిపోవడమే హిట్లరు దురాక్రమణ యుద్ధానికి నాంది, కారణం అన్నాడు రీడ్.

ఆ మెతకతనం కేవలం ఆ ప్రధానిది కాదు. అతని దేశానిదీ, 1930 నాడు దుర్బలంగా, భయంగా, మెతగ్గా ఉన్న ఆ ప్రజాస్వామ్యాలదీని. ఆనాడు బ్రిటనుకు యుద్ధమంటే భయం పట్టుకుంది. అలాగే వ్యాపారవర్గాలవారంతా ఆయుధ నిర్మాణంకన్న తమతమ వ్యాపారపరిశ్రమలే ప్రధానంగా యెంచారు. అలాగే రాజకీయపక్షాలు యుద్ధాన్ని ఆమోదించ టానికి భయపడ్డాయి. ఈస్థితిలో దేశమంతా ఎదురైనప్పుడు ఒక్క ప్రధాని ఏం మాట్లాడగలడు ? ఈ సమస్య ఆనాటి బ్రిటనుదే కాదు. పెట్టుబడిదారీవ్యవస్థలున్న ప్రజాస్వామ్య రాజ్యాలన్నిటిదీని అంటూ వాదించాడు కెనెడీ.

రీడ్ తక్షణం నాలిక్కరుచుకుని కెననెకాళ్ళమీద పడ్డంతపని చెయ్యలేదుగాని ఇత నెవడో గట్టివాడు అని కాస్త గట్టిగానే అనుకున్నాడు.

నిజానికి ఈ సమస్యలో కెనెడీ చాలాగట్టివాడు. 1939–40 లో హార్వర్డు విద్యార్థిగా రాజకీయశాస్త్రం చదువు తున్నప్పుడు పరిశోధనకి మ్యూనిచ్ ఒప్పందం తీసుకున్నాడు. దీనిమీదనే అండరుగ్రాడ్యుయేటుథీసిస్ వ్రాశాడు. రాజకీయ శాస్త్రంలో ప్రొఫెసర్లు బ్రూస్‌హాపర్. పేసన్‌వైల్డ్‌ల పర్య

వేతుణక్రింద వైడ్నర్ లైబ్రరీలో నిర్విరామంగా పరిశోధన సాగించాడు. లండన్ టైమ్స్, ఎకనామిస్ట్‌వంటి ముఖ్యపత్రికలు, విదేశాంగశాఖ మినిట్సుపుస్తకాలు (ఆయాసమావేశాలలో చర్చించిన అంశాలన్నీ వివరంగా వ్రాసివుంచేవి), పార్లమెంటులో చర్చలరికార్డులు అన్నీ కూలంకషంగా చదివి ఆకళింపు చేసుకున్నాడు.

అతను వ్రాసిన పరిశోధనవ్యాసంలో అతను అవలంబించిన వైఖరి అందులో వాదం—అవే, ఇక్కడ రీడ్‌తో చేసిన చర్చలకు ప్రాతిపదికలు. ఆనాడు అతని 'థీసిస్' (పరిశోధన వ్యాసం) విద్యాపీఠానికి అందజేసినతర్వాత అక్కడి అధ్యాపకులంతా దాన్ని చాలామెచ్చుకున్నారు. ఆ ప్రోత్సాహం పురస్కరించుకొని కెనెడీ దానిని గ్రంథరూపంలో ప్రచురించ సంకల్పించాడు. ఆనాటికి అతనితండ్రి జోసెఫ్ కెనెడీ ఇంగ్లాండులో అమెరికా రాయబారిగా వున్నాడు. ఆయనకూడా హర్షించి కొన్నిసూచనలు చేశాడు. కెనెడీకుటుంబానికి ఆప్త మిత్రులలో ఒకడైన ఆర్థర్ క్రోక్ (న్యూయార్కు-టైమ్స్) అది చదివి "వై ఇంగ్లాండు స్లెప్ట్" **(Why England slept)** అని నామకరణం చేయమని సూచించాడు. 'టైమ్' (రాజకీయ వారపత్రిక) ప్రధాన సంపాదకుడు హెన్రీలూస్ ఆ పుస్తకానికి పీఠిక వ్రాస్తానన్నాడు. కెనెడీ పుస్తకంవేశాడు. 1940 జూలైలో విల్‌ఫ్రెడ్ ఫంక్ ఇంక్ సంస్థ ఆ పుస్తకం ప్రచురించింది. వెలువడగానే అది విపరీతంగా అమ్ముడుపోయింది. ఆ యేడాది అత్యధికంగాఅమ్మిన కొద్దిపాటిపుస్తకాలలో ఒకటయింది. పత్రికలు సమీక్షలు మొత్తంమీద సుముఖంగానే

వచ్చాయి. ఆ ఒక్కపుస్తకంతో కెనెడీ తన 23 వ యేటికే అమెరికా ఇంగ్లాండులలో ప్రముఖవ్యక్తులకోవలో చేరిపో యాడు. "ఇక్కడ నీపుస్తకానికివచ్చిన మంచిపేరుచూస్తే నీకే ఆశ్చర్యంవేస్తుంది. గొప్పగొప్పవాళ్ళందరినీ మెప్పించిన ఈ ఒక్కపుస్తకం - నీ భవిష్యజ్జీవితంలో కొన్నిసంవత్సరాలపాటు నిన్ను ఒక గొప్పస్థాయిలో నిలబెడుతుంది. దీనివిలువ నీకు మున్ముందు తెలుస్తుంది" అంటూ జోసెఫ్ కెనెడీ కుమారు డికి లండనునుండి లేఖ వ్రాశాడు.

రచయితగా కెనెడీ తొలియత్నం యిదే. ఇది విశ్వ విద్యాలయానికి 'థీసిస్' గా సమర్పించినప్పుడు రాజకీయ శాస్త్రంలో అతను ఉత్తమప్రమాణాలు అందుకున్నాడనిపించు కున్నాడు. అంతకుముందు అతనికి హార్వర్డులో ఏవిధంగానూ పెద్దపేరు లేదు. అతనిపేరు అందరికీ తెలియదు. నిజానికి హార్వర్డులో తొలి రెండేళ్ళు అతనికి లభించింది 'సి' తరగతే. అతనుఉండే హాస్టల్ అధిపతి ప్రొఫెసర్ ఫ్రెరీ ఒకసందర్భంలో కెనెడీ విద్యార్థిదశను వివరిస్తూ హార్వర్డులో కెనెడీ ఏమంత చెప్పుకోదగ్గపేరు తెచ్చుకోలేదని అన్నాడు. అతనినిగురించి యెవరికీ తెలియలేదు. విద్యాపీఠం పత్రిక "క్రిమ్‌జన్" కు మూడేళ్ళపాటు సంపాదకుడుగావున్నా అందులోకూడా చెప్పు కోదగ్గ పనేమీచేయలేదు. కొత్తలో అసలు చదువుమీద కన్న ఆటలమీద ఆసక్తి హెచ్చుగావుండేది. కొత్తవిద్యార్థి దశలోవుండగా అతనిబరువు 149 పౌండ్లే అయినా ఫుట్‌బాల్ ఈత, గాఫ్ ఆటలలో యూనివర్శిటీ జట్టులో స్థానంసంపాదించ డానికి గట్టిగా కృషిచేశాడు; సాధించాడు. అయినా ఆట

గాఢంగా కూడా అతని ప్రతిభ కన్న సాధకుడుగా, దీక్షాపరుడు
గానే పేరువచ్చింది. ఏపోటీలో అయినాసరే, అతనిఆటచూస్తే
అతనిపట్టుదల, కృషి ఇవే కొట్టొచ్చినట్టు కనిపించేవి.

మొత్తంమీద రీడ్ ప్రభృతులతో చాంబర్లేన్ రాజకీ
యాలగురించి ఆరాత్రి రెండుమూడుగంటలయ్యేవరకూ వాది
స్తూనే వున్నాడు కెనెడీ. తరువాత ఎవరిగదులకు వారు వెళ్ళి
నిద్రపోయారు. అంతసేపువాదించుకున్నా ఒకరికొకరు పరిచ
యాలు చేసుకోలేదు. గదికి వెళ్తున్నప్పుడు ఓడ దడదడ డీసెల్
ఇంజన్ల నిండుశబ్దం విని నౌక పూర్తివేగంతో సముద్రాన్ని,
చీకటిని చీల్చుకుపోతోందనుకున్నాడు కెనెడీ. శాన్‌ఫ్రాన్సిస్కో-
పర్వతాలు క్రమంగా దూరంఅయిపోయి అదృశ్యం అవుతు
న్నాయి. మళ్ళీ భూమి ప్రయాణికులూ కంటబడడానికి చాలా
రోజులు పడుతుంది అనుకుంటూ పడకచేరాడు కెనెడీ.

ఆ మర్నాడు కెనెడీకీ, ఎన్సైన్ రీడ్‌కీ ఎవరో పరిచ
యంచేశారు. క్రితంరాత్రే నిజమైన పరిచయం జరిగినందువల్ల
ఈ లాంఛనం తీరడంతో ఇద్దరూ కొద్దికాలంలోనే గాఢ
మిత్రులయిపోయారు. * మార్చి 8 వ తేదీన 'రోషాంబో'
నౌక శాన్‌డియాగో రేవులో 'బ్రాజ్వేపయుర్' చేరుకుంది.
కెనెడీ, రీడ్‌లు ఆవేళకి డెక్ బద్దీలమీద వాలి నుంచుని కబుర్లు

---

*దరిమిలాను 1953 లో కెనెడీకి జాక్విలిన్ లీ బోలియర్‌కూ
న్యూపోర్టులో వివాహం జరిగినప్పుడు రీడ్ అతిథులను లోనికి ప్రవేశ
పెట్టే "ఉషర్" గా వ్యవహరించాడు. కెనెడీ అమెరికా అధ్యక్షుడు అయిన
తరవాత రీడ్ అతని ప్రభుత్వంలో ఒక ఆఫీసర్‌గా చేరాడు.

చెప్పుకుంటున్నారు. వీలైతే ఓడదిగి ఊళ్ళోకి వెళ్ళేవారుకాని నియమనిబంధనలు అనుమతించవు. రెండురోజుల తరవాత ఆ రేవువదలి కదలింది ఓడ. కెనెడీ, మిత్రుడూ డెక్ మీద రబ్బరులైఫ్‌బెల్టులు వేసుకుపడుకుని శత్రువిమానాలజాడకోసం పైనతిరుగుతున్న నౌకాదళవిమానాన్నీ నీటిలో ముందునడుస్తున్న X స్త్రీబోటునీ, చూస్తూ కబుర్లుచెప్పుకుంటున్నారు. ఈ రెండూ 'రోషాంబో' ని షుమారు 48 గంటలసేపు దారి చూపుతూ తీసుకువెళ్లాయి. ఆ తరవాత దాదాపు అడంగు చేరేవరకూ రోషాంబోకి తోడు వుండదు.

ఈ ప్రయాణంలో కెనెడీ, పెన్నోయరుకూడా మిత్రులయ్యారు. వాళ్ళిద్దరికీ అభిమానసామ్యంవున్న విషయాలు రెండుదొరికాయి. ఒకటి మధ్యప్రాచ్య రాజకీయాలు; రెండు రోమన్ ఎలోన్ను చుట్టలు. ఆ చుట్టల్ని పెన్నోయర్‌కి ఎవరో కానుకగా యిచ్చారు. బయలుదేరిన వారంరోజులతరవాత ఒకనాటిరాత్రి పెన్నోయరు డెక్‌మీదనించుని చీకటిసముద్రంలోకి సాలోచనగా చూస్తున్నాడు. కెనెడీ లోపలనుండి అతన్ని వెతుక్కుంటూ వచ్చాడు. 'నీ కో దుర్వార్త' అన్నాడు. అతను అప్పుడే లోపల 'మిమియోగ్రాఫ్' మీద రాగా చదివిన వార్త అది. పెన్నోయర్ తాతగారు ప్రపంచప్రసిద్ధ కోటీశ్వరుడు జె. పి. మోర్గన్ గుండెపోటువల్ల మరణించాడు.

పశ్చిమాభిముఖంగా 'రోషాంబో' నిరంతరంగా ప్రయాణిస్తూనేవుంది. ప్రయాణం పొడుగునా కెనెడీ నిర్విరామంగా ఏవో పుస్తకాలు చదువుతూనేవున్నాడు. ఒక్కొక్కసారి పుస్తకం తెరిస్తే గంటలతరబడి అలా చదువుతూనే వుండి

పోయేవాడు. అంతలోనే చలికాలంతిరిగి వాతావరణం వెచ్చబడింది. కెనెడీ, రీడ్‌లు ఓడవెనకభాగాన పడుకొని పొర్లుతూ తాము చదివిన పుస్తకాలగురించి చర్చించుకునేవారు. కెనెడీ చాలఉత్సాహంగా చర్చించిన పుస్తకాలలో ఫ్రాంచ్ వెర్ ఫెల్ వ్రాసిన "ది ఫార్టీడేస్ ఆఫ్ మూసాడాగ్" ఒకటి. మొదటి ప్రపంచయుద్ధంలో టర్కీలు తలపెట్టిన విధ్వంసక ఉద్యమం విషయంలో, ఆర్మీనియన్‌లు అవలంబించిన వైఖరిలో కుడి ఎడమలు చర్చించాడు వెర్ ఫెల్. మొత్తంమీద అప్పట్లో చదివిన పుస్తకం బ్రిటిష్ రాజనీతివేత్త, విద్వాంసుడు, రచయిత అయిన లార్డ్ట్వీడ్స్ మూర్ (జాన్ బుకాన్) తన స్మృతులను పొందుపరుస్తూ వ్రాసిన "పిల్‌గ్రిమ్స్ వే" అని కెనెడీ చెప్పేవాడు.

"మళ్ళీ అమెరికా వెళ్ళగానే నీ కోపుస్తకం పంపిస్తాను" అని రీడ్‌కి మాటయిచ్చాడు కెనెడీ. వెళ్ళినతరువాత మాటనిలబెట్టుకున్నాడుకూడా.

వయసుకి చిన్నవాడైనా (25 ఏళ్ళు) కెనెడీ అనుభవం విశేషంగా గడించాడని అనుకున్నాడు రీడ్. అప్పటికే అతనిది అసాధారణమైన దనిపించుకోదగ్గ జీవితం. కలవారిబిడ్డ. కుటుంబానికి అంతర్జాతీయఖ్యాతి వున్నది. అతనితండ్రి ఇంగ్లాండువంటి ముఖ్యదేశంలో రాయబారి. కెనెడీ జన్మించింది 1917 మే 29 న. బాస్టన్‌శివారున దిగువ మధ్యతరగతివారు వుండేవాడలో ఒక ఫ్రేమ్‌హౌస్ (కర్రలచట్రంమీద బిగించే ఇల్లు) లో జన్మించాడు. కెనెడీకుటుంబంలో ప్రతివారూ అమితశక్తివంతులు. బంతికుండే చైతన్యంతో, ఉత్సాహంతో

అందరూ ఆరోగ్యంగా వుంటారు. ఆ కుటుంబం పూర్వీకులు ఒకప్పుడు ఐర్లండునుండి వలసవచ్చారు. క్రమేపీ మెసాచూసెట్స్ డెమోక్రాటిక్ పార్టీలో రాజకీయంగా పలుకుబడి, అధికారం సంపాదించుకున్నారు. కెనెడీ తల్లిదండ్రులు-జోసెఫ్, రోజ్‌ఫిట్జ్‌రాల్డ్ కెనెడీలకు విలియంకార్డినల్ ఓకానెల్ వివాహం జరిపించారు. వారికి మొత్తం తొమ్మండుగురు సంతానం కలిగింది-జోసెఫ్ జూనియర్, జాన్, రోస్‌మేరీ, కాత్లీన్, యూనిస్, ప్రెటేషియా, జీన్, రాబర్టు, ఎడ్వర్డ్.

కెనెడీతండ్రి జోసెఫ్ ఒకమోస్తరు పరిస్థితులలో జీవితం ఆరంభించాడు. హార్వర్డులో పట్టభద్రుడై పాతికేళ్ళు వచ్చేసరికి తూర్పుబొస్టన్‌లోని ఒకచిన్నబ్యాంకుకు ఆధిపత్యం సంపాదించాడు. మొదటి ప్రపంచయుద్ధంతరువాత పెట్టుబళ్ళ వ్యాపారంలో, సినిమావ్యాపారంలో బాగాగడించి ధనవంతుడయ్యాడు. తనవ్యాపారంఅంతా న్యూయార్కులో చేయడం వల్ల జాక్‌బాల్యమంతా రివర్‌డేల్, బ్రాంక్‌విల్ పేటలలో గడిచింది. రెండుచోట్లలోనూ జాక్ పాఠశాలలకువెళ్ళి చదువుకొన్నాడు. ఒకఏడాదిపాటు కనెక్టికట్, న్యూమిల్‌ఫర్డ్‌లోని కాథలిక్ పాఠశాల కాంటర్‌బరీస్కూలులో చదివాడు. ఆపైన వాలింగ్‌ఫర్ట్‌లో ఛోట్‌విశ్వవిద్యాలయంలో చేరాడు. అక్కడినుండి హార్వర్డుకు వెళ్ళాడు.

ఆనాటికి రాజకీయంగా జాక్‌తండ్రి మంచిఉచ్ఛదశలో వున్నాడు. 1932 నాటి డెమోక్రాటిక్ మహాసభకు ముందరినుంచీ ఆయన ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్టును బలపరుస్తూ వచ్చాడు. రూజ్వెల్ట్ అధ్యక్షుడు అయినతర్వాత సెక్యూరి

టీస్, ఎక్స్ఛేంజ్ కమిషన్‌కు జోసెఫ్‌ను అధిపతిచేశాడు. తండ్రిహోదానుబట్టి జాక్‌కు ఆరోజులలో రూజ్వెల్ట్, ఆయన భార్య ఎలినార్, చర్చిల్, ఈడెన్, హాల్ ఫారెస్టవంటివారి పరిచయభాగ్యం లభించింది. శీతాకాలం సెలవులు పామ్‌బీచ్‌లోని కెనెడీ భవనంలోను, వేసవిసెలవులు కోప్‌కాడ్‌లోని హైనీస్ పోర్టులో తనతండ్రి కొన్న విడిదిభవనంలోనూ గడిపేవాడు.

తండ్రి రూజ్వెల్ట్ ప్రభుత్వంలో పనిచేస్తున్నాడు. వాషింగ్‌టన్‌లోనూ, దరిమిలా ఆయన ఇంగ్లాండుకు రాయబారిగా వెళ్ళినతరువాత లండనులోనూ తానుగడించిన అనుభవాలనూ, ఆనాటి విశేషాలనూ కెనెడీ ఈ ప్రయాణంలో రీడ్‌కు వల్లించిచెప్పాడు. బాల్యంలో తనకీ, అన్న జోకూ నిత్యంజరిగిన పోట్లాటలూ, పోటీలూ అన్నీ కథలుగా చెప్పాడు. జో రాజకీయరంగంలో చాలా పైకివస్తాడని ఇంట్లో అంతా అనేవారు. కాని అతను నౌకాదళంలోచేరి బాంబర్‌పైలట్‌గా పనిచేస్తున్నాడు.

కెనెడీ ఇంట్లో జనాభా విలక్షణమైనది. వాళ్ళకి పరస్పరం ఎంతగాఢమైన అభిమానంఉండేదో వ్యక్తులుగా అంత తీవ్రమైనపోటీ ఉండేది. ఎవరికివాళ్ళే పైచెయ్యిగా ఉండాలని పంతంగా ఉండేవారు. జోకి జాన్‌కి సాధారణంగా పడేదికాదు. జో ఎప్పుడూ తమ్ముడిని బుకాయించి, దబాయించి తిరిగేవాడు. ఇంట్లో అందరికీకూడా అతనిమీదనే మోజు. అన్న పట్టభద్రుడై కళాశాలదాటి వెళ్ళిన తరవాతనే, జాక్ ఒక మనిషి అనిపించుకునే అవకాశం వచ్చింది. అంతవరకూ అందరూ జోన్‌నే పొగడేవారు. జో యుద్ధంలో చేరి పెద్ద

హీరో అవుతాడు. రాజకీయాలలో దిగి పెద్దనాయకుడవు తాడు. తరువాత వాళ్ళ తండ్రిలా, ప్రపంచప్రముఖులలో ఒక డవుతాడు. ఇదీ ధోరణి. జాక్ అంతకాలం జో నీడలోనే ఉండేవాడు. జాక్ హార్వర్డ్ విద్య ముగించి బయటికి వచ్చిన తరువాత, యుద్ధం అతని జీవనమార్గాన్ని నిర్దేశించడానికి ముందు-ఈ మధ్యకాలంలో తనకర్తవ్యం గురించి, భవిష్యత్తు గురించి ఎటూపాలుపోక మథనపడ్డాడు. న్యాయశాస్త్రం చదవడం మంచిదా? వ్యాపారంలో దిగడం మెరుగా? రచయితగా కృషిచేస్తే మంచిదా? ఒకదశలో జాక్ న్యాయశాఖా శాలలో చేరాలన్నదాకా వెళ్ళి మళ్ళీ విరమించుకున్నాడు. స్టాన్‌ఫర్డ్ వ్యాపారవిద్యాలయంలో చేరి ఆరుమాసాలు శిక్షణ పొందాడు. అంతలో అది మానుకుని దక్షిణ అమెరికాలో సమగ్రమైన పర్యటనచేసిరావాలని బయలుదేరాడు. రాజకీయ రంగంలో పైకిరావచ్చునా అంటే ఎవరికీ గురిలేదు. కాలేజీలో ఫ్రెష్‌మన్‌క్లాసు ప్రెసిడెంటు కావాలని పోటీచేసి ప్రాథమిక ఎన్నికలోకూడా నెగ్గలేకపోయాడు.

రోషాంబోనౌకమీద సాయిలాపాయిలాగా కబుర్లాడుతున్న ఆనాటి కెనెడీలో పడుచుదనపు ఉత్సాహం, శక్తి, చైతన్యాలూ వున్నాయి. వాటికి తగ్గ హుందాతనం ఉంది. సరదాగా కలిమిడిగా కనిపించేవాడు. వాటికితగ్గ నిగ్రహం వుండేది. కాలేజీలో క్లాసు సంఘానికి ఎన్నిక కాలేకపోయిన ఆ యువకుడు ఆనాడు, ఒక అద్భుతమైన విచిత్రమైన అనుభవం కలిగించే సంఘటనవైపు పయనిస్తున్నాడు. అది

కొన్నేళ్ళ తరువాత, అతని జీవిత మార్గాన్నే మార్చివేయగల మహిమాన్వితమైన సంఘటన అని అతనికి తెలియదు.

ప్రతిరోజూ తెల్లవారు ఝామున, సాయంసంధ్యవేళ అందరినీ గదుల్లోకి వెళ్ళిపోవాలని శాసించేవారు. సబ్‌మెరీన్‌ల ప్రమాదం అత్యధికంగా ఉండేది— ఆ రెండు వేళల్లోనే. ఆ సమయాలలో ఉద్యోగ కేంద్రాలకు వెళ్తూ మధ్యేమార్గంలో వున్న ఈ ఆఫీసర్లకు పనేమీ వుండదు. మధ్యాహ్నవేళ మాత్రం కెనెడీ విధిగా డెక్ మీదకు వెళ్ళి, ఓడసిబ్బంది తుపాకులసాధన చూసేవాడు. అప్పుడప్పుడు మిత్రులతో 'బ్రిడ్జ్' ఆడేవాడు. పేకాటలో అతనికో కొత్త మిత్రుడు దొరికాడు. అతనూ హార్వర్డ్ విద్యార్థే- ఎన్‌సైన్ చార్లెస్ ఎఫ్. రాలీ జూనియర్ ప్రస్తుతం టార్పెటో-బాంబర్ పైలట్‌గా ఉంటున్నాడు.

ఒకనాటి ఆటతరవాత రాలీ బ్రూక్లిన్ ట్రస్ట్ కంపెనీకి నల్భై డాలర్ల చెక్కు రాసి, కెనెడీకి సమర్పించుకున్నాడు.

ఓడమీద ఉండగాకూడా, ఈ ఆఫీసర్లందరికీ నౌకాదళం ఆయుధాలు ఇచ్చింది. ఒక్కొక్కరికీ ఒరలో పెట్టిన బాకులూ, స్మిత్ అండ్ వెస్సన్ వారి .38 కాలిబర్ రివాల్వర్లూ ఇచ్చారు. ఓడమీద కాలక్షేపానికి బాకులు బాగా పనికొచ్చాయి. ఒక గదిలో ఒకబోర్డు అమర్చారు. దాని మీద చిన్నచిన్న కాగితం ముక్కలు అతికించారు. పదిఅడుగుల దూరాన నుంచుని బాకు విసిరి లక్ష్యశుద్ధిపోటీలు చేసు

కునేవారు. బుల్స్ (లక్ష్యకేంద్రం) ని ఎవ రెన్నిసార్లు కొడితే అంతగొప్ప.

దూరంగా ఏదో ఓడ కనబడడం, గుర్తుతేలక అది శత్రునౌక అని కంగారుపడడం, హెచ్చరికలు, సన్నాహాలు, సందడి తరుచుగా ఉండేది. తీరా దగ్గరపడ్డాక ప్రతీదీ మిత్ర నౌక అని తేలేది. మొత్తంమీద, ఒక ఇంజను చెడి, మరమ్మతుకోసం కొద్దికాలం ఆపివేయడం మినహాయిస్తే, ప్రయాణం సాఫీగానే సాగిపోయింది. కెనెడీమిత్రులు చాలా సరదాగా జరిగిపోయిందనికూడా అన్నారు. మార్చి 26 న న్యూహెబ్రిడిన్ ద్వారందగ్గర యు. ఎస్. ఎస్. ట్రేసీ అనే నౌక ఎదురువచ్చి, రోషాంబోను, ఎస్పిరిటో శాంటో హార్బర్‌కు తీసుకువెళ్ళింది. 'ట్రేసీ' పూర్వాశ్రమంలో డిస్ట్రాయర్ (విమాన విధ్వంసక నౌక). దరిమిలా మైన్‌స్వీపర్‌గా (శత్రు నౌకలను ధ్వంసంచేయడానికని, సముద్రంలో నీటిమట్టానికి దిగువగా అయితే బాంబులను తొలగించే నౌక) మారింది. మార్చి 28 నాటికి, ట్రేసీ రక్షణకై విపరీతంగా మైన్స్ అమర్చుకొన్న ఎస్పిరిటో శాంటోహార్బర్‌లోకి 'రోషాంబో' ను చేర్చింది.

డెక్ మీద నిలబడి చూస్తున్న కెనెడీ, రీడ్‌లకు రేవుకు కొంతదూరంలో ఒక మునిగిపోయిన రవాణానౌక కనిపించింది. పసిఫిక్ ప్రాంతంలో యుద్ధంవల్ల కలిగిన విధ్వంసానికి నష్టానికి తొలిసారిగా వారుచూసిన దాఖలా అదే. హార్బర్‌కు చేరే కాలువలో ప్రవేశించాక వారికి, విమానవాహక నౌక 'కారియర్', దానిని పరివేష్టించి ఉన్న చిన్న నౌకలూ

కనిపించాయి. ఆదృశ్యంచూసి అద్భుతంగా ఉందనుకొన్నారు. ఇంకా ఎదర 21 డిస్ట్రాయర్ నౌకలు కొలువుతీర్చిన దృశ్యం కనిపించింది. ఉత్తేజితులయ్యా రిద్దరూ. ఆ సమూహంలోనే అమెరికన్ క్రూయిజర్ నౌకలు 'హోనోలులూ,' 'శాన్ డియగో', 'సెంట్ లూయిస్,' 'నాష్విల్', ఆస్ట్రేలియన్ క్రూయిజర్ 'లియాండర్' కనిపించాయి.

రీడ్ కి ఉన్న ఉత్తర్వుల ప్రకారం, అతను అక్కడ దిగ రాడు. రోషాంబోలోనే యాత్రసాగించి, న్యూకెలడోనియా లోని 'నౌవోమియా' కి వెళ్ళాలి. కెనడీ మాత్రం ఇక్కడే దిగి, ఇక్కడనుంచి సోలమన్ దీవులకు వెళ్ళాలి. అక్కడ మోటార్ టార్పెడోల దళంలో అతనికి నియోగం. టార్పెడోలు చాలా షోకైన చురుకైన బోటులు. నౌకాదళంలో వీటిని ఈ పేరుతోనే పిలిచినా, ప్రజలుమాత్రం అభిమానంతో (పెట్రోల్ టార్పెడో) అని పిలుస్తారు. మొత్తంమీద ఈ రేవులో మిత్రులిద్దరూ కరచాలనం చేసుకుని వీడ్కోలు చెప్పుకున్నారు. అడంగుచేరాక పి. టి. దళంలో చేరతానని కోరి అక్కడ డ్యూటీవేయించుకుంటానని రీడ్ కెనెడీకి మాటయిచ్చాడు. ఆవిధంగా తిరిగి ఇద్దరూకలిసి ఒకచోట ఉండవచ్చునని అతని ఆశ.

కెనెడీదిగాక అతనిని మరోఆఫీసర్లజట్టులో కలిపారు. తిరిగి ఎస్. ఎస్. టి. 419 మీదికే ఎక్కించారు. అది గాడల్ కెనాల్ లో యుద్ధసామగ్రిని దించి అక్కడనుంచి ఆఫీసర్లను టులగీ చేర్చాలి.

ఎస్పిరిటోశాంటోలో తొలిరోజుల్లో ఉపద్రవాలేవీ లేకుండా బాగానే గడిచిపోయాయి. కాకపోతే విమానదాడి జరుగుతుందని తరుచు హెచ్చరికలు వచ్చేవి. కారణం అక్కడ కొద్దినెలలపాటు భయం అలా వుండేది. ఆకాశంలో ఎగిరేశాత్రీ ఏది కనపడ్డా శత్రువిమానమే అని కంగారు పడేవారు. అందువల్ల ఆ ప్రాంతంలో తిరిగేవన్నీ మిత్రవిమానాలైనా వున్నజనం అందరినీ సురక్షితస్థానాలకు తరిమికొట్టే వారు.

ఈ గంద్రగోళం యెలావున్నా కెప్టెన్ లివింగ్‌స్టన్ తనగదిలో స్థిమితంగా కూర్చుని వారితో వీరితో కాసేపు కబుర్లుపెట్టుకు కాలక్షేపంచేసేవాడు. లివింగ్‌స్టన్ కెంటుకీ రాష్ట్రీయుడు. హెండర్సన్ అతని జన్మస్థలం. కెంటుకీవాళ్ళు సాధారణంగా దేనికీ చలించరు, కంగారుపడరు.

ప్రయాణం ఆరంభమైన కొత్తలోనే ఓడలోవస్తున్న ఒకఆఫీసరు రాయబారి కెనెడీ కుమారుడని అతనికి తెలిసింది. యుద్ధానికిముందు యూరప్‌పరిస్థితులగురించి స్వయంగా చూసి వచ్చినవారి అభిప్రాయాలు తెలుసుకోవాలన్న కుతూహలంతో లివింగ్‌స్టన్ ఒకనాడు కెనెడీకి కబురంపాడు.

"మీరుకాస్త గట్టిగానే (యూరప్‌ను) చూసివుండాలి" అన్నాడు చర్చకదుపుతూ.

హార్వర్డులో జూనియర్ సంవత్సరం చదువుతూవుండగా రెండవ సెమెస్టర్ మొత్తం విదేశాలలోవుండి చదువు

కుందికి అనుమతితీసుకున్నాడు కెనెడీ. 1939 లో యూరప్ వెళ్ళాడు. చెకోస్లోవేకియాలో పోగామిగిలిన కాసినిభాగాలు కూడా కబళించాలని నాజీలు ముందుకుదూకుతున్నరోజు లవి. అక్కడిస్థితిగతులన్నీ వివరించాడు కెనెడీ. ఆ తరవాత ఫ్రాన్సు, పోలెండు, రష్యా, టర్కీ, పాలెస్టైన్‌లలో తనపర్యటనానుభవాలు తెలియజెప్పాడు. అప్పట్లో ఆయాదేశాల రాజధానుల నుండి అక్కడిస్థితిగతులు వివరిస్తూ లండన్‌లో తండ్రికి నివేదికలు పంపేవాడు కెనెడీ.

గడువుతీరి తిరిగి హార్వర్డు చేరేముందు బ్రిటన్ వెళ్ళాడు. ఎథేనియానౌకను ఒక జర్మన్‌సబ్మెరిన్‌టార్పెడోచేసిం దన్న వార్త అప్పుడే వచ్చింది. ఆ తరవాత ఆ వుపద్రవంలో బ్రతికి బయటపడిన అమెరికన్‌లకు తోడ్పడేందుకని రాయబారి కెనెడీ తనకుమారుణిని గ్లాస్‌గో పంపించాడు.

ఏప్రిల్ 7 న వైమానికదాడి జరిగిన తరువాత ఎల్. ఎస్. టి. 449, సబ్ చేజర్ 521 ఎస్పిరిటోశాంటోరేవులోకి చేరుకోడానికి కారణం వుంది. ఆ మర్నాడే జపానీయులు అంతకన్న భారీయెత్తునవచ్చి దాడిచేస్తారని భయపడ్డారు. కాని అలాంటిదేమీ జరుగలేదు. ఐదురోజులపాటు ఆ ప్రాంతం అంతా తారట్లాడి ఏప్రిల్ 12 న ఎల్. ఎస్. టి. 449 గాడల్‌కెనాల్‌లో ప్రవేశించింది. కొద్దిరోజులతరవాత టులగీ చేరింది. కెనెడీ అమెరికావదలి అప్పటికే నెలరోజులయింది.

ఎదుటికొండ దిగగానే కొండంతబోర్డు ఒకటి కొట్టొచ్చినట్టు కనబడింది. కోటిగొంతులతో గర్జిస్తున్నదనిపించేంత పెద్దఅక్ష రాలలో అడ్మిరల్ విలియం ఎఫ్. హాల్సే పెట్టించాడు ఆ బోర్డు.

జపానువాళ్ళని చంపండి!

జపానువాళ్ళని చంపండి!

జపానువాళ్ళని చంపండి!

మీవిధి మీరు సమర్థంగా నిర్వహిస్తే పచ్చవెధవలను (జపానువాళ్ళు) చంపడానికి తోడ్పడినవా రవుతారు.

# 2

తాటితోపుల మధ్యనున్న టులగీ హార్బర్‌లో పెద్ద ఓడలు, చిన్నబోట్లు కిటకిటలాడుతూవుంటాయి. వాటిలో పి. టి. 109 ఒకటి. గాడల్‌కెనాల్ పోరాటంలో ఆరితేరి బాగాదెబ్బతిని ఇవాళ రంగుచెడి, ఎలుకలుపట్టి, బొజ్జింకలకు నిలయమై అలరారుతున్నా, తొమ్మిదిమాసాలనాడు కళకళ లాడుతూ కొత్తచేవతో రంగుతోమెరిసిన సరికొత్తబోటు అది. ఎనభై అడుగుల పొడుగున ప్లైవుడ్‌తోతీర్చి 12 సిలెండర్ల పాకర్డ్ ఇంజన్‌లు మూడు బిగించారు. నాలుగు టార్పెడో ట్యూబులు; మెషిన్‌గన్‌లు, విమానవిధ్వంసకఫిరంగి అమర్చారు. 1942 జులైలో దానిని 'నెవార్కు—బే' రేవులో జలప్రవేశం చేయించారు. ఎలెక్ట్రిక్‌బోట్‌కంపెనీవారి మెల్కో—నౌకాదళవిభాగంవారు నిర్మించిన ఆ బోటు న్యూజెర్సీ, బెయాన్‌లోని కంపెనీ నౌకాశ్రయంలో వుండగా ఒకరోజున హఠాత్తుగా నౌకాదళాధికారులు దండెత్తివచ్చి యుద్ధానికి కావాలని తీసుకొన్నారు. వచ్చినవారు లెఫ్టినెంటు (జెజి) బ్రియాంట్ ఎల్. లార్సన్, అతనిసిబ్బందీని. బోటుచూసి బాగుందని తృప్తిపడ్డారు. ఎక్కి ఇంజన్ స్టార్టుచేశారు.

లెఫ్టినెంట్ లారన్స్ ఆధిపత్యాన, పి.టి. 109 అద్భుత యాత్రా చరిత్ర ప్రారంభమైంది. న్యూజెర్సీ పారిశ్రామిక ప్రాంతాలమధ్యగా నూనె, బొగ్గు, దుమ్ము, పొగలను ఒరుసుకుంటూ చీల్చుకుంటూ రేవుపొడుగునా లంగరువేసుకొని తుప్పుపట్టిపోతున్న రవాణానౌకలను చూసుకుంటూ జెర్సీ కెలాల్ వంతెన దాటి రంగప్రవేశం చేసింది 109. యుద్ధఘట్టంలోవున్న దేశానికి జయంకూర్చే నిజమైన ఆయుధాల బలం తెలిపే స్థావరాలు అనతగ్గ దుక్క-ఇనుము, ఇంధన తైలాలు, రసాయనికద్రవ్యాలు, రైలుపట్టాలు, వాహనాలూ వగైరా కర్మాగారాలెన్నో ఈప్రాంతంఅంతా క్రిక్కిరిసివున్నాయి.

నీటిని చీల్చుకుపోతున్న పి. టి. 109 అతిసొగసైన కెరటాన్ని అనంతంగా మలచుకుంటోంది. వెనకవైపు మడ్డినీటిని మనోహరమైన నురగకెరటంగా పరిమార్చి మరీ వెళ్తోంది. దానిఅగ్రం చాలా ఎత్తు. రేడియో ఆన్ టెనా (శబ్దతరంగాలను గ్రహించే ఏరియల్) గాలిలో ఠీవిగా ఊగుతోంది. టార్పెడోట్యూబులు సముద్రంలోకి గురిచేసినట్టున్నాయి. ఫాక్టరీల, నూనెటాంకుల వాతావరణంమధ్య నీటిలో హుందాగా, సొగసుగా, వేగంగా యెదురులేని వీరుడిలా వెళ్ళిపోతున్న ఆబోటునుచూస్తే మానవుడి ధైర్యసాహసాలు, పౌరవ, నిర్లక్ష్యం అన్నీ క్షణంలో స్ఫురిస్తాయి. బహుశా ఆ లక్షణాలే లేకపోతే పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి ప్రసాదించినశక్తి వుండీ వృథాఅయేది.

నెవార్క్ బేనుండి కదలిన 109 కిల్ వాన్ కుల్ మీదుగా న్యూయార్కు చేరుకుంది. అక్కడ స్టాట్యూ ఆఫ్ లిబర్టీ (ప్రజాస్వామ్య స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను చాటే బ్రహ్మాండమైన విగ్రహాం. దీనిని ఫ్రాన్సు అమెరికాకు కానుకగా ఇచ్చింది) దాటగానే వేగంపుంజుకొని బ్రూక్లిన్ లోని నౌకాదళ నౌకాశ్రయానికి ప్రయాణం సాగించింది. నాలుగురోజుల తరువాత డ్యూటీలోపడింది. ఈస్ట్ రివర్, లాంగ్ ఐలెండ్ సౌండ్ నరాంగన్ సెట్ బే ప్రాంతాలలో విహరించసాగింది. బ్రూక్లిన్ కూ, మెల్విలులోని పి. టి. శిక్షణ కేంద్రానికీ మధ్య రాకపోకలే ప్రధానంగా ఆబోటుపని.

109 మీద మహావేగంగా వెళ్ళడంఅనేది గాలితోటి నీటిజల్లుతోటి హుషారైన యుద్ధంచేయడమే. పెద్ద కెరటాలను దాటినప్పుడు బోటుఅడుగుభాగం ఎగిరి దభేలున నీటిమీద పడుతూవుంటుంది. ఆ తాకిడికి తట్టుకోమంటే నావికులుఉన్న బలంఅంతా మోకాలికీళ్ళమధ్య నిలిపి పడకుండా బిగబట్టుకు నిలదొక్కుకునేవారు. ఐరల్ బాటమ్ సౌండుజలాలమీద గంటకి 40 మైళ్ళవేగాన బోటుపోతుంటే నావికులు మహాఉత్సాహంగా వుండేవారు. ఏదో శత్రునౌకమీదికి దూకుడుగాపోయి నీటిమట్టానికెళ్ళే శతఘ్నులు దాన్నికొట్టి మళ్ళీ దానిగురికి దొరక్కుండా వంకరటింకరగా తిరుగుతూ తప్పించుకు పారిపోతున్నట్టుండేది.

పి. టి. 109 చాలాబాగా పనిచేసేది. శక్తికిశక్తి, వాటానికివాటం, దార్ఢ్యం వుండేవి. ఎలాచెబితే అలా తిరిగేది. ఇకపోతే ఆనోవకిచెందిన కొన్ని పి. టి. ల వేగం దీనికిలేదు.

లేదని కెప్టెన్‌లారెన్స్ అనేవాడు. వేసవిగడిచేసరికి ఒకనాటి స్పీడు బోటు పి. టి. 109 యుద్ధరంగానికి లాయకీఅయింది. నాక్షోన్ తీసుకువెళ్ళారు. అక్కడనుండి ఓడమీద కనుమ లోని ఖాల్బోవారేవుకు తీసుకువెళ్ళారు. అక్కడ 5 వ మోటారుటార్పెడ్ బోటుదళంలో చేర్చి మరికొంత తర్ఫీదు చేశారు. తరువాత సెప్టెంబరులో రెండవస్క్వాడ్రన్‌కు బదిలీ చేశారు. లిబర్టీ ఓడమీదకెక్కించి నేమియాచేర్చారు. అక్కడి నుండి ఒకడిస్ట్రాయరు దీనిని టులగీ తీసుకువెళ్ళింది. కొద్ది రోజుల తరువాత గాడల్ కెనాల్‌కు ఉత్తరదిశన డ్యూటీ వేశారు.

కొద్దిరోజులలోనే 109 యుద్ధాలంకారాలు అమర్చుకో సాగింది. ఒకనాటిరాత్రి కేప్ ఎస్పెరెన్స్ ప్రాంతంలో సోదా చేయడానికివెళ్ళి కోస్తాఫిరంగులనుండి మూడుదెబ్బలుతిని మూడుచిల్లులతో తిరిగివచ్చింది. మరురాత్రి లుంగాపాయింటు ప్రాంతంలో గస్తీతిరిగింది. ఒకసారి సైనికదళానికి కావలసిన సామాగ్రి వేసికొని సావోదీవికి వెళ్ళివచ్చింది. ఒకొక్కసారి సైనికులకు టపాబట్వాడాచేసేది. 1943 శీతాకాలంఅంతా ఈబోటు డ్యూటీలు ఇలాటివే. ఒకసారి ఇంజను స్టార్టుకానందు వల్ల బయలుదేరక ప్రాణగండం తప్పించుకుంది. ఆరాత్రి ఇది కదలదని స్క్వాడ్రన్ కమాండర్ లూటినెంటు రోలిన్ ఇ. వెస్ట్ హోమ్ 109 మీది సిబ్బందిని 112 బోటుమీదికి ఫిరా యించి దీనిని తీసుకుబయలుదేరాడు. ఆవేళ దీనికసలు డ్యూటీ లేదు. ఆరాత్రి అందు డ్యూటీలో వెళ్ళి కేప్ఎస్పెరెన్స్, డోమాకోవ్‌లమధ్య గస్తీతిరిగింది. తెల్లవారుఝామున మరో

రెండు బోటులను తోడుచేసికొని వెస్టుహోమ్ నాలుగు జాపనీస్ హాట్సునౌకలమీద దాడిచేశాడు. వాటిలో హాట్సుకాజ్ అనే ఒకఓడ బాగా దెబ్బతింది. కాని ఈ బోట్లలో పి. టి. 112 మాత్రం తూట్లుపడేలా దెబ్బతిని మునిగిపోయింది. లూ. వెస్టుహోమ్, అతని సిబ్బంది ఒకచిన్న దొన్నెమీద చేరుకొని ఆ తెల్లవారేదాకా యీదారు. అప్పుడు ఒక పి. టి. బోటు వచ్చి వారిని ఆదుకుంది. సిబ్బందిలో ఇద్దరికి బాంబుతునకల వల్ల గాయాలు తగిలాయి.

లూ. హోమ్ రేవు చేరగానే పి. టి. 109 ను బాగు చేయించి తిరిగి దాడిజరిపాడు. 48 గంటలతరువాత తిరిగి శత్రునౌకలు దీన్నికూడా దెబ్బతీశాయి.

ఒకరాత్రి ఒకజాపనీస్‌నౌక మునిగి అందుమీది నావికులు ప్రమాదంలో వుండగా వారిన్నిపైకితీసే పనిమీదవెళ్ళింది పి. టి. 109. ఒక్కడుతప్ప మిగతాఅందరినీ పైకిలాగారు. అతనొక ఆఫీసరు. దొరకకుండా యీదుకు పారిపోసాగాడు. తుపాకీగుండ్లతో అతనిని ఆపి వెనక్కిరప్పించాలని నిశ్చయించాడు లూ. వెస్టుహోమ్. వెంటనే 45 కోల్డ్‌రివాల్వరుతీసి యీదుతూన్న ఆ ఆఫ్సరుకు కొంచెంఎదురుగా గుండ్లు కురిపించాడు. ఆఫ్సరు వేరేదారి తోచక వెనక్కితగ్గాడు. అలా అతన్ని సమీపించి పైకిలాగాలనుకుంటూ వుండగా బోటు ఇంజనురూమ్‌లోని ఒకఅసిస్టెంట్ ఇది చూశాడు. వెస్టుహోమ్‌కి గురిచూచి కొట్టడం చేతకావడంలేదన్న దురభిప్రాయంతో అతను ఒకరైఫిల్‌అందుకొని ఒక్కటే దెబ్బతో ఆ ఆఫీసర్ని చంపిపారేశాడు.

కానీ ఫిబ్రవరిలో వెస్ట్‌హోమ్‌కు ప్రమోషన్ వచ్చింది. టులగీలోని మోటారుటార్పెడోదళం కమాండింగ్ ఆఫీసరుదగ్గర చీఫ్‌స్టాఫ్‌ఆఫీసరుగా వేశారు. ఏప్రిల్‌నాటికి లూ. లార్సన్‌కు యుద్ధరంగం వదలి స్వదేశంచేరుకునే వంతువారీ అవకాశం వచ్చింది. ఏప్రిల్ 25 న పి. టి. 109 లాగ్‌బుక్ (దైనందిన కార్యక్రమాన్ని వ్రాసివుంచే పుస్తకం)లో ఈక్రింది విధంగా వ్రాయబడింది.

0830 గంటలకు * సెసాపీకి వెళ్లేందుకు సిద్ధం.

1100 గం. లెఫ్టినెంట్ (జె. జి.) జె. ఎఫ్. కెనెడీ బోటు ఆధిపత్యం స్వీకరించారు.

1145 గం. పొదలమాటున రివాజుఅయినచోట లంగరువేశాము.

1941 వేసవికాలంలో ఒకనాడు కెనెడీ, మార్త్వాస్ విని యార్డులోని ఎడ్గార్‌టౌన్‌కు తన తెరచాప పడవ 'విక్ట్యురా' మీద షికారుగా వెళ్ళాడు. కెనెడీకి చిన్నవయసు నాటినుంచీ పడవనడపడంఅంటే ఆసక్తి. అప్పట్లో తరచు యానినా రేవునించి నాన్‌టకెట్‌సౌండుమీదుగా మార్త్వాస్

* సెసాపి-టులగిదీనిదగ్గరవున్న పి. టి. బోట్ల స్థావరం.

వినియార్డుకు బోటుమీద వెళ్ళేవాడు. తల్లిదండ్రులు గట్టు మీదనిలబడి మెడలుఎత్తిచూచినా పడవలో కెనెడీ తల కూడా కనబడేది కాదు.

ఇప్పుడు పెద్దవాడయ్యాడు. ఈసారి ప్రయాణంలో అత నికి కనబడిన ఒకదృశ్యం గాఢమైన ముద్రవేసింది. భవిష్య త్తులో తిరిగి అది ఆకర్షించబోతూన్నదని అతనికి తెలియదు. ఆనాడు హార్బరులో ప్రవేశిస్తూండగా అతనికంటబడింది. ఒక అందమైన పెట్రోల్‌టార్పెడో బోటు. అది కొత్తది. నౌకా దళం దీనిని న్యూపోర్టునుండి తీసుకువచ్చి ఇక్కడ ప్రదర్శనకై నిలిపివుంచింది.

మొదటి ప్రపంచయుద్ధంలో బ్రిటన్, ఇటలీ, జర్మనీలు మోటార్‌టార్పెడో బోట్లను ఉపయోగించాయి. రెండవ ప్రపంచయుద్ధం మొదలైననాటినుండి బ్రిటన్ వాటిని ప్రయో గించి మంచిఫలితాలు సాధిస్తూవచ్చింది. వాటిని "మస్కిటో (దోమ) బోటు" అనేవారు. అందరూవాడుతున్నా అమెరికా మాత్రం దీనిమీద చాలాతర్జుమా పడింది. వాషింగ్‌టన్‌లో నౌకాదళం పెద్దతలకాయలంతా అమెరికాకి ఇవి తగవని, వద్దని గట్టిగావాదించారని చెప్పుకొనేవారు. కాని ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్, జనరల్ డగ్లస్, మెకార్థర్‌లుమాత్రం వీటిని వాడితీరాలని పట్టుపట్టి ఒప్పించారు. ముఖ్యంగా ఫిలిప్పీన్స్ ప్రాంతంలో మోటారుటార్పెడోలు బాగా ఉపయోగపడతా యని మెకార్థర్ అన్నాడు. ఆయనమాట అక్షరాలా నిజమని దరిమిలాను జరిగిన సంఘటనలు నిరూపించాయి. మొత్తం మీద ఎడ్గార్‌టౌన్‌లో అందంగా సొగసుగా నిలిచిన పి. టి.

బోటు కెనెడీని చాలా ఆకర్షించింది. బోటుమీదికి ఎక్కి అంతా చూశాక అమాంతం స్టీరింగుఅందుకొని ఇంజన్ స్టార్ట చేసి ముందుకురికించాలన్నంత ఉత్సాహంకలిగిం దతనికి.

మోటారుబోట్లు నడపడంలో అతనికి అపారమైన అనుభవం వుందనికాదు. తెరచాపపడవలు నడపడంలోనే అతనికి చెయ్యితిరిగింది. వాటిమీదే సరదాఎక్కువ. అతను కుర్రవాడుగా వుండగానే తండ్రి లియానో జూనియర్ అనే నాక కొన్నాడు. అది పదహారడుగులపొడుగున దూసిన కత్తిలా వుండేది. అప్పట్లో కెనెడీ దంపతులకు ఎనమండుగురు సంతానం. తమ యిద్దరినీ కలుపుకొని 'టెనోకన్' అని ఆ బోటుకు పేరుపెట్టాడు జోసెఫ్. 1932 లో ఎడ్వర్డు పుట్టాడు. అప్పుడు కొన్న మరోనావ 'వియానోజూనియర్' కు ఆయన 'వన్ మోర్' (మరొకడు) అని నామకరణం చేశాడు. అప్పట్లోనే ఆయన 'విక్ట్యురా' ను ఫ్లాష్-2 అనే స్టార్ బోటునుకూడా కొన్నాడు.

సొంతనావ లున్నందువల్ల జాన్ కెనెడీకి వాటిని నడపడంలో ఆసక్తి, ప్రతిభకూడా పెరిగాయి. ఒకసంవత్సరం స్టార్ బోటు తరగతిలో నాన్‌టకెట్‌సౌండ్ పోటీలలో చాంపియన్ షిప్ సంపాదించాడు.

హార్వర్డ్ బోటింగ్ జట్టులో అతను ఒక సభ్యుడు. తూర్పుప్రాంతీయ అంతర్‌కళాశాలల పోటీలలో ఒకయేడాది అతనిజట్టుకూడ మిలన్‌ట్రోఫీ గెలుచుకుంది. వేసవిలో అతను అన్న జోసెఫ్ ఇద్దరూ వీలుదొరికినప్పుడల్లా పోటీపందాలకు

వెళ్ళేవారు. కెప్టెన్ గిరీ ఒకసారి ఇతనైతే, మరోసారి అతను తీసికొనేవారు. ఇతరులెవరూ లేకపోతే వాళ్ళిద్దరే ఒకరితో ఒకరు పోటీగా నావనడుపుకునేవారు.

ఇలా నావలమీద యింతకృషిచేసినా యింతసరదా వున్నా యుద్ధకాలంలో పెరల్ హార్బర్ దాడికిముందు పరిస్థితి తీవ్రమై అంతా యుద్ధానికిచేరుతున్నవేళ కెనడీ సైనికదళంలో చేరడానికి ప్రయత్నించాడు. కాని సైన్యం అతన్ని చేర్చుకోలేదు. కారణం వెన్నెముక సరిగాలేకపోవడం. హార్వర్డులో జూనియర్ యూనివర్శిటీ ఫుట్ బాల్ పోటీలో ఆడుతూండగా నడుంమీద బాగా దిగువన దెబ్బతగిలింది. అది అలానే వుండిపోయింది. తిరగగొట్టారన్న నిరుత్సాహంబదులు పట్టుదల పెరిగింది. నడుంఎముక సరిఅయి చెప్పినట్లు వినేందుకు అయిదు మాసాలపాటు చికిత్సకులుచెప్పిన వ్యాయామంచేశాడు. తరువాత నౌకాదళంలోచేర ప్రయత్నించాడు. 1941 సెప్టెంబరులో ఫిట్ నెస్ టెస్టు (ఆరోగ్యం, అంగసౌష్టవం తగినట్లు వున్నాయని తేల్చే పరీక్ష) లో ఉత్తీర్ణుడయ్యాడు. అక్టోబరులో యునైటెడ్ స్టేట్స్‌లో నౌకాదళం రిజర్వుశాఖలో ఎన్ సైన్ గా నియుక్తుడయ్యాడు.

తరువాత అతనికి 'పెంటగన్' (వాషింగ్టన్‌లోని రక్షణవ్యవహారాల ప్రధానకార్యాలయం)లో డ్యూటీవేశారు. నౌకాదళ రహస్యసమాచారశాఖలో పనిచేస్తూ దైనందిన వార్తాసంగ్రహపత్రిక ఒకటి తయారుచేసేవాడు. తీరికవేళలలో రహస్యసమాచార సేకరణ, పరిశీలన లలోను, నౌకాదళ

నియమనిబంధనలలోను, కస్టమ్స్ వ్యవహారాలలోను కరె స్పాండెన్స్ కోర్సుద్వారా శిక్షణపొందాడు.

డిసెంబరు 7 ఆదివారంనాడు కెనెడీ, అతని మిత్రులు లెమొయిన్ బల్లింగ్స్, గిఫిల్ స్టేడియంలో బేస్ బాల్ మాచ్ కి వెళ్ళారు. వాషింగ్టన్ రెడ్ స్కిన్స్ జట్టు 20-14 స్కోరుతో ఫిలడల్ఫియా ఈగిల్సును చిత్తుగాఓడించగాచూసి ఆనందించి కబుర్లుచెప్పుకొంటూ తిరిగివస్తున్నారు. అంతలో భయంకర మైన 'కబురు' వినబడింది. జపాన్ పెరల్ హార్బర్ మీాద విరు చుకుపడిందని. తక్షణం కెనెడీ తనను ఈఆఫీసునుండివదలి ఓడ మీాదడ్యూటీవేసి యుద్ధంలోకి పంపమని కోరుతూ దరఖాస్తు పెట్టాడు. అది జరగలేదు. పైగా 1942 జనవరిలో అతన్ని పెంటగన్ నుంచి దక్షిణకెరూలినా, చార్లెస్ టౌన్ లోని 65 నౌకాదళవిభాగానికి బదిలీచేశారు. అక్కడ యుద్ధపరికరాల ఫ్యాక్టరీలపై శత్రువిమానాలు బాంబులువేయకుండా చూడడం అతనిపని. ఏవిమానాలూరాని ఆ ప్రాంతంలో గోళ్ళుగిల్లు కుంటూ పనిలేకుండా కూర్చోడంతో కెనెడీకి ప్రాణం విసు గెత్తిపోయింది.

1942 వేసవిలో నార్తువెస్టర్న్ యూనివర్సిటీలో నౌకాదళ రిజర్వుఆఫీసర్ల ట్రైనింగుస్కూలుకు పంపించారు. అప్పటినుండీ కెనెడీ ఉద్యోగజీవితం హుషారైన ఘట్టంలో పడింది.

రెండో ప్రపంచయుద్ధం తొలిరోజుల్లోనే ధైర్యసాహ సాలుచూపి పేరు గడించుకున్నవారిలో లూటినెంట్ జాన్

డి. బల్‌కిలీ ఒకడు. మోటార్ టార్పెడో బోటు మూడవ స్క్వాడ్రన్ కమాండర్‌గా ఆయన 'మెడల్ ఆఫ్ ఆనర్' అందుకున్నాడు. ఫిలిప్పీన్స్‌నుండి జనరల్ మెకార్థర్‌ను, అక్కడి దళాన్ని సురక్షితంగా చేర్చినది యీ స్క్వాడ్రన్ బోటులే. సూచిక్ బేలో ఒక జాపనీస్ ఆక్సిలియరీ క్రూయిజర్ నౌకను ముంచివేసినది ఇదే. ఇలాంటి సాహసాలు, అద్భుతాలు ఎన్నో చేసింది యీ దళం. ఇది ప్రజలలో ఉత్తేజకరమైన కథలూ-గాథలుగా ప్రచారంఅయేసరికి అమెరికా రక్షణాంగాలన్నిటిలోను అద్భుతమైన అత్యంతశక్తివంతమైన ఆ యుద్ధాలు ఈ పి. టి. బోట్లేననేభావం బాగావ్యాపించింది. జనబాహుళ్యానికి వీటిమీద ఒకతరహామోజు, గ్లామర్ ఏర్పడింది. బల్కలీగురించి స్క్వాడ్రన్ 3 కి చెందిన మరొకరు లూ. రాబర్ట్ బి. కెల్లీ గురించి వారి సాహసచర్యలు వర్ణిస్తూ 'దే వర్ ఎక్స్‌పెండబుల్' అనే పుస్తకం వచ్చింది. ప్రజలు ఆ పుస్తకం విరగబడికొని చదివారు. పి. టి. బోట్ల అద్భుత కృత్యాలగురించి, వాటి నావికుల సాహసచర్యలగురించి కథలుగా చెప్పుకొనేవారు. సూచిక్ బేలో పి. టి. బోట్లు నౌకని ముంచిన తరువాత జపానువాళ్ళు చాలా కంగారుపడ్డారు. అమెరికావాళ్ళు అతిరహస్యంగా ఒక కొత్తయుద్ధం తయారు చేశారని రాకాసిలాటి ఆబోటు గర్జిస్తుందని భయంకరంగా రెక్కలాడిస్తూఎగిరి మీదపడుతుందని దశదిశలా టార్పెడోలు వర్షంలాకురిపించి సర్వనాశనంచేస్తుందని టోక్యో రేడియోలో వర్ణిస్తూ వార్తలు ప్రచారంచేశారు.

ఆనాడు పౌరుషంగా విన్న, చదివిన కథలన్నీ ఈనాడు ఎడ్గార్‌టౌన్‌లో పి. టి. బోటును చూడగానే గుప్పుమని గుర్తుకొచ్చాయి. అమాంతం ఒక పి. టి. బోటుకు కెప్టెన్ అయిపోవా లనుకున్నాడు. అనుకొన్నట్టే పరిస్థితులుకూడా కలిసివచ్చాయి. కెనెడీ నార్త్ వెస్టరన్ యూనివర్శిటీ చేరిన తరువాత పి. టి. సర్వీసుకై ఇక్కడి విద్యార్థులనుండి రిక్రూట్ చేస్తారని * లూటినెంట్ బల్కెలీ, మెల్విల్ కేంద్రంలో సీనియర్ ఇన్‌స్ట్రక్టర్ (అధ్యాపకుడు) లూటినెంట్ జాన్ హార్లీలు వచ్చి అభ్యర్థులను ఇంటర్వ్యూ చేస్తారని ఒక ప్రకటన వచ్చింది. ఎన్‌సైన్ కెనెడీ అవకాశంరాగానే ఎగిరిగంతువేశాడు.

బల్కెలీ, హార్లీలు నిర్ణయించుకున్న అర్హతలన్నీ కెనెడీలో పుష్కలంగా వున్నాయి. వాళ్ళకి బాగా చదువుకొని రాణించిన యితరులు కావాలి. అభ్యర్థులకు శరీరసౌష్ఠవం, వ్యాయామక్రీడలలో ప్రతిభ కావాలి. చిన్ననావలను నడపడంలో విశేషమైన అనుభవం కావాలి. అసలు ముఖ్యంగా ఈ చివరపేర్కొన్న అంశంవల్లనే పి. టి. బోటు ఆఫీసర్లు చాలామందీ ఐవీలీగుసభ్యులు సొంతపడవ లున్నవారూ, యాక్ట్‌క్లబ్బుల సభ్యులూకూడా అక్కడే తిరుగుతూ పడవలు ఎరువుతీసుకు సరదాగా పోటీలుచేసేవారు. ఎన్నికఅవడం జరుగుతూవచ్చింది. ఎన్‌సైన్ కెనెడీకి అన్నిలక్షణాలూవున్నాయి. హార్వర్డ్‌లో బాగాచదువుకున్నాడు. హార్వర్డు యీతగాళ్ళ జట్టులో అతను సభ్యుడు. ఇవన్నీ పరీక్షకులకు నచ్చాయి.

* 1961 లో నౌకాదళాధిగావున్న రియర్ అడ్మిరల్ జాన్ హార్లీని ప్రెసిడెంట్ కెనడీ మారీటైమ్ కమిషన్‌లో సభ్యుడుగా నియోగించారు.

అన్నిటికన్నా మిన్నగా తెరచాపనావలు నడపడంలో అతని కున్న ఆసక్తి, ప్రతిభ, అనుభవం బాగా ఆకర్షించాయి.

వెంటనే వారు కెనెడీని ఎన్నుకొని పి. టి. ఆఫీసరుగా శిక్షణకు పంపాలని సిఫార్సుచేశారు. 1942 అక్టోబరు 1 నుండి మెల్విల్ స్థావరంలో ఎనిమిదివారాల శిక్షణకార్యక్రమం మొదలైంది. మోటారుటార్పెడోబోటు స్క్వాడ్రన్ శిక్షణకేంద్రం, నరాంగన్ సెట్ బేలో వుంది. అక్కడ ఆఫీసర్లు, సిబ్బంది, అభ్యర్థులు కాన్ సెట్ పాకలలో బసచేసేవారు.

తుపాకీకాల్చడం, నావలు పడవలు నడపడం, నావిక విద్యలు, ఇంజనీరింగు, టార్పెడోలను ప్రయోగించడం వగైరాలన్నిటిలోనూ తరిఫీదు పొందేవారు. శిక్షణ చాలాభాగం పి. టి. బోట్లమీాదనే జరిగేది. అత్యం తారోగ్యకరమైన పద్ధతిలో జీవితంసాగేది. తెల్లవారు జామునే మిలిటరీబ్యూగిల్ మేలుకొలుపు. తరువాత కాలి స్తనిక్స్ ఎక్సర్ సైజ్ (కదలికలో సొగసు, తూకం వుండేట్టుచేసే) వ్యాయామం జరిగేది. తరువాతపరుగులు, వ్యాయామక్రీడలు మాత్రం యిష్టాయిష్టాలకు వదలివేసేవారు. అది శిరస్త్రుతువు. ఛాన్సురాగానే కెనెడీ టచ్ ఫుట్ బాల్ కు తయారయ్యాడు. ఎర్రటి 'హెచ్' అక్షరంకుట్టిన నల్లస్వెట్టర్ వేసుకొని బంతిలా ఎగురుతూ వస్తున్న కెనెడీనిచూసి హన్ స్కూలుతాలూకు కాబోలు అనుకున్నాడు ఎన్ సైన్ జార్జి రాస్.

ఆనాటి తొలికలయిక చిరకాలంనుంచి వారిద్దరి జీవి తాలు భవిష్యత్తులో గాఢంగా పెనవైచుకొనిపోతున్నవని

అతను ఆ క్షణాన వూహించలేదు. అసలు మెల్విల్ కేంద్రంలో చేర్చుకోతగ్గవయ సుంటుందా అని రాస్‌కి అనుమానం వచ్చింది.

శని, ఆదివారాలలో కెనెడీ తన పాకలోని తోటి ఆఫీసర్లను టచ్ ఫుట్ బాల్ ఆటకు పిలిచేవాడు. లేదా దగ్గరలో వున్న హాయానిస్ రేవుకి వెళ్ళి సముద్రంవొడ్డునే షికారుచేద్దాం రమ్మనేవాడు.

అక్టోబర్‌లో కెనెడీకి జూనియర్ గ్రేడ్ లూటినెంట్‌గా ప్రమోషన్ ఇచ్చారు. నవంబరు నెలాఖరుకు శిక్షణపూర్తి అయింది. వెంటనే యుద్ధరంగంలో తిరుగుతున్న ఏస్క్వాడ్రన్‌లోనో తనకి డ్యూటీవేస్తారని ఆశపడ్డాడు కెనెడీ. కాని అతని ప్రతిభే అతనిఆశలకు ఎదురైంది. లెఫ్టినెంట్ హార్లీ అతన్ని ఇక్కడే అధ్యాపకుడుగా నియోగించ నిశ్చయించాడు. ఎందుకంటే కెనెడీకి ఓడనడపడంలో ఉత్తమశ్రేణిరాంకింగ్ వచ్చింది. ఇంజనీరింగ్ వగైరాలలో మంచిప్రమాణం అందుకున్నాడు. మొత్తంమీద అన్నిటా చిత్తశుద్ధితో పాటుపడతాడనీ, శ్రద్ధగా అన్ని నేర్చుకుంటాడనీ మంచిపేరు వచ్చింది. అందువల్ల అతన్ని ఎం. టి. బి. స్క్వాడ్రన్ 4 లో వేశారు. అంటే అది మెల్విల్‌లోని స్థావరం. అక్కడ శిక్షణకార్యక్రమాలకు వాడే పి. టి. 101 కి కెనెడీని కమాండర్‌గా వేశారు.

మెల్విల్‌లోనే దిగబడిపోయినందుకు కెనెడీ నిరుత్సాహపడినా బాధ్యతతీసుకొన్న తరువాతమాత్రం శ్రద్ధా

ప్రపత్తులతో పనిచేశాడు. ఒకరోజున కొందరు ఆఫీసర్ అభ్యర్థులను తీసికొని పి. టి. 101 లో శిక్షణకై బయలుదేరబోయాడు. రావలసినవారిలో ఎన్సైన్ పాల్ బి. ఫే జూనియర్ రాలేదు. కారణం వుంది. 101 కొంచెం పాతబోటు. 77 అడుగులే పొడుగు. ఫేమిత్రులు కొందరు ఎల్కోకంపెనీవారి కొత్త బోటు-80 అడుగులది ఒకటి తీసికొని 101 వెళ్ళేవేపే వెళ్తున్నారు. సరదాకొద్దీ అతను ఇక్కడ గైరుహాజరై అందుమీద వెళ్ళాడు. ఆ సంగతి సెమెఫోర్ మీద 101 కి కబురుచేశాడు. కాని అది అక్కడివారికి అర్థంకాలేదు. వేళఅవగానే ఫేకి గైరుహాజరువేసి కెనెడీ బయలుదేరాడు. కొద్దిగంటలతరువాత రేవుచేరగానే ఫేని పిలిచి చాలాగట్టిగాచివాట్లుపెట్టాడు. తనకి తనడ్యూటీ ఏమిటో ఎక్కడో ఖచ్చితంగా తెలుసు. తెలిసినప్పుడు ఎందుకురానట్టు? ఇలా ఎవడిమటుకువాడు కంటికి నదరుగావుందనుకున్నబోటల్లా ఎక్కేసి ఇష్టంవచ్చినట్టు షికారు చేస్తే ఏమిటి దీనిఅర్థం? ఇవాళ ఒక్కడే ఒక్కసారేచేశాడు. దీన్ని పదిలక్షలుపెట్టి గుణిస్తే-? అంతా యిలాచేస్తే ఆనాడు యుద్ధంలో దేశంగతి యేమయ్యేట్టు? ఏమయ్యేట్టని ...?

చివాట్లపాఠం అయ్యాక తుదిమెరుగుగా పి. టి. సర్వీసులోంచి బర్తరఫ్ చేసినట్లు వెల్లడించాడు కెనెడీ. ఎన్సైన్ ఫేకి దాంతో కంగారుపుట్టింది. బుద్ధిచెడి ఒక తెలివితక్కువపని చేశాననీ, యింకెప్పుడూ చెయ్యననీ నొక్కిచెప్పాడు. పరిపరి విధాల బ్రతిమాలాడు. బుద్ధివచ్చిందన్నాడు. అయినా కెనెడీ తగ్గలేదు. బెదరింపు మార్చలేదు. ఆ భయంతోనే చివరికి

బయటకు వెళ్ళాడు. భయంవున్నా యిలా ఆశకూడా వుంది—కెనెడీ నిజంగా అంతపని చెయ్యాడని. 1

కెనెడీ కాన్‌సెట్ పాకలో నివసించేవాడు. అతని పాకకు ఒకవంక ఎన్‌సైన్ జాన్ ఎల్. ఐక్స్ (బేటన్ రూజ్), మరోప్రక్కన లూటినెంట్ (జె. జి.) టార్బర్ హెచ్. మాక్డొనాల్డ్ 2 ఉండేవాడు. మాక్డొనాల్డ్ హార్వర్డులో చదివినప్పుడు పెద్ద ఫుట్‌బాల్ స్టార్. కెనెడీ అతనూ ఒకేగదిలో ఉండేవారు. కెనెడీ ఇప్పు డతన్ని మెల్‌విల్‌కు రప్పించుకున్నాడు. చలికాలం వచ్చింది. రాత్రిళ్ళు ఎన్‌సైన్ ఐక్స్ గజగజ వణికి పోయేవాడు. లూయిసానాకు పారిపోతాను అని గోలపెట్టే వాడు. కెనెడీ ఆతనిపక్కకింద వార్తాపత్రికలు పరచి చలి తగ్గించుకొనే ఉపాయం నేర్పాడు.

ఇంతలోనే ఒకవార్త వచ్చింది. మెల్విల్‌లోని బోట్లు కొన్నిటిని—కెనేడీది సహా— జాక్‌సన్‌విల్‌కు తరలించి అక్కడ నుండి ఓడమీద పనామాకు రవాణాచేస్తారన్నారు. ఈ బోటు ఉత్తర కెరూలినా దాటివెళ్తూవుండగా ఒకచోట భూమిలోకి చొచ్చుకొనిపోయి చిక్కుపడింది. కెనెడీ పి. టి. 101 లో వెళ్ళి దానికి తాడుపోసి లాగించబోయాడు. తాడు 101 బోటు

1 నిజానికి కెనెడీ అతన్ని భర్తరఫ్ చెయ్యలేదు సరిగదా! 1961లో అధ్యక్షుడయ్యాక నౌకాదళశాఖకు అండర్‌సెక్రటరీగా నియమించి ఆదరించాడు,

2 మాక్డొనాల్డు ఇప్పుడు డెమొక్రాటిక్‌పార్టీ తరపున ప్రతినిధుల సభలో సభ్యుడు. మాసాచుసెట్సుకు ప్రాతినిధ్యం వహిస్తున్నాడు.

తాలూకు ప్రొఫెల్లర్‌లో చిక్కుపడిపోయింది. చిక్కుతీయడానికని కెనెడీ నీటిలోకి దూకాడు. చలికాలపునీరు కావడంవల్ల కొయ్యబారిపోయాడు. ఒళ్ళంతా గడ్డకట్టేసినట్టయింది. అక్కడినుంచి జాక్సన్‌విల్ చేరేసరికి జ్వరంముంచుకొచ్చింది. చాలారోజులు ఆస్పత్రిలో ఉండిపోయాడు కెనెడీ.

అక్కడుండగానే అతనికి లూ. మాక్డొనాల్డ్ మెయిన్ రాష్ట్రంలో చలిఎంతతీవ్రంగా వుంటుందోచాలాసార్లుగొప్పగా వర్ణించిచెప్పడం గుర్తుకొచ్చింది. వెంటనే ట్రంక్ కాల్ బుక్ చేసి మాక్డొనాల్డ్‌ను పిలిచాడు.

"మీ మెయిన్‌కన్న యిక్కడ చల్లదనం ఎక్కువ. తెలుసా?" అన్నాడు గొప్పగా.

తను బయలుదేరదీసిన బోటులన్నీ చాలాకాలంపాటు పనామాలోనే ఉండిపోతాయని ఆస్పత్రిలో కెనెడీకి తెలిసింది. మళ్ళ ఇంకోస్థావరంలో స్థావరంగాఉండిపోవాలన్న దిగులు పట్టుకొంది. తండ్రికి చెప్పాడు. ఆయన లండన్‌లో రాయబారిగా వుండగా అక్కడకువచ్చి పరిచితులయిన అమెరికన్ నౌకాదళాధిపతులలో పెద్దలు కొందరున్నారు. తండ్రికొడుకులు వాళ్ళద్వారా యీ సమస్య చక్కబెట్టుకోవాలని ప్రయత్నించారు. ప్రయత్నాలు ఫలించాయి. కోలుకోగానే కెనెడీని పనామాకు పంపేబదులు సోలమన్ దీవులకు వెళ్ళమని ఉత్తర్వులు వచ్చాయి. అక్కడవారెవరికో బదిలీఅయితే ఆ స్థానంలో ఇతన్ని వేశారు.

# 3

యుద్ధానికి పూర్వం టులగీ బ్రిటిష్‌హయాములో వున్న సాలమన్ దీవులకు రాజధాని. పెరల్‌హార్బర్ దాడికి ఐదు మాసాలపూర్వం జపాన్ దీనిని వశపరచుకుంది. 42 ఆగష్టులో గాడెల్ కెనాల్ దండయాత్రలో ఒకభాగంగా అమెరికన్‌లు యిక్కడికి వచ్చి తిరిగి దీనిని స్వాధీనపరచుకున్నారు. టులగీ సన్నగావుండే చిన్నదీవి. కొండలమయం. ఫ్లారిడాకోస్తాకు నైరుతిదిశగావుంది. ఫ్లారిడా దీనికన్న చాలారెట్లు పెద్దది. అమెరికన్‌లు నెలకొల్పిన ఓడమరమ్మతు కార్ఖానాలూ, కాన్‌సెట్ పాకలు, తాటాకులతో వేసిన ఆఫీసర్స్ క్లబ్బు, రాయల్‌పామ్ వంటివాటిమధ్య రగ్బీఫీల్డ్, గవర్నమెంటు హౌస్ వంటి వలసరాజ్యపుచిహ్నాలు ఇప్పటిదాకా వున్నాయి.

సౌత్ పసిఫిక్ ప్రాంతంలో పి. టి. దళానికి అధిపతి కమాండర్ కల్వర్ట్, ఫ్లారిడాదీవిలో టులగీ పడమటికోస్తాకి ఎదురుగా 'కాలర్ట్ విల్' లో తన కేంద్రకార్యాలయం నెల కొల్పుకొన్నాడు. ఆ వూరినిండా స్థానికులు నివసించే రక రకాల పూరిపాకలు, వాటిమధ్య చైనానిర్మించిన మైరీన్ రైల్వే (నౌకాదళం సదుపాయంకోసం), టార్పెడోలు శుద్ధిచేసే కర్మాగారం వున్నాయి. రేవుదగ్గర ఒకపెద్ద సింహద్వారం

వుంది. దీనిమీాద "ప్రపంచంలోని ఉత్తమోత్తమమైన మోటార్ టార్పెడోబోట్లు ఈద్వారంగుండానే వెళ్లాయి" అని వ్రాసివుంటుంది.

పి. టి. బేస్ కార్యక్రమాలు చాలభాగం కాలర్ట్‌విల్ కాలువకి ఆవలగా టులగీలో ఒకనాటి చైనీస్ వ్యాపార కేంద్రం సెసెపీగ్రామంలో జరిగేవి. డిస్ట్రాయర్‌లు, లిబర్టీ ఓడలు, న్యూజిలాండ్ కార్వెట్‌లు ఆ కాల్వమీాద నిర్విరామంగా తిరుగుతూవుండేవి. మరమ్మతులకువచ్చే పి. టి. బోట్లు తమ ఛాన్సుకోసం గర్జిస్తూ రొదచేస్తూ డ్రైడాక్‌లో కాసుకొనివుండేవి. మరమ్మతులకేంద్రం జేమ్సుటౌన్ దగ్గర కిటకిటలాడుతూ తారట్లాడేవి. పి. టి. లో డ్యూటీలేనప్పుడు జాపనీస్‌విమానాల కంటబడకుండా టులగీకోస్తానో, ఫ్లారిడాకోస్తానో పొదలమాటునదాచి కట్టివుంచేవారు.

సాలమన్‌దీవుల స్థావరానికివచ్చాక కెనెడీకి డ్యూటీపడడానికి ఆట్టేరోజులు పట్టలేదు. పి. టి. 109 కి కెప్టెన్‌గా వెళ్ళవలసిందని ఉత్తర్వులు వచ్చీరాగానే ఆ బోట్ల కెప్టెన్ లెఫ్టి. లారెన్సును చూడబోయాడు కెనెడీ. ఆయన ఇతన్ని చూడగానే ప్రాణంలేచివచ్చింది. పరమానందభరితుడయ్యాడు. కళ్ళు కాయలుకాచేలా ఎదురుచూస్తున్నాడు లార్సెన్. అంటే లోగడ కెనెడీనిచూసి మళ్ళీ చూడాలని తహతహలాడుతున్నాడనికాదు. అసలెప్పుడూ ఇతన్ని చూడలేదు. అతని ఆనందానికి కారణం కెనెడీ డ్యూటీఎక్కితే తనుదిగి తక్షణం యిల్లు చేరుకోవచ్చునని. కొత్తకెప్టెన్‌ను బోటుమీాదికి తీసుకెళ్ళి

అంతా చూపించాడు. తరువాత నాలుగైదుసార్లు కెనెడీ ఆయ
నను పక్కనఉంచుకొని బోటుమీద షికారుచేసి దాని అను
పానులు, సాధకబాధలు ఆకళింపుచేసుకొన్నాడు. లారెన్స్
బోటు ఒప్పచెప్పి ఉద్యోగంవిరమించి అమెరికాకు వెళ్ళి
పోయాడు. కొత్తస్కిప్పర్ రాజ్యం ఆరంభమైంది.

లారెన్స్‌తోపాటు ఆ బోటు పాతసిబ్బందికూడ వెళ్ళి
పోయారు. కొత్తగాచేరిన ఒక ఆఫీసరుమాత్రం వుండిపోయాడు.
అంటే కెనెడీకి తనబోటు బలుపుసులుపులు తెలుసుకొని చెప్పు
చేతలోపెట్టుకోడంతోపాటు దానికి కొత్తనావికులజట్టును
ఎన్నుకొని వాళ్ళనీ ఈబోటునీకలిపి సమర్థమైన యుద్ధాం
గంగా తీర్చిదిద్దుకొనే బాధ్యతకూడా పైనపడింది. వేసవిలో
యుద్ధం పుంజుకునేనాటికి ఈ యేర్పాటు దారిలోపడాలి.

లారెన్స్‌జట్టులో దిగబడిపోయిన ఆఫీసరు ఎన్‌సైన్
లియొనార్డ్ జె. థామ్. ఓహియోలోని శాండస్కీ వాస్త
వ్యుడు. నిండైనహృదయం. అంతకన్నా నిండైన భారీవిగ్రహం.
ఎవడో పెద్ద వైకింగ్ (డేనిష్‌సముద్రపు దోపిడీదొంగ. దేహ
దార్ఢ్యానికీ, భారీవిగ్రహానికీ, బలపరాక్రమాలకీ పెట్టిందిపేరు)
దారితప్పి, కాలంతప్పి పొరపాటున ఈప్రాంతానికొచ్చాడని
పిస్తుంది. 1939 – 40 లలో ఎన్‌సైన్ లీకు, ఫ్రాన్సిస్ ష్మిట్
(బేస్‌లాక్) జట్టులో లెఫ్ట్‌టాకిల్ ఆడాడు. థామ్‌ది వెండి
జుట్టు. నౌకాదళంలోచేరాక వెండిగడ్డం పెంచాడు. బ్రహ్మాండ
మైన చాతీ, కొండంత భుజాలూ, నిడుపైనచేతులూ. మహా
కాయుడన్నమాట అతనిదగ్గర అతిశయోక్తి అనిపించుకోదు.
పి. టి. సర్వీసులో ఆనాడు బలిష్ఠులూ, అతికాయ మహాకా

యులూ చాలామంది వుండేవారు. ద్రాక్షపళ్ళరసం నిలవేసిన బాపతు తోనో, 190 ప్రూఫ్‌టార్పెడో ద్రవం (95% ఆల్కహాల్ వుండేదన్నమాట !) వల్లనో ఎవరికేనా ఉత్సాహం మరీ పెల్లుబికి చెలియలికట్ట దాటితే అలాటివాళ్ళని సునాయాసంగా దారికి తెచ్చి హద్దులోవుంచేందుకు తక్షణం తామ్‌కు కబురువెళ్ళేది. ఆ సామర్థ్యం అత డొక్కడికే వుండేది. కెనెడీ అతన్ని తనబోటుకి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నియమించాడు. అచిరకాలంలోనే తామ్ కెనెడీకి ఆ ప్రమిత్రుడు, నమ్మినబంటు అయ్యాడు.

రిటైరయే, బదిలీఅయేవారి స్థానాలు భర్తీచేయడానికని మెల్విల్‌నుండి కొత్తగావచ్చినవారిలోనుండి కెనెడీ తన సిబ్బందికి మనుష్యుల్ని ఎన్నికచేసుకున్నాడు. తను ఆధిపత్యం స్వీకరించిననాడే ముగ్గురు కొత్తవారు చేరారు.

ఒకడు గన్నర్స్‌మేట్ 2/సి. పేరు చార్లెస్ ఎ. హారిస్. బాస్టన్‌శివారు అవతల వాటర్‌టౌన్ అతని జన్మస్థలం. సన్నగా రివటలా వుంటాడు. ముదురుచాయ. రెడ్‌స్టాక్స్‌జట్టు కమాండర్‌పేరిట అంతా ఇతనిని 'బక్కీ' హారిస్ అని పిలిచేవారు.

ఇరవైయేళ్ళ హారిస్‌బాల్యమంతా నీటిమీద ఆటలలోనే గడిచింది. వాటర్‌టౌన్ హైస్కూలులో చదువు ముగించుకొని అతను హుడ్‌రబ్బరుకంపెనీలో ఉద్యోగానికి చేరాడు. యుద్ధంరాగానే నౌకాదళంలో చేరాడు.

మోటార్ మెకానిస్ట్ మేట్ 2/సి లియోన్ ఇ. డ్రాడీ 'బక్కీ' కన్న పదేళ్ళు పెద్దవాడు. సన్నగా పొడుగ్గాఉంటాడు. ముఖం సన్నగా పల్చగా ప్రసన్నంగా వుంటుంది. అతను మాట్లాడితే శబ్దం నాభిలోంచి గంభీరంగా వస్తుంది. చాలా తాపీగా మాట్లాడుతాడు. నిదానంగా ఆలోచించిగాని పన్నెత్తి పలకని అరుదైనస్వభావం అతనికి అబ్బింది. మొదటిప్రపంచ యుద్ధానికిపూర్వం అతని కుటుంబికులకు ఫ్లారిడాలో చెప్పుకో తగ్గ భూము లుండేవికాని, 1918 లో డ్రాడీతండ్రి చనిపోయే నాటికి పన్నుల బకాయిలు (లీన్‌లు) చాలావుండి ఆస్తంతా వాటికి చెల్లుబడిఅయిపోయింది. పెరల్‌హార్బర్‌నాటికి డ్రాడీ షికాగోలో మెకానిస్టుగా పనిచేస్తున్నాడు.

ఆనాడుచేరిన మూడోవ్యక్తి మోటార్‌మెకానిస్టు 2/సి ఎడ్మండ్ టి. డ్రెవిచ్. అతనిదీ డ్రాడీ వయసే. పిట్స్ బర్గ్ వాస్తవ్యుడు. తప్పటడుగు... వయసులోనే తండ్రి ఇత నికి పియానోనేర్పించడం ఆరంభించాడు. పదేళ్ళువచ్చేసరికి చర్చిలో అతనిఅన్న వయొలిన్‌వాయిస్తూవుంటే డ్రెవిచ్ పియానోమీద అనుసరించేవాడు. హైస్కూలులో చేరే నాటికి "కాంపస్‌క్లాన్స్" పేరిట అతను తొమ్మిదివాద్యాలతో జాజ్‌బాండ్ ఏర్పాటుచేసుకున్నాడు. హైస్కూలుతరువాత జోన్స్ అండ్ లాలిన్‌కంపెనీలో స్టీల్‌ఇన్‌స్పెక్టరుగా చేరాడు. కొంతకాలం రాత్రిపాఠశాలలో న్యాయశాస్త్రం అభ్యసించ బోయాడు. అంతలోకే యుద్ధంవచ్చింది. పి. టి. 109 సిబ్బం దికి డ్రెవిచ్ ఆస్థానరాజనీతివేత్త. అతను మంచి ఉపాయశాలి.

చురుగ్గా ఆలోచిస్తాడు. కర్తవ్యం ఖచ్చితంగా తెలిసినవాడిలా ధీమాగా అడుగువేస్తాడు.

గన్నర్స్‌మేట్ 3/సి మారిస్ ఎల్. కోవాల్, టార్పెడోమన్ 2/సి ఆండ్రూ జాక్సన్ కర్క్‌సే మే 1 వ తేదీన డ్యూటీఎక్కారు. కోవాల్‌కి 21 ఏండ్లు. సరదాగావుండే తిక్కమనిషి. చమత్కారాలకి ఆతనితరవాతే అని మెచ్చుకొనేవా రంతా. అతని తలిదండ్రులు పోలెండునుండి వలస వచ్చారు. మాసాచూసెట్స్ వేర్ నగరంలో పుట్టినా పెరిగి తిరిగిందంతా బాస్టన్‌దగ్గర అక్స్‌బ్రిడ్జ్‌లోనే. యుద్ధం మొదలయేనాటికి విక్టరీనౌకలను ఇంజన్లుతయారుచేసే ఫ్యాక్టరీలో పనిచేస్తున్నా డతను.

కర్క్‌సే నెమ్మదస్థుడు. ప్రసన్నంగా ఉండేవాడు. జార్జియాలోని రేనాల్డ్స్ అతని జన్మస్థలం. కొలంబస్‌లో పదవ తరగతివరకూ చదువుకున్నాడు. రిఫ్రిజిరేషన్ ఇంజనీరుగా పని చేస్తూ యుద్ధంవచ్చాక 1942 జులై 1 వ న మేకన్‌నగరంలో చేరాడు. అతనికి పాతికేండ్లు. యుద్ధంలోచేరిన మూడు నెలలకు అతనిభార్య క్లాయ్ ఆన్ మగబిడ్డను ప్రసవించింది.

రేడియో మన్ 2/సి జాన్ ఇ. మాగ్వైర్ మే 5 న చేరాడు. అతనివయసు 26 ఏళ్ళు. డాబ్స్‌ఫెర్రీ (న్యూయార్క్) వాస్తవ్యుడు. చిన్నప్పుడు స్నేహితులతోకలిసి న్యూయార్క్ సెంట్రల్ట్రాక్స్ దగ్గర బట్టలువిప్పుకొని ఈతలుకొడుతూ వుండేవాడు. అటేపు రైలువచ్చినప్పుడల్లా కుర్రాళ్ళంతా బుడుంగున నీళ్ళలోకి మునిగిపోతూవుండేవారు. పెరల్‌హార్బర్

దాడి తరవాత అతని సోదరుడు విలియం నౌకాదళంలోచేరి ఏరికోరి పి. టి. సర్వీసులో పని వేయించుకున్నాడు. అతని కది బాగానచ్చింది. అప్పటికి అనకొండా వైర్ అండ్ కేబుల్ కంపె నీలోపనిచేస్తున్న తమ్ముడు జాన్‌ను అదిమానివేసి పి. టి. సర్వీ సులో చేరమని నచ్చచెప్పాడు. దరిమిలాను అన్నదమ్ములిద్ద రికీ సౌత్ పసిఫిక్‌లోనే పి. టి. సర్వీసు డ్యూటీపడింది.

ఇతని తరువాత సీమన్ 1/సి ఎడ్గార్ ఇ. మావర్ చేరాడు. అతనివయసు 28. అతనుపనిచేసిన తొలిబోటు పి.టి. టెండర్ 'నయాగరా' మునిగిపోయిన కొద్దిరోజులకు ఇక్కడికి వచ్చాడు. 'నయాగరా' ఒకప్పుడు టామీమాన్‌విల్ 'యాట్లు' (విలాస విహారనౌక). జాపనీస్ విమానాలు ఒకనాడు శాన్ క్రిస్టోబర్ దగ్గర దీనిమీద బాంబువేసి ముంచివేశాయి. సన్నటి పల్చటి చక్కటి ముఖం, చెదిరిపోయిన చిక్కటిజుట్టు, అంతా కుర్రాడిలావున్న స్కిప్పర్ కెనెడీని తొలిసారిచూచినపుడు మావర్ విస్తుపోయాడు.

"మరో తొంభైరోజుల అద్భుతంకదూ!" అన్నాడు పక్కనున్న ఒకనావికుడితో.

"అలాగేం?... చూడుచూడు నీకే తెలుస్తుంది" అన్నా డతను వ్యంగ్యంగా.

'నయాగరా' మునిగిపోయినపుడు మావర్ కట్టుబట్ట లతో బయటపడ్డాడు. ఆ ప్రాంతంలో సామగ్రి సరఫరా తగి నంతగా లేనందువల్ల మావర్ 109 లో డ్యూటీకి వచ్చే నాటికి అతనిదగ్గర కట్టుబట్టలుతప్ప మరేమీ లేవు. 'ఇతని

కేదేనా చూడాలి' అన్నాడు కెనెడీ. వెంటనే ఓడదిగి నేవీ స్టోరుకి వెళ్ళాడు. అక్కడ తనపలుకుబడిఅంతా ఉపయోగించి మావర్ కి ఒక్కచొక్కా, అండర్ వేర్, మారుజతఒకటిసంపాదించగలిగాడు. అతనిసైజుకి బూట్సు దొరకలేదు. అక్కణ్ణించి సరాసరి నావికులబసలకువెళ్ళి కొందరిని బుకాయించి బతిమాలి మావర్ కి ఒకబూట్లజత, చొక్కాలు, సాక్ లు, అండర్ వేర్, డంగరీలు రాబట్టుకున్నాడు. ఆపైనతనబోటులో బూటు లేని మరికొందరికి బూట్లుకూడా దండెత్తుకొచ్చాడు.

"అవునుగాని, మనబోటుకి వంటవాడు లేడు. నీకు వంటొచ్చునా ?" అన్నాడు కెనెడీ.

చిన్నప్పుడు సెంట్ లూయిస్ లో వుండగా యింట్లో అతనూ అన్నదమ్ములూ వంతులవారీగా వంటచేసేవారు. "చిన్నవంటలయితే సంసారపక్షంగా చెయ్యగలను" అన్నాడు మావర్.

"అబ్బో ! అది చాలు ?" అన్నాడుకెనెడీ.

నాటినుంచి మావర్ పి. టి. 109 మీద బహుముఖ ప్రజ్ఞాశాలి అయ్యాడు. క్వార్టర్ మాస్టర్, సిగ్నల్ మన్, వంటవాడు వగైరా డ్యూటీలు ఎన్నోచేశాడు. ఒక్కోరోజు అతని అద్భుతపాకాలు భోంచేస్తూ "ఈ మావర్ కి కాసిని డ్యూటీలు తగ్గిస్తేమంచిది. ముఖ్యంగా వంటపనితప్పిస్తే బాగుండును" అనుకునేవాడు కెనెడీ.

పి. టి. 109 కొత్తకెప్టెన్ గా కెనెడీ ఏప్రిల్ 25 న లాగ్ బుక్ లో తొలిరోజు కార్యక్రమ విశేషాలు రాశాడు.

ఏమంత అతిశయోక్తులు లేకుండా నమ్రతగా రాసిన ఆ నోటు సంగ్రహం, సమగ్రరూపం కూడా ఇదే!

0800 రివాజైన చోటే లంగరు వేశాము.

జాన్ ఎఫ్. కెనెడీ

లూ. (జెజి) యు. ఎస్. ఎన్. ఆర్.

సిబ్బందిలో అంతా చేరేదాకా ఆగకుండా కెనెడీ బోటురిపేర్లు, చేరినవారికిశిక్షణ ఆరంభించాడు. ఆనాటికి అతనేం పెద్దఅనుభవంతో పండిపోయినవాడు కాడు. చేరిన జట్టు అంతకన్న పచ్చి. తొలిరోజులలో ఒకనాడు కెనెడీ అతి విలాసంగా పెద్దకెప్టెన్‌లా చూపుడువేలు గిర్రునతిప్పి-ఇంజన్ స్టార్ట్ చెయ్యమని తాత్పర్యం-సైగచేశాడు. సిబ్బంది కదిలి నంతచురుగ్గా ఇతను కదల్లేడు. చాలాసేపు హైరాణపడ్డాక మూడిటిలో ఒక్కటిపలికింది. అంతకన్న అతిరథులువచ్చినా మాటవినేస్థితిలో లేవాయింజన్‌లు. కెనెడీ చప్పబడిపోయాడు. కొద్దిరోజుల్లోనే న్యూగినీ పి. టి. బోటు నావికులు పాడుకొనే పాటలాటిదే అతనిబుర్రలోనూ మెదిలింది.

గంటకి 75 మైళ్ళు పోతాయి కొన్ని
పీటీలు. కొన్ని అంతకన్న తక్కువే
పోతాయికాబోలు. మాబోటు పూటకి
పదిమైళ్ళు వెళ్ళినాచాలు. కదలడం
అంటూ ఉంటేమా కదే పదివేలు.

సిబ్బందికి మెల్విల్‌లో ఉండగా కొత్తబోట్లు తుడిచి శుభ్రంచెయడమే అలవాటు. నెలలతరబడి ఉష్ణప్రాంతాలలో తిరిగి యుద్ధాలలో పాల్గొని అరిగి తిరిగి మాసిపోయి మకిలి జిడ్డు మడ్డి పట్టించుకొన్న ఈబోటును తుడవాలనగానే అంతా నిర్ఘాంతపోయారు. దీనికితోడు మరో అలంకారంకూడాఉంది. శత్రువిమానాలకంట పడగూడదని పొదలమాటున దాచి ఒడ్డుకు కట్టడంతో అవి విమానాలబారి తప్పించుకొని ఎలుకల బొద్దెంకలబారిని పడ్డాయి. వాటికి శ్రమలేకుండా గట్టు మీదికి తరలివెళ్ళేందుకు రాజమార్గం అమర్చినట్లయింది. అంతేకాదు, ఒకసారి బోటంతా దుర్భరమైన దుర్వాసన కమ్ముకుంది. ఎంతవెతికినా కారణం తెలీదు. చివరికి ఒకమెట్టు కింద ఒకఎలుక తెచ్చిపడేసిన కుళ్ళుచేప దీనికి ప్రసారకేంద్రం అని తేలింది. అసలు ఆయావిధులలో శిక్షణపొందినవారు నేర్చుకున్న పనులు జంకుతూ బెదురుతూచేసేవారు. పరీక్షార్థం తుపాకులు కాల్చడానికై కెనెడీ బయలుదేరేసరికి గన్నర్స్ మేట్ హారిస్‌కు బెదురుపట్టుకొంది. అతనికి తుపాకులుకాల్చడం తెలీకకాదు. అయితే పక్కన శిక్షకుడుఉంటే ధైర్యంగా కాలుస్తాడు. ఒక్కడుగా యెన్నడూ కాల్చలేదట! మరోనాడు బోటు ప్రాక్టీసుకువెళ్ళి టులగీగట్టు చేరుకుంది. అంతలో హఠాత్తుగా .50 కాలిబర్ మెషిన్‌గన్‌లజోడా బ్రహ్మాండమైన శబ్దంతో గర్జించసాగింది. అంతా హడలిపోయారు. జపాను విమానాలు బోటులోకి దూరిపోయాయని కొందరు భయపడ్డారు. తుపాకులున్నవేపు చూస్తే గన్నర్‌మెట్ కొవాల్ ఆ మరతుపాకులను రెండుచేతులా బిగించిపట్టుకొన్నాడు.

ఆకాశం హఠాత్తుగా జపానువిమానాలతో నల్లబడిపోగా చూసినవాడిలా ప్రాణభీతితో కొయ్యబారిపోతున్నాడు. ఇంతకీ కోవాల్ చెయ్యబోయినపని– మరతుపాకులను తుడవడం. చేసిన పని పొరబాటున మీటనొక్కి పేల్చటం. అవికురిపించిన అగ్ని వర్షానికి హార్బర్ అంతటావున్న మిగతా ఓడలనావికులంతా డెక్ లలోకి దూరి తలదాచుకున్నారు.

తుపాకులగర్జన ఆగిన ఒక్కక్షణం తరువాత అంతకన్న ఉధృతంగా మరోగర్జన మొదలైంది. అది కాక్ పిట్ ని స్కిప్పర్ కెనెడీకోపగర్జన. ఆధాటికి కాక్ పిట్ లోకి గురిచేసివున్న తుపాకులను తుడిచి బాగుచేసేటంత ఉద్రేకం కలిగింది కోవాల్ కి. కాని అదృష్టవశాత్తూ నియమనిబంధనలు అడ్డుపడ్డాయి.

కొన్నాళ్ళతరువాత పి. టి. 109 వంతువచ్చి మరమ్మతులకై డ్రైడాక్ చేరింది. కెనెడీ పొట్టిలాగు, చొక్కా వేసికొని తనూ రంగంలోకి దిగాడు. అక్కడి పనివాళ్ళతోకలిసి రంగు గీకడం, శుభ్రపరచడం, గరుకాయితంతో అరగదీయటం, కొత్తరంగుపూయటం వగైరా అన్నిపనులలోనూ పాల్గొన్నాడు. పైనించి శత్రువిమానాలకు అడవి చెట్లలా కనిపించే ఆకుపచ్చరంగు వేశారు. ఒకనాడు ఉదయం ఒకవడ్రంగి బోటుకు ఇవతల హాల్ గోడమాటున ఏదోపని చేస్తున్నాడు. లోపలభాగానవున్న కెనెడీ బాల్చీనిండా మురికి నీరుతీసి బయటికిపంపాడు. ఉత్తరక్షణంలో బురదనీరోడుతున్న ఒకముఖం కోపంగా పైకిలేచింది.

"ఒళ్ళుపై తెలియకుండా చేస్తున్నావా పని ? కళ్ళు లేవా ?" అని గద్దించాడా వర్కరు.

"అయ్యయ్యో ! చూడలేదు. సారీ. మన్నించు" అంటూ లూ. కెనెడీ పైకివచ్చి అతన్ని పరిపరివిధాల బ్రతిమాలి శాంతపరచి వెళ్ళాడు.

"నువ్వింతసేపూ గదమాయించిన దెవరినో తెలుసా?" అని అడిగాడు రేడియో ఆఫీసరు మాగ్వైర్.

"తెలీదు. ఎవరు ?" అన్నాడు కార్పెంటర్.

"ఈబోటుకు కెప్టెన్."

"భగవంతుడా !" అన్నాడు కార్పెంటరు అదిరిపడి.

కొన్నాళ్ళకి పి. టి. 109 మరమ్మతులు, ముస్తాబులు ముగించుకొని రాత్రిళ్ళు గస్తీడ్యూటీకి తయారై కదిలింది. కొత్తసిబ్బందికి అంతాకొత్తే! నీటిమీదకదిలేదల్లా శత్రునౌక, నింగినిమెదిలేదల్లా శత్రువిమానం అన్నంతకంగారుగాఉండేది. నిజానికి అప్పట్లో చెప్పుకోతగిన దేమీ లేదు. గస్తీదళాలన్నీ దాదాపు ముందుజాగ్రత్తగా జపానువాళ్ళు ఇట్టేవచ్చి అట్టే కొట్టి పారిపోయే ప్రయత్నాలుచెయ్యకుండా పెట్టినవే.

ఆనాటి కార్యకలాపాల తీవ్రతను కెనెడీ లాగ్‌బుగ్ తమాషాగా చిత్రించింది.

మే 8

1820 —పి. టి. 59తో కలిసి గస్తీకై
రెసాపీనుండి బయలుదేరాం.(ఎన్.

ఐ. సి.) శాపోదీవినుండి కేప్ ఎస్పెరెన్స్ వరకు... ఏమీా కనబడ లేదు.

మే 13

0045 0145 రస్సెల్ ప్రాంతంలో మెరుపు వెలుగులు కనిపించాయి. తుపాకికాల్పులు తాలూకు అను కున్నాం. చూసినప్రకారం ఫ్లాషెస్ తిరిగి ప్రసరించాయి.

మే 17

0040 శాపోదీవి మధ్యగా తెల్లటి కాంతి కనిపించింది.

మే 21

2030 నీటిలో తేలేనూనెడ్రమ్ముల మీాద .30కాలిబర్ గుండ్లు పదిరౌండ్లు కాల్చాము.

మే 23

0530 గస్తీస్థలంలోనుండి సెసా పీలో స్వస్థానానికిబయలు దేరాం.

0540 విమాన విధ్వంసక నౌక నుండి వెల్గులు తళుక్కు మన్నాయి. మిత్రసైన్యా నివేనన్నది తెలుస్తూనే వుంది.

2130 సీటిమట్టంపైన- 30 డిగ్రీల తేడాలో- నాలుగుమైళ్ళ దూరాన రెడ్ లైట్ కని పించింది. 109 వెళ్ళి చూసింది. ఫలితాలు : ఏమీలేవు.

టులగీలో జీవితం హాయిగా ఆదర్శప్రాయంగా లేదు గాని యుద్ధం పరిస్థితులదృష్ట్యా చూస్తే దుర్భరం అనడానికి వీల్లేనిస్థాయిలో జరిగిపోతోంది. జపానువాళ్ళ దండయాత్రలు- అడపాతడపా "వాషింగ్ మిషన్ చార్లీ"లు చేసిపోయే సంద డికి మించివుండేవికావు. ఆ విమానాలు లాండ్రీమిషను లోపల మరలుచేసే రొదతో వచ్చేవి. అందుకని ఆపేరు. 'చార్లీ' దాడిజరిగితే ఆవేళకి బోట్లలోకి నూనె ఎక్కించే కార్యక్రమాలు జరుగుతూవుంటే సిబ్బంది తక్షణం నూనె పీపాలను నీళ్ళలోకితీసివేసేవారు. నిజానికది యాతనే. అయినా రూల్సుప్రకారం తప్పనిసరి. అసలు శత్రువిమానాలకన్న వాటి మీద అమెరికన్ ఫిరంగులు తుపాకులు కురిపించే అగ్నివర్షప్ర వాహాలభయమే ఎక్కువగా వుండేది.

మిగతా ప్రాంతాలకున్న తాకిడీ, ప్రమాదావకాశాలూ ఇక్కడ లేవన్న ఆనందం కుండలో కూడే! పోతే భోజనం పైనందినకార్యక్రమాలలాగే విసుగెత్తేది. వాతావరణం చాలా వేడిగావుండేది. బాధాకరంగా వుండేది. ఉల్లాసానికి, విశ్రాంతికి సదుపాయాలు—కొత్తలో బొత్తిగా వుండేవికావు.

సెసెపీలో కెనెడీ గట్టుమీద పాకవేసుకొనివుండేవాడు. మెక్‌విల్‌లో కాన్సెట్‌పాకలో అతని సహవాసి ఎన్‌సైన్ ఐల్స్ అతనికన్న కాస్తముందుగానే టులగీ వచ్చాడు. అక్కడ నౌకాదళానికి చెందిన రీఫర్‌బాక్సెస్ (భారీరిఫ్రిజిరేటర్‌లు) వెనుకగా కాళీగావున్న గుడిసెచూచి బాగుందనుకున్నాడు. అది స్థానికప్రజలెవరో వేసుకున్నది. కెనెడీ అతనిది వదలగానే అది చూపించి "బోటుమీదడ్యూటీసమయంలో మనం యిక్కడ వుండవచ్చు. బాగుచేసుకొందాం" అన్నాడు. వెంటనే యిద్దరూకలిసి పాకను బాగుచేశారు. నేల చదును చేసి, చెక్కపలకలుకోసి దానిమీదవేశారు. నారింజకాయలు బంగీలుగావచ్చిన చెక్కపెట్టెలు తెచ్చి బట్టలపెట్టెలుగామార్చుకున్నారు. అక్కడవుండగా ఎప్పుడైనా విమానాలదాడి జరుగుతుందని సిగ్నల్‌వస్తే రెండురీఫర్‌బాక్సులమధ్య తలదాచుకునే వసతి యేర్పరచుకొన్నారు. ఇల్లు చక్కగా కుదరటంతో పాటు, ఇంటిపనిచేసిపెట్టడానికి వాళ్ళకు మెలనీషియన్ కుర్రాడుకూడా దొరికాడు. వాడిపేరు లామీ. సాలమన్ దీవులలోని మెలనీషియన్‌లు, బ్రిటిష్‌వారి పలుకుబడికి అలవాటుపడ్డారు. అందువల్ల యిప్పుడు యుద్ధంవచ్చిపడగానే బ్రిటిష్‌వారి మిత్రులుగా అమెరికన్‌లపట్ల స్నేహభావంచూపి

సహాయసహకారాలు చేస్తున్నారు. మెలనీషియన్‌లు వస్తుతః చాలాపొట్టివాళ్ళు. నల్లటి బిరుసైన జుట్టు. దేహంకూడా నల్లగావుంటుంది. పెదిమలూ కళ్ళూకూడా నల్లగానేవుంటాయి. అంతా నలుపుకాబట్టి వారిపలు వరుస కన్ను చెదిరేటంత తెల్లగా తళుక్కుమని మెరుస్తుంది.

లామీ పనిపాటలన్నీ చక్కగా చేసిపెట్టేవాడు. రాత్రి వేళల్లో కెనెడీకి, ఐల్సకీ మధ్యగా నేలమీద పడుకొనేవాడు. ఒకనాడేదో మాటలసందర్భంలో తాను పూర్వం ఒకప్పుడు కానిబాల్ (నరమాంసభక్షకుడు) నని చెప్పాడు. ఇద్దరూ తెల్లబోయారు. ఈ దీవులలో నరమాంసభక్షణ, తలకాయల వేట చిరకాలంగా వున్నాయన్న సంగతి చరిత్రప్రసిద్ధం. అయితే ఇప్పుడీ కుర్రాడు లామీ గొప్పగాచెపుతున్నమాట నిజమో కాదో, నమ్మొచ్చునో రాదో వాళ్ళు తేల్చుకోలేక పోయారు. లామీకి బంతివిసరడం, పట్టుకోడంనేర్పి ఓమోస్తరు వాలీబాల్ ఆటగాణ్ణి చేశారు. ప్రస్తుతం వాడు ఎంతసరదాగా నాగరికంగాఉన్నా పూర్వకథగురించి అడపాతడపా అనుమానాలు కలుగుతూవుండేవి. ఐల్స అతన్ని తరచుకదిపి ఆరాలు తీసేవాడు.

"ఓసారి ఫాదర్ (క్రైస్తవమతగురువు) ను తిన్నాను" అన్నాడు లామీ లాంఛనగా.

ఎన్‌సైన్ థామ్, కెనెడీ పాకలోకి వచ్చినపుడు పుష్టిగా నిండుగాఉన్న ఆ విగ్రహంకేసి లామీ విచిత్రంగా – బహుశా ఆకలికళ్ళతో–చూశాడు. తరవాత హఠాత్తుగా లామీ

మాయమైపోయాడు. వాకబుచేస్తే-ఎవరో న్యూజిలాండుఅధి కారులువచ్చి లామిాని పట్టితీసుకుపోయారని మాత్రం తెలిసింది.

తీరికవేళల్లో కెనెడీ పుస్తకాలు చదువుకొనేవాడు. అతనిదగ్గర టాల్‌స్టాయ్ "వార్ అండ్ పీస్"(యుద్ధము-శాంతి) నవలప్రతి ఒకటి వుండేది. ఒక్కొక్కసారి పోకర్, క్రీబేజ్ వగైరాఆటలుఆడేవాడు. లేదా అణువునించి బ్రహ్మాండందా ఏదిపడితే దానిమిాద అనంతంగా జరిగేచర్చల్లో ఉద్వేగంతో పాల్గొనేవాడు.

ఉదాహరణకి ఒకసారిఒకపుకారుబయల్దేరింది.టులగీవగైరా దీవులలో అమెరికన్ బాంబులవల్ల దెబ్బతిన్న కొబ్బరితోటల యజమానులకు అమెరికా ప్రభుత్వం నష్టపరిహారం ముట్టచెబు తుందని చెప్పుకున్నారు. లూ. (జె. జి.) సిడ్నీ రెబ్‌కాఫ్ దీని మిాదవాదిస్తే ఇది చాలా దారుణమైనపని అన్నాడు. అసలు యీ దీవులను శత్రుహస్తాలనించి విడిపించడానికై అమెరికా తనదేశీయుల ప్రాణాలు, కోట్లకొద్ది డాలర్లు ధారపోస్తోందనీ, పరిహారంఅంటూ వేరేయిచ్చేదేముందనీ అతనివాదం. కెనెడీ ఆమాట ఒప్పుకోలేదు. ప్లాంటేషన్స (తోటలు) ప్రయివేటు యాజమాన్యానివి. అందువల్ల వాటియజమానులు పరిహారం అడగడం న్యాయమేనని కెనెడీ ఎదురువాదించాడు.

ఏప్రిల్ 18 న కెనెడీ తను బోటును గాడల్‌కెనాల్‌కు తీసుకువెళ్ళాడు. హెండర్‌సన్ ఫీల్డువద్దనిలిపేవేళకు ఆకాశంలో లైట్నింగ్ విమానాలు కనిపించాయి. వాటిలో ఒకటి అంతకు ముందే బోగన్‌విల్లీదగ్గర జపాన్‌ఐక్యనౌకాదళానికి కమాం

డర్ ఇన్ ఛీఫ్ అయిన ఫ్లీట్ అడ్మిరల్ ఇసరోకూయమ మోటోను వధించినస్తోంది. యమమోటో విమానాన్ని కూల్చి వేసిన అమెరికన్ విమానం పైలట్ థామస్ జి. లాన్ ఫయర్ ఉత్సాహాతిరేకంకొద్దీ ఆకాశంలో తనవిమానంలో పిల్లిమొగ్గ వేశాడు.

ఏప్రిల్ 21 న, ఒకగుడారంలో రాజకీయవిషయంపై చర్చ తీవ్రస్థాయిలో చెలరేగిపోతోంది. మిసౌరీకిచెందిన రిప బ్లికన్ వాది లూ. ఆల్విన్ పి. క్లస్టర్ రూజ్వెల్టునీ, న్యూడీల్ ఉద్యమాన్నీ చెరిగి చెండాడిపారేస్తున్నాడు. కెనెడీ అతని ప్రతి వాదానికి ప్రతివాదంచెబుతూ తీవ్రంగా ఘర్షణలోకిదిగి ప్రభు త్వాన్ని సమర్థించాడు. ఇద్దరికీ పరిచయాలుకూడా లేవు. రివాజైన ధోరణిలో ఎవరో అర్థాంతరంగా రూజ్వెల్టుసతి ఎలి యొనార్ మీద ఒకవిసురు విసిరారు. కెనెడీ ఆమెను సమ ర్థిస్తూ తను వాషింగ్టన్ వెళ్ళి స్వయంగా కలుసుకున్నాననీ, ఆమెగురించి తనకు బాగా తెలుసుననీ, పత్రికలలో ఆమె గురించిచేసే వర్ణనలకూ, కల్పించినరూపానికీ, ఆమె నిజమైన వ్యక్తిత్వానికీ సంబంధంలేదనీ, ఆమె గొప్ప మహిళఅనీ వాదించాడు.

అంతలో లూ. క్లస్టర్ మాటమార్చి రూజ్వెల్టు డబ్బు న్నవాళ్ళందరినీ రాయబారులుగా నియోగించాడని నింద వేశాడు. ఆ ఒక్కపాయింటుమీదమాత్రం కెనెడీ ఎదురు వాదించలేదు. అంతలోనే క్లస్టర్ పక్కనున్న ఆఫీసర్ ఎవరో అతనిచొక్కాపట్టుకుగుంజి పక్కకితీసుకెళ్ళాడు. "కెనెడీమీద

మరి అంతదారుణంగా విరుచుకుపడడం సబబా?" అన్నాడు ఆ ఆఫీసరు.

"కెనెడీయా? ఆసంగ తెందు కిప్పుడు?" అన్నాడు క్లస్టర్.

మిత్రుడు కారణం చెప్పాడు. క్లస్టర్ ఆ విషయం మీద చర్చమానేశాడు.

ఇటువంటి సంఘటనద్వారా క్రమంగా కెనెడీ ఫలానా అన్నసంగతి అందరికీ తెలిసిపోయింది. ఒకనాటి సాయంకాలం వేళ కెనెడీ పెసెపీలోని బోటులో ఒంటరిగా షికారు వెళ్ళాడు. పొడుగాటి ఆసామీ ఒకతను ఎదురొచ్చి ఆపాడు. తనపేరు *ఎడ్వర్డు ఎఫ్. మెక్ లాలిన్ జూనియర్ అని చెప్పుకుని పరిచయంచేసుకొన్నాడు. అతను జూనియర్ గ్రేడ్ లూటినెంట్ గా పనిచేస్తున్నాడు.

మెక్ లాలిన్ తండ్రి బాస్టన్ లో ఫైర్ కమిషనర్. ఆయన కెనెడీతండ్రి జోసెఫ్ కు చిరమిత్రుడు. కెనెడీతాతగారు జగత్ప్రసిద్ధుడైన జాన్ ఎఫ్. (హానీఫిట్జ్) ఫిట్జ్ జెరాల్డునుకూడా ఆయన బాగా ఎరిగున్నాడని, కుటుంబమిత్రుడని, తరుచు వాళ్ళిద్దరూ తమయింటికి వస్తూపోతూవుండేవారని మెక్ లాలిన్ చెప్పాడు.

హానీఫిట్జ్ ఎనభయ్యవయేటకూడా ఆరోగ్యంగా, హుషారుగా నువ్వా నేనా అన్నట్టుండేవాడు. పాతశతాబ్దం చివరి

---

*ప్రస్తుతం మాసాటూసెట్స్కు లెఫ్టినెంట్ గవర్నర్.

సంవత్సరాలలోనూ, కొత్తశతాబ్దం పుటకల్లోనూకూడా బాస్టన్ ప్రముఖులలో ప్రముఖుడాయన. కెనెడీ పితామహుడు పాట్రిక్ జె. కెన్నడీకూడా అంతవాడే. ఈయనకాయన ఇవాళ మిత్రుడు, రేపు శత్రువు అన్నట్టుండేవాడు. పాట్రిక్ కెన్నడీ ఫైర్ కమిషనరుగా, వీధులకమిషనరుగా, ఎన్నికల కమిషనర్ గా ఉద్యోగంచేశాడు. రాష్ట్రప్రతినిధిగా వెళ్ళాడు. తరవాత సెనెటర్ అయ్యాడు. అన్నిటికన్న ముఖ్యం బాస్టన్ కి ఎన్నికలఅభ్యర్థులను ఎన్నికచేయడం వగైరా పెత్తనాలు చేతబట్టుకొని ఆ రాష్ట్రంమీద పెత్తనం చెలాయించే డెమొక్రాటిక్ పెద్దలలో పెద్ద. హనీఫిట్జ్ 'స్వీట్ ఆడిలిన్' పాట చాలా అద్భుతంగా పాడుతాడని మంచిపేరుంది. పిలవనిపెళ్ళిళ్ళకు కూడా మార్నింగ్ కోటు, టాప్ హేట్ వేసుకొని వచ్చేసి పాటపాడేవాడు. జీవితంమీద, రాజకీయాలమీద ఆయనకు గల మోజు, ప్రేమ మనమడు కెనెడీని బాగా ప్రభావితుడుని చేశాయి. తాతకీ, మనమడికీ మంచినేస్తం వుండేది. ఇతన్ని ఆయన 'రెడ్ సాక్స్' ఆటల పోటీలకు, పబ్లిక్ గార్డెన్ లో శ్వాన్ బోటుపై షికార్లకు తీసుకుపోతూ వుండేవాడు. కెనెడీ, లాలిన్లు తమకుటుంబాలగురించి, నాటిముచ్చటలగురించి చాలా కబుర్లు చెప్పుకున్నారు. మిత్రు లయ్యారు.

ఆ రోజుల్లో నౌకాదళోద్యోగులలో కనీసం ఆప్రాంతాన పనిచేసేవారిలో ప్రతివారూ అన్నిటికీ వాడే ఊతపదం 'షాఫ్ హెడ్'. ఆమాటకి చాలా అర్థాలుండేవి. "నన్ను దోచి పారేశారు" అన్నది పరమనాటుగా అనడానికి యీ మాట వాడేవారు. కెనెడీకి ఈమాటమీదచాలామోజు. తనకిఅదృష్టం

కలిసిరాలేదనో, అన్యాయం జరిగిందనో చెప్పాలంటే టూకీగా "ఐ వజ్ షాఫ్ టెడ్" అని గొణిగేవాడు.

సౌత్ పసిఫిక్‌లో వినబడే చక్కని ధ్వనులు ఎన్నో ఉన్నాయి. చిలకలు, మైనాలు, కెవ్వుమనే కాకటూలు, పారకీట్‌లు ఎన్నో నిరంతరంగా పలుకుతూవుంటాయి. కాని, బాస్టన్‌యాస, హార్వర్డు పలుకుబడి కలిపి కెనెడీ కంఠంలోంచి వెలువడే "షా-ఫ్ టెట్" అన్నమాట, ఆ ఉచ్చారణ వినబడినంత మనోహరంగా మరేదీ వినరాదు. ఆ 'య' కారశబ్దం గాలిలో కలిసిపోయిన తరువాతకూడా చాలాసేపు చెవులలో మారుమోగుతూనే వుంటుంది. విన్నవారిమనసులో గాఢమైన ముద్రవేస్తుంది. ఇంతవిలక్షణమైన పలుకుబడిలో యింత తరచుగా ఒక ఊతపదంవాడేవారికి ముద్దుపేరు లభించడం సహజం. కెనెడీకి "షాఫ్టీ" అని బిరుదిచ్చారు శ్రోతలు.

మెల్విల్ కేంద్రంలో బిరుదును తయారుచేసి యిచ్చినవాడు ఎన్‌సైన్ జో. జి. ఆట్‌కిన్‌సన్, టెనెసీలోని లెబనాన్ వాస్తవ్యుడు. అతను కెనెడీకన్న చదువులో ఓ యేడాది వెనక. 1941 లో వాండర్‌బిల్ట్ ఫుట్‌బాల్‌టీమును వదలి యుద్ధంలో చేరాడు. ఒకనాడు కెనెడీ ఒక కాన్‌సెట్ కుటీరంలోకి వచ్చి "నన్ను షాఫ్ట్‌చేసిపారేశారు" అంటూ దుగ్ధనంతాలూ. మాక్డొనాల్డ్ దగ్గర వెళ్ళబోసుకున్నాడు. తనని యుద్ధరంగంలోకి పంపుతారనుకుంటే ఇక్కడే మాష్టరుగిరీ చెయ్యమన్నారని అతని బాధ. ఆ అర్థంలో ఆమాట వాడాడు. ఈమాటవిన్న ఆట్‌కిన్‌సన్ తక్షణం ఆ బిరుదిచ్చాడు. సౌత్

పసిఫిక్‌లో తొలిసారిగా ఈ ముద్దుపేరు అచ్చయింది పి. టి. 109 లోని ఒకటూర్పెడో అగ్రంమీద అతికించారు.

మేనెలాఖరునాటికి పి. టి. 109 పదునుదేరింది. నావికులుగూడా బలువుసులువులు తెలుసుకుని గాడిలోపడ్డారు. డ్రిల్లు, రకరకాల పరుగులు సాధనచెయ్యడం, మిగతా పి. టి. లతో కలిసి నిర్దేశించిన మాస్టరులో ఒకటిగా పెరేడ్ చేయడం మొదలైనవన్నీ దినచర్యలయ్యాయి. పగటివేళలలో కాల్పులు సాధనచెయ్యడం, రాత్రిళ్ళు గస్తీతిరగడం రివాజై సిబ్బందికి ఆయావిద్యలలో చెయ్యితిరిగింది. వ్యక్తులుగా ఒక్కొక్కరి ఆత్మవిశ్వాసం పెరిగింది. ఒకజట్టుగా పరస్పరసమన్వయంతో కలిసికట్టుగా పనిచేయడం అలవాటైంది. పి. టి. బోటుమీది కొద్దిపాటి ఇరుకుబోటులు కలివిడిగా ఉండడం, ఒకరినొకరు అర్థంచేసికొని సహజీవనంచేయడం అలవరచుకొన్నారు.

కెనెడీ బోటుమీద ఎక్కువకాలం గడిపేవాడు. అతని సిబ్బంది అందరికీ అతనిమీద గౌరవాభిమానాలు పెరిగాయి. కర్రపెత్తనంకాకుండా అతనూ తమతోపాటు ఒళ్ళొంచి గట్టిగా పని చేయడం వారికి ఆనందం కలిగించింది. సాధారణంగా ఆఫీసర్లుపోయేదర్జా, హోదా పోకడలు పోకుండా ఇతను తమందరినీ తనతో సమానులుగా, సాటివారుగాచూసి ఆదరించేవాడని మెచ్చుకునేవారు. ముఖ్యంగా నౌకాదళ నిబంధనలను తు-చ తప్పకుండా అమలుచెయ్యక చూచీచూడనట్టు పట్టించుకొనకపోవడం, అన్నాపాలిస్ జనాన్ని ఖాతరుచెయ్యకపోవడం వాళ్ళకి చాలానచ్చాయి.

ఎండలకి కెనెడీకి ముదురుచాయ వచ్చింది. చొక్కా వేసుకునేవాడు కాదు. పంట్లాంతొడిగి, బెల్టులో ఒక ఒరబాకు దోపుకొనేవాడు. కళ్ళకి చలవజోడు వేసుకొనేవాడు. నెత్తిన రకరకాలటోపీలు పెట్టుకొనేవాడు. తరువాత తరువాత టోపీలని ఎంతదూరంగా ఉంచేవాడో, అవసరమైనప్పుడుకూడా పెట్టుకుందికి ఎంతగట్టిగా తిరస్కరించాడో సౌత్ పసిఫిక్ రోజులలో అవంటే అంతమోజుపడేవాడు. అదోపిచ్చగా సేకరించేవాడు. సన్ హెల్మెట్‌లు, నేవీ హేట్‌లు, ఆర్మీ, మెరైన్ ఫిటీ హాట్‌లు, బేస్ బాల్ టోపీలు, యాక్టలమీద గొప్పవారు పెట్టుకొనే రకరకాల టోపీలు పోగుచేసుకొనేవాడు. కొన్ని ఒకఅడుగు ఎత్తువికూడా వుండేవి. బ్రాడీ ఓసారి ఎక్కడో సైనికదళం టోపీ తెచ్చి అది తీసికొని పరటాగా బేస్ బాల్ టోపీ ఇస్తావా అని బేరంపెట్టాడు. కెనెడీ ఒప్పుకోలేదు. ఆ 'టోపీదాసు' డి గదిలోకి ఒకటోపీచేరితే ఇంక దానిని ఎవరేమిస్తానన్నా అది బయటికి రాదు. అంతే!

చిన్నఓడలన్నిటిమీదలాగా ఇక్కడా కెప్టెనూ, అతని సిబ్బందీ సాయిలాపాయిలాగా వుండేవారు. మున్ముందురాగల ఉపద్రవాలగురించి కబుర్లుచెప్పుకొని సమష్టిగా ఊహాగాన సభలు చేసుకొనేవారు. ఒక్కొక్కతరహాపరిస్థితి ఏర్పడితే ఎవరెలా ప్రవర్తిస్తారన్నదాన్ని మాట్లాడుకొనేవారు. ముఖ్యంగా ఆలోచించుకున్న ప్రశ్న ఒకటిఉండేది.–శత్రువుకు తాము బందీలుగా దొరికేపరిస్థితివస్తే ఏమిచెయ్యాలీ–అన్నది. ఆరోజుల్లో యుద్ధఖైదీలమీద జపానీయులుచేస్తున్న ఘోర కృత్యాలుగురించివచ్చే కథలు వినడానికే భయంకరంగా

వుండేవి. మొత్తంమీద ఆదినుండీకూడా పి. టి. 109 సిబ్బం దిలో ప్రతివ్యక్తీ శత్రువుకు దొరికిపోయేస్థితివస్తే ప్రాణాలతో పట్టుబడగూడదనే తీర్మానించుకున్నట్టు విశదంఅయింది.

సిబ్బంది మనోగతభావాలన్నిటికీ స్కిప్పర్ కెనెడీ అను కూలంగానే వుండేవాడు. టులగీలోవున్న కొత్తలో దాదాపు అందరికీ ఒక మోటారుమెకానిక్ మీద చిరాకు, కోపం వుండేవి. ఒకనాటిరాత్రి బోటు సముద్రంలో ప్రయాణంచేస్తూ వుండగా కెనెడీ ఏదో సిగ్నల్ ఇచ్చాడు. ఇంజన్ గదినుండి అందుకుతగిన ప్రత్యుత్తరంగాని, చెప్పినపని జరగడంగాని కానరాలేదు. కెనెడీ కిందికిదిగి వెళ్ళిచూశాడు. గదిలో ఎవరూ లేరు. ఆ డ్యూటీకి ముగ్గురుమెకానిక్ లు ఉన్నారు. చూస్తే ముగ్గురూ నిద్రపోతున్నారు. కెనెడీ వెంటనే డ్రెవిచ్ కలలోజొరబడ గర్జించి 'ఇదెక్కడనాకాదళ'మని కేకవేశాడు. డ్రెవిచ్ తొట్రుపడుతూనే తాము ముగ్గురూ డ్యూటీలు వాటాలువేసుకున్నామనీ, ఇప్పుడు మూడోవాడుడ్యూటీ అనీ అన్నాడు. కెనెడీ వెంటనే అతన్ని లేపాడు. డ్రెవిచ్ మాటను బోటుచేశాడు అతను. వెంటనే డ్రెవిచ్ కోపోద్రేకంతో అతని మీదపడి తన్నబోయాడు. కెనెడీ అడ్డుపడి ఆపాడు. అంతలో డ్రాడీ లేచాడు. జరిగింది తెలిసి కంగారుపడి డ్రెవిచ్ చెప్పిందే నిజమని ఋజువుపలికాడు. మూడోమెకానిక్ కు, పి.టి. 109కి ఆనాటితో ఋణంతీరిపోయింది.

పి. టి. బోట్లమీద అద్భుతకృత్యాల గురించి, ఆనంద జీవితంగురించి కథలుగాథలుగా ఉత్తేజకరంగా వర్ణించిచెప్పిన

సాహిత్యంలో ఒకముఖ్యవిషయం ఆయా రచయితలు మరచి పోయారు. అది టులగీలో 109 మీాద నావికులు అనుభవం మీాద నేర్చుకున్నారు. అది సాలమన్ దీవులవంటి ప్రాంతాలలో భోజనపదార్థాలు చాలారకాలుచేసుకు తినవచ్చునన్నది. ఎన్నిరకాలూ అన్నది- వుప్పుమిరియాలపొడి చల్లిన పందిమాంసంతో వంటవాడికి ఎన్నిరకాల వంటలు చేతనవునో అన్న దాన్నిబట్టి వుంటుంది. సైన్యంలోకన్న ఓడమీాద మంచి భోజనం, తినుబండారాలు దొరుకుతాయన్న ఆసతో సరదాతో చాలామంది నేవీలోచేరతారు. ఆ ఉద్దేశంతో పి. టి. సర్వీస్‌లో చేరేవాళ్ళు చాలాపొరబడుతారన్నమాట! ఎందుకంటే పి. టి. చిన్నబోటు. అదియుద్ధనౌకలా, విమానవాహకనౌకలా కొండంత వుండదు. అందులో చోటు వాటికిమల్లే భూగోళమంత వుండదు. మాంసాహారాలు, పాలు, వెన్న, గుడ్లు, కాయగూరలు, పళ్ళు దాచబెట్టి నిలవచెయ్యడానికి పి. టి. లో బ్రహ్మాండమైన రిఫ్రిజిరేటర్లు వుండవు. పి. టి. 109 సిబ్బందిలో చాలామంది ఆహారసత్యాలు అనుభవం మీాద తెలుసుకున్నారు. ఈసంగతి గురించి "టేల్స్ ఆఫ్ ది సౌత్ పసిఫిక్" (సౌత్ పసిఫిక్ కథలు) అనే గ్రంథంలో జేమ్స్ మిషినర్ వ్రాసిన వాక్యాలను వీరిలో కొందరు దరిమిలాను చదివి వాటి సారస్యాన్ని మరింతగా ఆస్వాదించ గలిగారు.

"పి. టి. బోట్‌ల గురించి అక్కడ పనిచేసేవారి కన్నీళ్లు తుడవడానికిరాస్తున్న చెత్త చదివి ప్రాణంవిసుగెత్తుతూంది... ఆ బోట్లమీాద పనిఅన్నది పరమహింస. ఒళ్ళు హూనం

అయోలా, రెక్కలుముక్కలయోలా నిర్విరామంగా పనిచేయడం తప్ప మరేంలేదు. మాంటానానుండి వెళ్ళే మొండిఘటాలకు కూడా అది కఠినాతికఠినమైనపని అనిపించింది” అని ఆయన చాలాఖచ్చితంగా వ్రాశాడు. “నిజమే. ఇక్కడ ఆఖరికి రొట్టెలుతయారుచేసే పరికరాలుకూడా లేవు. రొట్టెముక్క అన్నది పశువుమాంసంఅంత అపరూపమైన వస్తువు.

సీమన్ మావర్‌లో వంటవాడుగా ప్రయత్నలోపం గాని, ప్రతిభాలోపంగాని లేదు. శ్పామ్‌ను (పందిమాంసం) శ్పామ్‌గా ఉడకేసి పెట్టేవాడు. శ్పామ్ బర్గర్స్‌గా పెట్టేవాడు. చెత్తకిందకొట్టి ఊరగాయబద్దలతో కలిపి వడ్డించేవాడు. అచిర కాలంలోనే సిబ్బంది ఈ యిబ్బందికి తట్టుకోలేక ఆహారా న్వేషణలో పడ్డారు. కెనెడీవంటి ఘనాపాఠీలు బుద్ధిబలా న్నంతా వుపయోగించి వేటాడేవారు. శ్పామ్ ఎ లా మావర్ (మావర్ శ్పామ్ వంటకం), కాన్‌చేసిన వియన్నాసాసేజ్ ఉడకవేసిన బీన్సుమినహా మరొకగడ్డి కరిచినా ఫరవాలేదన్న ధోరణిలో తిరిగేవాడు.

ఒకొక్కసారి సరికొత్తభోజనం చేదామని సరదాపడి ఓ చేపని పట్టేవారు. వలలో కొక్కాలు లేకపోయినందువల్ల అందు కో ఉపాయం కనిపెట్టారు. చేపలమూక నీటిమట్టందగ్గ రలో కనబడగానే ఓతుపాకీ పేల్చినా, లేకపోతే ఒక హాండ్ గ్రెనేడ్ (చేత్తోవేసే నాటుబాంబు) పడేసినా చేపలు ఆ ధ్వనికి మూర్ఛిల్లి కొట్టుకొచ్చేవి. కావలసినవి చేత్తోఅందు కొనేవారు. మరీ కనీవినీఎరగని చేపలు దొరికితే ఆనందించి

తినాలో, భయపడి పారెయ్యాలో తేలేదికాదు. ఎందుకంటే కొన్ని విషపుచేపలు ఇక్కడ తిరుగాడుతాయనిఎవరోచెప్పారు. సాధారణంగా అనుమానం తగిలితే దొరికినచేపని మళ్ళీ నీటిలో పారవేసేవారు.

'కూటి' కోసం వారు ఊహించిన కోటివిద్యలలో కొన్ని ఘాటురకంకూడా వుండేవి. కాని ఎన్నో వృథాఅయి పోయేవి. ఒకనాటిరాత్రి డ్రాడీ సెసెపీలోని ఒక భోజనశాల డేరాలోకి దూరి ఒకగాలన్ పీచెస్‌తీసుకొని బయటకి జారుకు న్నాడు. ఆకలితో ఆవురావురుమంటున్న తోడినావికులంతాం చేరి ఆడబ్బాతెరిస్తే అందులో పీచెస్ లేవు. బచ్చలికూర దొరికింది. ఉసూరుమంటూ దాన్ని నీటిపాలుచేశారు.

కెనెడీకి తీపిసరు కంటే ప్రాణం. దానికోసం ఎప్పుడూ తాపత్రయపడుతూ వుండేవాడు. ఏమన్నా గిట్టుబాటవుతుందని తోస్తే ఆ ప్రాంతంలోని సైనికశిబిరాలకీ, సీబీశిబిరాలకీవెళ్ళి అక్కడి తినుబండారాల దాతలను పలుకరించి మంచిచేసు కొనేవాడు. అమ్మితే కొనేవాడు. చేతిలో డబ్బులేకపోతే సాధారణంగా పర్సుఖాళీయే-తన సిబ్బందిలో ఎవరిదగ్గరో జీతాలొచ్చాక ఇస్తానని చెప్పి అప్పుతీసికొనేవాడు. ఒక్కసారి అప్పుడబ్బులు అద్భుతమైన కానుకలు తెచ్చేవి. దొరికినప్పు డల్లా స్కిప్పర్ తనజనంకోసం ఒ. హెన్రీ చుట్టలపెట్టె (24 ఉంటాయి) పట్టుకొచ్చేసేవాడు. కనుచూపుమేరలో ఏదైనా సరుకురవాణానౌక కనిపిస్తే కెనెడీ తనబోటును అటు పరుగె త్తించేవాడు. అక్కడ యాచించో, ఎరువో, అరువో, అడిగో, ఉంటే డబ్బిచ్చికొనో ఆహారపదార్థాలు సంపాదించేవాడు.

ఒక్కొక్కసారి వీకంగా ఒకడజనుగుడ్లు తెచ్చేవాడు. ఒకో సారి ఒక్క రొట్టెముక్కో- రెండుబారుల బట్టలసబ్బో దొరి కేది. ముఖ్యంగా హాట్ కేక్స్ అంటే కెనెడీ చెవికోసుకొనే వాడు. ఓసారి సెసెపీలో ఒక మెస్సుదగ్గర క్యూలోవెళ్ళి ఒక వాయితీసికొని రెండోఛాన్సుకని మళ్ళీ క్యూలోదూరి వెళ్ళే సరికి వంటవాడు గుర్తించి కోపంతో తరిమికొట్టాడు. తరు వాత 'మిఠాయిరాయ' డంటూ సిబ్బందిఅంతా కెప్టెన్ని ఉడి కించారు.

"చూడు! మనం అమెరికా వెళ్ళాక మనమూవర్ చేత నీకు రోజూ హాట్ కేక్స్ వండించిపెడతాలే" అంటూ బ్రాడీ ఓదార్చాడు.

ఆరోజులలోకూడా పిండిదొరికినప్పుడల్లా మూవర్ హాట్ కేక్స్ తయారుచేసేవాడు. వాళ్ళమ్మనేర్పినపద్ధతి అతనిది. ఎండబెట్టినగుడ్లు, పాలపొడి, పిండి, డబ్బావెన్న (చెడనివెన్న అనేవారు దాన్ని) కలబోసి కేక్ తయారుచేసేవాడు. ఒక సారి కెనెడీ మరో పి. టి. మీదికివెళ్ళగా అక్కడ 'డోనట్స్' పెట్టారు. తనబోటుకి రాగానే మూవర్ని అడిగాడు– అవి చేసి పెట్టమని. మూవర్ దిగులుగాతలవంచుకొన్నాడు. డోనట్స్ చేయడం ఎలాగో వాళ్ళమ్మ నేర్పలేదు.

పోతే పొడిచేసిన ఐస్‌క్రీమ్ సరఫరాలో కెనెడీ కృషిని అంతా తెగమెచ్చుకునేవారు. అదిమాత్రం నిరంతరంగా వచ్చేది. కెనెడీ ఎలా తెచ్చేవాడన్నది వాళ్ళు చెప్పుకుంటూ వింతే! ఐస్‌క్రీం పొడర్‌ను నీళ్ళలోకలిపి బోటులోని చిన్న రిఫ్రిజిరేట

రులో, ఐస్‌కూ్యబులలో పోసివుంచేవాడు. గడ్డకట్టేసరికి అది సుమారైన ఐస్‌క్రీమ్‌గా రూపొందేది. రాత్రిళ్ళు సౌత్ సీ ప్రాంతాల గస్తీమీద తిరుగుతున్నపుడు కెనెడీ కప్పులకొద్దీ అదితింటూ బోటునడిపేవాడు.

ఆహారపదార్థాలు పుట్టించడంలో, ఎదటిచేతిలోంచి గిట్టించుకోడంలో సిద్ధహస్తులయ్యాడు. సౌత్ పసిఫిక్‌లోని నౌకాదళోద్యోగులందరికీ అది ఒక లలితకళ. నేర్చుకొనక తప్పనివిద్య. అటుకేసి రవాణానౌకవస్తేనే పండుగ. ఆ నౌక మీదనించి సరుకుదింపే జనాభాలోకి పి. టి. బోటు మనిషికి చేరే ఛాన్సువస్తే ఇక చెప్పనక్కరలేదు. అది వరప్రసాదం. నక్కనితొక్కరావడం. ఒకనాడు మాగ్వైర్‌కు అలాంటి గిరాకీ తగిలివచ్చింది. ఒకనౌకనుండి ఒకరాంఫ్‌లైటర్ పడవమీదికి నూరుపెట్టెల బీరుకాయలు దింపేపనిలో ఒకచెయ్యివెయ్యడానికి అతన్ని పిలిచారు. ఇంతఅద్భుతమైన సరుకును ఓడదింపినా ఎక్కించినా వుండే పితలాటకాలు, సరుకుగల్లంతులు ఎలాటి వుంటాయో నౌకాదళాధికారులకు అనుభవంమీద బాగా తెలుసు. అందుకని వెయ్యికళ్ళతో కనిపెట్టి చూస్తారు. బీరు కాయల పెట్టెలేవీ బీరుపోకుండా ఒకపద్ధతి పెట్టారు. ఓడ మీంచి ఒకపెట్టెతీస్తే తీసినట్టు పద్దురాస్తారు. బీచిలోకి ఒక పెట్టెదిగితే దిగినట్లు పద్దురాస్తారు. ఈ కట్టుదిట్టాలూ ప్రతిబంధకాలూ ఇలావుంటాయని మాగ్వైర్‌కు తెలుసు. యుద్ధరంగంలో తనవిధిని పూర్తిగాగుర్తించిన మహావీరునిలా త్రికరణశుద్ధిగా పనిలోకిదిగి కృషిచేశాడు. అతను సరుకుదింపే లైటర్ పడవమీద సరుకుదింపే కీలకస్థానంలో ఉన్నాడు. కేసులువస్తు

న్నాయి. దింపుతున్నారు. ఈలోగా మరోకంటితో వెసులు బాటుచూసి ఈ లైటర్ ఇంజను ఒకపెట్టెలాటి గదిలో అమర్చి వుంచారనీ, దాని కో పెట్టెమూతలాటిదే ఉందనీ గమనించాడు. వీలూపాలూచూచి కాలితో ఇంజనుమీద మూత ఒత్తిలిగించి దిగేపెట్టె ఒకదానిని అందులోకి పట్టించి గుట్టుగా మూతదింపేశాడు. తరువాత పెట్టెలన్నిటినీ మామూలుగానే దింపేశాడు.

ఆఖరుపెట్టె దిగగానే బీచిలోని సప్లయిఆఫీసరు పొలి కేకపెట్టాడు: "మాకు తొంభైతొమ్మిది అందాయి. ఒకటి గల్లంతైంది" అంటూ.

"ఇక్కడికి మానూరూ మాకు చేరేవరకూ మీలో ఒక్కరుకూడా ఓడదిగి గట్టెక్కడానికి వీల్లేదు" అని మోత జనాన్ని చూస్తూ జనాంతికంగా మరోకేకవేశాడు.

వెంటనే అంతటా అందరూ అన్వేషణ ఆరంభించారు. ఇంజనుపెట్టెదగ్గర కేవరైనా వచ్చినప్పుడల్లా మాగ్వైర్ గుండె గిలగిలలాడిపోయేది. కాని ఇంజనుపెట్టెలో దాచిపెట్టేఅసాధ్యు డుంటాడని ఎవరికీ వూహాపోక అందులో తనికీ చెయ్యలేదు. అప్పటికే చాలాపొద్దుపోయింది. సాయానికొచ్చిన జనం అంతా వారివారి బోట్లమీదికి చేరుకోవాలని సప్లయిఆఫీస రుకూ తెలుసు. మనసుకు నమ్మకంలేకపోయినా సర్దుకుని, వచ్చేవి తొంభైతొమ్మిదే కాబోలని సరిపెట్టుకొన్నాడు. అంతా వెళ్ళిపోయారు. లైటర్ మీద కాపలావున్న కాక్ స్వెయిన్ కూడా పోతాడేమోనన్న ఆశతో మాగ్వైర్ అక్కడే

తచ్చాడాడు. కాని ఆ అసామి ఏదో పసిగట్టాడేమో పీఠంవే సుకు కూచున్నాడు. చివరికి మాగ్వీర్‌కు ఓపిక చచ్చింది. ఆ మొండిసాలరు నోరుమూసుకుండికి రుసుముగా ఆరు బీరు టిన్నులు ధారపోసుకుని నూరో పెట్టె భుజానపెట్టుకుని పి. టి. ఆశ్రమం చేరుకున్నాడు. యుద్ధకాలపు విశేషాలలో మాగ్వీర్ అపురూపంగా మనసులో పదిలపరచుకున్న మధురస్మృతు లలో ఇది ఇంకొకటి.

ఒకసారి టులగీకి ఒకకొత్త పి. టి. దళం వచ్చింది. కొత్తవారుకాబట్టే అమాయికంగా తమసరుకును రేవుగట్టు మీాద బొమ్మలకొలువుతీర్చినట్టు అందందు పేర్చిపెట్టుకున్నారు. వాటిలో కొన్ని దొంతర్లు టార్పెడో ఫ్లూయిడ్ డబ్బాలు. అయిదుగాలన్లటిన్నులు పదిహేనిటిని పేర్చిపెట్టారు. టార్పెడో ఫ్లూయిడ్ అనే ద్రవం 190 ప్రూఫ్. అంటే అందులో 95% ఆల్కహాల్ వుంటుంది. సౌత్ పసిఫిక్ ప్రాంతంలో నావికులు దీనిని కేవలం టార్పెడోలు పేల్చడానికేకాక అంతకన్న గొప్ప కార్యాలకు ఉపయోగించడంకద్దు. అందువల్ల ఆసరుకు గిరాకీ ఎక్కువ. ఆరాత్రి పి. టి. 109 బోటు .50 కాలిబర్ మిషన్ గన్స్‌కు మందుగుండు సామగ్రికోసం రేవుకివచ్చింది. ఆసరుకు తీసుకువెళ్తున్న సిబ్బంది అక్కడేవున్న ఈ 'సరుకు' ను చూచి ఆచేత్తో ఒక డబ్బాఅందుకుని చల్లగా జారుకున్నారు. కొద్ది సేపటిలో ఈ పరప్రసాదంసంగతి మిగతా బోట్లన్నిటికీ తెలిసి పోయింది. అక్కడినించి ఆ ప్రాంతంలోని పి.టి. బోటులన్నిటికీ అర్జెంటుగా హార్బర్ లోకి వెళ్ళితీరవలసిన రాచకార్యాలు ఏర్ప డ్డాయి మందలుమందలుగా వచ్చేశాయి కొద్దిసేపటికి గట్టుమీాద

అయిదుడబ్బాలు మిగిలాయి. స్క్వాడ్రన్ ఆఫీసర్లకు జరుగు తున్న కథ తెలిసింది. ఒక్కనిమిషంతరువాత ఏప్రిల్ 7 నాటి విమానాలదాడినిమించిన ధాటితో టులగీ చుట్టుపక్కలఅంతా కల్లోలం చెలరేగింది. కమాండర్ కల్వర్టుకు కబురువెళ్ళింది. ఆయన వెంటనే తనిఖీబోట్లను వదలి ఆ ప్రాంతంలోని పి. టి. లన్నిటినీ సోదాచేయించాడు.

తనిఖీ అధికారులు పి. టి. 109 మీదికెక్కి ఆచివరి నించి ఈ చివరివరకూ పైనుండి క్రిందివరకూ ఎంతసోదా చేసినా ఆల్కహాల్ డబ్బా ఒక్కటిగూడా దొరకలేదు. వాళ్ళు వెళ్ళాక సిబ్బంది ఒక చిన్న తెప్పవేసుకొని పొదలపక్కగా కొంచెందూరం వెళ్ళారు. అక్కడ వారి కొకపెద్దకార్కు కని పించింది. అటూఇటూచూసి ఆకార్కును పైకిలాగారు. దానికొస నో ఐదుగాలన్ల ఆల్కహాల్ డబ్బా వుంది.

తీరా దీన్ని బోటుమీదికి తెచ్చుకొని ఆశగా మూత తెరిచేసరికి అందులో 'పింక్ లేడీ' ఉన్నది. పింక్ లేడీ అన్నది ఒకరంగు. ఈ టార్పెడో ద్రవాన్ని చాలమంది మధుసేవకు విని గిస్తున్నారని అధికారులు అది తాగేందుకు వీలులేకుండా ఒక రసాయనద్రవ్యంకలిపేందుకు గుర్తుగా ఈరంగు తెప్పిం చారు. అయితే దీనికి పైయెత్తుకూడా ఈజనానికి తెలుసు. వాళ్ళు దానిని ఒకడబ్బాగిన్నెలో పోశారు. అందులో ఒక రాగిగొట్టం కొన్నికాయిల్స్ అమర్చారు. దానిని ఎలక్ట్రిక్ ప్లగ్‌కు తగిలించి కాయిల్స్‌ను చన్నీళ్ళమధ్యగా పోనిచ్చారు. ఈవిధంగా ఒకయంత్రాగారం కల్తీద్రవంలోని పింక్ లేడీని

వదిలి మిగతాది వడబోసి పరిశుద్ధమైన ఆల్కహాల్‌ను కప్పు లోకి దింపింది. దానిఘాటును రుచికరమైనస్థాయికి దింపడం కోసం మావర్ అనాసపండ్లరసం పట్టుకొచ్చాడు.

ఈ చిన్నవిందుసంగతి కెప్టెన్ కెనడీకి తెలియదని వాళ్ళెవరూ భ్రమపడలేదు. కాని ఆయన ఆ సమయంలో యుద్ధానికి సంబంధించిన పెద్దపెద్ద సమస్యల గురించి తీవ్రాలోచనలో నిమగ్నుడై వుంటాడని తమకుతాముసర్ది చెప్పుకున్నారు.

ప్రతిఆదివారం సెసెపీ చర్చిలో ప్రార్థన లుండేవి. ఆనాడు దగ్గరలోవుంటే కెనడీ మాగ్వైర్‌ను తీసుకుని చర్చికి వెళ్ళేవాడు. పి. టి. లలో చర్చికి వెళ్ళేవారందరినీ తీసుకువెళ్ళ డానికని ప్రత్యేకం ఒక పెద్ద పడవ బోట్లదగ్గరకు వచ్చేది.

"బోటొచ్చింది. ప్రార్థన కెళ్తారా?" అని కేకవేసేవాడు మాగ్వైర్.

ఇద్దరూ బోటుఎక్కి చర్చికి వెళ్ళేవారు. ఆచర్చి గడ్డి కప్పుతో వేసినపాక.

టులగీవదలివెళ్ళిపోయేముందు కెనడీ ఒకసారి బోటును కాల్వార్డ్‌విల్‌లోని కర్మాగారానికి తీసుకువెళ్ళాల్సివచ్చింది. పనిముగించుకొని వెళ్ళిబోతూవుండగా "హేయ్ జాక్" అంటూ ఎవరో ఒక వేల్‌బోట్‌మీంచి కేకవేశారు. కెనడీ తిరిగిచూశాడు. 'రోషాంబో' నౌకమీద తనకి మిత్రుడైన ఎన్‌సైన్ రీడ్. తనుకూడా పి. టి. సర్వీసు ఎన్నుకుని వచ్చికలుసుకుంటానని మాటయిచ్చాడా నాడు. ఇపుడు సొమియాలో

వేశారు. ఇప్పుడే వస్తున్నాడు. రాబోయే కొద్దినెలలపాటు యిద్దరూ చాలా సన్నిహితులై తిరగవలసివుంది. రోజులు గడుస్తున్నకొద్దీ పి. టి. 109 సిబ్బందికి ఉన్నబోటుమీాద విసుగు పుట్టింది. కదిలి ముందుకుపోవాలన్నకోరిక తొలచసాగింది. ఆనాటి 'టులగీ' నాటుభాషలో చెప్పాలంటే "టులగీగ్రాగీ" అయిపోయారంతా. పశ్చిమదిశన వాళ్ళు ఎదుర్కొని అనుభవించబోతున్న సంఘటనలగురించి కాస్తముందుగా తెలిసివుంటే టులగీలో గ్ స్త్రీద్యూటీతో సంతృప్తిపడి కదలకుండా కూర్చునేవారేమో !

# 4

జపానుపై విజయసాధనకై టోక్యోదాకా సాగవలసి వున్న సుదీర్ఘయాత్రలో ఒకభాగంగా పశ్చిమసాలమన్ దీవుల లోని న్యూజార్జియామీద దండయాత్రజరపాలని రక్షణదళాధిపతులు ముగ్గురూ నిశ్చయించారు. న్యూజార్జియా ఒక ద్వీప సమూహం. వందలకొద్దీ చిన్నద్వీపాలూ, కొన్ని పెద్దద్వీపాలూ వున్నాయి. వాటిలో రెండోవా, గిజో, కొలంబంగారా, వెల్లా లావెల్లా, వానావానా, అరుండెల్, గానోంగా, వాంగునూ, షేటిపారి, గటుకాయ్ మొదలైనవి యుద్ధకాలంలో ముఖ్యమైనవి. అన్నిటికన్న పెద్దద్వీపం న్యూజార్జియాయే. ఆదీవి పశ్చిమ కోస్తాచిట్టచివరను రెండోవాదీవికిఎదురుగా జపానీయులుచాలా ముఖ్యమైన విమానాశ్రయం ఏర్పరచుకున్నారు. దండయాత్రకి ముహూర్తంగా డి–డే 1943 జూన్ 30 అని పెద్దలు నిశ్చయించారు.

మేనెలాఖరుకల్లా టులగీ అంతా దండయాత్రాసన్నాహాలతో కోలాహలంగా వుంది. డెస్ట్రాయర్లు, సరుకుఓడలు, విమానవాహకనౌకలు అనేకరకాలవి చిన్నవీ పెద్దవీ గాడల్ కెనాల్, న్యూహెబ్రిడీస్ నుండి రాసాగాయి. వాటికి చోటు చెయ్యడానికి అంతవరకు టులగీరేవులోవున్న నౌకలను రస్సెల్

దీవులకు పంపిస్తున్నారు. ఇవి టులగీకి పడమట 80 మైళ్ళ దూరాన ఉన్నాయి. అంటే న్యూజార్జియాకు ఉన్నదూరంలో మూడవవంతు.

టులగీనుంచి మొట్టమొదట తరలివెళ్ళినవి పి. టి. బోటులే. వాటిలో చాలామటుకు రస్సెల్స్‌కే బయలుదేరాయి. అంతలో ఒక ఆరింటిని న్యూగినీ పంపవలసిందిగా కమాండర్ కల్వర్టుకు ఉత్తర్వువచ్చింది. ఐదింటిని ఎన్నిక చేశాక ఆరోదానిదగ్గర చిక్కువచ్చింది. పి. టి. 109 ని పంపమని కెనెడీ, 110 ని పంపమని దాని కెప్టెను పాట్‌మన్రో – ఇద్దరూ అడిగారు. న్యూగినీలోనే యుద్ధంజోరుగావుంటుందన్న ఆలోచనే కారణం. అదాయిదాఅని తేల్చుకుందికి మన్రో ఒక నాణెంతీసి పైకెగరేశాడు.

"బొమ్మా బొరుసా" అన్నాడు.

"బొరుసు" అన్నాడు కెనెడీ.

"బొమ్మ పడింది" అన్నాడు మన్రో విజయగర్వంతో.

ఆ 50 సెంట్లనాణెం తీర్పుఫలితంగా మన్రో న్యూగినీకీ, కెనెడీ న్యూజార్జియాదాడికీ వెళ్ళడంజరిగింది.

మే 30 తేదీ తెల్లవారుఝామునే రస్సెల్‌దీవులకు బయలుదేరవలసిందని కెనెడీకి ఉత్తర్వుఇచ్చారు. కదిలేటపుడు నియమనిబంధనలు అవసరమని చెప్పినదానికన్న ఒక్కరవ్వ ఎక్కువ పరికరాలతోనే కదిలింది 109. జరిగిందిది: ఆ క్రితం రాత్రి మాగ్వైర్, మావర్, కోవాల్, హారిస్‌లు నలుగురూ

ఊళ్ళోకి వెళ్ళి ఒకసినిమా చూచి వచ్చారు. తిరిగివచ్చేటప్పుడు ఔట్ బోర్డుమోటారు అమర్చిన డింగీబోటు ఎక్కి బోటుచేరు కున్నారు. చేరుకున్నాక ఆబోటును అమాంతం పైకెత్తి బోటులో దింపేసి దానిమీదటార్పాలిన్ కప్పేసి గుట్టుచప్పుడు కాకుండా పడుకున్నారు. దళాలన్నీ రస్సెల్ దీవులుచేరాక 109 జనానికిమాత్రం ప్రభుత్వం ప్రత్యేకసదుపాయాలు చేసినట్టు కనబడిం దందరికీ.

రస్సెల్సదీవులలో వంకరటింకరగావున్న కోస్తాలోంచి సన్నటిచీలికలు బురదకాలువపై ఇంద్రనీలాలపర్వతంలావున్న చక్కటి పచ్చటి అడవులలోకి వీరహస్యాలు అందాలో అన్వే షిస్తూపోతాయి. హారిస్, కోవాల్ కలిసి ఒకనాడు ఒకవీరు వెంబడి డింగీమీద అడవులలోకి వెళ్ళారు. గట్లమీద అప్పు డప్పుడు నీటిమధ్యగాకూడా భయంకరమైన మొసళ్ళు కనిపిం చాయి. డింగీ దగ్గరకురాగానే ఛీత్కరఘూడించి జలప్రళయం రేపేవి. ఆజోరుకు అలవాటుపడ్డాక వాటిని వేటాడ్డంలో మజా మరిగారు నావికులు. తప్పించుకొనేరోజులు పోయి సరాసరి వెతుక్కుంటూ వెళ్ళేవారు. కుదిరితే రైఫిల్ గురిచూసి కొట్టే వారు. ప్రమాదంఅనుకుంటే నాటుబాంబువేసి ముక్కలుచేసి పారేసేవారు.

మొసళ్ళు దొరకకపోతే చిలకల్ని కొట్టేవారు లేదా చేపలుపట్టేవారు. ఒకసారి మూడడుగులపొడుగున్న ఈల్ చేప పడింది. అదిచేసిన యుద్ధం, ఉధృతం చూసి దానినోట కొక్కెం ఊడదీసి వదలివెయ్యడానికికూడా భయపడ్డారు.

నావికులు బాగా బోటుదగ్గరకు లాగి సగందేహం నీటిలోపలా మిగతాసగం పైనా ఉండేట్టుగా బిగించికట్టారు. బోటుపోని చ్చారు. తరువాత కొంకెం మరోసారి లాగిచూద్దామనుకొనే సరికి చేప కిందికి సగం గల్లంతైపోయింది. పైసగ మేదక్కింది.

అడవిలో స్థానికప్రజలుండే గ్రామాలలో ప్రవేశించ రాదని అమెరికన్‌లకు నిషేధాజ్ఞవుంది. కాని యీ డింగీలో పరిశోధకులకు అల్లంతదూరంలో కనపడేగ్రామాలూ, స్థంబాల మంచెలమీదకట్టిన ఆపాకలూ చూడగాచూడగా దగ్గరికివెళ్ళ కుండా ఉండలేకపోయారు. ఒకరోజు మధ్యాహ్నంవేళ అడవి లోకి డింగీషికారెళ్ళిన కర్కసీ, కోవాల్, హారిస్‌లు ఒక చోట కాలువకి అల్లంతదూరాన కొన్నిగడ్డిపాకలు చూశారు. తెగించి ఒడ్డుకు దగ్గరగా లంగరుదింపి సుమారు ఎనిమిదిఅంగు ళాలనీటిలో దిగారు. కాళ్ళకు జోళ్ళులేవు. అడుగుతీసి అడుగు వేసేలోపల ఆకాస్తనీటినిండా వేలాది నీటిపాము లున్నాయనీ, అవన్నీ కాళ్ళకి పెనేసుకుని మెలేసుకుంటున్నాయనీ గ్రహిం చారు. ఉత్తరక్షణంలో బెదిరి 'కంగారు కంగారుగా ముగ్గురువీరులూ గట్టుమీదికి ఒక్కదూకుదూకారు. ముగ్గురికీ భయంతో పై ప్రాణాలు పైకెగిరిపోయాయి. గట్టుమీది జనం మళ్ళీ ఎలా పడవలో పడతారో, ఎలా యీ 'గండంగడిచి గట్టెక్కుతారో' ఊహించుకొందికికూడా భయపడ్డారు.

తరువాతకథ అలావుంచి వచ్చినపని చూదామని ముందుకుసాగారు. ఊళ్లోకి ప్రవేశించేసరికి ఆడవాళ్ళు అమాం తం పాకల్లోకి దూరిపోయారు.

అర్ధనగ్నంగావున్న నల్లటిమనుషులు మహానంగా కోపంగాచూస్తూ, యీటెలుచేతబట్టి ముందుకువెదురొచ్చారు. నావికులు ముగ్గురూ ఇకిలించి 'హలో' అని పలకరించారు. అందుకు బదులుగా వారు యీటెలతో నేలమీద కోపంగా కొట్టి కళ్ళల్లో నిప్పులుకురిపించారు. కొట్టలేదుకాని, కొట్టి చంపేధోరణిలో మీదిమీదికి వస్తూ నావికులు ముగ్గురినీ ఊరి బయటకు నెట్టేశారు. వెళ్ళిపోడానికి అతిథులు సిద్ధమేకాని, మామూలుగా వెళ్ళకుండా గ్రామస్థులు ముందడుగువేస్తూ ఈటెలుఝుళిపిస్తూ అనుసరిస్తూనే వున్నారు.

కాలవబడ్డుదాకా ఈ యాతన తప్పలేదు. గట్టుచేరి డింగీని కళ్ళచూడగానే ప్రాణాలులేచొచ్చాయి. ఒక్కసారిగా జోరుగా నీళ్ళలోకిజారబడి పరుగెత్తి డింగీఎక్కిపోయారు. నీరుదాటుతూన్నప్పుడు అందులో పాములున్నాయనీ, కొంత సేపటిక్రితమే అవి హడలగొట్టేశాయనీ వాళ్ళకి గుర్తుకూడా రాలేదు. డింగీవదలి, రేవులోకివెళ్ళి పి. టి. 109 మీదికి చేరు కున్నాకగాని నీళ్ళలో పరుగిడుతున్నపుడు పాము లసలు తగుల లేదన్న సంగతి తట్టలేదు.

రసెల్ దీవిలో కెనెడీ, తోడిఅఫీసర్లూ ఒకపాత 'ప్లాం టేషన్' బంగళాలో నివసించేవారు. చాలా విశాలంగా చక్కగా ఉండేది. ముందర బారుగా మెట్లవరుసతో కవిగా

వుండేది. పైన రేకుతో కప్పువేశారు. కొయ్యస్తంబాలమీద కొంచెం ఎత్తుగా నిలచివుండేది. బంగళా ఎదురుగా సన్ లైట్ ఛానెల్ అంటే రస్సెల్ దీవులలో ముఖ్యదీపాలు పావువు, బానికాలు రెండిటిమధ్యగా ఉత్తరదక్షిణాలుగా పోతుం దా కాలువ.

బంగళా వెనక పెద్ద నిమ్మచెట్టుండేది. మధ్యాహ్నాల వేళ కాస్త ఆల్కహాల్ లో కొంచెం నిమ్మరసం కలుపుకొని విశ్రాంతిగా సేవించేసమయాలలో ఆ చెట్టును మెచ్చుకొనే వారు. ఆ చెట్టువెనకే ఉచ్చలదొడ్డి వుండేది. అది టోజో సమాధి ఆకారంలో కట్టారు. సమాధిపైనవుండే శిఖరశిలలాటిదే దీనిమీదకూడా అమర్చారు.

తీరికవేళలలో కెనెడీ క్రిబాజ్ (పేకాట) ఆడేవాడు. వచ్చేటప్పుడు తనతో ఒక రికార్డుప్లేయర్ కూడా తెచ్చుకు న్నాడు. ఉన్నరికార్డులలో అతనికి చాలాఇష్టమయిన పాట ఒకటి తరచు పెట్టేవాడు. అతని సహవాసులకే నిద్దర్లోకూడా వినిపించేది:

“నవ్వింది నన్ను చూసి
నిర్మల నీలాకాశం
చూసిచూసి కళ్ళుమూసి
ఎటు తెరిచినా నీలాకాశం

నిర్మల నీలాకాశం.”

రసెల్ దీవులు చాలా అందంగా మెరిసిపోతూవుం టాయి. దీవులనిండా పెద్దకొబ్బరితోటలు. వాటిచుట్టూ పచ్చటి చిక్కటి అడవులు. యుద్ధానికిపూర్వం లివర్ బ్రదర్స్ వారు అక్కడా తోటలువేశారు. అక్కడిజలం ఇంద్రనీలం, పచ్చలకాంతులు కలబోసుకుని తళతళలాడుతూ వుంటుంది. ఆ తళతళలకి కొంచెం దిగువన కన్నుచెదరేలాటి ఎరుపు, నీలం, పసుపురంగుల చేపలు తళుక్ తళుక్ మంటూ తిరుగుతూ వుంటాయి. ఇంకా దిగువన అనేకరంగులలో వెలిగిపోయే పగ డాలగుట్టలుచిమ్మే కాంతులకు ఈ చేపలు బిత్తరచూపులు చూస్తూ అటూఇటూ పరుగులుపెడుతూవుంటాయి. అమెరి కన్‌లు ఈ మత్స్యసంపద, వాటిసౌందర్యంచూసి ముగ్ధులై పోయారు.

ఒకనాడు సన్‌లైట్ ఛానెల్ దక్షిణపుచివరఉన్న స్థావ రంనుండి 109 బయలుదేరివెళ్తోంది. కెనెడీ ముందువేపు చివ రన బోర్డ్గిలాపడుకొని సాలోచనగా నీటిలోకి చూస్తున్నాడు. హఠాత్తుగా అతను కెవ్వున కేకవేశాడు. నావికులంతావచ్చి తొంగిచూశారు. చాలాకాలంపాటు కళ్ళుమూసుకున్నా చెరిగిపోనంత భయంకరదృశ్యం కనబడింది. నౌకాగ్రానికి కొంచెం ఎదురుగా ఎడమవైపున ఒకపెద్ద సొరచేప వెళ్తోంది. బోటువేగం హెచ్చించమన్నాడు కెనెడీ. మాగ్వైర్ ముందు కురికించాడు. నీటిలో సొరచేప నిమిషంక్రితం ఎంతదూరంలో ఉందో ఇప్పుడూ అంతేదూరంలోవుండి జోరుగా పోతోంది. నాలుగుగుర్రాల బగ్గీకికట్టిన ముందువెనక గుర్రాలలా నడు స్తున్నాయి బోటూ, చేపాను.

'తగ్గించు' అన్నాడు కెనెడీ. బోటు వేగం తగ్గింది. చేప కూడా జోరు తగ్గించింది. ఇలా బోటు ఎంత వేగంగా వెళ్తే సరిగ్గా అంతే వేగంతో చేపా వెళ్తోంది. ఈ ఆట ఇలా కొంత సేపు సాగాక దానికి విసుగెత్తి ఏ చేప ప్రాణం తియ్యడానికో వెళ్ళిపోయింది.

టులగీలాగే యిక్కడా బోటుకి పొదల మాటున లంగరు వేసేవారు. బురదలో కాలు పెట్టకుండా ఒడ్డునుండి బోటు మీదికి చేరడానికి ఒక కాట్‌వాల్ (సన్నటి గోడ మీదుగా కాలిబాట) నిర్మించారు. డెక్ మీద వర్షం పడకుండా కొయ్యలూ కొక్కాలూ చూసి వాటి మీదుగా కాన్వాసు గుడ్డ వేశారు. దానికింద, డెక్ మీద పరుపులు వేసుకు పడుకొనేవారు.

హార్వర్డ్ రోజులనుండీ బాధపెడుతున్న నడ్డి నొప్పి మూలంగా కెనెడీకి పరుపంటే పడేదికాదు. ఒక ప్లైవుడ్ బల్ల అమర్చుకొని అందుమీద నిద్రపోయేవాడు. అప్పుడప్పుడు నడ్డి నెప్పి గురించి చెప్పినా పూర్వంకన్నా మెరుగు అంటూ ఉండేవాడు. అతను పడుకొనే వేళల్లో నావికులు అది పట్టుకు పోయి దానిమీద బట్టలుగుంజేవారు. నాలుగైదుసార్లు కెనెడీ నడ్డివాలుద్దామని వచ్చేసరికి బల్ల గల్లంతైపోవడం జరిగేది. దానిమీద అడపాతడపా కెప్టెన్‌కీ సిబ్బందికీ ఘర్షణ జరిగేది.

"మాక్ ! నా బోర్డేది ?" అన్నాడోనాడు కెనెడీ.

"బోర్డా ? ఏ బోర్డు ?"

"ఏ బోర్డో తెలీనట్టు ! చెప్పు !"

"ఒకవేళ... కోవాల్ నిన్నమొన్న ఒక బోర్డునుకోసి క్రిబొజ్ సెట్‌లు తయారుచేసి అమ్ముకుంటున్నాడు... కొంప తీసి అదికాదుకదా!" అన్నాడు మాక్ నవ్వి.

"అదే అయితే అమ్మేసిన ముక్కలన్నీ కొనుక్కొచ్చి పోగేసి అతికించి బోర్డుతయారుచేసివ్వడానికి—రెండేరెండు నిమిషాలు గడువిస్తున్నాను" అన్నాడు కెనెడీ.

బోటులో ఎవరోఒకరు మరొకరిని దబాయించడం రివాజైపోయినట్టుంది. డ్రెవిచ్‌కి మావర్ అంటే లోకువని జనాభిప్రాయం. కనీసం ఒకనాడు కాక్‌పిట్ దిగువన చార్టు హౌస్‌లో పిస్టల్ పేలిన క్షణంవరకూ దబాయించేవా డనాలి.

మావర్ డ్రెవిచ్‌లు యిద్దరూ క్రిందిగదిలో కునుకు తీస్తున్నారు. మావర్ లేచి తన కోల్ట్ .45 పిస్టల్ తుడిచి శుభ్రంచేసుకోవడానికి పూనుకున్నాడు. (పి. టి. నావికులు ఆయుధాలు మొలలోనే ధరిస్తారు) చార్టుబల్లమీద దుకాణం పరిచాడు. పిస్టల్ క్లిప్ ఊడదీశాడు. పాతగుడ్డమీద నూనెబొట్లు వేశాడు. ఈలోగా డ్రెవిచ్ లేచి డెక్ మీదకు వెళ్దామని నిచ్చెన ఎక్కుతున్నాడు. మావర్ పిస్టల్ స్లైడ్ (మీట) వెనక్కిలాగి చేంబర్‌లో బుల్లెట్ (గుండు) కోసం చూశాడు. లేదు. లేదుకాబోలన్న ఉద్దేశంతో మీటవదలివేశాడు. ఆ తరవాత ఉద్భవించిన శబ్దం—ముఖ్యంగా బోటుగర్భంలో వున్న ఆ చిన్నగదిలో పెద్దబాంబు పేలినంత ధాటీగాపేలింది. గదిలో ఎక్కడివారక్కడ కొయ్యబారిపోయారు. నిజానికి ఆ పిస్టలులో ఒకబుల్లెట్ ఉంది. కాని మావర్ దాన్ని బయ

టికిలీసేమిటాటు నొక్కినపుడు ఎందుకో అది చిక్కుపడి బయట పడలేదు. తీరా మీటవదిలితే అదికాస్తా పేలింది. బయటపడిన ఆ గుండు డెక్ మీదికి అప్పుడే నిచ్చెనఎక్కిసిన మూవర్ వెన కాలేవెళ్ళి నిచ్చెనబద్దీని కొట్టింది.

"డ్రెవిచ్! జాగ్రత్త! మూవర్ నీఅంతు చూసేట్టు న్నాడు.... ...అతనికి దూరంగావుండు" అన్నాడు మాగ్వైర్ కోలుకోగానే.

డ్రెవిచ్ నిజంగానే మూవర్ని సాధించి బుకాయించా డని మాగ్వైర్ గ్రహించాడు. కాని ఆ తరవాత ఎక్కువ కాలం అతను అక్కడ లేడు. యుద్ధంలో కెనెడీ సిబ్బందినుండి ప్రాణాలుఅర్పించిన మొదటి వీరుడుగా అతనికి ఘనతదక్కిం చాలని విధి నిర్దేశించింది.

టులగీలోలేని గొప్పసదుపాయం ఒకటి రస్సెల్ దీవిలో పి. టి. లకు అమరింది. టులగీలో పి. టి. లకు ఇంధనం (100 ఆక్టేన్ గాసొలిన్) పెద్ద పెద్దడబ్బాలతో తెచ్చి భుజాలువిరిగేలా మోసి టాంకులోకి గల్టాగొట్టాలద్వారా వంపి నింపుకొనేవారు. ఇక్కడ ఆయాతనతప్పింది. ఒక రేవుకట్టి అక్కడగాసోలిన్ స్టేషన్ పెట్టారు... సరాసరి ట్యూబుల ద్వారా టాంకులకు పెట్టుకోవచ్చు.

ఇక్కడ ఉదయంవేళలలో ఒకతమాషా జరిగేది. రాత్రిగస్తీడ్యూటీ చేసివచ్చిన బోట్లు సరాసరి పెట్రోల్ డాక్

దగ్గరకు వెళ్ళి టాంకునింపుకోవాలి. ఆ తరవాతే లంగరువేసి ఫలాహారాలు తీసుకోవాలని ఉత్తర్వులు. గస్తీతిరిగివచ్చినఅన్ని బోట్లూ నింపడానికి కనీసం రెండుగంటలసేపు పడుతుంది. అంటే అన్నిటికన్న ముందుగావచ్చి పెట్రోలుపోసుకొనే బోటుసిబ్బందికి అందరికన్న ఎక్కువసేపు పడుకునేఛాన్సు ఉంటుందన్నమాట! అందువల్ల ముందుగా రేవుచేరుకుందికి బోటులన్నీ పోటీపడేవి. గస్తీడ్యూటీఅయిన క్షణంలో అన్నీ ఒక్కుమ్మడిగా పెట్రోలుస్టేషనుకేసి ముందుకురికేవి. భయంకరమైన వేగంతో అన్నీ డాక్ మీదికి విరుచుకుపడేవి. చెక్కబల్లలతో వేసి కొబ్బరిదూలాలు నిలిపిన ఆ డాక్ ప్లాట్‌ఫారం అందుమీద ఒకచివరగావేసిన టూల్ (పరికరాలు) పెద్ద దడదడలాడిపోయేవి.

కొన్నాళ్ళయేసరికి 109 కి ఒకకీర్తి వచ్చింది. ఇంకే బోటు సిబ్బందికీ 109 లో వాళ్ళకి దొరికినంత రెస్టు దొరకడం లేదని. అందుకు కారణం కెనెడీయే. రెణ్ణెల్లనాడు ఈబోటు చేతిలోకి తీసుకున్ననాటినుండీ దీన్ని మరింతవేగంగాపోయేట్టు చూడాలని కెనెడీతాపత్రయపడేవాడు. "ఇంకా స్పీడుకావాలి. ఇంకా, ఇంకా..." అంటూ మోటార్ మాన్‌లను హెచ్చరిస్తూవుండేవాడు. బోటుస్టీరింగ్ చేతిలోవుంటే అతని కెంతో ఆనందం. జోరుహెచ్చినకొద్దీ అతనిహుషారూ హెచ్చేది. పెట్రోలుడాక్ దగ్గరకు మిగత పి. టి. లతో పోటానపోటీగా వస్తున్నప్పుడు పి. టి. 109 జోరుకు సాటికనబడేదికాదు. పెద్దహోరుతో వెనకాల బ్రహ్మాండమైన కోడిపుంజుతోకలా నీరు పైకిచిమ్ముతోవుంటే చిరుతపులిలా డాక్ మీదకుఉరికేది.

చిట్టచివరిక్షణంవరకూ ఆఖరుఅంగుళంవరకూ అదేవేగంతో బోటునుపోనిచ్చేడు కెనెడీ ఇంక గుద్దేస్తుందన్నదాకా వచ్చాక ఇంజన్‌లను రివర్స్ చేయించేవాడు. బోటు అమాంతం ఆగేది.

ఇలా వెంట్రుకవాసిలో ప్రమాదం ఉండనేలా ఆపడం చూసి మోటార్ మెకానిక్‌లు ఆందోళనచెందసాగారు. అంత వేగంతోవచ్చి హఠాత్తుగా రివర్స్‌చేయడంవల్ల ఇంజన్‌లు పోనుపోను దెబ్బతింటాయని భయపడ్డారు. అదలావుంచి ప్రతి సారీ అనుకున్నట్టు ఆక్షణంలో ఇంజన్‌లు పనిచెయ్యకపోవచ్చు నని డ్రాడీ హెచ్చరిస్తూ వచ్చాడు. కాని అలా ఎన్నడూ జరగలేదు. ఇంజన్లు డ్యూటీచేస్తూనేవున్నాయి. కెనెడీ గెలుస్తూనేవున్నాడు. అతని కావలసిం దదొక్కటే !

ఒకనాటి ఉషఃకాలాన కెనెడీ తిరుగుముఖంపట్టాడు. తూర్పున మేఘాలు అరుణరాగరంజితాలై వెలుగుతున్నాయి. కొబ్బరిచెట్లు నిర్మలనిశ్చల జలాలలో నీడలుచూసుకొని తృప్తిగా తలలూపుతున్నాయి. కెనెడీకీ మరోబోటుకూ భీకర మైనపోటీ ఆరంభమయింది. రేవుకి చాలాదూరం ఉండగా ముందుపోవడం అనవసరమని కెనెడీ జోరుతగ్గించి రెండో బోటు నీటినిచీల్చిచేసే గాడిలో దానివెనకాలే పోసాగాడు. డాక్ అల్లంతదూరంలో ఉందనగా పక్కకితప్పించి జోరు పుంజుకున్నాడు.

క్రమంగా ముందుబోటును అంగుళం అంగుళంగా చేరుకుంటూ పక్కగావచ్చాడు. సమానంగా సాగాడు. అదీ తగ్గలేదు. రెండూ సమఉజ్జీలుగా ముందుకుపోతున్నాయి. ఇక ఎవరినెవరూ దాటేప్రశ్న లేదు. ఎవరు తగ్గుతా రన్నదే, తగ్గ

కుండా నిలిచేందుకు గుండెధైర్యం ఏస్కిప్పర్‌కి ఉందన్నదే తేలాలి. అదే ఫలితం తేల్చాలి. బోటు డాక్ మీాదికి ఉరకడం పోయి అదే బోటుమీాదికి వచ్చేస్తోందన్న భ్రమ కలిగేటంత దగ్గరగావచ్చేశాయి. ఆ చివరిక్షణాలలో మొండిగుండెధైర్యం కెనడీదే అయింది. ఒక్కక్షణం ఎక్కువనిలిచి పక్కబోట్లను దాటేశాడు. అది వెనక్కి తగ్గింది.

తక్షణం ఇంజన్‌లను రివర్స్‌చెయ్యమని ఉత్తర్వు చేశాడు కెనడీ. ఇంజన్‌లుమూాడు నోరువెళ్ళబెట్టాయి. 80అడుగుల పి. టి. 109 బోటు తాడుతెంచుకు గాడీపడిన 80 అడుగుల మిసిలీలా ఒక్కసారిగా పెద్దశబ్దంతో డాక్‌లోకి చొచ్చుకుపోయింది.

అప్పటికే పెట్రోలుసరఫరాసిబ్బంది అంతా డాక్ మీాద డ్యూటీలోకి వచ్చారు. ఒకవారంటు ఆఫీసరు వర్కర్లనుతీసికొని పనిముట్లుతీయిస్తున్నాడు. అంతలో భూగోళం పేలునబద్దలై ముక్కలన్నీ వాళ్ళనెత్తినే పడ్డట్టయింది.

పనిముట్లు దశదిశలా విహరించాయి. రెంచిలు,జాకీలు, స్క్రూడ్రైవర్లు, సుత్తులు, వులులు ఎగిరినంత ఎగిరి నీళ్ళల్లోకి వడగళ్ళలా పడ్డాయి. బయట డెక్‌మీాద నుంచున్న మనుషులూ అంతే! ఎగిరి నీటిలోపడ్డారు. లోపలున్నవారిలో అదురుపాటుకున్నోలుకొని కదిలేపాటి సాహసంఉన్న కొద్దిమంది నెమ్మదిగా బయటికి పాకసాగారు. బయటికివచ్చి చుట్టూ చూసేసరికి అంతవరకూ వాళ్ళు ఊహించినట్లు జపానువాళ్ళ డైవ్‌బాంబర్స్‌మూాక కనబడలేదు. డాక్‌లోకి ఒకపక్కగా చొచ్చుకుపోయిన ఒక్క పి. టి. బోటు కనపడింది. దానిమీాద

బక్కపలచని కేప్టెన్ చెలరేగి ఒక్కసారిగా నిశ్చలంఅయి పోయిన ప్రళయఫలితాన్ని మౌనంగా చూస్తూ నిల్చుని వున్నాడు. ఉద్ధృతానికి ఎగిరిపడిన అతని సిబ్బంది నిశ్చేష్టులై నిలబడి చూస్తున్నారు.

కెనెడీ తనకన్న పెద్దఅధికారిఅయినా వారంట్ ఆఫీసరు ఉద్రేకంతో పెద్ద పెద్ద కేకలువేస్తూ తిట్టాడు. నావికు లంతా బెదురు కుదురుపరచుకుంటూ 109 నీ, దాని సిబ్బందినీ నానామాటలూ అంటూ చిందులుతొక్కారు. మొత్తంమీద అన్ని వేపులనుంచీ తిట్లూ, శాపనార్థాలూ పెనుగాలిలావచ్చి కొడుతున్నాయి. వినేట్టున్న ఇద్దరుముగ్గురికి క్లుప్తంగా క్షమా పణచెప్పుకోడం తప్పవిడిచి కెనెడీకి చేసే దేం కనబడలేదు. గాలివాన వెలిసేదాక తలవంచుకు వింటూ నిలబడ్డాడు. తర వాత నెమ్మదిగా బోటును వెనక్కినడపడానికి ప్రయత్నిం చాడు. జరిగినగొడవకి ముక్తాయింపులా అక్కడక్కడవున్న పనిముట్లు నీటిలోనూ, బోటుమీదా కురిశాయి.

ఐరిష్‌వాళ్ళందరికీ కలిసివచ్చే అదృష్టం అడ్డుపడకపోతే ఈ సంఘటన కెనెడీకి చాలాఅనర్థం తెచ్చిపెట్టివుండేది. అతని అఘాత్యంగురించి అంతా తిడుతూవుండగా కథ మూడో కాలంలో నడుస్తున్న వేళ పులిమీదపుట్రవచ్చి పడిందన్నారు. రెండుమూడు పి. టి. బోట్లు కట్లుతెంచుకొని కొట్టుకుపోతు న్నాయని కబురువచ్చింది. దీనికన్న అది పెద్దఉపద్రవం. కాబట్టి అంతా తిట్లు వాయిదావేసి వాటిని కాపాడుకోందికి పరుగెత్తారు. ఈ అదనుచూచుకొని కెనెడీ తనబోటును నెమ్మ దిగా కదలేసి కొంచెం అవతలగావున్న ఒకకాలవలోకిపట్టించి

రభసచల్లారేదాకా ఎవరికంటాబడకుండా పొదలమాటున దాచాడు. ఇది జరిగిన కొన్నాళ్ళవరకూ అతన్ని అంతా 'క్రాష్ కెనెడీ' అని పిలిచేవారు.

రసెల్ దీవులలో గస్తీడ్యూటీ టులగీ జీవితంలాగే సాఫీగా సాగిపోతోంది. కాని కొద్దికాలంలోనే పెద్దసమస్యలు తలెత్తడం ఆరంభించాయి.

న్యూజార్జియా దీవులపై దండయాత్రకై అడ్మిరల్ విలియం ఎఫ్. హాల్‌సీక్రిందవున్న మూడవ నౌకాదళం అవధిలోనే ఒక ఉభయచర (సైనిక, నావిక) సంగ్రామదళం రూపొందించడం ఆరంభించారు. దానికి 'టాస్క్ ఫోర్స్ 31' అని పేరుంచారు. రియర్ అడ్మిరల్ రిష్మండ్ కెల్లీ టర్నర్ ఆధిపత్యాన నడిచే దళానికి మందిమార్బలం చేరడం మొదలుపెట్టారు. యుద్ధనౌకలు-ప్రెసిడెంట్ జాక్సన్, ప్రెసిడెంట్ ఆడమ్స్, ప్రెసిడెంట్ హెయస్-మూడూ సైనికులను క్రిక్కిరిసిపోయేలా ఎక్కించుకొనివచ్చాయి.

మరోవంక టాల్‌బాట్, జేన్, డెంట్, వాటర్స్, ఫారెన్‌హోల్ట్, బుకానన్, మెక్‌కాలా మొదలైన డిస్ట్రాయర్ నౌకలు ఆయూరవాణానౌకలకు, ఎల్. ఎస్. టి. ఓడలకు, టగ్‌బోట్లు, బార్జ్‌లు వగైరాలన్నిటికీ రక్షణఇస్తూ తీసుకు

వచ్చాయి. టి. ఎఫ్. (టాస్క్‌ఫోర్స్) 31 లో వీటితో బాటు న్యూజార్జియా మోటార్ బోటు స్క్వాడన్‌ను కూడా చేర్చారు. దీనికి అధిపతి లూ. క్లస్టర్. ఇందులోని 12 పి. టి. లలో కెనడీ 109 కూడా ఒకటి.

టులగీనుండి బయలుదేరేముందు అనుకున్నట్టే పి. టి. 109 జూన్ మధ్యలో మరమ్మతులకై సెసెపీస్థావరానికి వచ్చింది. చెడిన ఇంజన్లుమూడూ తీసివేసి న్యూహెబ్రిస్ కర్మాగారంలో పాతభాగాలలో పునర్నిర్మించిన ఇంజన్‌లను అమర్చారు. తరువాత కెనడీకి గాడల్ కెనాల్‌లో ఒకపని పుర మాయించారు. బయలుదేరేముందు కెనడీ మావర్‌ను పిలిచి అక్కడికి వెళ్ళేతగు దారి, వేగం వగైరాలన్నీ ఆలోచించి కార్యక్రమం తయారుచెయ్యమన్నాడు. పి. టి. సిబ్బందిలో ప్రతిఒక్కరికీ అందుమీదజరిగే ప్రతిపనీ పూర్తిగా తెలిసివుండా లని నియమంవుంది. ఎవరైనా ఒకవ్యక్తి ఫలానాపని చెయ్య లేనిపరిస్థితివస్తే వెంటనే ఎవరో ఒకరు ఆ డ్యూటీ చెయ్య గలగాలి.

"లుంగా (రోడ్స్) కు సాధ్యమైనంత చప్పునచేరాలి" అన్నాడు కెనడీ.

మావర్ డెక్ దిగి చార్ట్‌హౌస్‌లోకివెళ్ళి అలవాటులేని యీ కొత్తసమస్యతో కొంతసేపు తంటాలుపడి చివరికి ఒక అంచనావేసి పైకితీసుకెళ్ళాడు.

"సుమారు రెండుగంటలకి చేరుతాం" అన్నాడు.

"సుమారు !... నా కా సుమార్లూగిమార్లు సనికి రావు. మనం అక్కడికి చేరగలిగేదైనా ఖచ్చితంగా చెప్పాలి" అన్నాడు కెనెడీ.

మావర్ చార్ట్ హౌస్‌లోకి తిరిగివెళ్ళి మళ్ళీ తిప్పలు పడి లెక్కలువేసుకువచ్చాడు. "రెండుగంటల పదినిమిషాలు" అన్నాడు. అతని అంచనా సరిచూడగా ఖచ్చితంగా సరిగ్గా వుంది.

"గుడ్ !" అని కెనెడీ మెచ్చుకున్నాడు. మావర్ వుప్పొంగిపోయాడు.

గాడల్ కెనాల్‌లో పనిముగించుకొని 109 రసెల్ చేరు కుని దండయాత్రకు తుదిసన్నాహాలలో పడింది.

నాలుగవ మెరైన్ రెయిడర్ బెటాలియన్ 103 వ పదాతిదళం (ఇన్‌ఫెంట్రీ) న్యూజార్జియా చేరుకోవడం, ముండావిమానాశ్రయంమీదికి అమెరికన్ విమానాలు భారీగా దాడిచేసిరావడంజరిగిన కొద్దిరోజులకే ఈ బ్రహ్మాండమైన నౌకాదళంకూడా దండయాత్రకి తరలింది.

జూన్ 30 డి–డే నాడు అనుకున్నప్రకారం ముఖ్యం గాచేరవలసిన బలాలు, రెండోవా ఉత్తరకోస్తాలో నిర్ణీతస్థలం చేరుకున్నాయి. అక్కడే పి. టి. బోట్లు ప్రయోగనిర్దేశనం కోసం కమాండర్ కెల్లీ ఒకస్థావరం ఏర్పాటుచేశారు.

నౌకాదళాలన్నీ స్థావరం చేరుకునేముందు పి. టి. 109 రసెల్‌దీవులకు న్యూజార్జియాకు మధ్యనున్న ప్రాంతంలో

పి. టి. 109 రాత్రిళ్ళు గస్తీతిరిగేది. వస్తున్ననౌకలను ఏపక్క-
నుంచైనా శత్రునౌకలు అటకాయిస్తే ఆదుకుందికిగాను
టార్పెడోలు ప్రయోగించడానికి సిద్ధంగాఅమర్చుకొని
తిరిగేది.

అయితే అలాటిసంఘటన లేవీ జరగలేదు. రాత్రిళ్ళు
వాతావరణంమాత్రం భీకరంగాఉండేది. తెల్లవారేవేళకి
సముద్రప్రళయం చెలరేగింది. బోటును నిర్దాక్షిణ్యంగా
ఊపేసి అటూయిటూ విసిరికొట్టేది. ఆవేళ్ళల్లో ఏదోఒక
ఆసరాపట్టుకోకుండా డెక్ మీద నిలుచోడం అసాధ్యంగా
వుండేది. డ్యూటీలోలేనివాళ్ళు బంకులోచేరి పడుకొంటే ఎము
కలువిరిగేప్రమాదం తగ్గుతుందని ఎలాగోఅలా పక్కలు చేరు
కునేవారు. కాని పడుకున్నా కుదురుఉండేదికాదు. బోటు
వాళ్ళని డొల్లుపుచ్చకాయల్లా అటూయిటూ దొర్లించి విసిరి
కొట్టేది. అట్టడుగు అంతస్థుబంకులో పడుకోబోయిన డ్రెవిచ్ కు
పడుకొనివుండడం బొత్తిగా అసాధ్యంఅయిపోయింది.

గస్తీఅయిపోగానే 109 రసెల్స్ చేరుకోవాలి. ఒక
నాటి ఉదయం అలాగే కల్లోలం నిభాయించుకొంటూ
యాతనపడుతూ తిరుగుముఖంపట్టి పోతూంది. అంతలో
కూడావస్తున్న మరోబోటు ఆపదలోవున్నదని తెలిపే సిగ్నల్
ప్రసారంచేసింది. కెనెడీ వెంటనే బోటును వెనక్కిమళ్ళించి
ఆబోటును ఆదుకోబోయాడు. ప్లైవుడ్ డొలకతోకట్టిన 80
అడుగుల బోటుకి ఇలాటి దిక్కుమాలినచోట యీ ప్రళయ
వేళ ఆపదొస్తే బైటపడ్డట్టే అనుకున్నాడు కెనెడీ. కొండంత

కెరటాలెక్కుతూ, ఉత్తరక్షణంలో వెయ్యిఅడుగులలోతని పించే లోయలలోకి కూలిపోతూ అతిప్రయాసమీద ఆబోటును సమీపించాడు. కెరటాలతాకిడికి ఆబోటు 'హల్' (బోటు శాస్త్రీగుల్ల) లో పెద్దదెబ్బతింది. చెక్కవిరిగి కన్నంపడింది. అందులో పరుపులుతెచ్చి కుక్కి తాత్కాలికంగా ప్రమాదం కొంచెం ఆపినా నీరు లోపలికి వెళ్ళిపోతూనేవుంది.

109 దగ్గరకు రాగానే హోరుగాలిలో గొంతుచించుకొని అవతలి కెప్టెన్ అరిచాడు-అర్జంటుగా 'బిల్జ్ పంపు' (ఓడ అట్టడుగు అరలోంచి నీరుతోడే పంపు) కావాలని. అది తన దగ్గరలేదు. అయితే దూరంగా న్యూజార్జియానుంచివస్తున్న ఒకడెస్ట్రాయర్ కనిపిస్తోందనీ, అక్కడికివెళ్ళి అడిగితెస్తాననీ అరిచి అటు కదిలాడు కెనెడీ. కెరటాల దూకుడులో లోయలో బోటును నడపడంతోపాటు అసలు తనమట్టుకుతాను కాలూని నిలబడడానికికూడా రెండుచేతులా సత్తువకొద్దీ స్టీరింగునుకరిచి పట్టుకున్నాడు కెనెడీ. డెస్ట్రాయర్‌నౌకనుచేరి చెప్పగానే కెప్టెన్ బిల్జ్‌పంపును 109కి అందించమని ఉత్తర్వుచేశాడు. ఆఓడ ఈబోటు పక్కపక్కగా వచ్చాయికాని ఒకోవూపు కెరటంలేచివచ్చినప్పుడల్లా ఒకసారి డెస్ట్రాయర్ పి. టి. కన్న చాలాఎత్తుకి లేచిపోయింది. అది దిగేసరికి పి. టి. డెస్ట్రాయరునుదాటి పైకిఎగిరిపోయేది. అవిరెండూ ఒకప్రమాణంలో ఉంటేగాని పంపు ఇందులోకి దింపడం సాధ్యంకాదు. ఒంటి సిలెండర్ మోటారుతోకలిసి అది చాలాబరువు. ఎత్తుపల్లాలు చూసుకునేలోగా అదీయిదీ గుద్దుకొనేప్రమాదం వుంది. అది ఉక్కు. ఇది ప్లైవుడ్ చెక్క. ఒక్కదెబ్బతో ఇది చితికి

ముక్కలై పోతుంది. కెప్టెన్ లిద్దరూ అతిమెలకువతో వ్యవహ రించి పంపును బదలాయించారు.

కెనెడీ డెస్ట్రాయరునువదలి జరిగి వెనక్కి బయలుదే రాడు. అంతలో ఒక పెద్ద కెరటం శీర్షభాగం తిమింగిలంతోక దెబ్బలా బోటును కొట్టింది. ముందుభాగంలో ఎడమవైపున తగిలిన ఆదెబ్బధాటికి ఒకటార్పెడో అదరి దానిట్యూబు లోంచి ఊడిపడింది. ఆ విసురుకు ఎక్కువలోతుకువెళ్ళి సబ్ మెరీన్‌లనుకొట్టే మరో పెద్దటార్పెడోను (డెప్త్‌చార్జ్) కొట్టింది. అవికనక పేలివుంటే కెనెడీ బోటు, మనుష్యులు క్షణంలో తునియలై పోవడంజరిగేది. అదృష్టవశాత్తూ రెండూ రెండువిభిన్నవిధానాలలో పేలేవిధంగా-ఈయంత్రాలనుఅమర్చ డంవల్ల ఆ ప్రమాదం తప్పింది. కాని తాకిడికి పెద్దటార్పెడో దాని చట్రంమీదనుండి అదరి, డెక్‌నువిడిచి, సిబ్బంది నివ సించే గదులఅంతస్థుకువెళ్ళి సరిగ్గా డ్రెవిచ్ పడుకొనివున్న గది మీద పడింది.

డ్రెవిచ్ అదరిపడి లేచేసరికి ఉధృతంగా ఊగిపోతున్న బోటు అతన్ని బోర్లగిలాపడేట్టు విసిరికొట్టింది. ముక్కువంగి పోయి చెంపకీ నేలకీ మధ్యపడి చితికిపోయింది. ముందుపళ్ళు రెండు విరిగిపోయాయి. అతడులేచి పైకి ఎగ్రాకి సగంవెళ్ళే సరికి మళ్ళీ కిందపడిపోయాడు. ఈసారి అతని కుడిమోకాలు విరిగిపోయింది. నెత్తురుకారుతూ బాధతో గిలగిలతన్నుకొం టున్న డ్రెవిచ్‌కు ఒకమార్ఫైన్ (మత్తుకి) ఇంజక్షన్ ఇవ్వ బోయాడు కెనెడీ. కాని అతను వద్దన్నాడు. తరువాత కెనెడీ

ప్రమాదంలోవున్న బోటుకు పంపుఅందించి మరోఓడవచ్చి దీనిని ఆదుకొనేవరకూ పక్కనే తనబోటు ఉంచాడు.

రసెల్స్‌కు తిరిగివచ్చాక రేవులో జనం పి. టి. 109 డెక్ మీద పెద్దటార్పెడోపడి చితగ్గొట్టినభాగాన్ని సంభ్రమాశ్చర్యాలతో చూడడం గమనించాడు కెనెడీ. ఇంకా యుద్ధ యాత్రలుచెయ్యని ఓడలమీది నావికులంతా ఇదిచూసి 109 జపాన్ విమానాలతోను, డిస్ట్రాయర్ నౌకలతోను భీకరసంగ్రామంజరిగి, సాహసపరాక్రమాలుచూపి, విజయంసాధించి క్షతగాత్రమై తిరిగివచ్చిందని అనుకంటూవుంటారుఅన్న ఆలోచనకలిగి నవ్వుకున్నాడు.

డ్రెవిచ్ ని ఆస్పత్రిలో చేర్పించారు. ఆనాటికి అతనికి తెలియకపోయినా పి. టి. 109 కీ అతనికీ ఋణంతీరిపోయింది. కెనెడీదగ్గర దరిమిలాను పనిచేశాడుగాని అది మరోబోటు మీద, మరోతరహా పరిస్థితులలో!

తరువాత 109 కి మరోయిద్దరు కొత్తవాళ్ళనుపంపారు. ఇద్దరూ మోటార్ మెక్ లే! బోటులో మిగతాఅందరికన్న ఇద్దరూ వయసులో పెద్దవాళ్ళే!

విలియంజాన్‌స్టన్ వయసు 33. అప్పటికే అతను సౌత్ పసిఫిక్ లో చిరకాలంవుండి ప్రాణంవిసుగెత్తివున్నాడు కాబట్టి ఇంక వంతు ప్రకారం తనను దేశంపంపుతారన్న ఆశతో వున్నవాడికి పి. టి. 109 మీద డ్యూటీవేశారు. మళ్ళా ఇంకోదండయాత్రకి వెళ్ళడం అతనిలో ఏకోశానా ఉత్సాహం కలిగించలేదు. జాన్‌స్టన్ జన్మస్థలం స్కాట్‌లెండ్‌లోని

డంబర్‌స్టన్. అతనితండ్రి తాపీపని చేసేవాడు. జాన్‌స్టన్ రెండోయేట అతను అమెరికా తరలివచ్చి బాస్టన్‌దగ్గర డోర్ స్టెస్టరులో కాపురంపెట్టాడు. ఆ యాత్రతో సౌతాంప్టన్ నుండి వస్తూండగా 'టైటానిక్' నౌక తమకళ్ళఎదరే ఎలా ధ్వంసమై మునిగిపోయిందీ జాన్‌స్టన్‌తల్లి అతని చిన్నతనంలో వర్ణించి చెబుతూవుండేది. యుద్ధంరావడానికిముందు జాన్‌స్టన్ గల్ఫ్‌ఆయిల్‌కంపెనీలో టైలర్ నడిపేవాడు. అతను వర్కర్ల యూనియన్‌సభలో కూర్చునియుండగా పెరల్ హార్బరుమీద బాంబులుపడ్డాయన్నవార్త వచ్చింది. వెంటనే బజారుకెళ్ళి లోటున్నపళ్ళు కట్టించుకొని ఆవారమే నౌకా దళంలో చేరాడు.

పి. టి. 109 లో చేరిన రెండవఅతను పాట్రిక్ మెక్ మహన్. అతనికి 37 ఏళ్ళు. అందరికన్నా పెద్దవాడుకాబట్టి తండ్రిహోదాయిచ్చి 'పాప్', 'పప్పీ' (నాన్న) అంటూ అంతా పిలిచేవారు.

పి. టి. 109 కి అచిరకాలంలో వాటిల్లబోతున్న ఉపద్రవంలో బతికిబయటపడినవారిలో అందరికన్నా ఎక్కువ బాధలుపడినవాడు, ఎంతబాధవున్నా ఒక 'ఆఁ,వూఁ' అనకుండా దిగమింగి నిలబడగలిగినవాడు—మొండిఘటం 'పప్పీ' మెక్‌మహన్ ఒక్కడే. మెక్‌మహన్ రైతుబిడ్డ. ఇల్లినాయిస్ లోని వయానెట్ అతని జన్మస్థలం. రైతుకుటుంబంలో పుట్టినా అతనికి చిన్నప్పటినుంచీ ఇంజన్‌లంటే వ్యామోహం. 20 ఏళ్ళువచ్చాక దక్షిణకాలిఫోర్నియాలోని బురదరోడ్లమీద కార్లపోటీలుచేసేవారిదగ్గర మెకానిక్‌గా పనిచేసేవాడు. పెరల్

హార్బర్ దాడినాటికి అతను డెట్రాయట్ స్ట్రీట్ రైల్వేకంపెనీలో మెకానిక్ గా పనిచేసేవాడు. అతని 'కొడుకు' (భార్య తొలివివాహంవల్ల పుట్టినవాడు) నౌకాదళం—సబ్మెరీనరుగా పని చేస్తున్నాడు. తనకన్న చిన్నివాడు—కొడుకు—ప్రాణాలకు తెగించి యుద్ధానికివెళ్ళగా తాను యింట్లోకూర్చోవడం అతనికి నచ్చలేదు. కళ్ళుబాగులేక నేత్రపరీక్షలో ఆటంకాలువచ్చినా ఎలాగో తంటాలుపడి నౌకాదళంలోచేరాడు. "యుద్ధంచెయ్యడమో, చంపడమో, చావడమో చేద్దామని చేరాను" అన్నాడు ఆనాటిసంగతులు చెబుతూ. ఆనాటికి అతను బల్లకట్టుపడవకన్న పెద్దబోటు ఎక్కి—ఎరగడు. ఈతరాదు. శాన్ డియాగో శిక్షణకేంద్రంలో అతన్ని తటాకంలో దూకమంటే దూకేశాడు. దూకి సరాసరి కిందికి వెళ్ళిపోయాడు. శిక్షకులు అతన్ని పైకితియ్యాల్సివచ్చింది. తరువాత మిసోరీయూనివర్శిటీలోని నేవీడీసెల్ స్కూలులో చేరాడు. కోర్సుపూర్తి అయ్యాక పి. టి. సర్వీసు కోరుకున్నాడు. ఎందుకూఅంటే "మెకానిక్ గా నేను నేర్చినవిద్య, పి. టి. లాటి చిన్నబోటు మీద పనికొస్తుం"దని అన్నాడు.

డెప్త్ చార్జి టార్పెడోపడి డెక్ విరిగినందువల్ల కొన్నాళ్లు మళ్ళా వర్క్ షాపులోవుంచి 109 కి మరమ్మతులు చేశారు. అది పూర్తిఅయిన కొద్దిరోజులతరువాత మోటారుటార్పెడోల అగ్రశ్రేణిరంగానికి వెళ్ళవలసివచ్చింది. జులై మధ్యలో కెనెడీకి ఉత్తర్వువచ్చింది. ఆ స్థావరం, సాలమన్ దీవులలో అన్నిటికన్న పెద్దదైన రెండోవాదగ్గర వుంది. పసిఫిక్ ప్రాం

తంలో జరుగుతున్న సంగ్రామానికి అదే మధ్యగావున్న కేంద్రం.

రసెల్ నుండి రెండో వాకు దూసుకుపోతున్న పి. టి. 109 ను చూసి "వెళ్ళు, వెళ్ళు ! చిట్టిపడవా! వెళ్ళు, వెళ్ళు!" అంటూ దారేపోయే డెస్ట్రాయర్ కన్నుగిలిపింది.

# 5

రెండోవా హార్బర్ నిశ్చలతటాకంలాఉండే నీలజలధి. సుమారుగా ఒకమైలు పొడుగు, రెండుమైళ్ళు వెడల్పు వుంటుంది రెండోవా ద్వీపం. దాని ఉత్తరపుకొసన వరుసగా హారంలా అమరిన చిన్నచిన్న ద్వీపాలుకలిసి ఈ హార్బరును ఏర్పరచాయి. దక్షిణాన చిక్కటి అడవులున్న పర్వతశ్రేణి దీనికి రక్షణ. వాయువ్యాన రాతిగుట్టలగోడ, దాని కావల సాలమన్ సముద్రం. తూర్పున, ఈశాన్యాన పేరుకి ద్వీపాలనతగ్గ చిన్నచిన్న భూమండలాలు వరుసకట్టి వున్నాయి. గుండ్రంగా చదరంగా చిక్కటి పచ్చటి అడవులతోనిండిన ఆ దీవులమధ్య ఎగరడానికి పైకితన్నుకొస్తూన్న రాకెట్లలా కొబ్బరిచెట్లు కనిపిస్తుంటాయి. ఈ దీవులకావల బ్లాంచిఛానల్ ప్రవహిస్తూంది. సాలమన్ దీవులకు చుట్టుపక్కల ప్రాంతానికంతా జలదారులలో ఇదే ముఖ్యమైన మార్గం. ఈ కాలువ కావలే న్యూజార్జియా వుంది. జపాన్ అధీనంలోవున్న ముండా విమానాశ్రయం ఎలాగైనా కైవసంచేసుకోవాలన్న పట్టుదలలో అమెరికన్ సైనిక నావిక దళాలు అక్కడ భీకరంగా పోరాటం సాగిస్తున్నాయి. రెండోవా రేవుకు ముండావిమానాశ్రయం ఐదున్నరమైళ్ళదూరాన వుంది.

నౌకాదళంవచ్చి శిబిరాలువేసి యుద్ధానికి స్థావరాలు కర్మాగారాలు నెలకొల్పేవరకు ఇది వృట్టి నిర్జనారణ్యం. నైఋతిదిశన-రెండోవా భూఖండంమీదనే నౌకాదళం ప్రధానస్థావరం నిర్మించుకుంది. దానికి ఎదురుకొసన-ముండా స్థావరంవైపుగా లంబరీ దీవిమీద పి. టి. స్థావరం నెలకొల్పారు. లంబరీ చాలా చిన్నదీవి. అంతాకలిసి ఐదువందల గజాల నిడివి. మూత్రపిండం ఆకారంలోవుంది. ఈ దీవినిండా తాటితోపులు ఏవుగా దట్టంగా పెరిగాయి. దీనిపక్కగా ఒక సన్నటి కాలువ. అవతలివేపున బావ్రాదీవి వుంది. పి. టి. ల ప్రధానస్థావరానికి ఉపకేంద్రంగా దీనిని వుపయోగిస్తూ వుంటారు. లుంబారీ తూర్పుఅగ్రాన సన్నటి యిసుకబీచి మలుపుతిరిగి వస్తుంది. అక్కడ పసుపుపచ్చని పూలుపూసే వారూవృక్షం పక్కన ఓడలమీద సరుకుదింపడానికి ఒకజెట్టీ నిర్మించారు. అక్కడ నీటిలోంచి కనబడేంత స్ఫుటంగా ఈ క్రిందిబోర్డు వుంది.

## టాడ్ సిటీ

## TODD CITY

నూనెడబ్బాల మూతలు ఎనిమిదింటికి తెల్లనిరంగువేసి వాటిమీద నల్లటిఅక్షరాలు వ్రాసి ఆ బిళ్ళలకు తాడుపోసి మాలకట్టి, రెండుతాడిచెట్ల మధ్యగా వేలాడగట్టారు. రెండోవాలో ప్రాణాలుకోల్పోయిన మొట్టమొదటి పి. టి. నావికుడు ఇ. టాడ్, జూనియర్ పేరిట స్మారకచిహ్నంగా దీని

కీ పేరు పెట్టారు. టాడ్ కమాండర్ కెల్లీ అధీనంలోని 9 వ స్క్వాడ్రన్‌లో ఉండేవాడు.

ఈ స్థావరంలో పనిచేసే నావికులకు లుంబేరీ దీవిని టాడ్ సిటీ అంటేనే బాగా తెలుస్తుంది.

బీచికి కొంచెందూరంగా నాపాపొదలూ, రాక్రోసో బెలామా ద్రాక్షతీగలు దట్టంగా వున్నాయి. వాటి వెనుకగా అవి మాటుచేసుకొని కొంతస్థలం శుభ్రపరచారు. నాలుగు తాడిచెట్లు నాలుగుమూలలా ఉండేట్టు ఒక చదరం బాగుచేసి అక్కడ యుద్ధనిర్వాహక ప్రధానకార్యాలయం ఏర్పరచారు. నూడనెబ్బాలలో ఇసుకపోసి వాటిలో పునాదియేర్పరచారు. చుట్టూరా ఇసుకబస్తాలతో గోడలునిలిపి పైన పిరమిడ్ ఆకారంలో డేరా బిగించారు. ఈ ఆఫీసులోపల బల్లలు, కుర్చీలు, టైప్‌రైటర్లూ, మ్యాపులు, సైనికదళానికిచెందిన ఫీల్డ్ టెలిఫోన్ (యుద్ధరంగంనుండి మాట్లాడేది), రేడియో, కోడింగ్ (సాంకేతిక వార్తాప్రసార) యంత్రాలు అన్నీ అమర్చారు. దగ్గరలోనే క్షతగాత్రులకై ఒకడేరా, భోజనాదికాలకొకడేరా వేశారు. ఈ మెస్సులో సైనికదళంతాలూకు సి. కె. రేషన్‌పదార్థాలుతప్ప మరేమీవుండేవి కావు.

రెండోవా కొండలమీద సెలయేటినీరు తెచ్చి అందులో క్లోరిన్‌కలిపి శుద్ధిచేసి దానిని లిస్టర్‌బాగ్‌లలో పదిలపరచేవారు. త్రాగేనీటివనరు అదే! పోతే, ఈ స్థావరంలో ఎప్పుడూవుండి పనిచేసేసిబ్బంది మోటార్‌మాన్‌లు,టార్పెడోమెన్, వడ్రంగులు, కమ్మరులు, రేడియో టెక్నీషియన్లు వగైరా

అందరికీ ద్వీపంఅంతా పేలునుబట్టి చెల్లాచెదురుగా డేరాలు వేశారు. డేరాలదగ్గరే ఇసుకలో సైనికులు దాగి నిలిచి కాల్పులు జరపడానికి ఫాక్స్‌హోల్స్ (సన్నటిగోతులు) తవ్వి వుంచారు. మరతుపాకుల స్టాండ్‌లుకూడా గోతులలో ఏర్పరచారు. ఇసుకనేలకాబట్టి లోపల కొబ్బరిచిప్పలు, తాటిమట్టలువేసి గోడలు కట్టుదిట్టంచేసేవారు.

ద్వీపంఅంతా క్రిమికీటకాలతో కిటకిటలాడేది. మాంగ్రోచ్ చెట్ల (తూర్పు పశ్చిమఇండీస్‌లో ఒకజాతి) నిండా చిన్నచిన్న నల్లబల్లులు మిలమిలలాడుతూ జరజర తిరిగేవి. కోస్తాఅంతాఉన్న పగడపురాతిపిచ్చుల్లో నేలపీతలు (ఎండ్రకాయలు) టకటకలాడుతూ తిరుతూవుండేవి. పోతే అక్కడా యిక్కడా అనిలేకుండా అంతటా నల్లటియీగలు మనిషికి పిచ్చెక్కించేలా ఝుమ్మని రొదపెడుతూ విహరిస్తూ వుండేవి.

రస్సెల్‌నుండి హుటాహుటిన సుదీర్ఘప్రయాణంచేసిన పి. టి. 109 రెండోవా హార్బర్ చేరేసరికి మిట్టమధ్యాహ్నం అయింది. కెనెడీ తన కంపాస్, చార్టులు చూసుకుని సరాసరి పి. టి. స్థావరం లుంబెరీ (టాడ్‌సిటీ) చేరి, కొత్తఅధికారి లూటినెంట్ కమాండర్ థామస్ జి. వార్‌ఫీల్డ్‌కు కనబడి తనరాకను తెలియజేశాడు. అంతక్రితంవరకు అక్కడవున్న కమాండర్ కెల్లీని, న్యూజార్జియాకు అవతలగావున్న రైస్ యాంకరేజ్ కేంద్రంలో పి. టి స్థావరం నెలకొల్పడానికి పంపించారు. ఇంచుమించు అదేసమయానికి అసలు టాస్క్‌ఫోర్స్ 31 ఆధిపత్యంకూడా చేతులుమారింది. అడ్మిరల్

టర్నర్ స్థానంలో అడ్మిరల్ థియొడోర్ ఎస్. విల్కిన్‌సన్ వచ్చాడు.

రెండోవాలో పి. టి. బోట్లు మొత్తం పదిహేను, ఇరవైవరకూ వుండేవి. వాటిని మూడేసి మూడేసిచొప్పున జట్లుకట్టి మూటినీ ఒక్కొక్క 'బోయ్' (నీటిపై తేలే ఇనప గోళాలు) లకు కట్టి లంగరు వేసేవారు. ఇలాటి బోయ్‌లు లుంబేరి చుట్టుపక్కల చెల్లాచెదురుగా చాలావుండేవి. వార్‌ఫీల్డ్ కెనెడీకి ఒకబోయ్‌ని కేటాయించాడు. తరువాత స్థావరంలోని మిగతా ఆఫీసర్లకు అతన్ని పరిచయంచేశాడు.

వార్‌ఫీల్డ్ చాలా నిక్కచ్చిగావుండే అధికారి. నెబ్రాస్కా యూనివర్శిటీలో ఫ్రెష్‌మన్ దశలో వుండగానే సెనెటర్ జార్జ్ నారిస్ అతనిని యునైటెడ్‌స్టేట్స్ నౌకాదళ అకాడమీలో చేర్పించాడు. ఉప్పునీరునేదాన్ని వార్‌ఫీల్డ్ కంటచూసింది తొలిసారిగా అక్కడ చేరుకునే. 1932 లో అక్కడ పట్టభద్రుడైనాక ఆయన యుద్ధనౌకలమీద పని చేశాడు. ఫిలిప్పీన్స్‌పై జపాన్ దండెత్తినప్పుడు డిసెంబరు 7న ఆయన మనిలాలోనే వున్నాడు. "మార్షల్ జోఫర్" నౌక అపుడే ఆరేవుకు వచ్చింది. దీనిని వార్‌ఫీల్డ్‌కు వప్పగించి జపానీయులు దీనిమీదపడి ముంచేలోగా దీన్ని పదిలంగా ఆస్ట్రేలియా చేర్చవలసిందని ఉత్తర్వులు చేశారు. ఆ ఓడనిండా బహుభాషల జాతుల జనం సిబ్బందిగా పనిచేస్తున్నారు. ఒక వంక వారిలో ఎవరూ ఏఅఘాయిత్యమూ చెయ్యకుండా, కొట్టుకోకుండా కనిపెడుతూ, మరోవంక సముద్రంలో శత్రు

వులువుంచే మైన్‌ఫీల్డును తప్పించుకుంటూ నౌకను నడిపాడు. ఒకసారి కనుచూపుమేరలో జపాన్ యుద్ధనౌకలు కనబడగానే అవి చుట్టుముట్టి నౌకను వశపరచుకొనే ప్రమాదం వుందని తోచి దాన్ని ముంచివేయడానికికూడా సన్నద్ధుడయ్యాడు. మొత్తంమీద ఏఅవాంతరాలూ లేకుండానే సురక్షితంగా నౌకను డార్విన్ చేర్చగలిగాడాయన. తరువాత అక్కడినించి 'మార్షల్‌జోఫర్'ను శాన్‌ఫ్రాన్‌సిస్కోకు తీసుకువెళ్ళాడు. అక్కడ అది 'రోషాంబో' గా మార్చబడింది. ఆయనకూడా మెల్విల్ వెళ్ళి అక్కడ పి. టి. ఆఫీసరుగా మారిపోయాడు.

హెడ్‌క్వార్టర్సు అధికారులలో ఆయన కెనెడీకి పరిచయంచేసిన ముఖ్యులు–స్థావరం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ లూ. ఆర్థర్ హెచ్. బ్రెండ్‌సన్ (ఓకలెండ్)' కమ్యూనికేషన్సు ఆఫీసర్ (వార్తాప్రసారాలు, రవాణా) లూ. జేమ్సు ఎల్. వుడ్స (హాట్సన్). కొంతసేపు అంతా పి. టి. బోటు కెప్టెన్‌ల సమస్యలగురించి, ఈ దీవులలో వారు నిర్వహించే కార్యాల గురించి మాట్లాడుకొన్నారు. తరువాత కెనెడీ తనబోటును తీసుకువెళ్ళి 'ఒక బోయ్' కి తగిల్చి లంగరువేశాడు. కాని అతనికి ఎక్కువకాలం విశ్రాంతి లభించలేదు.

రస్సెల్సునుండి పదిగంటలసేపు ప్రయాణంచేసివచ్చినా ఆ రాత్రే కెనెడీబోటుకు గస్తీడ్యూటీ వేశారు. ఆనాటినుండి ఆగష్టునెలంతా జరుగనున్న సంఘటనలతో–వారి జీవనస్మరణాలమార్గాలు 50 మైళ్ళ లోపువున్న సముద్రప్రాంతంలో గజిబిజిగా సాగాయి. కథంతా పగడపుగుట్టలు, ద్వీపాలు, ఉప్పునీరు అనే మూడుశీర్షాల త్రిభుజంలోనే యిమిడిపోయింది.

నిజానికి మరోరకం పరిస్థితులలో చూచి ఆనందించడమే కథా వస్తువయితే ఈ ద్వీపాలు, ఈ సముద్రజలం, ఈ పగడపు గుట్టలు, ప్రకృతి రాబర్ట్ లూయి స్టీవెన్‌సన్ చెప్పిన కవితకు అందమైన రూపానువాదం అనిపించేవే.

"బిల్లోస్ అండ్ బ్రీజ్
మౌంటెన్స్ అండ్ సీస్
ఐలెండ్స్ ఆఫ్ రెయిన్ ఎండ్ సన్..."

ఈ త్రిభుజం రెండోవా రేవుదగ్గర ఆరంభమై సముద్రం మీదుగా పడమట వెల్లాలా వెల్లా దీవికి పోతుంది. అక్కడనుండి రేఖ తూర్పుకుతిరిగి వెల్లా సింధుశాఖమీదుగా కోలంబంగారాదీవికి పోతుంది. ఇది ఒకప్పుడు బ్రహ్మాండమైన అగ్నిపర్వతం. ఇప్పు డది ఆరిపోయింది. అరణ్యపర్వతంగా నిలిచి వుంది. అక్కడ దక్షిణానికి తిరిగి న్యూజార్జియా దక్షిణాగ్రంమీదుగా రెండోవా చేరుతుంది. అక్షరాలా ఈ త్రిభుజంలోపలగావున్న ప్రాంతాలు గిజోద్వీపం దానిఉపగ్రహ ద్వీపాలు వున్నాయి. గిజోకి కోలంబంగారానికి నడుమగా బ్లాకెట్ జలసంధి వుంది. దీని సముద్రంలోకిచేర్చే ఫెర్గ్యుసన్ పాసేజ్ వుంది.

ఇంచుమించుగా ఈ త్రిభుజ ప్రాంతంలోనే జపానీయుల అధీనంలోవున్న ప్రాంతాలు రెండున్నాయి. అక్కడనుండి సాగించే పోరాటంవల్ల ఈ ప్రాంతంలో అమెరికన్ దళాలస్వేచ్ఛకు కొంతభంగం కలుగుతోంది. ఒకటి-ముండా విమానాశ్రయం. ఇది తమచేతిలోకి రాకముందు జపాన్

ఇక్కడ ఒక్కొక్క అడుగు వదులుకు వెనక్కుతగ్గవలసి వచ్చేది. రెండోవా స్థావరం ముండాకి ఉత్తరంగా కులాసింధు శాఖకు అవతల కోలంబంగారా ద్వీపి తూర్పుకోస్తాన వుంది. దీనిపేరు విల్లాప్లాంటేషన్. ఇక్కడ జపానుకు ఒక విమానాశ్రయం, విమానస్థావరంకూడా వున్నాయి. వాళ్ళకు పశ్చిమ సాలమన్ ప్రాంతంలో కాలూనేచోటు కావాలీఅంటే ఈ విలా స్థావరం ఉంచుకొనితీరాలి. అది నిలుపుకుందికి వాళ్ళు శాయశక్తులా అవస్థపడుతున్నారు.

రాబోల్ లోని వాళ్ళ ప్రధానస్థావరం చాలాపెద్దది. అక్కడినుంచే సైన్యాన్ని, యుద్ధ సామగ్రినీ రాత్రివేళకల్లా బయలుదేరదీసి న్యూజార్జియాసౌండ్ కాలువద్వారా పంపేవారు. దీనికి గాడల్ కెనాల్ పోరాటంనుంచీ అమెరికన్ సైనికులు నావికులు, దానికి 'స్లిట్' (కన్నం) అని పేరుపెట్టారు. విలాస్థావరానికివెళ్ళే ఓడలు ఈ కన్నంగుండావచ్చి దక్షిణానికితిరిగి వెల్లాసింధుశాఖలో ప్రవేశించి బ్లాకెట్ స్ట్రెయిట్ ద్వారా అడంగుచేరుకుంటాయి. ఈ మార్గంలో రవాణాకు మోటారుఅమర్చిన పెద్దపెద్ద బార్జెస్ (పడవలు) వాడేవారు. కాని తరచుగా ఎక్కువ మందీమార్బలం పంపాలన్న ఉద్దేశంలో జాపనీయులు 'ఎక్స్ప్రెస్' నడిపేవారు. అంటే డెస్ట్రాయర్ నౌకలను చాలాతీసుకొచ్చి సరుకెత్తి బారుకట్టి పంపేవారు. ముండాస్థావరానికి సరఫరాలు ఈ మార్గంలో ఈవిధంగానే జరుగుతూవస్తున్నాయి. అందువల్ల రెండోవా రేవులోని పి. టి. బోటులకు ముఖ్యమైనపని బ్లాకెట్ స్ట్రెయిట్ లోని ఈ 'రాత్రించరు' లను అడ్డుకొట్టి విలాస్థావరానికి ఒక్కమనిషి

గాని, ఒక్కరొక్కటైముక్కగాని చేరకుండా చేసి అక్కడ స్థావరాన్ని మూడ్చిపారవెయ్యడమే !

రెండోవాలో బయలుదేరిన పి. టి. లు సాలమన్ సముద్రందాటి బ్లాకెట్ కాలువలో ప్రవేశించేవి. దీనికి రెండు మార్గాలున్నాయి. ఒకటి–గిజోదివికీ న్యూజార్జియా పడమట వున్న వానావానాదీవికి మధ్యగాపోయే ఫెర్గ్యూసన్ పాసేజ్. మరొకటి–ఇంతకన్న మారమైనదారి. అది గిజోదీవికీ వెల్లా లావెల్లాకూ మధ్యగాపోయే గిజోకాలువ.

డ్యూటీకివెళ్ళిన తొలిరాత్రి కెనెడీకి అక్కడిదీవులు, జలదారులు యేవీ గుర్తు తెలియలేదు. మ్యాపుమీద డిగ్రీలు, కోణాలప్రకారం ఇది ఫలానాఅంటే ఔనుకాబోలనుకున్నాడు. ఆ పూటంతా అతను డివిజన్ నాయకుడిని అతిశ్రద్ధగా అనుసరిస్తూ ఆప్రాంతపు భౌగోళికరూపం ఆకళింపుచేసుకుందికి నావికులంతా పరాకులేకుండా అతిచురుగ్గావున్నారు. బెరుకు బెరుగ్గాకూడా వున్నారు. రాత్రిపూట మసగ్గా నీడల్లాకనబడే చిన్నచిన్న దీవులలోకొన్ని జపానువాళ్ళ అధీనంలో వున్నాయని ఆ చీకట్లలో వాళ్ళు తుపాకులు ఫిరంగులు పెట్టుకొని వెయ్యికళ్ళతో కనిపెట్టిచూస్తూ వుంటారని వారికి తెలుసు. కాకపోతే ఏదీవిలో శత్రువున్నదీ ఇంకా ఖచ్చితంగా తెలియదు. ద్వీపాలపేర్లుకూడా కొన్ని భయంకరంగావున్నాయి. ముఖ్యంగా 'గిజో' అంటే స్థానికభాషలో 'ప్లేగు'అని అర్థంట! రాత్రి గస్తీవెళ్తూవుంటే ఒక్కొక్కమలుపులో అందరికీ గుండెలు దడదడలాడేవి. ఒకొక్కదీవి కరడుగట్టిన చీకటి ముద్దలా కనబడగానే గుండె ఝల్లుమనేది.

తొలిసారిగా 'శత్రు-సముద్రం' లో ప్రవేశించి తిరుగుతున్న ఆ బృందానికి అంతవరకూ ఆటవిడాయంగా చేస్తూవచ్చిన వన్నీ ఇప్పుడు ప్రమాదభరితాలుగా కనబడసాగాయి. టులగీ, రసెల్ దీవులలో ఉన్నప్పుడు విహారాలలో, గస్తీలలో వంకర టింకరగా బోటును నడపడం సర్దాగావుండేది. కాని ఇప్పుడు అక్కడ మార్గదర్శిని అనుసరించి బోటును కెనెడీ వంకర టింకరగా తిప్పుతూనడిపితే ఇంజన్‌లు వేడెక్కి-పోయి చెడతాయని పాప్ మెక్‌మన్ కంగారుపడేవాడు.

అర్ధరాత్రివేళ ముందు దారిచూపుతూ నడుస్తున్న బోటు హఠాత్తుగా దూరతీరాన చీకటిలో ఒకనల్లటి ఆకారాన్నిచూసి మెషిన్‌గన్‌కాల్పులు ఆరంభించింది. వెంటనే 109 సహా మిగతాబోటులన్నీ ఆ కాల్పులుసాగిన దిక్కుకు గట్టిగాఅగ్నివర్షం కురిపించేశాయి. కొన్నిగుళ్ళు ఆ నల్లటి ముద్దలో గుచ్చుకు పూసుకుపోయినట్టే కనిపించాయిగాని ఎన్నిగుళ్ళువెళ్ళినా అటునుంచి చలనంఏమీ కనబడలేదు. ఎదురుకాల్పులు రాలేదు. ఆకారం-నిజంగా అలాటిదంటూ అక్కడోటుంటే అమాంతం మాయమైపోయినట్టయింది.

తెల్లవారి చుక్కలు తెల్లబోయేవేళకు బోట్లు నిద్ర ముఖంతో తిరుగుముఖంపట్టాయి.

"బాగానే వుంది" అన్నాడు మెక్‌మహన్.

కాని బాగాలేదన్న భావం కొద్దిరోజులలోనే కలిగించింది రెండోవా. ఇక్కడికీ, టులగీ రస్సెల్‌లలో జీవితానికీ అసలు సంబంధంలేదు. అక్కడ చాలకాలంపాటు యుద్ధం

కేవలం వార్తలలో ఉత్తర్వుల సందడిలో కనబడింది. వచ్చి నప్పటిమాట—అనిపించేది. ఇక్కడ—అలాకాదు. ఆ భావం, యుద్ధప్రభావం, వాతావరణం అంతటా దట్టంగా అలము కుంది. ఒకరకం ఆందోళన, భయం ఎక్కడపడితే అక్కడ తాస్తకదిపితే చెలరేగేలాగా వున్నాయి. సముద్రగర్భంలో కనబడని జలవాహినిలా యీభయం లోలోపలఉంటూ బయటివాతావరణాన్ని సంచలితంచేసివేయసాగింది. నావికు లంతా ఒకరకంగా బిగించుకుపోయారు. ఉద్రిక్తులై ముట్టు కుంటే పేలిపోయేలావున్నారు. అనునిత్యం మృతగాత్రుల క్షత గాత్రుల గురించినవార్తలు, కబుర్లు వింటూవుంటే లోలోపల అశాంతిచెలరేగింది.ఎవరిమటుకువారు మనంగాయపడతామా, చచ్చిపోతామా అని ఊహాగానాలు చేశారు. శత్రువు విరు చుకుపడితే, బోటుమునిగిపోతుంటే, వాళ్ళు మనని బందీలుగా పట్టుకోబోతుంటే మనం ఏం చేస్తాం ? ఏం చేయాలి ?—అన్న విషయాలు ఆలోచించుకుంటూ వుండేవారు. పోగాపోగా ఇళ్ళ దగ్గర ఇన్నాళ్లుసాగించిన పాతజీవితంమీదకు మనసుపోయింది. వెళ్ళిపోవాలన్న కోరిక బలవత్తరం కాసాగింది. ఆ జీవితా లలో అనుభవించి విసుగెత్తి ద్వేషించిన చెడ్డహంశాలు మరు గునపడిపోయి వాటిలోవుండే సుఖాలూ, ఆనందం, శాంతి మరింత అందంగా కనబడసాగాయి. మళ్ళీ ఆ జీవితంలభించే అవకాశం అదృష్టం ఏనాటకి పడతాయో, అదృష్టంవుండి తిరిగి ఇళ్ళుచేరగలిగినా ఆ వాతావరణంజీవితం అలాగే వుంటాయో ఉండవో అని వితర్కించుకోసాగారు:

ఏది విన్నా ఏది కన్నా అంతా యుద్ధసంబంధమైనదే! బోటుమీదించి ఆకాశంలోకి చూస్తే దూరంగా ముండా విమానాశ్రయంమీద బాంబులువేస్తున్న అమెరికన్ విమానాలు కనిపించేవి. ఒకొక్కసారి భారీఎత్తున దాడీజరిగినపుడు విమానాలు చాలాయెత్తునుండి బాంబులవర్షం కురిపిస్తూవుంటే అవన్నీ నలకలలా కనబడేవి. పొగగొట్టం ఏదోకనబడగానల్లటి మసిరాలుతూందేమో అనిపించేటంత దట్టంగాపడేవి బాంబులు.

ఆర్లీ ఎ. బర్ (31 నాట్‌లు) అధిపత్యాన డెస్ట్రాయర్ నౌకలు బ్లాంచ్‌ఛానెల్‌లో బయలుదేరి న్యూజార్జియా కోస్తామీదవుండే జాపనీస్ ఫిరంగిదళాలను పేల్చిపారేస్తూవుంటే, ఆ కాల్పుల వెలుగులన్నీ పి. టి. నావికుల కళ్ళల్లో మెరిసేవి. ఆ ధ్వనులు వీరిగుండెల్లో ప్రతిధ్వనించేవి. పోతే అమెరికన్ స్థావరంలోని 155 మిల్లిమీటర్ ఫిరంగులు ముండావిమానాశ్రయంవేపు లాంగ్‌రేంజ్ (దూరానికి గురిచూచికొట్టే ఏర్పాటు) కాల్పులు రాత్రింబవళ్ళు అనకుండా నిరంతరంగా సాగిస్తూనేవుండేవి. బోటులోవున్న పి. టి. నావికులకు తమపైనుండి ఝుంయ్‌మని దూసుకుపోతున్న గుళ్ళ బారుచేసేధ్వనులు వినిపిస్తూనే వుండేవి.

పోరాటం పతాకస్థాయిచేరేవరకు జపానీయుల భయం కూడా ఆ స్థాయికే చేరుకుంది. బ్లాకెట్‌స్ట్రెయిట్‌ద్వారా మందీమార్బలాలను అక్కడికి చేరవెయ్యడానికి నానావిధాలా తాపత్రయపడసాగారు.

అప్పట్లో సాలమన్ సముద్రంలో అమెరికాకు చాలి నన్ని ఓడలులేవు. డెస్ట్రాయర్ కూడా తక్కువే! అందువల్ల ఈ సన్నటి జలమార్గాలలో శత్రునౌకలను అటకాయించి కాల్పులుజరపడానికి పి. టి. బోటులమీదనే ఎక్కువగా ఆధారపడేవారు.

గాడల్ కెనాల్‌లోని టి. ఎఫ్. 31 కమాండర్ ప్రతి రోజూ మధ్యాహ్నంవేళ వార్ ఫీల్డ్‌కు రేడియోద్వారా ఆర్డర్సు పంపేవాడు–గిజో, కోలంబంగారా, వెల్లాలా వెల్లాలకు గస్తీ దళాలు పంపవలసిందని. సాయంత్రం నాలుగుగంటలకు వార్ ఫీల్డ్ పి. టి. స్కిప్పర్లందరికీ కబురంపేవాడు-లుంబేరీ చేరు కోనివాళ్ళకోసం ఎల్. సి. వి. పి. బోటుపంపి రప్పించేవాడు. కేంద్రకార్యాలయంలో సమావేశపరచి గతరాత్రి గస్తీల గురించి సంగ్రహంగా చెప్పించుకొనేవాడు. తిరిగి ఈరాత్రి ఎవరెక్కడ డ్యూటీచెయ్యాలో పురమాయించేవాడు. ఈ లెక్కని పి. టి. లకి పని ఎక్కువగా వుంటుందని, తనబోటు ఇక ప్రతిరాత్రీ విరామంలేకుండా గస్తీకివెళ్ళాల్సివస్తుందని కెనడీ గ్రహించుకున్నాడు.

విశ్రాంతిలేకుండా పనిచేయడం, ఆందోళన, వాతా వరణం, ఉద్రిక్తత అన్నిటివల్ల ఆఫీసర్లకీ, సిబ్బందికీకూడా ఆరోగ్యం కొంతసన్నగిలసాగింది. అయినా తొలిరోజులలో పి. టి. 109 యాత్రలు ఏ అనర్థాలూలేకుండా సాఫీగానే సాగాయి.

ఒకరాత్రి కెనడీ సముద్రంమీద తిరుగుతూవుండగా

రేడియోలో సందేశంవచ్చింది-వెల్లాలా వెల్లాకు ఉత్తరాన ఒక జపాన్ యుద్ధనౌకమీద అమెరికన్ బి-25 బాంబర్ విమానాలు దాడిచేస్తున్నాయి-అని. వెంటనే కెనెడీ బ్లాంకెట్ స్ట్రెయిట్‌ను చీల్చుకుంటూ అమితవేగంతో వెల్లాసింధుశాఖలోకి వెళ్ళాడు. దూరాన విమానాలనుండికురిసే బాంబుల వెలుగులు నీటిమట్టానికి దగ్గరగా జాజ్వల్యమానంగా వెలుగుతున్నాయి. ఆ దృశ్యంచూచిన హారిస్‌కు అమెరికాలో వాటర్‌ఫ్రంట్ (హార్బర్) ప్రాంతంలో దీపావళిలా వెలిగిపోయే వీధులు జ్ఞాపకంవచ్చాయి. అంతలో నిప్పులుచెరిగే స్థలం పి. టి. లకు అనువైనచోటు కాదు. దానికి తగినదల్లా చాటునవుండి హఠాత్తుగా ఎదరపడడం, కాల్పులుజరిపి తూనీగలా పారిపోవడం. అదీకాక ఈ పోరాటం యింకా చాలా దూరాన జరుగుతోంది. కెనెడీ తనహద్దుదాటి దూరంవెళ్తేగాని అక్కడికి చేరలేడు. చివరకి ఆ యుద్ధాన్ని విమానాలకే వదలివేసి తన నిర్ణీతస్థానానికి వెళ్ళిపోయాడు కెనెడీ.

మరోనాటి రాత్రి కెనెడీ వెల్లాసింధుశాఖలోకి X స్త్రీ వెళ్ళాడు. ఇంజన్లు మూడింటిలోనూ రెండింటిని ఆపించి ఒకదానిమీద తాపీగా తిరుగుతున్నాడు. X స్త్రీచేసేప్రాంతం చేరుకున్నాక పి. టి. లకిదే రివాజు. ఇంజన్‌లు శక్తివంతమైనవి కాబట్టి మూడుపనిచేస్తే శబ్దం చాలాఎక్కువగా ఉంటోంది. ఆపైన బోటువెనకకలగి చెదరే నీరు పైనవిమానంనుండి చూసే శత్రువులకువాసిదారిని రోడ్‌మాప్‌చూపినంతస్పష్టంగా చూపుతోంది. ఒకటేఇంజనుఅయితే కల్లోలం, చప్పుడుకూడా చాలాతక్కువస్థాయిలో వుంటాయి.

నాలుగోఝాము వేళకి బోటు స్థావరానికి చాలా దూరంలో వుంది. నావికులంతా చాలాచిరాగ్గా ఉన్నారు. ఇంజన్ శబ్దం ఎగ్జాస్ట్ రొదమించి మరేమీ వినబడటంలేదు. ఎటు చూసినా చిక్కటి చీకటితప్ప మరేమీ కనబడటంలేదు. హఠాత్తుగా ప్రపంచం అంతమయ్యే ప్రళయం నేడే అనిపించే టంతగా ఆకాశంలో ఉజ్వలమైన కాంతిపుంజం భగ్గుమంది, సరిగ్గాబోటుకుపైగానే అది వెలిగి అలాకొద్ది క్షణాలు నిలిచింది. బోటు ఆమూలాగ్రాన్ని ఒక్కసారిగా వెలిగించి చూపింది. ఆఖరుకు ఆ కాంతిపుంజంకేసి తలెత్తి పైకిచూస్తున్న నావికుల ముఖాలలో ప్రతిరేఖనుకూడా ప్రస్ఫుటంగా చూపింది. భయంతో, సంభ్రమంతో అందరూ దాదాపు నిశ్చేష్టులై పోయారు. "ప్రళయం వచ్చింది. ఇక చనిపోతున్నాం" అనుకున్నారు కొందరు.

హారిస్ వెనుకవైపున 20 మిల్లిమీటర్ల టార్పెడోకు (విమానవిధ్వంసకం) పటకాతో బిగించుకొని గస్తీచేస్తున్నాడు. బెదురుగా కంగారుగా అటూఇటూ చూస్తున్నాయి అతనికళ్ళు. అతను నెత్తిన ఉక్కుటోపీ ధరించాడు. కాపోక్ లైఫ్‌జాకెట్ ధరించాడు. నౌకాగ్రాన కుడివైపుగా ఆకాశంలో అతనికి వెళ్ళిపోయిన విమానంతోక కనబడింది. వెంటనే తుపాకిని అటుతిప్పి గురిచూసి దానికి కొంచెం ఎదరికి కాల్చాడు. దెబ్బతగలలేదు. మళ్ళీ పేల్చాడు. గురితప్పింది. వదలకుండా వరసగా కాల్పులుసాగించాడు. అంతలో కెనెడీ గొంతెత్తి గావుకేకవేశాడు: "హారిస్! ఆపాపు" అంటూ. కెనెడీతోపాటు అతను ఒకపెనుసున వచ్చివాలాడు.

"ఆపెయ్, ఆపేయ్...! అది బ్లాక్ కాట్" అన్నాడు.

హారీ కాల్పులు ఆపేశాడు. బ్లాక్ కాట్ అనేది అమెరికన్ పి. బి. వై. కాటాలినా గస్తీవిమానాలకి ముద్దు పేరు. ఆ విమానంపైలట్ పైన గస్తీతిరుగుతూ యీబోటును చూసి స్పష్టంగా గుర్తుతెలుసుకొందికి ఈ వెలుగుబాంబు (కేవలం వెలుగుకోసం పేల్చేది) పడేశాడు. పి. టి. ఫలానా అని తెలియగానే ముందుకుపోయాడు. హారీ కాల్పులుఆరంభించగానే అతను రేడియోద్వారా బోటులో మెగ్వైర్‌కు తన గుర్తులుచెప్పడం, కెనెడీ అది తెలుసుకునివచ్చి హారీని సకాలంలోఆపడం జరిగింది.

పి. టి. బోటులకి ఈ విమానాలు ఎప్పుడూ ప్రాణాంతకాలే! సాధారణంగా చీకటిలో గస్తీతిరుగుతూవుండగా పైన విమానం వస్తూవుంటే (బోటు ఇంజన్‌ల రొదలో అసలు విమానంమోత వినబడడంఅంటూ వుంటే) అది శత్రువిమానమో కాదో ఎంతటి కెప్టెన్‌కీకూడా చెప్పడం కష్టం. అలాగే పైన పైలట్‌కుకూడా ఇదేసమస్య. అందువల్ల రెండోవాలో గస్తీతిరిగే పి. టి. లు ఎన్నోసార్లు అమెరికన్ విమానాలనుండి తీవ్రంగా దెబ్బతినడం, అమెరికన్‌విమానాలమీదనే కాల్పులు జరిపి తీవ్రనష్టం కలిగించడం జరుగుతూవచ్చింది.

జులై 20 రాత్రి తెల్లవారుతూవుండగా పి. టి. 164, 166, 168 అప్పుడే ఫెర్గ్యుసన్‌పాసేజ్‌దాటి బయటికివచ్చి రెండోవావైపు పోతున్నాయి. హఠాత్తుగా ఎక్కడనుంచో అమెరికన్‌ఆర్మీ బి-25 విమానాలు నాలుగువచ్చి వాటిమీద

విరుచుకుపడ్డాయి. అప్పటికి మూడుబోట్లలో ఒకటి ఒకపెద్ద దుంగకి ఢీకొట్టుకుని దెబ్బతిన్నందువల్ల మిగతరెండూ వేగం తగ్గించి దానికితోడుగా ఆగాయి. అందువల్ల అవి వేళనుమించి ఉండవని స్థావరంలో అధికారులు భావించే ప్రాంతంలో ఓగంటసేపు ఉండిపోయాయి. రాత్రిగస్తీతిరిగి హెండర్‌సన్ ఫీల్డుకు చేరుకుంటున్న బి-25 విమానాలకు ఆ సమయానికి ఆ ప్రాంతంలో అమెరికన్‌నౌకలు ఏవీవుండవని చెప్పారు. కాని దిగబడిఆగిన వీటినిచూసి వైమానికులు ఇవి శత్రునౌకలే అనుకున్నారు. కింద పి. టి. లు అసలు విమానాలగురించి పట్టించుకోనే లేదు. హఠాత్తుగా ముందు విమానం ఈ బోట్ల దగ్గరవరకూ సముద్రంలో దారిపోసినట్లు గుళ్ళవర్షం కురిపించడంతో అంతా కంగారుపడి సెమెఫోర్ (చేతులువూపిగాని, సిగ్నల్‌రెక్కలతోగాని సందేశంచెప్పడం) ద్వారా, రేడియో ద్వారా, వెరీపిస్టల్ (మమ్మల్ని కాపాడండి అన్నభావంతో కాల్చే ప్రత్యేకమైన పిస్టల్) ద్వారా సైగలుచేశారు. ఆర్తనాదాలు చేశారు. కాని ఆవిమానాలు ఉధృతంగా కాల్పులు జరపసాగాయి. 164, 166 బోట్లమీది నావికులు కెప్టెన్ ఉత్తర్వుకోసంకూడా చూడకుండా గత్యంతరంలేక ఎదురు కాల్పులు ఆరంభించారు. భూమ్యాకాశాలమధ్య చెలరేగిన ఆ అగ్నితోరణంతో పి. టి. 166 కు నిప్పంటుకుంది. నావికులు అప్పటికే తీవ్రంగా గాయపడినవారుసహా నీటిలోకిఉరికి ఈదుకుపోయారు. కొద్దిక్షణాలలో ఆ బోటు బ్రహ్మాండమైన శబ్దంతో పేలి బ్రద్దలై మునిగిపోయింది,

ఇటు. పి. టి. నుండి కాల్పులు జరుపుతున్నవారిలో ఒకనావికుడు ఒకవిమానానికి సరిగ్గా గుండెమీద గురిచూసి కొట్టాడు. దెబ్బతిన్న విమానం కట్టుతప్పి గిరిగిరాతిరుగుతూ పొగలుచిమ్మాయి. ఐదుమైళ్ళదూరంపోయి చివరికి సముద్రంలో కూలిపోయింది. ఇంతలో పి. టి. 168 కి కూడా నిప్పంటుకుందికాని నావికులు సకాలంలో మంటలుఆర్పివేశారు. వెంటనే లూ. మెకాలే ఎర్వర్డ్ (థర్డు) సారథ్యాన 168 కూలినవిమానంకోసం పరుగుతీసింది. ఆ విమానం సిబ్బందిమీద ఈ బోటుసిబ్బంది కోపంతో మండిపడుతూ దగ్గరకువెళ్ళారు. కాని అక్కడ వాళ్ళకి కనబడినదృశ్యం పరిస్థితిని మార్చివేసింది ఆ బాంబర్ పైలట్. మరి ఇద్దరు వైమానికులు అప్పటికే ప్రాణాలువిడిచారు. ముగ్గురు తీవ్రంగా గాయపడి వున్నారు. మొత్తం పదకొండుమంది నావికులూ, ముగ్గురు వైమానికులూ ఈ పొరపాటుయుద్ధంలో తీవ్రంగా గాయపడ్డారు. అందరూ మానంగాబరువెక్కినగుండెలతో రెండోవా చేరుకున్నారు.

ఇలాంటి సంఘటనలన్నీ వినివున్నమీదట కెనెడీ ఒకనాడు గిజోప్రాంతంలో తనబోటుకోసం అన్నట్టు పైనతిరుగుతున్న రెండు పిబివై విమానాలనుచూసి కొంచెం కలవరపడ్డాడు. కాక్‌పిట్‌లో ఎప్పుడూ తనకుడివైపునుండే రేడియో ఆఫీసర్ మెగ్వైర్‌నుచూసి 'ఏమిటి కథ అని పైవాళ్ళకనుక్కో' అన్నాడు కెనెడీ.

అంతలో కొంచెంపక్కగా ప్రేలుడు సంభవించింది.



"కాస్తుంటే ఆదెబ్బ మనకి తగిలేదని చెప్పు" అన్నాడు కెనెడీ.

పైకీ కిందికీ సందేశాలబాణాలు పరటాతిరిగాయి. అంతా గందరగోళంగా వున్నా యవి. చివరికి ఒక పైలట్ తనతోడి పైలట్‌తో గూడా కాల్పులుఆపమని చెప్పి వెళ్ళిపోతా నన్నాడు. ఇంతలో మాగ్వైర్‌కు ఒకవార్త అందింది_ఒక జాప నీస్ పాంటూన్ విమానం (నీటిమీద తేలుతూవుండేది) ఆ ప్రాంతంలో తిరుగుతోందని. ఈ జీరోవిమానాలంటే అన్ని టికన్న ఎక్కువ భయపడతారు పి. టి. నావికులు. ఈస్థితిలో ఎదర ఎక్కడేఅరిష్టం కాసుకునుందో తెలీకుండా పైన మిత్ర విమానాలతో సరాగాలాడడంఅనేది దుస్సహమైన విషయం.

"ఈసారి మనమీదుగావచ్చే విమానం ఏదైనాసరే కాల్చిపారేస్తామని చెప్పు" అన్నాడు కెనెడీ మాగ్వైర్‌తో.

కొద్దినిమిషాల తరువాత మాగ్వైర్ కేకవేశాడు: "దెబ్బకితగ్గి తప్పుకుపోయారు" అని. రాత్రుళ్ళు, పగళ్ళు కడ చినవాటికీ, నడుస్తున్నవాటికీ, రాబోయేవాటికి బొత్తిగా తేడా తెలీనంతగా మక్కికిమక్కిగా అన్నట్టు తయారయ్యాయి. రాత్రిగస్తీ, పగలు రెస్టు-రాత్రిగస్తీ, పగలు రెస్టు.

రాత్రికి రేవులోనే కట్టేసివుండే బోట్లమీద నావికులు విలాసంగా కూర్చుని రాత్రిడ్యూటీకివెళ్తున్నవాళ్ళనిచూసి-హేళనగా ఏదోఅనేవారు. హుషారుచెప్పేవారు. "వాళ్ళని చావచితగ్గొట్టెయ్" అనే వా డెవడో. అక్కడితో వెళ్తున్న

వాళ్ళకీ వీళ్ళకీ మధ్య తిట్లూ కొట్లూ చెలరేగేవి. చివరికి వెళ్లే వాళ్ళు, కూర్చున్న వాళ్ళని వెక్కిరించిపోయేవారు.

రాత్రిగస్తీకివెళ్ళే నావికులకు బోటు ఫెర్గ్యూసన్ పాసేజీ చేరగానే నరాలు బిగదీసుకుపోయేవి. ఉద్రిక్తత ఏర్పడేది. ఇది దాటితే ఇంక చీకటిలో శత్రువుమధ్య పడతామని తెలుసు. శత్రువులా తమచుట్టూరా వుంటారు. గిజో, వెల్లాలావెల్లా, కోలంబంగారా, న్యూజార్జియా అన్నీ వాళ్ళ ఆవాసాలే!

రాత్రిఅంతా డ్యూటీలేనప్పుడు కునుకుతియ్యడం లేదా బెదురుగా, భయంగా డెక్ మీద నిలబడి చుట్టూచూడడం, హఠాత్తుగా దూరాన టార్పెడోకాల్పుల వెలుగులూ, వెలుగు బాంబులలో భగ్గుమనే మేఘాలూ కనబడగానే లేదా బోటు కుడివేపునా, ఎడంవేపునా ఏదో నీడలాటి శాల్తీకదుల్తూందని తెలీగానే కంగారుపడడం, హెచ్చరికరాగానే అదరిపడి పరుగులు తీయడం...

పదిక్షణాలు ప్రళయం అనిపించేటంతకాంతి,పదిక్షణాలు ప్రాణంపోయిందనిపించేటంత ప్రమాదస్థితి, ఆందోళన, కాస్త విరామం, మళ్ళీ గంద్రగోళం, ఆ తరవాత కటికచీకటి, నిర్విరామంగా బోటుహోరు, అలసటచే కునుకుపాట్లు, అంతలో మళ్ళా అదరిపాటు—ఇలా సాగేవి రాత్రులు. అయితే కెనెడీ బోటుకు సంబంధించినంతవరకూ తాడోపేడో తేల్చే సంఘటన ఏదీ జరగలేదు.

మొత్తంమీద పి. టి. బోటు గస్తీఅనేది అనిశ్చితం, అస్పష్టంఅయిన ప్రచ్ఛన్నయుద్ధంకింద తేలింది. చీకటిసము

ద్రంలో చీకటిలాంటి దీవులలో సమరం జరపాలి. చీకటిని, ద్వీపాలనలుపును ఆసరాచేసికొని బార్జిలు ద్వీపాలపక్కగా జీమూతాల్లా నిశ్శబ్దంగా తిరుగాడుతూవుంటాయి. వాటిని గుర్తించి కాల్పులు ఆరంభిస్తే గబుక్కున ప్రక్కనే వున్న ఏకాల్వలోనో జారబడి తప్పుకుంటాయి. లేదా కోస్తామీది చెట్లనీడల్లో కలిసిపోతాయి. దూరంగా స్పష్టాస్పష్టంగా కదులాడే చీకటిముద్దల్లాతప్ప ఖచ్చితంగా ఇది బార్జి అని తెలిసేలా ఎన్నడూ కనబడవు. పి. టి. స్కిప్పర్‌కు ముందు ఒక నల్లటిశాల్తీ అనిపించినట్టు వుంటుంది. కళ్ళు చికిలించి మళ్ళీ జాగ్రత్తగాచూస్తే అసలు ఏమీ కనబడదు. చివరకు క్షణం క్రితం అక్కడ కనబడినరూపం తనభ్రమేనని సర్దుకొంటాడు కెప్టెన్. ఒక్కొక్కసారి నిజంగానే బార్జి పడవని కొడతాడు. ఒక్కొక్కసారి చీకటిలాంటి నీడమీద తనభ్రమమీద కాల్పులుజరుపుతాడు. ఎదరవున్నది ఫలానా ఔనాకాదా, అసలు వున్నదా లేదా అని తేలని యీ అనిశ్చితస్థితి నరాలను తెంచివేసేది. ఒకవేళ ఎన్నికొట్టినా దెబ్బ ఆ పడవకి తగిలినా ఆ తృప్తికూడ దక్కేది కాదు. అసలు తగిలిందోలేదో కూడా చాలాసార్లు తెలిసేదికాదు. ఇవన్నీకాక తుపాకీపేల్చాలా కూడదా అన్నమీమాంసలో హింసపెట్టేవిషయం మరొకటి వుంది. ఎదర కదలాడే ఆ నీడనిజంగానే ఒకశాల్తీ కావచ్చు. అయితే అది శత్రువులలేదా తమతోపాటు బయలుదేరిన మరో పి. టి. బోటా తెలియక దాన్ని కాల్చిపారేస్తే——?

మొత్తానికి ఎలాగో తెల్లవారి వావావానాద్రివిదగ్గర ఆకాశం తెల్లబారగానే అలసినబోటులన్నీ రేవుకు తరలేవి.

నావికులకు ప్రాణం స్థిమితపడేది. లుంబేరీ దాటిపోతూవుండగా బీచీలో జనం హర్షధ్వానాలు చేసేసరికి మళ్ళీ మనుష్యుల మధ్య పడ్డామని ప్రాణంలేచొచ్చి హుషారుపుంజుకొనేది. రేవుచేరాక పొద్దుపెరిగి, సంజవేపుతిరిగి దిగజారిపోతూవుంటే అంతక్రితంరోజుకీ, ఆ క్రితంరోజుకీ కార్బన్‌కాపీలు సాగేవి. రాత్రి నల్లటిముఖంలో తొంగిచూసేవేళకు ఆనాటి సూర్యోదయంతో మేలుకొన్న ఉత్సాహం, మనస్థిమితం సాయంత్రం సూర్యుడితోపాటే సముద్రంలోకి దిగజారి అస్తమించిపోయేది. నిన్నరాత్రిలాగే యివాళ నావికులంతా గంభీరులైపోయే వారు. ఉద్రిక్తత పెరిగేది. కొద్దిసేపటికే గుండె బరువెక్కేది. ఒళ్ళు అలసిపోయేది.

పి. టి. బోట్లమీద జీవితం నానాటికి దుర్భరంకాసాగింది. మలేరియారాకుండా వుండాలని 'అటాబ్రిన్' మాత్రలు మింగిమింగి అందరిదేహాలూ పచ్చబారిపోయాయి. జీర్ణశక్తిచెడి నీళ్ళవిరేచనాలు పట్టుకొని అందరికీసత్తువసన్నగిలిపోసాగింది. చల్లటిపానీయంఅనేది ఎక్కడా లేదు. మంచినీళ్ళుమరగకాచి అందులో క్లోరిన్‌పుష్కలంగా కలిపేవారు. ఆవాసనతో ఆనీరు తాగడం అసహ్యంగా వుండేది. కొందరికి రిస్టువాచీలు మణికట్టినుంచి మోచేతివరకు వదులై జారిపోతూవుంటే చేతులు చూసుకొని ఓహో చిక్కిపోతున్నాం అనుకున్నారు. ఆఫీసర్లు నావికులుకూడా అల్యూమినియంతట్టలలోనే భోజనం చేసేవారు. భోజనం నూటికి తొంభైసార్లు పందిమాంసమే! ఒకనాడు ఒకచోటికి ఆర్మీబేకరీనుంచి రొట్టెల రేషన్ అందిందని ఒకతను కెనెడీచెవిలో వూదాడు. వెంటనే కెనెడీ

ఒక చిన్న పడవ వేసుకు బయలు దేరేడు. "రొట్టె చేతు లతో" తిరిగి వచ్చాడు. రొట్టెకి మొహం వాచిపోయిన సిబ్బంది అంతా ఎన్నాళ్ళతర్వాతో రొట్టె చూసి, రుచి చూసి పొంగిపోయారు. పోయిన ప్రాణాలు లేచివచ్చాయి.

మిట్ట మధ్యాహ్నం అయ్యేసరికి సూర్యుడు చండ ప్రచండంగా నిప్పులు చెరిగిపోసేవాడు. రేవులో ఏ బోటుకీ నీడ లేదు. బోటులో నావికుల బసలన్నీ కుంపట్లలా ఉండేవి. ఊపిరితప్ప గాలి లేదు. ఒంటిమీద బట్ట నిలవడం దుర్భరంగా ఉండేది. ఒక్కొక్కటే తీసిపారేయడం మొదలుపెట్టారు. చివరికి భోజనాలగదికి ఒంటిమీద బట్టలేకుండా నగ్నంగా వచ్చి కూర్చొనేస్థితి వచ్చింది. కెనడీ వెంటనే చర్యతీసికొని ఇది ఆపాడు. కనీసం చిన్న లాగన్నా లేకుండా బయటకు రాకూడదని ఒక ఉత్తర్వు జారీచేశాడు. లోపల పడుకోటంకూడా దుస్సహంగా ఉండేది. గదులన్నీ కంపుకొట్టేవి. పరుపులమీద గలీబులు లేవు. ఎవరైనా ఒకపక్కమీద కొంచెంసేపు పడుకుంటే అది చెమటతో తడిసి ముద్దఅయిపోయేది. అక్కడ మగ్గిపోవడంకన్న ఎండ మండిపోతున్నా, డెక్ మీద చెక్కలనేల కాలిపోతున్నా ఆ యెండలో పడుకోవడమే హాయిగావుండేది. కెనడీ టార్పెడోట్యూబుప్రక్కనో, ఒక్కొక్కసారి "డే-రూమ్" వేసిన ప్లైవుడ్ పైకప్పుమీదనో పడుకొనేవాడు. కాని యింత ఎండలో పడుకొంటే కొంతసేపటికి కళ్ళుతిరిగి ప్రాణం కడంటి పోయేది. శరీరం అంతా అచేతనం అయిపోయేది. అయినా ఎవరూ ఎక్కువసేపు పడుకొందికి ఎలాగూ వీలుండేది కాదు. చెరిగే ఎండ.

మధ్యాహ్నం అయేసరికి మళ్ళీ రాత్రిగస్తీకి సన్నాహాలు చేసుకోవడం ఆరంభించాలి. తుపాకులు తుడుచుకోడం, మందుగుండుసామగ్రి తెచ్చి సిద్ధపర్చుకోవడం, రేడియో సరి చేసుకోవడం, ఇంజన్లన్నింటికీ నూనెవేసి ఆయత్తం చేసుకోవడం ఆరంభించేవారు. ఇంజన్ గదిలో పనిచేయడం అన్నిటి కన్నా దుర్భరమైన చిత్రహింస! అక్కడ ఎప్పుడూ 110 డిగ్రీల వేడికి తక్కువుండేది కాదు. మోటార్ మెకానిక్‌లు ఇరవైనాల్గుగంటలూ నిప్పుకణాల్లా వేడిగా వుండేవారు. వేడి మధ్యనే తిరిగేవారు. చెమటతో, గ్రీజ్‌తో ఒళ్ళంతా జిడ్డుగా బంకగా వుండేది.

తరచుగా మధ్యాహ్నం వేళ రెండోవా కొండలమీద నుండి కొండలంత వర్షమేఘాలు తరలివచ్చేవి. ఒక్కపెట్టున సంచలనం చెలరేగి ఉడికిపోతున్న ప్రకృతిని ప్రాణాలను చల్లబరచివెళ్ళేవి. అంతలో సూర్యుడు వచ్చేవాడు. బ్రహ్మాండమైన ఇంద్రధనస్సును ఎక్కుపెట్టేవాడు. ఒక్కోసారి అది రెండు ద్వీపాల మధ్య రంగుల వంతెనలా ఉండేది. అటూ ఇటూ లంగర్లేసినట్లు కనిపించేది. కాని బోటు వర్షపుచల్లదనాన్ని ఈ వేడిమిని కలుపుకొని లుంబేరిదీవిలో మాంగ్రోల్, నాపా అడవులలా సెగలుకక్కుతూ ఉడికించివేసేది.

బోటు మీాద తాపం భరించలేక అప్పుడప్పుడు నావికులు కొందరు 109 మీాదినుండి నీటిలో దూకేసేవారు. కాసేపు ఈతలు కొడుతూ తిరిగేవారు. అయితే డెక్ మీాద ఎవరో ఒకరు రైఫిల్ పట్టుకొని నిల్చునేవారు. ఎందుకంటే సాలమన్ సముద్రం షార్కుల పుట్టిల్లు. కిటకిటలాడుతూ

వుంటాయి. ఈతకి దిగినవారికి షార్కులమాట గుర్తుకు రాగానే సరదాకాస్తా ఎగిరిపోయేది.

సాయంకాలం అవుతూవుండగా ఒక విచిత్రమైన విరామం ఏర్పడేది. అయిపోవచ్చిన విశ్రాంతికి, పడబోతున్న శ్రమకూ, భయాలకు మధ్యస్థితి అది. ఎక్కడో ఎవరో గ్రామ ఫోను పెడతారు. కొందరు డెక్ మీాద కునుకుతీస్తారు. కొందరు ఉత్తరాలు రాసుకుంటారు. ముఖ్యంగా ఆ రాత్రి వారు తమబోటు గస్తీడ్యూటీకి వెళుతుందని తెలిసినా విధిగా వుత్తరాలు రాసేవారు.

సూర్యోదయం ముందు, రాత్రంతా గస్తీతిరిగే సిబ్బందికే ముందు V టపా అందుకునే అవకాశం ఎక్కువుండేది. మాావర్, 109 లోనికి దిగి వంట ఏర్పాట్లు ప్రారంభించేవాడు. ఆసమయానికే రాత్రికార్యక్రమం తాలూకు ఉత్తర్వులతో సహా కెనెడీ తిరిగి వచ్చేవాడు. 109 కి రాత్రి పనివున్నదని ఉత్తర్వు వస్తే సిబ్బందంతా గంభీరంగా పనులన్నీ తెముల్చుకొని ఆరింటి తరువాత బయలుదేరేందుకు సిద్ధంగా వుండేవారు.

ఆరోజు జూలై 19. సాయంత్రం అవుతోంది. కెప్టెను బోటుమీాది కొచ్చి, మళ్ళీ గిజో ప్రాంతాల గస్తీతిరిగేందుకు బ్లేకెట్ జలసంధిదాకా వెళ్ళాలని చెప్పాడు. కొద్ది గంటల్లో ఆచోటు చేరుకున్నారు. మామూలుగా చీకటిపడినా మేఘాలు మాత్రం కాంతి నింపుకుని నీటిని ఒరుసుకుని కనిపించాయి. పి. టి. 109 కి ఎడంవైపున కొద్ది దూరంలో మరోబోటు కూడా గస్తీవుంది. రెండూ గిజో, కోలంబంగారాల మధ్య

తారట్లాడటం ప్రారంభించాయి. గంటలు దొర్లిపోతున్నాయి. కానీ ఇంతకుముందు రాత్రులలాగే ఏమీ జరగలేదు.

కెనెడీ కాక్‌పిట్‌లో వీల్ దగ్గర నుంచున్నాడు. ఎప్పటిలాగే రేడియోమేన్ మేగ్వ్యార్ అతని కుడిపక్క నున్నాడు. ఫార్వర్డ్ గన్ టరెట్‌లో, హారిస్ మెషిన్ గన్‌ల మీద పిడికిలి బిగించి వున్నాడు. డెక్ మీద మాయెర్, క్వార్టర్ మాస్టర్ గదికి ఆనుకుని నుంచున్నాడు. గస్తీనుంచి విశ్రాంతి తీసుకుంటున్న జాన్సన్ ఇంజన్ గదికెళ్ళే నిచ్చెన వద్ద డెక్ మీద పడుకునివున్నాడు. కింద ఇంజన్ గదిలో మెక్‌మహాన్ డ్యూటీలో వున్నాడు. అతను పిలిస్తే వెళ్ళడానికి సిద్ధంగా డ్రాడీ, నిచ్చెనమీద వుండి సగం బైటకు కనిపిస్తూ నించుని వున్నాడు. పైన, ఎడంవైపు వెనకనున్న గన్ టరెట్‌లో నున్న కోవాల్‌తో డ్రాడీ మాట్లాడుతున్నాడు.

తలపైకెత్తి కోవాల్‌తో మాట్లాడుతూన్న డ్రాడీకి బోటు ఎడంవైపున నూరు అడుగులలోపు దూరంలో ఓవిమానం కనిపించింది. ఉదయిస్తున్న సూర్యకాంతి మేఘాల మీద ప్రతిఫలించి నందువల్ల అతను ఆ విమానాన్ని చూడ గలిగాడు. కెనెడీతో మాట్లాడడానికి వెడుతూన్న ఎవ్రెన్స్ తామని చూసి డ్రాడీ గట్టిగా అరచి చెప్పాడు. అంతలోనే 'బూమ్! బూమ్!' అంటూ భయంకరమైన శబ్దం వినిపించింది. 109 కీ రెండో బోటుకీ మధ్య, కళ్ళు చెదిరేట్లు రెండు ఎర్రటి కాంతిపుంజాలు వెల్లివిరిశాయి. పి. టి. 109 కుడివైపుకు ఒరిగి విపరీతంగా అల్లల్లాడిపోయింది.

కోవాల్ నెప్పితో తలపట్టుకున్నాడు. ఇంజన్ గదికెళ్ళే సందులోంచి డ్రాసీ ఎగిరిపడ్డాడు. అతని తల డెక్ కి కొట్టుకుంది. అతని తల నొప్పిపుట్టింది.

109 బోటు అటునుంచి ఈచివరిదాకా, ఫోర్డుకారు తలుపుగడియ ముక్కలూ, సేఫ్టీరేజర్లూ, కుళాయిగొట్టాలూ మొదలైన చెత్తసరుకు వర్షంలా కురిసింది. ఈ చెత్తంతా యుద్ధానికిపూర్వం జపాను అమెరికానుంచి దిగుమతిచేసుకున్న సరుకు తాలూకుది. బోటుమీద గదులకి వున్న కర్ర గోడలు విరిగిపోయాయి. ఒక పెద్ద ఇనుపముక్క బోటు ఎడమపక్క నుండి కుడిపక్కవరకూ చీల్చుకుంటూ వెళ్ళింది. కుడిడొక్క లో నీటిమట్టంపైన పెద్దకన్నం ఏర్పడింది. మండుతున్న మరోముక్క గ్యాస్ గొట్టానికి ఒక క్షణార్ధంలో చిల్లుపెట్టి, ఉత్తరార్ధక్షణంలో టంకంవేసినట్లు అతుక్కుపోయింది.

పనిచేస్తున్న ఇంజను ఆగిపోయింది. మెక్ మహన్ కి భయంవేసింది. విమానదాడిసమయంలో ఇంజన్లు పనిచెయ్యక పోతే 109 ని అతిసులభంగా గురిపెట్టి ధ్వంసంచెయ్యొచ్చు. కానీ అతను మరుక్షణంలో మూడు ఇంజన్లనీ పనిచేయించాడు. కెనెడీ మూడు త్రాటిల్స్‌నీ నొక్కి బోటుని ముందు కురికించి వలయాకారంగా ఎడంవేపుకి తిప్పి మహావేగంతో విమానం పరిధినుంచి తప్పించాడు. కోవాల్ తన హెల్మెట్ తీసి జుట్టులోంచి వేళ్ళుపోనిచ్చాడు. తలమీది వెంట్రుకలు సూదుల్లా నిలబడివున్నాయి. తలమీది నరాలు బిగుసుకుపోయినందువల్ల వచ్చిన నొప్పేతప్ప దెబ్బేం తగల్లేదని గ్రహించాడు. వెంటనే ఫిరంగులవైపు దృష్టి మళ్ళించాడు.

బ్రాడీ ఇంకా డెక్‌కి అంటుకుపోయే వున్నాడు. మేగ్వ్యార్ కాక్‌పిట్‌లోంచి దూకివచ్చి "దెబ్బతగిలిందా" అని అడిగాడు.

"నాతల" అంటూ బ్రాడీ హెల్మెట్ తీసేప్పటికి నుదుటిమీదనించి రక్తంకారండం మొదలెట్టింది.

మాయెర్ సహాయంతో మేగ్వ్యార్ అతన్ని చార్ట్ హౌస్‌లోకి దింపాడు. కట్టుకట్టడానికి ముందు రక్తం తుడిచేశాడు. రక్తం తుడిచాడేగానీ తలమీద గాయం కనబడలేదు. ఈలోగా బ్రాడీయే తన ఎడంచెయ్యి రక్తసిక్తంగా వుండటం గమనించాడు. బాంబుతాలూకు ముక్కలు ముంజేతిలో గుచ్చుకొని వున్నాయి. మధ్యవేలు చీలిపోయివుంది. డెక్ మీద హెల్మెట్ తీసినపుడు ఆచేతి రక్తం నుదుటికి అంటుకుందన్నమాట. బాంబుదెబ్బకి డెక్ మీదికి ఎగిరిపడి తల నేలకి కొట్టుకున్నందువల్ల గాయం తలకి తగిలిందనుకున్నాడు.

గన్ టర్రెట్‌లో ఉన్న కోవాల్‌కి తలనొప్పి తగ్గింది. కాని అతడిలో ఒకవింత అనుభూతి కలిగింది. ఎత్తుగా పొడి ప్రదేశంలో ఉన్నా అతడి కుడిపాదం తడితడిగా ఉన్నట్టనిపించింది. మొదట్లో అతడు ఈ విషయం పట్టించుకోలేదు. కాలు నేలమీద ఆన్చితే బురదతొక్కుతున్నట్లు అనిపించింది. కంగారుగా కింద 'చార్ట్ హౌస్' లోకి పరుగెత్తాడు. ఆ మసక వెల్తుర్లో మావర్, బూటు విప్పతీసి చూస్తే దానినిండా నెత్తురు నిండివుంది. అప్పుడుకాని అతడికి తెలిసిరాలేదు- ఒక ఇనపముక్క- తన చీలమండలోకి నొప్పి తెలియకుండా చొచ్చుకుపోయిందని.

మొత్తంమీద శత్రువు తీసిన దెబ్బకి తలలెగిరిపోయాయి అనుకున్నదల్లా ఒకరి కాలు, ఒకరి చెయ్యి మాత్రం దెబ్బ తిన్నాయని లెక్క తేలింది. కోవాల్‌కీ డ్రాడీకి ప్రమాదకర మైన గాయాలు తగలలేదనీ, రెండోవాకి తిరిగి పోనవసరం లేదనీ కెనెడీ నిశ్చయించుకున్నాడు. గస్తీ రాత్రంతా యథా ప్రకారం తిరగసాగింది.

ప్రొద్దుటే హార్బర్ చేరుకున్న తర్వాత రెండు ముఖ్య మైన సంగతులు వారికి తెలిశాయి. ఒకటి - బాంబుముక్క బోటు నడుమభాగంనుండి చొచ్చుకొని వచ్చి డ్రాడీ మునుపు నిలబడ్డ నిచ్చెనని చీల్చివేసింది. బాంబులు పేలిన కంగారులో అతడు నిచ్చెనమీదనుంచి విసిరిపారవేయబడ్డాడు. లేకపోతే అతడి ఒళ్ళంతా తూట్లు పడిపోయేది. రెండవది- కాక్‌పిట్ లోని 'వీల్'కి పక్కగా ఎడంభాగంలో ఎత్తుగాఉన్న లోహపు కవచం సొట్టపడివుంది.

ఈ లోహపు కవచం అక్కడ లేకపోయినా లేక తుపాకిగుండు తాకిడికి తట్టుకోలేనంత బలంగా లేకపోయినా పి. టి. 109 పొద్దుటే నాయకుడు లేకుండా రెండోవా చేరు కునేది.

"వెంట్రుకవాసిలో బతికి బయటపడ్డావు" అన్నాడు మోయర్ కెనెడీతో.

"నువ్వుమాత్రం" అన్నాడు కెనెడీ క్వార్టర్‌మాస్టర్ గదికి పడ్డ చిల్లిని చూపుతూ.

పొడసూపుతున్న అదృష్టం ఈ బాంబులు పేలడంతో తారుమారైంది. 109 బోటు చాలచోట్ల దెబ్బతిన్నది.

లోపలిభాగం తూట్లుపడింది. కుడివైపు నీటిగొట్టంకు పైగా పన్నెండు అంగుళాల చదరంలో ఒక అతుకు వెయ్యాల్సి వచ్చింది.

మరీ దారుణం ఏమిటంటే శత్రువులు తమరక్తం కళ్ళ చూశారు. క్రోవాల్‌నీ, డ్రాడీసీ టులగీలోని హాస్పిటల్‌కు పంపేయాల్సి వచ్చింది. వీరు పి. టి. 109 ని తిరిగి చూడలేదు. కాని వీరు డ్రెవిచ్‌తో బాటు మరో బోటులో మరో క్లిష్ట పరిస్థితుల్లో కెన్నెడీతో కలిసి పనిచేయవచ్చు.

ఇంతలో మరో దుశ్శకునం ఎదురైంది. జూలై 30 వ తారీకు రాత్రి పి. టి. 109 ఇంకా ఏడు బోట్లతో కలిసి ఎదురుచూస్తున్న జపాన్ యుద్ధనౌకల దండయాత్రను ఎదుర్కొనేందుకు బ్లాకెట్ జలసంధి వైపు వెళ్ళాల్సివచ్చింది. ఫెర్గూసన్ పాసేజ్‌లోని మకుటీ దీవికి పశ్చిమాన తమ స్థావరానికి వెడుతున్నపుడు పి. టి. 109 కి చుక్కాని చెడిపోయింది. అది బాగుచేయించేందుకు కెన్నెడీ రెండోవా తిరిగి పోవాల్సి వచ్చింది.

బోటులోనివారి పరిస్థితి దారుణంగా తయారైంది. ఒక వారంరోజులుగా సిబ్బందికి తాజాఆహారం దొరకలేదు. కాని 'ముండా' ఐదుమైళ్ళదిగువన న్యూజార్జియా లో ఒక 'ఎల్ సిటి' సిబ్బందివద్ద ఆహారపదార్థాలున్నాయని కెనెడీకి తెలిసింది. అతడు ఇహ ఆలస్యంచేయలేదు. బ్లాంక్ ఛానల్‌గుండా ప్రయాణంచేసి 'ఎల్‌సిటి' 161 బోటులోకి ప్రవేశించి ఐదుపౌన్ల న్యూజిలాండ్ మాంసంకోసం ఆ బోటులోని వంటవాణ్ణీ, ఆ బోటుఅధిపతి పిక్కెట్ లంప్‌కిన్‌నీ ప్రాధేయపడ్డాడు.

కెనెడీ రాయబారికుమారు డని లంప్‌కిన్ గుర్తుపట్టాడు. తను 'బాస్టన్' ముఖంచూసి సరిగ్గా ఏడాదయిందని తనవిచారం ప్రకటించాడు. మళ్ళీ తామిద్దరూ 'బాస్టన్' చూడటమే తటస్థిస్తే ఈ ఐదుపౌనుల న్యూజిలాండు మాంసం బదులుగా బ్రహ్మాండమైన విందుచేసి ఋణంతీర్చుకుంటానని కెనెడీ వాగ్దానంచేశాడు.

ప్రాధేయపడీ, బదు లడిగీ సంపాదించిన మాంసంతో అతడు రెండోవాకు తిరిగివచ్చాడు.

# 6

ఆగష్టు ఒకటవ తేదీ  మధ్యాహ్నం ఎండ తీవ్రంగా వుంది. దూదిపింజాల్లాంటి తెల్లటి చిక్కటి మబ్బులు దక్షిణ పసిఫిక్ నీలికడలిమీద వేలకొలదిమైళ్ళు వ్యాపించాయి.

జాపనీస్ యుద్ధనౌకలు 'అమరగిరి' 'హాగికాజె' 'అరషీ' 'పిగూరె' 'బొగెన్‌విల్లీ' ద్వీపానికి ఉత్తరంగా బారుదీరివస్తున్నాయి. అవి కోలాబంగారా ద్వీపంమీద విలాస్థావరానికి చేరుకుంటున్నాయి. అవి ఇక్కడికి అర్ధరాత్రికి చేరుకోవాలి. 'ముండా' ద్వీపాన్ని కాపాడుతున్న సైనికులకు మరింతబలంచేకూర్చేందుకు మరో తొమ్మిదివందల సోల్జర్లనీ, డెబ్భైఅయిదు టన్నులకు పైగా ఆహారపదార్థాలనూ ఒడ్డుకుచేరవెయ్యాలి.

ఫ్లాగ్‌బోటు 'హాగికాజె' 'అరషీ' 'పిగూరే' దక్షిణ ముఖంగా వెడుతున్నాయి. ఒక్కొక్కబోటులో మూడువందలమందిసోల్జర్లు  వున్నారు. అమెగిరీనౌక రక్షకభటుడిలా మిగతానౌకలకు వెన్నంటివెడుతున్నది. ఇరువైపులాకూడ కాపలాకాస్తున్నది తరచు అది. హాగికాజెనౌక ముందుకువెళ్ళి నలుదిక్కులా పరీక్షించి మళ్ళా వెనక్కుతగ్గుతున్నది. అమెరికన్ సబ్‌మెరీన్లు వస్తే అడ్డగించేందుకు సంసిద్ధమౌతున్నవి.

'అమెగిరి' రెండంతస్థుల గోధుమవర్ణంనౌక. ఇందులో పదముగ్గురు ఆఫీసర్లూ రెండువందలనలభైయ్యెదుమంది సిబ్బందీ వున్నారు. ఈ నౌకాధిపతి లెఫ్టినెంట్ కమాండర్ 'కొహేహ నామీ'. ఇతడుముప్పదినాలుగేళ్ళ దృఢకాయుడు. పొట్టి్రకాపు. ముఖం నలుచదరంగా వుంటుంది. 'అన్నాపొలీస్' తో సరి తూగగల జపాన్‌లోని 'ఇటాజిమా' 'నావల్ అకాడమీ' నుంచి 1928 లో డిగ్రీపుచ్చుకున్నవాడు. విధ్యుక్తధర్మాలను ఖచ్చితంగా నియమబద్ధంగాపాలించే కార్యదక్షుడు. డ్యూటీలో లేనప్పుడు ప్రసన్నంగా, నిదానంగా మాట్లాడుతాడు. యుద్ధం మొదలైనరోజుల్లో మార్షల్‌దీవుల్లో 'అసనాగీ' యుద్ధనౌకాధి పతిగా పనిచేశాడు. గిల్బర్ట్‌దీవులూ, వేక్‌దీవులూ, న్యూబ్రిటన్‌దీవులమీది దండయాత్రల్లో పాల్గొన్నాడు. 1942 వ సంవత్సరం సెప్టెంబరునెలనుంచీ 'అకెబోనో' యుద్ధనౌకకు నాయకుడుగా పనిచేశాడు. 1943 వ సంవత్సరం జూన్‌నెల నుంచీ రాబాల్‌ద్వీపంవద్ద ఈ 'అమెగిరీ' యుద్ధనౌకాధిపతిగా పనిచేస్తున్నాడు.

పర్వతాలూ, చల్లారినఅగ్నిపర్వతాలూ చుట్టూగోడలుగా అమరివున్న ఈ విశాలమైన హార్బరునుంచే ఈ నాలుగు యుద్ధనౌకలూ సముద్రంలోకి ప్రవేశించాయి. జూలై 6 వ తేదీ కులాగల్ఫ్‌వద్ద జరిగిన యుద్ధంలో అమెరికన్‌నౌక 'హెలెనా' మునిగిపోయింది. కాని 'అమెగిరి' నౌకకు నాలుగు దెబ్బలుతగిలాయి. ముందున్న రేడియోగది, విద్యుచ్ఛక్తి ప్రసారయంత్రాలు సమయానికి బాగుచేసుకుని 'విలా' స్థావరానికి బయలుదేరిననౌకల్తో కలుసుకుంది.

న్యూగినీ, సాలమన్‌లలో దాపుల్లోవున్న జపాన్ సైన్యానికి ఆహారపదార్థాలు సరఫరాచేసేందుకు ఈ 'రాబాల్' ద్వీపం ముఖ్యస్థావరము. 1943 వ సంవత్సరం వేసవిలో ఈ ద్వీపం ఉద్రిక్తతతో నిండిపోయింది. జూన్ నెలనుండి అమెరికన్ విమానదాడులు విపరీతంకాజొచ్చాయి. దాడిజరగని సమయాల్లో స్థావరంలోని సైనికులు అప్పుడప్పుడు వాలీబాల్ ఆడుకుని కాలక్షేపంచేసేవారు. ఆఫీసర్లకూ, రేవులోనినౌకలో వున్న సైనికులకూమాత్రం ఈ వీలు చిక్కేదికాదు. బాంబర్ విమానాలు దాడిచేస్తే వాటిని ఎదుర్కొనేందుకు సిద్ధంగా నౌకమీదనే వుండేవారు.

సాలమన్‌దీవుల్లోని జాపనీస్‌ల పరిస్థితి చాలాఆందోళనకరంగా వుండటమేకాకుండా, సమీపంలోఉన్న అమెరికన్ విమానాలూ, యుద్ధనౌకలవలన సిబ్బందినీ, ఆహారపదార్థాలనూ రప్పించడం అసాధ్యంకాజొచ్చింది. 'స్లాట్' నుండి 'విలా' కు ఇలా సరఫరాచేస్తున్నప్పుడే 'కులాగల్ఫ్' యుద్ధం సంభవించింది. పదిహేనురోజులతర్వాత 'యుగూర్' 'కియోనామీ' యుద్ధనౌకలు, ఛాయిసూల్‌దీవికి దక్షిణంగా స్లాటీలో గస్తీతిరుగుతూండగా అమెరికన్ విమానాలు బాంబులు వేయటంవల్ల మునిగిపోయాయి. జూలై 21 వ తేదీ 'అరియాక్' అనే యుద్ధనౌకా, దాన్ని అనుసరిస్తూన్న మరిరెండు చిన్నపడవలూ మరోమార్గంగుండా 'విలా' కు వెళ్ళాయి. కోలంబంగారాదీవికి ఉత్తరాన స్లాట్‌కు అభిముఖంగావెళ్ళి కులాగల్ఫ్‌గుండా 'విలా' కు చేరుకునేబదులు వెల్లాలావెల్లా ద్వీపంవరకూ స్లాట్‌లోనే ఉండిపోయాయి. అక్కడనుండి

వెల్లాగల్ఫ్‌లోకిమళ్ళి కోలంబంగారాదీవికి దక్షిణంగా ప్రయాణంచేసి బ్లాకెట్ జలసంధిగుండా 'విలా' కు వెళ్ళాయి.

ఈ మూడునౌకలూ ఏప్రమాదమూ జరగకుండా ఈ మార్గంనుంచి ప్రయాణంచేయటంతో జపానీయులకు ధైర్యం వచ్చింది. బ్లాకెట్ జలసంధికూడా మరోమహత్తరప్రయత్నం తలపెట్టారు. జూలైనెల 29 వ తేదీన వైస్ ఎడ్మిరల్ 'టోమెషిగె సమెజియా' నుండి 'సాగికాజె' నౌకలో సమావేశం ఏర్పాటుచేశామంటూ 'అమెగిరి', 'హగికాజె', 'అరషి', 'షిగూరె' నౌకాధిపతులకు కబురువెళ్ళింది.

ఈ సమావేశంలో ఈ నలుగురు నౌకాధిపతులూ ఒక దళంగా ఏర్పడి ఆగష్టు 1 వ తేదీన చీకటిపడింతర్వాత బ్లాకెట్ జలసంధిగుండా ప్రయాణంచేయాలని ఉత్తర్వులు బట్వాడా అయ్యాయి. ఆరాత్రి వెన్నెలగా వుండదు.

కొద్ది గంటల్లో మందుగుండుసామాను, పెట్టెలూ, కొద్దిగా మాంసమూ, డబ్బాలలోపెట్టి సీలువేసిన ఆహారమూ, బియ్యపు బస్తాలూ, 'హాగికాజె', 'అరషి', 'షిగూరె' నౌకల మీదికి ఎక్కించేశారు. అంతాబాగానే ఉందికాని ఒక చిన్న చిక్కువచ్చింది. సైనికదళంవారు పెద్దమొత్తాల్లో మత్తు పానీయాలు లారీలనిండా నింపుకొని గట్లవద్దకు వచ్చారు. నావికాదళంవారు దీనికి అంగీకరించలేదు. సైనికదళంవారు ససేమిరా తీసుకువెళ్ళా లన్నారు. నౌకల్లో మిగతా సామగ్రికే చోటులేదనీ, ఈమత్తుపానీయాలు కూడ ఎక్కడ పెట్టించాలనీ నౌకాదళంవారు తమ నిరసన తెలిపారు. న్యూజార్జి

యాలో బాన్‌డోయ్ దళాలకు హుషారు కలిగించేందుకు ఈ పానీయాలు తప్పనిసరి అని సైనికదళంవారన్నారు. చాలసేపు తర్జన భర్జన జరిగిన మీదట ఒకరకంగా రాజీకివచ్చి నౌకల్లో ఎక్కించారు.

ఎలాగైతేనేం 'హాగికాజె' 'అరషి' 'షిగూరె' నౌకల్లోని సిబ్బంది యుద్ధానికి సిద్ధమైంది. ఎవరికున్న కొద్దిఆహారం వారు జాగ్రత్తచేసుకున్నారు. ఎండలో, డెక్ మీద చోటు కోసం సోల్జర్లుతోసుకులాడేవారు. ఎందుకంటే కిందిభాగంలోని గదులు చాలాఇరకాటంగా వుండేవి. అందులో 'పడుండటానికి' ఎవరూ ఇష్టపడేవారు కాదు.

తమయుద్ధనౌకలు చాలానాశనంకావడంతో, నౌకల్లో ప్రయాణించే ఆఫీసర్లూ, సిబ్బందీ చాలా నిరుత్సాహపడిపోతున్నారు. ఆరోజు మధ్యాహ్నం బోగన్‌విల్లీచుట్టూ ప్రదక్షిణాలుచేస్తూన్నప్పుడు మళ్ళీ తిరిగి వస్తామో లేదోనని నౌకల్లోనివారు తలపోయసాగారు. 'షిగూరే' నౌకాధిపతి, లెఫ్టినెంట్ కమాండర్ 'టామేచీహారా' తన స్వంతవస్తువులను ఒక పెట్టెలో పెట్టి రాబాల్‌లోని ఒకమిత్రుడివద్ద వదిలేసి ఒకవేళ తాను తిరిగిరాకపోయినట్టయితే ఆ పెట్టెను తనఇంటికి పంపమనికూడ అప్పచెప్పివచ్చాడు.

ఆదేరోజు మధ్యాహ్నం రెండోవాహోర్బరు చాలా ప్రశాంతంగా వుంది. 155 మిల్లిమీటర్ గన్‌లు దూరంనుండి జరిపిన 'ముంబా' ద్వీపంమీద గాలివాన్ కాల్పులతరువాత ఒకరకమైన నిశ్శబ్దం ఏర్పడింది. చాలా పి. టి. బోట్లు మళ్ళా పెట్రోలు నింపుకొన్నాయి. గన్ టెర్రెట్‌లోని సిబ్బంది మర తుపాకులను శుభ్రపరుస్తూ ఆయిల్ పట్టిస్తూ పైభాగంలోఉన్న ఆంటీఎయిర్‌క్రాఫ్ట్ తుపాకుల్లో మందుకూరుస్తూ విసుగుతో పనిచేస్తున్నారు. డెక్ అడుగుభాగంలో ఎక్కడో గ్రామఫోను ఏదోతమాషాపాట పాడుతున్నది.

పి. టి. 164 వ బోటు స్పేర్‌సామాగ్రిని నింపుకొని టులగీనుంచిఅప్పుడేవచ్చింది. మాంసమూ, ఆహారపదార్థాలూ తీసుకువచ్చినా అంతసంబరపడేవారుకాదేమో కాని ఈయుద్ధ సామగ్రిరావటంతో సిబ్బందిముఖాలు ఇంత అయినై.

ఎప్పుడూ ఏదోఒక కొత్తవింత జరిగేది ఒక్క పి. టి. 109 బోటులోనే. హైపవర్ ఆయుధాల ఉపయోగంలో కొత్త పుంతలు తొక్కేందుకు ఆ సిబ్బంది ప్రయత్నించేవారు. సిబ్బందిలో ఒకరికి ఒకఆలోచన తట్టింది. డెక్ కి ముందు భాగంలో ఒకశక్తివంతమైన ఒకఫిరంగిని పెట్టినట్లయితే జాపనీస్ ఉక్కుపడవలను ఎదుర్కొనేందుకు ఎంతమాత్రం తీసిపోదని, అందువల్ల ఒకపాత 37 మిల్లిమీటర్ ఆంటీ-టాంక్ ఫిరంగిని డెక్ ముందుభాగంలో సిద్ధంచేసేందుకు నిర్ణయించుకున్నారు. ఇప్పుడు జాపనీయుల ఉక్కుపడవ ఎదురైనా ఇహ తిరుగుండదు.

మధ్యాహ్నానికల్లా కెనెడీ ఒకహిగ్గిన్స్‌పడవలో ఫిరంగి తీసుకొస్తున్నాడు. పి. టి. బోటు భరించగలదని తెలిస్తే ఏ ఆయుధాన్ని తెచ్చేందుకు కెనెడీ వెనుదీయడని మెగైర్ అననే అన్నాడు.

పి. టి. 109 లోని సిబ్బంది హుషారుగా ఉన్నారు. ఎందుకంటే ఇంతకాలం గస్తీమాత్రమే తిరుగుతూన్న ఆబోటు ఆగష్టు ఒకటవతారీకురాత్రి రెండోవాకు చేరుకోవాలి.

హిగ్గిన్స్‌బోటు రానేవచ్చింది. ఆంటీటాంకు ఫిరంగినీ రెండడుగుల వెడల్పూ, ఎనిమిదడుగుల పొడవూగల రెండు చెక్కల్నీ బోటుమీదికి ఎక్కించారు. ఈ రెండుచెక్కల్నీ డెక్కు ముందుభాగంలో ఇరుపక్కలా పెట్టారు. తరువాత ఫిరంగికి అడుగుభాగంలోఉన్న చక్రాల్ని తీసేసి దాని ఇరుసు ఈ చెక్కలమీద ఆనేట్టు పెట్టారు. తర్వాత ఈ ఇరుసును చెక్కలకు తాపడంచేసేందుకు లుంబేరీనుంచిరానున్న వడ్రంగులకోసం నిరీక్షించారు.

ఇప్పుడు సిబ్బందిలో కొన్ని కొత్తముఖాలుకనిపించినై. ఎన్‌సైన్‌థామ్, హారిస్, మగైర్, మోయిర్, మెక్‌మహాన్. కిర్‌కస్, జాన్స్టన్‌బోటుమీదనే ఉన్నారు. కాని డ్రెవిచ్‌తో పాటు క్లోవాల్, డ్రాడీ హాస్పటల్‌లో ఉండడంవల్ల కెనెడీ వారిస్థానంలో మరొకళ్ళని నియమించాల్సివచ్చింది.

అందులోఒకతను రేమాండ్‌స్టార్కె. ఇతడు టార్పెడో బోట్లు నడపడంలో నిపుణుడు. జుట్టు నెరిసివుంటుంది. ఇరవైతొమ్మిదేండ్ల భారీవిగ్రహం. ఇతని మాతామహుడు బ్రిటిష్

నౌకాదళంలో పనిచేసి కెనడాలో ఆ ఉద్యోగం వదిలేసి ఒక కెనడియన్ వనితను పెళ్ళాడి అంచెలమీద తనసంసారాన్ని పశ్చిమానికి తరలించాడు. తండ్రివైపు పూర్వీకులుమాత్రం స్టార్క్ పట్టణంలోనే నివాసం ఏర్పరచుకున్నవారు. ఇతనితాత ముత్తాత యూనియన్ సైన్యంలో గెట్టిస్‌బర్గ్ వద్ద యుద్ధంలో పోరాడి గాయపడ్డారు. రేమాండ్ స్టార్క్‌కి చిన్నతనంలో ఆరోగ్యం బాగావుండేదికాదు. జీవితంకూడ ఒడుదుడుకులుగా నడిచేది. స్కూలుచదువు ముగిసింతర్వాత కొంతకాలం న్యూపోర్టుబీచీలోనూ, కాలిఫోర్నియా రేవులోనూ మత్స్యవ్యాపార కేంద్రంలో జాలరిగపనిచేశాడు. తరువాత నూనెగనుల్లో ఉద్యోగం దొరికింది. పెరల్‌హార్బర్ దాడి జరగడంతో నౌకాదళంలో చేరాడు. అప్పుడే అతడివివాహం అయింది. తర్వాత ఒకపిల్లవాడు కలిగాడు.

స్టార్క్ పి. టి. 109 బోటుకు మార్పిడికి కారణంవుంది. అంతకుముందు పని చేసిన నౌకాదళాధిపతితో అతడికి పొసగ లేదు. అతణ్ణి ' ఐవీలీగుస్నాబ్ ' (బడాయిపోయేమనిషి) అంటుండేవాడు. లుంబ్యేలో ఎవరో ఒకఆఫీసరు కెనెడీకి ఒక దిట్టమైనవాడు కావాలని చెప్పడంతో స్టార్క్ పి. టి. 109 కి వెళ్ళాలని నిశ్చయంచేసుకొన్నాడు. ఇక్కడి నాయకుడితో తంటాఉండదని అతడిఉద్దేశం. అసలు భాగ్యవంతులతో అతడికి పొత్తుకుదరదు. కాని తరువాత ఒకమాటు అతనన్నాడు: మొదటిమాటు నేను కెనెడీని చూసినప్పుడు ఒకటోరకం కాలేజీకుర్రవాడులా అనిపించాడు. కార్యదక్షుడుఅయినా

చాలాసరదాగావుండేరకంఅనీ, నిగర్విఅనీ, సిబ్బందిపట్ల సాను భూతితో మెలగేవాడనీ వర్ణించాడు స్టార్క్.

ఇంజన్‌గదిలో మోటార్ మెకానిజమ్‌పనికి డ్రాడీ స్థానంలో జిరార్డు యి. జిన్‌సర్ అడుగెట్టాడు. ఇతనికి పాతి కేళ్ళు. 109 బోటు సిబ్బందిలో నౌకల్ని గురించి క్షుణ్ణంగా తెలిసింది ఇతని కొక్కడికే. ఇతడిచిన్నతనం బెల్లివిల్లీలోనూ, ఇలియినాయ్‌లోనూ గడిచిపోయింది. స్టార్క్‌సంసారంలానే ఇతడిసంసారంకూడ చితికిపోయింది. రెండేళ్ళు హైస్కూల్లో చదివింతరువాత ఉత్తరఇలియినాయ్‌లోని సివిలియన్ కన్స ర్వేషన్‌కోర్ క్యాంప్‌లో కొంతకాలంపనిచేశాడు. 1937 వ సంవత్సరంలో నౌకాదళంలోచేరాడు. తనపూర్వికులు నౌకా దళానికి చెందినవారేనని అతడికి గర్వంకూడఉండేది. 'ది గ్రేట్ వైట్‌ఫ్లీట్' (శ్వేతనౌకాదళం) అని పేరొందినదళంలోని యు. ఎస్. ఎస్. మోంటెనాలో అతడిపెత్తండ్రి పనిచేశాడు.

1930 ప్రాంతంలో జింసర్ చించినాటీ, ట్రెంటన్ అనే నౌకల్లో ప్రపంచమంతా చూశాడు. 1941 లో పి. టి. బోట్లలో నియుక్తుడయినాడు. వీటి యంత్రనిర్మాణాన్ని గురించి క్షుణ్ణంగా తెలుసుకునేందుకు డెట్రాయ్‌లోని పాకర్డ్‌ప్లాంట్‌కు పంపబడ్డాడు. తరువాత బ్రూక్లిన్ నౌకాశ్రయంలోని ఒక పి. టి. దళానికి పంపబడ్డాడు. డిసెంబరు 7 వ తారీకు ఆది వారం మధ్యాహ్నం జింసర్‌భార్య వంటచేసుకుంటున్నది. ఆమెకి కనేనెలలు. జింసర్ ముందుగదిలో కూర్చుని న్యూయార్క్‌కీ, బ్రూక్లిన్‌కీ మధ్యజరిగే ఫుట్‌బాల్ ఆటమీద రేడియో కామెంటరీ వింటున్నాడు. రేడియోలో ఒక్కక్షణం ప్రసారం

ఆగి ఒక ముఖ్యప్రకటన వెలువడింది. అది విని జింసర్ వంట గదిలోకి వెళ్లాడు.

"ఇది విన్నావా ?" అన్నాడు భార్యతో.

"ఏం, ఆటఅయిపోయిందా?" అన్నది.

"కాదు, జపాన్ వాళ్ళు పెరల్ హార్బర్ మీద దాడి చేశారు" అన్నాడు.

"అయితే మీరు వెళ్ళాలా ? ఎంతకాలం ?" అని అడిగింది. ఆమెకు తెలుసు, తనవి రెండూ వెర్రిప్రశ్నలేనని. మోటార్ మెకానిక్ గావచ్చిన మరొకడిపేరు హెరాల్డ్ డబ్ల్యు. మారేన్. ఇతణ్ణి కోవాల్ స్థానంలో ఫిరంగులు పేల్చేందుకు నియుక్తుణ్ణి చేశాడు కెనెడీ. ఇతడు పంధొమ్మిదిఏళ్ళచిలిపి కుర్రవాడు. ఈ యంత్రాలుఅంటే చాలాఉత్సాహం. వీళ్ళు ముగ్గురన్నదమ్ములు; మెసాచూసెట్స్ రాష్ట్రంలోని చికోపీలో పుట్టి స్ప్రింగ్ ఫీల్డ్ లో పెరిగాడు. అక్కడ అతడితండ్రి వెష్టింగ్ హౌస్ కు ఇన్ స్పెక్టరుగా వుండేవాడు. పదోక్లాసువరకూ చదివి పెరల్ హార్బర్ ముట్టడికి నెలరోజులపూర్వమే నౌకాదళంలో చేరాడు. అప్పుడికతడికి పదిహేడేళ్ళు. కొత్తసిబ్బందిలో నాలుగోవాడు సీమాన్ 2/సి రేమండ్ ఆల్బర్టు. ఆక్రన్ కు చెందినవాడు. అతన్నిచూస్తే యుద్ధంరోజుల్లో టైమ్స్ స్క్వేర్ లోనూ, శాన్ ఫ్రాన్సిస్కోలోనూ నీలంచొక్కావేసుకొని, నెత్తిమీద తెల్లటోపీ, ఈచేతిలో అమ్మాయి, ఆ చేతిమీద పచ్చబొట్టూసహా అటూఇటూ కంగారుగాతిరిగే నావికులు గుర్తుకొస్తారు. పదకొండుఏళ్ళు చదువుసాగించి పెరల్ హార్బర్

దాడికి కొన్నిమాసాల తర్వాత క్లైవ్‌లాండ్‌లో నావికా దళంలో చేరాడు. మొదట అతన్ని విక్సాన్ ఎ అండ్ ఎమ్ రేడియోస్కూలుకు పంపారుగానీ తరువాత తనంతతానే పి. టి. బోట్లలో పనిచేస్తా నన్నాడు. అతనికి ఇరవై ఏళ్ళు. మనిషి కొంచెం దూకు డనే చెప్పవచ్చు.

మధ్యాహ్నం ఒడ్డున లెఫ్టినెంట్ వుడ్స్, కమాండర్ వార్‌ఫీల్డ్‌ను కలుసుకున్నాడు. పి.టి. హెడ్‌క్వార్టర్సుకు ముఖ్యమైనవార్త వచ్చిందని చెప్పాడు. ఈవార్త కోలీపాయింట్ నుంచి కమాండర్ టి. ఎఫ్. 31, రెండోవా రేవుకి అద్దరినున్న నౌకాస్థావరం రేడియో కేంద్రానికి తెలియజేశారనీ, ఇప్పుడు లుంబేరీకి ప్రసారంచేస్తున్నారనీ చెప్పాడు.

కొద్దిక్షణాల్లో ఒక రేడియోమాన్ సంకేతాలను విడమరచి ఆ వార్తను కమాండర్ వార్‌ఫీల్డ్‌కు అందించాడు. ఆయన అది చదవగానే తెల్లబోయాడు. పి. టి. స్థావరానికి నాయకత్వం వహించినతరువాత ఆయనకు ఇంత జబర్దస్తీగానూ ఇంతఅర్జంటుగానూవున్న ఉత్తర్వు రాలేదు. వచ్చిన వార్త ఇది :

DATE/TIME GROUP 312356

FROM : CTF 31

TO (ACTION) COMMTBRON (RENDOVA) APC 28:1 MAR RD REG :

TO (INFO) COMSOPAC CTG 31'2; ATFC SOPAC

MOST SECRET

INDICATIONS EXPRESS MAY RUN TONIGHT ONE DASH TWO (1–2) AUGUST X ALSO HEAVY BARGE TRAFFIC TO BAIROKO OR SUNDAY INLET X WARFIELD OPERATE MAXIMUM NUMBER PETER TARES (PT) IN AREA BAKER (B) X KELLY OPERATE ALL AVAILABLE PETER TARES (PT) IN KULA GULF SOUTH OF LINE BAMBARI DASH RICE X BURKE WITH SIX (6) DESTROYERS GOES UP SLOT ARRIVING NORTH OF KOLOMBANGARA AT ZERO ZERO THIRTY LOVE (0030L) AUGUST SECOND (2ND) X IF KELLYS BOATS FORCED RETIRE TO LEVER DURING NIGAT ROUTE THEM CLOSE IN NEW GEORGIA SHORE X JAP AIR OUT TO GET PETER TARES (PT) X WARFIELD KELLY EACH ACKNOWLEDGE AND ADVISE NUMBER OF BOATS THEY WILL OPERATE TONIGHT X RICE ACKNOWLEDGE.

---

* x అనేది ఫుల్‌స్టాపుకు సంకేతం. లవ్ అనేది స్థానికకాలమానం గుర్తు. ఎరియా బేకర్ (బి) అనేది బ్లాకెట్ సింధుశాఖకు గుర్తు.

దీని సారాంశం ఇది: రాత్రి జపానువారు దాడిచేసే సూచనలున్నాయి. బైరాకో లేక సండేపాయలమీద పడవల రద్దీ వుండొచ్చు.

బ్లేకెట్ జలసంధి ప్రాంతంలో వార్‌ఫీల్డ్ సాధ్యమై నన్ని పి. టి, బోట్లు సిద్ధంచేయాలి. రైస్ బంబారి దక్షిణాన కులా సింధుశాఖ ప్రాంతంలో కెల్లీ సాధ్యమైనన్ని పి. టి. లను కూడదీసుకోవాలి.

ఆరు డిస్ట్రాయర్‌లతో బర్క్, 'స్లాట్' మీదుగా కోలంబంగారా ఉత్తరదిశకు వస్తున్నాడు. ఒకవేళ రాత్రి, కెల్లీ బోట్లు లివర్ వైపు వెళ్ళవలసిన అవసరంవస్తే వాటిని న్యూజార్జియా ఒడ్డుకి దగ్గరగా మళ్ళించవలసింది. జపాన్ విమానదళంవారు ఎలాగో అలాగ పి. టి. లను ధ్వంసం చెయ్యాలని చూస్తున్నారు. వార్‌ఫీల్డ్, కెల్లీలు ఈ వార్త అందినట్లూ, రాత్రి తాము ఎన్నెన్ని బోట్లు సిద్ధంచేసుకో గలరో అన్న సంగతీ తెలియజేయవలసింది.

ఆరాత్రి జపాన్‌వారు కోలంబంగారా దిక్కుగా పెద్ద ఎత్తున దండెత్తివస్తున్నారనడానికి సి. టి. ఎఫ్. 31 కు తగిన కారణాలు దొరికివుంటాయని వార్‌ఫీల్డ్ గ్రహించాడు. వార్‌ఫీల్డ్ అధీనంలో వున్న పి. టి. లు, రైస్ ఏంకొరేజ్ ప్రాంతంలో కెల్లీ అధీనంలో వున్న పి. టి. లు, ఆర్లె బర్క్ ఆధ్వర్యాన ఆరు డిస్ట్రాయర్లు, ఇన్నిటినీ ఒకే దిక్కుగా పంపి స్తున్నారంటే ఏదో ముంచుకొస్తోందన్న మాటే. మొత్తం

లెఖ్ఖకడితే, రెండో ప్రపంచయుద్ధంలో పి.టి. లకు ఇది బాగా పెద్దఎత్తు దాడి అనే చెప్పాలి.

ఈ ఉత్తర్వులో ఇంకో విశేషం వుంది. జపాన్ విమానాలు పి. టి. ల అంతు కనుక్కోడానికి వస్తున్నాయన్న వాక్యం చదవడం పూర్తిచేశాడో లేదో వెంటనే ఓ రేడియోమాన్ వచ్చి "ప్రమాదస్థితి" వచ్చేసిందని చెప్పాడు.

రెండోసారి సైరన్ కూత, మెషీన్‌గన్ శబ్దం లుంబేరీలో ఇంచుమించు ఒకేమారు వినిపించాయి.

తాటి తోపుల్లోంచి తుపాకీ గుళ్ళు దూసుకుని వచ్చాయి. గుడారాల చుట్టూరా ఇసక చెల్లాచెదురైంది. ఆకాశంమీద, ఏంటీ క్రాఫ్ట్ ఫిరంగుల ప్రేలుళ్ళ తాలూకు పొగలు కనిపించాయి.

సిబ్బంది తిట్టుకుంటూ, కాపుకోసమని కంగారుగా అటూ యిటూ పరుగెట్టారు. తుపాకీగుళ్ళు గుడారాలని చీల్చివేశాయి. పైన చెట్ల మధ్య నుంచి విమానాలు కనిపించి మాయమవుతున్నాయి. ఆఫీసర్లు బాతుల్లా తలలుసాచి పొదలమాటునుంచి ఫాక్స్‌హోల్స్ (చిన్న ట్రెంచీలు) వైపు పరిగెట్టారు. వీరిలో ఒక స్థూలకాయుడు వున్నాడు. అతను హేకార్డ్ మోటార్ కంపెనీలో వుండేవాడు. పి. టి. ఇంజన్లు సరిచూడడానికి వారంట్ ఆఫీసర్‌గా ఇక్కడకు పంపించారు. అతడు కంగారులో దూకిన కన్నం అతని సైజుకి తవ్వినది కాదు. మధ్యలో సగం పైకీ సగం కిందకీ చిక్కుబడిపోయాడు. పైన భయంకరంగా పేలు

తున్న మెషీన్‌గన్‌ల పాలబడేలోగానే ఎవరిదో కాలు అతన్ని పూర్తిగా క్షేమంగా లోనికి నొక్కేసింది. వెంటనే మరో నలుగురు ఆఫీసర్లు ఆ ఆపరేషన్స్ కందకంలోకి జొరబడ్డారు. ద్వారం చిన్నదైనా క్షేమంగా లోనికి చేరుకున్నారు.

ఇక్కడ పి. టి. 109 డెక్ మీాద ఇంజన్‌గది ద్వారం పక్క కునుకుతీస్తున్న పేపీ మెక్‌మహన్ ఎయిర్ రెయిడ్ సైరన్ కూతవిని త్రుళ్ళిపడిలేచాడు. లేచి కంగారుగా కాలు నిలదొక్కుకునే లోగా, రెండోవా కొండ పక్కనించి రేవు పైకి ఒక విమానం దూసుకు వస్తూవుండడం గమనించాడు. అది "మెరీన్ గ్రమ్మన్" లా కనిపించగానే హమ్మయ్య అనుకున్నాడు. "మెరీన్ గ్రమ్మన్" అంటే అమెరికా విమానమే. కానీ ఆ విమానం డైవ్ చెయ్యడానికి ఇటు తిరగడంలో తోకమీాద ఉదయసూర్యుడు చిహ్నం కనిపించింది. అది శత్రువిమాన మని తెలుసుకుని అతను కొయ్యబారిపోయాడు. ఆవిమానం సూటిగా పి. టి. 109 వైపే వస్తున్నట్టు కనబడింది. క్షణక్షణానికి పెద్దదవుతో మీాది మీాది కొస్తోంది.

మెక్‌మహన్ ఎవరో వదిలేసిన ఒక పాత రైఫిల్, ఎన్‌ఫీల్డ్ 30-30 ఎప్పుడూ దగ్గరుంచుకునేవాడు- ఇలాంటి విపత్కర సమయాలలో ఆదుకుంటుందని. ఆ రైఫిలంటే అతనికి ఎంతో నమ్మకం. కానీ సమయానికి రైఫిల్ చేతికి దొరకలేదు. దృష్టిఅంతా ఆ విమానంరెక్కకింద వున్న నల్లటి బాంబుమీాదే వుంది. చూపు మరల్చలేకపోయాడు. కంగా

రుగా డెక్ అంతా చేతులతో తడిమాడు. ఎక్కడా తగల లేదు.

అతను ఏ పరిస్థితిలో వున్నాడంటే, తను బాంబు మీానుంచి దృష్టి మరలిస్తే అది అమాంతం తనమీాద పడు తుందనే నమ్మేశాడు.

"ప్రమాదం" అన్న కేకవినగానే జిన్సర్ అపాయాన్ని వెంటనే గుర్తించాడు: "డైవ్ బాంబర్లు!" అని మరో కేక వినబడింది. పి. టి. బోట్లు అన్నిటినుంచి నిశ్శబ్దాన్ని బద్దలు కొడుతూ మెషీన్‌గన్లు పేలాయి. తూటా పటకాలు పుచ్చు కుని జిన్సర్ పరుగెట్టాడు.

ఓ శత్రువిమానం బోట్ల మధ్య డైవ్ చెయ్యబోయి నిప్పంటుకుని పేలి లుంబేరికి అవతల నీళ్ళల్లోకి చొచ్చుకు పోయింది. ఆ జోరుకి నిలువెత్తున నీళ్ళు పైకిలేచి క్షణంసేపు కదలకుండాఉండిపోయాయి. ఒడ్డునున్న లెఫ్టినెంట్ బెరన్ట్సన్ కి నిర్మలమైన నీటిలో కూలిపోయిన విమానం, ఇంకా విమా నం నడుపుతున్న భంగిమలలో వున్న పైలట్ శవం కనిపిం చాయి.

దూరాన పి. టి. 103 బోటుదగ్గర నీరు ఎగజిమ్మి పొగకనిపించింది. రేడియోమాన్ మెగ్యూర్‌కి ఒక్కమాటు గుండెఆగిపోయినంత పనైంది. ఎందుచేతనంటే 103 లోవున్న రేడియోమాన్ బిల్ మెగ్యూర్ తనతమ్ముడే.

'ఇక్కడ మాకేంప్రమాదంలేదు' అని జాన్ మెగ్యూర్ అరిచాడు. కానీ పి. టి. 103 దాదాపు అరమైలుదూరాన

వున్నందువల్ల అతని కేక వినిపించనూ లేదు. ఎవరూ జవాబూ పలక లేదు.

సైరస్ విన్నాడో లేదో హెరిస్‌కి, రెండో వాశిఖరం దిక్కునుంచి దూసుకువస్తున్న అయిదారు డైవ్ బాంబర్లు కని పించాయి.

ఇంత అకస్మాత్తుగా శత్రువు కనిపించేసరికి అతనుకంగారు పడి వెనకవైపు, 20 మిల్లిమీటర్ ఏంటీ ఎయిర్‌క్రాఫ్ట్ గన్ (విమాన విధ్వంసక శతఘ్ని) వున్న తనస్థానానికి పరిగెట్టాడు. శతఘ్ని దట్టించిలేదు. కానీ ఆంద్రూ జాక్‌సన్ కిర్‌క్సీ సహాయంతో మందుఎక్కించి కాల్పులు మొదలెట్టాడు. అతను దగ్గరున్న విమానానికికాకుండా తను మొదటినుంచీ గమని స్తూన్న దానికే గురిచూసి కాల్చాడు.

కొద్దిరోజులముందే బోటుకివచ్చిన మార్క్లి ముందున్న గన్‌టరెట్‌లోకిదూకి రెండుబాలన వేళ్ళూ ట్విన్ .50 కాలిబర్ మెషిన్‌గన్‌ల మీటలమీద నొక్కాడు. శతఘ్నులు టపటప టప మంటలుకక్కుతూ గర్జించాయి. వందలలెక్కలో ప్రేలుళ్లు వెలువడుతూంటే మార్క్లి చేతులూ పిడికిళ్ళూ అదిరిపోయాయి.

ఓ విమానం నీటిఅంచుదాకా దూసుకొచ్చి బోట్ల మధ్య ఒకటార్పెడో వదిలింది. అది కొన్నిబోట్లను రాసు కుంటూవెళ్ళి ఎంచేతనో బ్లాంచీకాలవవైపు మళ్ళింది. మళ్ళీ ఓవంపుతిరిగి లుంబేరీమీదున్న సెర్చిలైట్ సిబ్బందివద్దకొచ్చి చేరింది. ఒడ్డునున్నవారు భయపడ్డారు. ప్రొపెల్లరు తిరుగు తున్నా అదృష్టవశాత్తూ ఆ టార్పెడో పేలలేదు.

విమానదాడిజరిగే సమయానికి కెనెడీ వ(డంగులకోసం ఎదురుచూస్తున్నాడు. వెంటనే కాక్‌పిట్‌లోకి దూకి ఇంజన్లు స్టార్టుచెయ్యమన్నాడు. బోటువదలమని మెగ్వ్యార్‌కి కేక వేశాడు.

రేవంతటా పొగా తుంపరా అలుముకునివుంది. ఆకాశంలో హఠాత్తుగా ఒకఅగ్నిజ్వాల పెఠేల్‌మని (ప్రజ్వరిల్లింది. ఒక డైవ్‌బాంబర్ సరాసరి కిందికిదూసుకొచ్చి బోట్లమధ్య బద్దలైంది. బి-25 ఎస్. దాడినుంచి తప్పించుకున్న పి. టి.164 ముక్కచెక్కలుగా పేలిపోయింది. బోటులోవున్న విడిభాగాలన్నీ నీటిలోకి చెల్లాచెదురయ్యాయి. సిబ్బందిలో ఇద్దరు చనిపోయారు. పి. టి. 117 మునిగిపోయింది. మూడోబోటు కొద్దిగా దెబ్బతింది.

విమానాలు వస్తూనేవున్నాయి. సిబ్బందికి అన్నీ ఒకే మాటు కనబడకపోయినా అధికారనివేదిక(ప్రకారం మొత్తం వచ్చిన విమానాలసంఖ్య పాతిక. మార్నీ-ఒకఫిరంగి పనిచెయ్యకపోయినా రెండోదాన్ని పేలుస్తూనేవున్నాడు. టరెట్ వెనకాల డెక్‌మీద మావర్ నించునివున్నాడు. మార్నీ కాల్పులు గురితప్పడం గమనించాడు. పనిచెయ్యని ఫిరంగి, పేలుతున్న ఫిరంగిని పక్కకులాగడంవల్ల ఇలాజరుగుతోందనుకున్నాడు.

"ఆ గన్‌సంగతి చూడు" అని మార్నీని హెచ్చరించాడు.

"నువ్వు ముందర అక్కడినుంచి తప్పుకో. చావదలచు కున్నావా?" అని ఎన్‌సైన్ థాయ్ మావర్‌ను హెచ్చరించాడు.

మావర్ వెంటనే ముందున్న టార్పెడోగొట్టం పక్కగా డెక్ మీద నేలకరుచుకుని పడుకున్నాడు. అక్కడి నుండి బోటుపక్కనే నీళ్ళల్లో తుపాకిగుళ్ళు పడడం కనిపిస్తోంది. ఒకశత్రువిమానం కిందుగా దూసుకుని వెళ్ళింది. దాంట్లోవున్న జాపనీస్ పైలట్ మొహంసైతం కనిపించింది.

కెనెడీ బోటువేగం హెచ్చించాడు. బోట్లు అంటిపెట్టు కునివున్న చోటునుంచి అల్లకల్లోలంగావున్న ఆ రేవుప్రాంతం నుంచి దూరంగా దారితీశాడు. దెబ్బతిననిబోట్లు ఒక్కొక్కటీ తలోదారీ వెడుతున్నాయి. శత్రువిమానం కూలి ధ్వంసమైన బోట్లవద్ద ప్రాంతమంతా కంగాళీగావుంది. నీటిపై ముక్కా చెక్కా తేలుతున్నాయి. కొందరు అక్కడినుండి ఈదుకొస్తు న్నారు. ఒకతనికి దెబ్బ లేం తగలకపోయినా ఒళ్ళంతా రంగు మయంగావుంది.

లుంబేరీనుంచి దారిచేసుకుంటూ పి. టి. 109 కొంత దూరం వెళ్ళేసరికి ఆకాశంలో హడావిడితగ్గింది. విమానా లన్నీ వాయువ్యదిక్కువైపు వెళ్ళిపోతున్నాయి. ఆల్‌క్లియర్, మరిక ప్రమాదంలేదన్న సైరన్ వినగానే కెనెడీ 'బాయ్' వద్దకు తిరిగివెళ్ళాడు. బాంబర్లవల్లజరిగిన నష్టం అంచనావేశారు. తన తమ్ముడున్న పి. టి. 103 కి సిబ్బందికి ఏమీప్రమాదం జరగలేదని తెలిసి మెగ్వ్యార్ మనసు కుదుటపడింది.

కెనెడీ చిన్నపడవలో ఒడ్డుచేరుకున్నాడు. రోజూలాగే బోటుకెప్టెన్‌లు ఆపరేషన్స్ డగ్‌అవుట్‌లో కలుసుకున్నారు. ఈరోజుమాత్రం అందరూ గంభీరంగావున్నారు. కమాండర్ వార్‌ఫీల్డ్ కాకీలాగూ, చొక్కా వేసుకున్నాడు. ఏవో మ్యాప్‌లుచూస్తూ పక్కనున్న లెఫ్టినెంట్ చెరన్డ్‌సన్‌ను మొత్తంనష్టం ఎంత అని అడుగుతున్నాడు.

"ఈసారి జపానువాళ్ళు అటోఇటో తేల్చేట్టే వున్నారు. ఈరాత్రి హడావుడిగానే వుండేట్టుంది" అన్నాడతను.

చుట్టూరా కుర్చీల్లోనూ కిందా కూర్చున్న కెప్టెన్లకు, సి. టి. ఎఫ్. 31 నుంచి ముందొచ్చిన రహస్యవార్తల్లో కొన్నిభాగాలు చదివి వినిపించాడు. "వార్‌ఫీల్డ్ సాధ్యమైనన్ని పి. టి. బోట్లను సిద్ధంచెయ్యవలసింది" అని చదివాడు.

"ఉన్న బోట్లన్నీకావాలి. ఎన్నిబోట్లు కండిషన్‌లో వున్నాయి ?" అని అడిగాడు.

తీవ్రంగా దెబ్బతగలని బోట్లగురించి ఆయాకెప్టెన్‌లు చెప్పారు. మొత్తం పదిహేనుబోట్లు పనికొచ్చేట్లు తేలింది. నాల్గింటికివున్న రాడార్‌సెట్లు పాతకాలంనాటివి. వార్‌ఫీల్డ్ ఈ నాలుగుబోట్లచుట్టూరా మిగతావాటిని చేర్చి నాలుగు దళాలుగా ఏర్పాటు చేశాడు.

ఒకోదళాన్ని ఒకోప్రాంతం కాయమన్నాడు. పి. టి. 107 నాయకుడు లెఫ్టినెంట్ జార్జి ఇ. కుక్‌మన్ "సి" దళం ఆధ్వర్యం వహించాడు. ఈ దళం ఫెర్గుసన్ పాసేజ్ దక్షిణాన

గస్తీ వుండి, ఆకాలువగుండా బ్లేకెట్ స్ట్రెయిట్‌లోకి శత్రు నౌకలు రాకుండా అడ్డుపడుతుంది. మిగతా మూడు దళాలూ ఫెర్గుసన్ పాయలోంచి సింధుశాఖలోకి వెళ్ళిపోయి అక్కడే గస్తీ వుంటాయి. పి. టి. 174 తాలూకు లెఫ్టినెంట్ రసెల్ డబ్ల్యు. రోమ్ కింద వుండే "ఆర్" దళం మకుటి ద్వీపానికి తూర్పున మిగతా రెండూ కోలంబంగారా దక్షిణపు టొడ్డు అవతలా గస్తీ కాస్తాయి.

అంటే పి. టి. 171 లోని లెఫ్టినెంట్ బెరన్డ్‌సన్ యొక్క "ఏ" దళం గాంబెరె గ్రామం ఎదురుగానూ, పి. టి. 159 తాలూకు లెఫ్టినెంట్ హెన్రీ జె. బ్రాటింగ్‌హాం కిందుండే "బి" దళం వంగానంగా గ్రామం అవతలా గస్తీ వుంటాయి. "బి" దళం స్థానం బ్లేకెట్ స్ట్రెయిట్‌కు చిట్ట చివర నన్నమాట. ఈ దళంలో లెఫ్టినెంట్ బ్రాటింగ్‌హామ్ తో బాటు లెఫ్టినెంట్ (జె జి) విలియం ఎఫ్. లైబెనో జూని యర్. పి టి. 157 లెఫ్టినెంట్ (జె జి) జాన్ ఆర్. లోవెరీ యొక్క పి. టి. 162. లెఫ్టినెంట్ కెనెడీ పి. టి. 109 కూడా వుంటాయి. పి. టి. స్థావరానికి రేడియో సంకేతం "ఓక్ జీరో" ప్రతిబోటుకీ రేడియో కాల్ నంబరు ఇచ్చారు: కెనె డీది "ఓక్ 14"

బ్రాటింగ్‌హామ్ సీనియర్ కెప్టెన్ అవడంవల్ల తన దళానికే కాకుండా మొత్తం బృందానికంతకూ ఆయనే నాయకుడయ్యాడు. ఆయన తన ఇరవై ఆరో ఏటే చెప్పుకో తగ్గ స్థితిలోకి వచ్చాడు. అన్నాపోలిస్ లో 1939 లో పట్టా పుచ్చుకున్న తర్వాత "ట్విగ్స్" అనే ఫోర్ స్టేకర్ నౌకను

నడిపాడు. "ట్విగ్స్" ను తర్వాత, పాతబడిపోయిన మరో నల్భైతొమ్మిది డిస్ట్రాయర్లతో బాటు హేలిఫాక్స్‌లో బ్రిటిష్ వారి కిచ్చేశారు.

కొన్నాళ్ళు అట్లాంటిక్ లోని తటస్థరాజ్యాల గస్తీ బృందంలో వున్నాడు. తరువాత పి.టి. బోట్లలో పనిచేశాడు. మణిలాలో పేరొందిన మూడవ స్క్వాడ్రన్‌లో పనిచేశాడు.

జనరల్ మెకార్థర్‌ను, ఆయన భార్యా పుత్రులను మిండానో ఉత్తరపు టొడ్డుకు తీసుకుని వెళ్ళిన బృందంలో ఈయన వున్నాడు. బల్ కెలీ ఆధ్వర్యంలో వున్న ఆ పి. టి. 41 బోటుతో బాటు వెళ్ళిన రెండుబోట్లలోని పి. టి. 35 లో ఈయన ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్. పి.టి. 35 కు నాయకుడు కెల్లీ. కెల్లీ ఆధ్వర్యానవున్న 9 వ స్క్వాడ్రన్‌తో బాటు సాలమన్ దీవులకు వచ్చాడు.

బ్లేకెట్ స్ట్రెయిట్ లోంచి విలాకు వెళ్ళే దారులన్నీ సమర్థంగా కాయడానికి ఈ పదిహేనుబోట్లూ ఏయే స్థానంలో వుండాలో మ్యాప్‌మీద వార్ఫీల్డ్ చూపించాడు. ఒకవేళ జపాన్‌వారు కోలంబంగారా ఉత్తరదిక్కునించీ చుట్టుతిరిగివస్తే కెప్టెన్ బర్క్, కమాండర్ కెల్లీ వాటిని అటకాయించవలసి వస్తుంది.

కెనెడీ తిరిగి తనపడవవైపు వస్తూంటే మెర్విల్ టచ్. ఫుట్‌బాల్‌ఫీల్డులో పరిచయమైన ఎన్‌సైన్ జార్జి హెన్రీరాబర్టు సన్ రాస్ ఎదురుపడ్డాడు. రాస్, కలుపుగోలుమనిషి. ప్రిన్స్‌టన్‌లో '41 లో చదువుకుంటూన్నప్పుడు అతను చాలాసరదా

మనిషిగా పేరుపొందాడు. ఎటొచ్చీ బట్టలవిషయంలో శ్రద్ధ వుండేది కాదు.

ఆల్టర్నేట్ సిబ్బందితో తను ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ గా పనిచేసిన పి. టి. 166 ను బి-25 లు జులై 20 న ముంచేశాయి. ప్రస్తుతం అతనికి బోటు లేదు. "జాక్! ఇవాళ రాత్రి నీతో రావచ్చా?" అని అడిగాడు.

"37_ మిల్లిమీటర్ వంటి-టాంక్ గన్ పేల్చడం వచ్చా?" అని కెనెడీ ప్రశ్నించాడు.

"లేదు- కానీ నేర్చుకోడం ఎంతసేపూ" అన్నాడు రాస్.

"సరే పద" అన్నాడు కెనేడీ. ఎన్ సైన్ రాస్ కు పాతికేళ్ళు. షికాగో అవతల హైలాండ్ పార్క ప్రాంతంవాడు. చిన్నప్పుడు అతని తల్లి పుట్టిల్లు ఫేర్ ఆఫ్ సైడ్ మీదున్న లార్గ్సుకి వెళ్ళి వస్తూండేవాడు. పడవలతో అక్కడే అతనికి తొలిపరిచయం. పెద్దయిన తర్వాత విస్కాన్సిన్ లోని లేక్ జెనీవా రేసు పడవలు నడిపాడు. లేక్ మిచిగన్ మీదకూడా అనుభవం వుంది.

ప్రిన్సటన్ లో వున్నప్పుడు ట్రైయాంగిల్ షోలో వున్నాడు. అక్కడ అతను ఇంట్రామ్యూరల్ హెవీ వెయిట్ బాక్సింగ్ ఛాంపియన్. టోనీ కేంజొనరీ, హెన్రీ ఆర్మ్ స్ట్రాంగ్ బార్నీరాస్ వంటి వస్తాదులు ప్రసిద్ధికెక్కిన ఆరోజుల్లో జార్జి రాస్ ను అందరూ బార్నీ అని పిలిచేవారు. తరువాత కూడా ఆ పేరే అందరికీ అలవాటైపోయింది.

అతని పేరులోనున్న 'హెన్రీ రాబర్ట్సన్' అతని మామయ్యపేరు. ఆయన రాస్ పుట్టేముందు ఇప్రెస్ దగ్గర కెనెడియన్లతో యుద్ధంచేస్తూ చనిపోయాడు. బార్నీ నావికా దళంలో చేరినపుడు తనపేరులో ఆయన పేరున్నందుకు కొంచెం కంగారుపడ్డాడు. "యుద్ధసమయంలో మరణించిన ఆయన పేరుపెట్టారు కనుక నాకూ జపానువారి చేతుల్లో చావు రాసిపెట్టి వుందని పెద్ద అనుమానం" అని అతను తరవాత చెప్పాడు. కెనెడీబోటులో వుండొచ్చా అని అడగ డంలో ఈ పిచ్చినమ్మకంకూడా కొంత దోహదమిచ్చిందనే చెప్పాలి. మంచి అనుభవశాలి పక్కనుంటే యుద్ధంనుంచి ప్రాణాలతో బయటపడచ్చునని అతని నమ్మకం.

విమానదాడులు ఉధృతంగా జరుగుతున్న ఈ సమ యంలో స్థావరానికి కొంచెం దూరంగా వుండటం మంచిదను కున్నాడు. మిగతా పి. టి. నావికులలాగే అతనూ ప్రమాదం ఎక్కువున్నాకూడా ఏదో ఒక పడవమీద వుంటే కాస్త గుండె నిబ్బరంగా వుంటుందని తలచాడు.

మట్టలూ, కొబ్బరిచిప్పలూ తొక్కుకుంటూ కెనెడీ, రాస్ లుంబెరీ ఒడ్డువైపు నడిచారు. కెనెడీచేతుల్లో తన చార్టులు వున్నాయి. రాస్ విమానదాడి హడావుడి గురించి చెబుతున్నాడు. నాచు గడ్డి కట్టలతో కట్టిన దడి వెనకాల ఫిరంగులు కనిపించాయి. జపాను విమానదాడిని ఎదుర్కొన్న గన్నర్లు ఆ ఫిరంగులను చక్కబెట్టుకుంటున్నారు.

తమ తమ పడవలకు తిరిగి వచ్చిన నాయకులందరూ ఒడ్డువద్ద చేరారు. ఉక్క పోస్తోంది. ఈగలు తోచనివ్వటం

లేదు. కెనెడీ, రాస్ ఓ పడవ ఎక్కారు. రాస్ తెడ్డేశాడు. పి. టి. 109 చేరుకోగానే కెనెడీ బోటుమీద కెక్కి తన ఛార్ట్‌లను మావర్‌కి అందిచ్చాడు.

"ఇవాళ రాత్రి బయలుదేరుతున్నాం" అన్నాడు.

"ఈ రాత్రే!" అని ఎవరో సణిగారు.

"సిద్ధంకండి. నాల్గున్నరకల్లా బోటు వదలాలి" అని కెనెడీ ఆర్డరిచ్చాడు.

మిట్టమధ్యాహ్నంనుండి 'అమాగిరి', 'హగికాజె' 'అరాషి', 'షిగ్యూర్' చాలామైళ్ళు ప్రయాణంచేశాయి. పశ్చిమాన సూర్యాస్తమయం అయేసమయానికి బోగన్‌విల్లికీ ఛాయిసూల్‌కి మధ్యనున్న బోగన్‌విల్లి స్ట్రెయిట్‌లోకి వచ్చేశాయి. అమెరికన్ విమానాలు ఏక్షణానవచ్చిపడతాయోనని పొద్దంతా సిబ్బంది అప్రమత్తులై వున్నారు. పొద్దుకూకింది. 'స్లాట్' దగ్గరకొచ్చేస్తున్నారనేసరికి ఉద్రిక్తతత ఇంకా ఎక్కువైంది. సిబ్బందిఅంతా వారివారిస్థానాల్లో సిద్ధంగావున్నారు.

'అమాగిరి' డిస్ట్రాయర్ ఓడ బ్రిడ్జిమీద కమాండర్ హనామి నించునివున్నాడు. అతనిదృష్టిఅంతా సముద్రపుటంచునుంచీ తనరక్షణక్రిందవున్న మిగతా మూడుడిస్ట్రాయర్లదాకా వ్యాపించి కేంద్రీకరించివుంది. అతనితోబాటు

ఫైర్ ఆఫీసరు 11వ డిస్ట్రాయర్ ఫ్లొటిల్లాదళం కమాండర్ అయిన కెప్టెన్ కట్సుమోరి యమాషిరో నించునివున్నాడు. నాలుగు డిస్ట్రాయర్లలో అమగిరిఒక్కటే పదకొండవ ఫ్లొటిల్లాకు చెందినది. అనుభవజ్ఞుడయిన కెప్టెన్ యమాషిరో ఆదళం ప్రతినిధిగా వచ్చాడు. అతనికి నలభైనాలుగేళ్ళు. యొకోసుకాలో జన్మించాడు. అతనికుటుంబం తరతరాలుగా నౌకాదళంలో పనిచేసినవారే. 1919 లో ఎటాజిమాలో పట్టా పుచ్చుకొన్నాడు. తరువాత కొన్నాళ్ళు కేంటన్‌లో ఒక గన్‌బోట్‌కి ఆధిపత్యంవహించాడు. హాంగ్‌కాంగ్ విజయంలో ఇతనికి పాత్రవుంది. గాడల్‌కెనాల్‌కు సైన్యాన్ని తరలించుకొని వెళ్ళాడు. నెలక్రితమే 11వ ఫ్లొటిల్లాకు నాయకుడయ్యాడు. ప్రస్తుతం అమగిరిమీద సీనియర్ ఆఫీసరుగావున్నా మామూలుబాధ్యతలన్నీ కమాండర్ హనామీమీదే వున్నాయి.

నావికులంతా ట్రాపికల్ యూనిఫారాలు అంటే పొట్టి చేతుల కాకీచొక్కాలు, నిక్కర్లు, టోపీలు ధరించివున్నారు. అప్పటివరకూ పరిస్థితి ఎంతక్లిష్టంగా, కష్టంగా, ఉద్రిక్తంగా వున్నా వారు మానసికంగానూ శారీరకంగానూ ఏమీచలించలేదు. 'అమాగిరి' వైద్యోద్యోగి లెఫ్టినెంట్ (జెజి) అకిరా నకాజిమాకి పెద్దఎత్తున ఏమీపనితగల్లేదు. నకాజిమా నిదానస్థుడు. కళ్ళకి జోడుండేది. ఇంపీరియల్ యూనివర్సిటీ (ఇప్పటి టోక్యో యూనివర్సిటీ) మెడికల్‌స్కూల్లో పట్టాపుచ్చుకొన్నాడు. కులాగల్ఫ తరువాత ఓడకు మరమ్మతు జరుగుతూండగా నీరుబాగాలేనికారణంగా ముప్ఫైమంది ఆఫీసర్లు

డిసెంటిరీకి గురిఅయ్యారు. కానీ 'ఎక్స్‌ప్రెస్' బయలుదేరే సమయానికి అందరూ కోలుకున్నారు.

రాబాల్ వద్ద నీటిసరఫరా సరిగాలేదు. త్రాగేనీటివిషయంలోనూ, స్నానానికీ బట్టలు ఉతుక్కోడంలోనూ అమాగిరి సిబ్బంది తీవ్రనిబంధనలను పాటించాల్సివచ్చింది. ఆహార విషయంలో పరిస్థితి మరీగడ్డుగా తయారైంది. జపానుఓడల మీద అమెరికన్ సబ్‌మెరీన్లదాడి తీవ్రంగా వున్నందువల్ల న్యూబ్రిటన్‌లోకి ఆహారంపంపిణీ చాలాకష్టమయింది. వచ్చిన ఆహారంలో మంచిభాగంకాస్తా స్థావరంసిబ్బంది తీసేసుకునేవారు. చివరకుడిస్ట్రాయర్లకు నాసిరకం మిగిలేది. 'అమాగిరి'లో బియ్యం, టీ లకు లోటులేదుగానీ, తాజామాంసం కాయగూరలు దొరికేవికావు. రొట్టెలు అసలులేవు. విలాకు వెళ్ళినపుడు డబ్బాల్లో ప్యాక్‌చేసిన వెదురుమొక్కలు దొరికాయి కాని అవి ఉప్పుమయం!

ఓడ శుభ్రంగా వుండేది. సిబ్బంది భయభక్తులు ఎన్నదగ్గవి. నావికులు ఆఫీసర్లు చాలామంది 'అమాగిరి' మీద ఇంతకుముందు ప్రయాణంచేసినవారే అయినందువల్ల సూర్యోదయంముందు రాగలిగిన ప్రమాదాలకు సిద్ధమైవున్నారు. కానీ సీమన్ 1/సి సీజిరో మోరిమోటోకి ఇది మొదటిసారిఅయినా నిర్భయంగా వున్నాడు. అమెరికన్లు కేవలం డబ్బుకోసమే యుద్ధంచేస్తారనీ తనలాగ రాజభక్తితో పోరాడేవారి కేమాత్రమూ దీటుకారనీ అతని గట్టినమ్మకం.

శత్రుదేశంగురించి తనవారుచేసే ఈప్రచారంమీాద అతనికి గురి.

పొద్దుకూకినసమయానికి నాలుగుడిస్ట్రాయర్లూ బోగన్‌విల్లి స్ట్రెయిట్‌దాటి 'స్లాట్' ద్వారా వెల్లాలావెల్లావేపు దారి తీశాయి. వారిదారి బ్లేకెట్‌స్ట్రెయిట్‌లోంచి దక్షిణాన వెల్లా గల్ఫ్‌ద్వారా కుండురుంబంగారా పాయింట్‌దగ్గరకు తీసికెడు తుంది. వీరిని తిరగ్గొట్టడం కెప్టెన్ బర్క్, కమాండర్ కిల్లీల పని కాదు.

# 7

సోలమన్ ద్వీపాల్లో త్వరగా పొద్దుకూకుతుంది. ఆరుంబావుకల్లా లుంబేరీద్వీపం వెనకాల సూర్యుడు అస్తమయానికి ఉపక్రమించాడు. కొబ్బరిచెట్లు ఎర్రటిఆకాశంమీద నల్లగాకనిపిస్తున్నాయి. రెండోవా రేవువద్ద నిశ్చలంగావున్న నీలిసముద్రం బంగారంలా వెలిగి గచ్చకాయరంగులోకి చల్లబడింది. పశ్చిమాన కిందుగావున్న మేఘసంచయం కొన్ని క్షణాలు బంగారురంగు సంతరించుకున్నాయి. ఆరూఇరవైకల్లా వెలుగుతగ్గింది. మసకవెల్తుర్లో పచ్చటిచెట్లూచేమామీద తెల్లటి కొబ్బరిమొదళ్ళు స్పష్టంగా కనిపించాయి. చీకటిపడుతున్నకొద్దీ రెండోవా శిఖరాగ్రాన నీటిమేఘాలు చేరసాగాయి.

ఆరున్నరకల్లా రేవంతా ఒక్కసారి స్టార్టవుతున్న ఇంజన్లశబ్దంతో నిండిపోయింది. మొత్తం 15 పి. టి. బోట్లు. ఒకోబోటుకి మూడుఇంజన్లు. ఒక్కో-ఇంజనుకు పన్నెండు సిలెండర్లు. నలభైఇంజన్లశబ్దం వినిపించింది. 540 సిలెండర్లూ స్పందించసాగాయి. టాడ్ సిటీలో కర్రబల్లమీద నించుని ఓ నావికుడు సంజ్ఞలుచేసి పి. టి. ల తాలూకు సిగ్నల్‌మాన్ ఇచ్చే జవాబుకోసం ఎదురుచూస్తున్నాడు.

పి. టి. 109 మీాద మార్నీ, హారిస్ కలిసి శతఘ్నులను పైకితీసి మందుదట్టిస్తున్నారు. విమానదాడిజరిగిన సమయంలో 20_మిలిమీాటర్ విమానవిధ్వంసకశతఘ్ని తాలూకు లాకింగ్ పిన్ విరిగిపోయింది. ఒడ్డుకెళ్ళి మరోటి తీసుకొస్తానని హారిస్ అన్నాడు. కానీ కెనెడీ రాత్రికి దాన్ని తాడువేసికట్టివుంచొచ్చనీ మర్నాడు కొత్తది తెచ్చుకోవచ్చనీ చెప్పాడు.

ఇంజన్ గదిలో మెక్ మహన్ ఆక్సిలరీ జెనరేటర్ పెట్రోలు, బ్యాటరీల గురించి యథాప్రకారం కంగారుపడుతున్నాడు. మెగ్వ్యార్ ఎలక్ట్రిక్ సర్క్యూట్లన్నీ సరిచూసుకొని రేడియో సరియైన ఫ్రీక్వెన్సీలో వుండేట్లు అమర్చడంలో నిమగ్నుడై వున్నాడు.

జపాన్ డైవ్ బాంబర్ల దాడివల్ల మధ్యాహ్నం 37_మిల్లిమీాటర్ గన్నూ, చెక్కల్నీ ముందు డెక్ మీాద బిగించడం సాధ్యంకాలేదు. రాత్రి అవసరమొస్తే ఆ శతఘ్ని ఉపయోగం వుంటుందని కెనెడీ తలచాడు. బోటు ఊగిసలాడ్డంలో అది నీళ్ళల్లోపడిపోకుండా డెక్ కు తాడేసి గట్టిగాకట్టమన్నాడు. చెక్కల్ని కూడా అలాగే కట్టమన్నాడు. ఇలా చేసినందువల్ల ఎంతమేలు జరిగిందో వారికి తర్వాతగానీ తెలిసిరాలేదు.

కెనెడీ ఎన్సైన్ రాస్ కి బోటంతా చూపించాడు. ప్రమాదసూచనలు తెలిపేందుకూ అవసరమైతే 37 మిలిమీాటర్ గన్ను ప్రయోగించేందుకూ ఫోర్ డెక్ మీాద వుండమన్నాడు. వారిద్దరినీ చూడగానే కొత్తవానిరాక దుశ్శకునమన్న సంగతి సిబ్బందిలో కొంతమందికి గుర్తుకొచ్చింది.

కంచాలూ ప్లేట్లూ సర్దేసి చార్ట్‌హౌస్‌లో మావర్ కాఫీ పుచ్చుకుంటున్నాడు. దగ్గరున్న కిర్క్‌సీచేతులుమాత్రం వణుకుతున్నాయి. కప్పు బల్లమీదపెట్టి కాఫీ అక్కడినుంచే చప్పరించడం మొదలెట్టాడు. కిర్క్‌సీ చాలా ధైర్యశాలి అని పేరు. కానీ కొన్ని దినాలుగా ఎందుచేతో చావు దగ్గరకొస్తోందనే భయంపట్టుకుంది. ఎవరో గ్రామఫోను రొద ఎక్కువగా వుండంటే- వుంటేఏం? ఎలాగా చావబోయేవాడికి ఎలావుంటేనేం అన్నాడు. ఎవరెన్ని చెప్పినా వినలేదు.

మధ్యాహ్నం విమానదాడీ, దానివల్ల జరిగిన నష్ట కాండ అతని నమ్మకాన్ని మరింత ధృవపరిచాయి.

“నేను పోయింతరువాత నా సంగతి కాస్తచూస్తావు కదూ?” అని హారిస్‌ని అడిగాడు.

“నీకేమన్నా పిచ్చెక్కిందా” అన్నాడు హారిస్ మృదువుగా.

“ఇంక నేను ఇంటికి తిరిగివెళ్ళడం కల్ల” అన్నాడు కిర్క్‌సీ.

“నీకు నిజంగా పిచ్చెక్కిందోయ్” అంటూ హారిస్ నవ్వేశాడు.

ఆరాత్రి గస్తీ వేయించుకోవద్దని మెక్యూర్ కిర్క్‌సీని బతిమాలాడు. అడిగితే కాదనరని కూడా చెప్పాడు. మిగతా వారంతా అతని పరిస్థితి అర్థంచేసుకుంటారనీ అతను లేనంత మాత్రాన పెద్ద ఇబ్బంది వుండదనీ అన్నాడు. కిర్క్‌సీ ససేమిరా ఒప్పుకోలేదు. కిర్క్‌సీతో కాస్త మాట్లాడమని

మెగ్వ్యార్ కెనెడీని కోరాడు. కెనెడీ బోటుమీదకి రాగానే కిర్క్‌సీకి ధైర్యంచెప్పి అనునయించబోయాడు గానీ ఏమీ లాభంలేకపోయింది.

"ఈరాత్రికి నువ్వు ఒడ్డునుండి వుంటే మంచిదోయ్. ఎవ్వరూ ఏమనుకోర్లే. పొద్దుటికల్లా కుదుటబడతావ్" అన్నాడు మావర్ కాఫీ తాగుతూ.

"ఎందుకనుకోరూ. పిరికివాణ్ణి అనుకుంటారు" అన్నాడు కిర్క్‌సీ. మిగతావారితో బాటు తనూ తన కేపక్ లైఫ్ జాకెట్_ చేతులకు కట్టుకున్నాడు. ఇనపటోపీ అందుబాటులో వుంచుకున్నాడు.

"సిద్ధంకండి" అని కెనెడీ ఆర్డరిచ్చాడు.

కిందవున్న జిన్సర్ ఇంజన్లు స్టార్ట్ చేశాడు. బయలుదేరమని ఆర్డరిచ్చి కెనెడీ మూడు త్రాటెల్స్‌నీ నొక్కాడు. ఇంజన్‌గది నుంచి సంయ్ అని జవాబొచ్చింది. జిన్సర్ ఒకటి తర్వాత ఒకటిగా ఇంజన్ల గేర్లు వేశాడు. కెనెడీ బోటుని మెల్లగా బయలుదేరదీశాడు. కెప్టెన్లందరూ మిగతా బోట్లకు సాధ్యమైనంతవరకూ కెరటాలు తగలకుండా వుండేట్లు మెల్లిగా బోట్లను వదిలారు.

దళాలవారీగా బోట్లు సర్దుకుంటున్నాయి. లెఫ్టినెంట్ బ్రాటింగ్‌హామ్ కింద వున్న "బి" దళంలోని పి. టి. 159, పి. టి. 157, పి. టి. 162 ల వెనగ్గా కెనెడీ తన బోటుని మళ్ళించాడు.

పెద్దశబ్దంతో పదిహేను పీటీలూ దళాలవారీగా యుద్ధ సన్నద్ధులై సర్దుకుంటూన్న ఆదృశ్యం మరువరానిది. పచ్చగా చక్కగా వున్న ఆబోట్లు భయంకరంగా కనిపించాయి. వాటి టార్పెడోలు దట్టించి వున్నాయి. వాటి శతఘ్నులు ఆకాశాన్ని వెతుకుతున్నాయి. వాటి ఎంటెన్నాలు స్పందిస్తున్నాయి. ఇంజన్లు గర్జిస్తున్నాయి. సిబ్బంది అంతా హెల్మెట్లతో, లైఫ్ జాకెట్లతో రక్షితులై పొంచివున్నారు.

వారుచేరుకోవలసిన స్థానాలదూరాన్నిబట్టి ఒక్కొక్క దళమే బయలుదేరుతోంది. వంగావంగాకు అవతలున్న కోలం బంగారాతీరం చేరుకోవలసివుంది కనుక లెఫ్టినెంట్ బ్రాంటింగ్ హామ్‌కింనున్న నాలుగుబోట్లూ ముందుబయలుదేరాయి.

మిగతావాటిలోంచి దారిచేసుకుంటూ ఆ నాలుగూ లుంబేరీదాటిపోయాయి. బ్లాంచిఛానెల్‌లోకి మళ్ళగానే వేగం హెచ్చించాయి. చార్టుహౌస్‌లో మావర్‌కి తను మధ్యాహ్నం కంగారుతో స్థావరానికి రోజూలాగే మస్టర్ షీట్ (హాజరుపత్రం) అందజేయడం మర్చిపోయానన్నసంగతి గుర్తొచ్చింది. అందువల్ల ఆరాత్రి పి. టి. 109 లో వున్న పదముగ్గురు ఆఫీసర్లు, సిబ్బందిపేర్లూ అధికారపూర్వకంగా హెడ్ క్వార్టర్సు రికార్డుల్లోకి ఎక్కలేదు.

మిగతా మూడుదళాలూ వెనకవచ్చాయి. అన్నికాలం ఓపెన్ ఆర్డరులో బోటుకీ చోటుకీ ఎడంవుండే పద్ధతిలో నడుస్తున్నాయి.

ఆరుముప్పావుకల్లా సూర్యాస్తమయంకాంతి ఆకాశ మంతటా ఆఖరిసారి వెలిగి వెంటనే చీకటిఅలుముకుంది. కుడి వేపు దూరంగావున్న న్యూజార్జియా కొండలు అస్పష్టంగా కనిపించసాగాయి. రెండోవాశిఖరాన్ని మబ్బులు కప్పేశాయి. సదరన్‌క్రాస్‌మాత్రం దూరంగా గాలిపడగలా కనిపించింది.

ఇంక ఆట్టేసేపు నక్షత్రాలు కనిపించవు. ఫర్గుసన్ పాసేజ్‌వైపు వెడుతున్నకొద్దీ ఆకాశంలో దట్టంగా మబ్బులు కమ్ముకున్నాయి. బ్లేకెట్‌స్ట్రెయిట్ చేరేసమయానికి ఆకాశం తారుపూసినట్టయిపోయింది.

బ్లేకెట్‌స్ట్రెయిట్‌కి కొన్నివందల అడుగులపైనున్న కోలంబంగారా అడవి అతిచీకటిగానూ నిర్మానుష్యంగానూ వుంది. అక్కడ ఆస్ట్రేలియాదేశస్థుడు లెఫ్టినెంట్ ఆర్థర్ రెజినాల్డ్ ఇవాన్స్ కోస్ట్‌వాచర్‌గా వున్నాడు. చుట్టూవున్న చీకటిలోకి పరిశీలనగా చూస్తున్నాడు.

లెఫ్టినెంట్ ఇవాన్స్ ధైర్యశాలి. ప్రమాదభూయిష్ట మైన గూఢచారిపనిమీద అక్కడున్నాడు. విలామీది జాప నీస్‌స్థావరం కనబడేటట్లు ఓ వెదురు గుడిసెలో మకాం పెట్టాడు. ఆ గుడిసెలో ఆహారం, బైనాకులర్స్, టెలిస్కోపు, కాంపస్. లాగ్‌బుక్కు, రివాల్వర్, జపాన్‌వారివద్దనుంచి

పట్టుకున్న ఓ రైఫిల్, ఓ టామీగన్ ముఖ్యముగా రేడియో అమర్చుకున్నాడు.

ఇలాటి కోస్టువాచర్స్ సాలమన్‌దీవులు న్యూగినీపొడుగునా వున్నారు. ద్వీపవాసులుకూడా వీరికి సహాయపడుతూండేవారు. వారివల్ల ఏదేనాసమాచారం తెలిసినా, శత్రునౌకగానీ శత్రువిమానంగానీ శత్రుసేనగానీ ఏమాత్రం కదిలినట్లు తను చూసినా, విన్నా, లెఫ్టినెంట్ ఇవాన్స ఈ సమాచారాన్ని లుంగా, గాడల్‌కెనాల్‌లకు వెంటనే తెలియజేసేవాడు. అతనూ, మిగతా కోస్టువాచర్లూ ఇచ్చే సమాచారాన్ని వెంటనే పి. టి. ఎఫ్. 31 కి రిలే చేసేవారు. ఏదేనా ఇలాటిరిలే వచ్చిందంటే టులగీరేవులో ఓడబయలుదేరిందనో, డిస్ట్రాయర్లు దారిమళ్ళాయనో, హెండర్సన్‌ఫీల్డ్‌లో విమానాలు దిగాయనో అర్థం.

దక్షిణపసిఫిక్‌లో మిత్రరాజ్యాల విజయానికి చాలా ఖర్చయింది. మెలనేషియాఅంతా ఐదులక్షల చదరపుమైళ్ళమేర పరచుకున్న కొన్నివందల ఆస్ట్రేలియన్ కోస్టువాచర్ల దళం సహాయంలేకపోతే మరింతఖర్చయి వుండేది.

గాడల్‌కెనాల్‌దాడిని అటకాయించడానికి వచ్చిన జాపనీస్ బాంబర్లను అమెరికన్ విమానాలు ముక్కలుచేశాయంటే దానికికారణం బోగన్‌విల్లిమీద మలబిటాకొండనున్న కోస్టువాచర్ రేడియోద్వారా ఇచ్చిన హెచ్చరికే! ఏప్రిల్ 7న విమానదాడి జరుగనున్నదని మొదట తెలియజేసినది బోగన్‌విల్లిలోవున్న కోస్టువాచరే. సమయానికివచ్చిన

ఈ హెచ్చరికబట్టే మిత్రనౌకలు విమానాలొచ్చే ముందు గానే చెల్లాచెదురుగా తప్పుకున్నాయి. కోస్టువాచర్లు గాడల్ కెనాల్‌ను తిరిగివశంచేసుకోడానికి జపానువారుచేస్తున్న సన్నాహాలు కనిపెట్టారు. పోర్టులాండ్ ద్వీపాల్లో శత్రునౌకలుచేసే ప్రతికదలికా సి. టి. ఎఫ్. 31 కు ప్రసారంచేస్తూ వచ్చారు. లెఫ్టినెంట్ వెస్టుహోమ్‌కిందున్న పి. టి. 112 మునిగిపోయిన రాత్రి స్లాట్‌వైపు ఒక 'టోక్యో ఎక్స్‌ప్రెస్' దూసుకువస్తోందని ఒక న్యూజార్జియా కోస్టువాచర్ హెచ్చరించబట్టే పి. టి. బోట్లకి 'హాట్సుకాజే' డిస్ట్రాయర్ని నష్టపరిచేఅవకాశం కలిగింది.

'హెలెనా' తాలూకు కొందరు నావికులనూ, పారచూట్‌లద్వారాదిగిన లెక్కలేనన్ని వైమానికులనూ, ఓడలు మునగ్గా ఈదుకొచ్చిన నావికులనూ ద్వీపవాసుల సహాయంతో ఈ కోస్టువాచర్లే రక్షించారు.

ఈ కోస్టువాచర్ సౌకర్యం ప్రథమంగా మొదటి ప్రపంచయుద్ధ సమయంలో ఆస్ట్రేలియన్ నౌకాదళంవారు సివిలియన్ విభాగంగా ప్రారంభించారు. జనాభా చాలా మటుకు ఖండం ఆగ్నేయమూలలోనే సర్దుకున్నమూలంగా ఇవతల ఒడ్డుపొడుగునా శత్రువులుదిగే ప్రమాదం వుందని ఆస్ట్రేలియా గ్రహించింది. ఒకవేళ దిగితే కొన్నిగంటలకో లేదా కొన్నిరోజులతరబడి ఈ సమాచారం ప్రభుత్వానికి తెలిసే సౌకర్యంలేదు. అందుచేత 1919 లో నౌకాదళం ఈ ఉపాయం పన్నింది. టెలిగ్రాఫ్‌ద్వారా సమాచారం అందజేయగలవారు అంటే పోస్టుమాస్టర్లు, హార్బర్‌మాస్టర్లు,

స్కూలుమాస్టర్లు, మిషనరీలు, పోలీసువారు, రైల్వేఉద్యో గులూ మొదలైనవారిని ఎన్నుకున్నారు. వారిపని ఒడ్డుపొడు గునా అనుమానాస్పదాలైన విషయాలుజరిగితే పసిగట్టడమే. వారుఅందించేసమాచారాన్ని టెలిగ్రాఫ్‌తీగలద్వారా మెల్బోర్నెస్ అందజేయడానికి జనరల్‌పోస్టుఆఫీసువారు ఒప్పుకు న్నారు. ఏ సమాచారం సేకరించాలి, ఎలా పంపాలి అన్న విషయంపై కోస్టువాచర్లకి సూచనలు అచ్చువేసిఇచ్చారు.

న్యూగినీ, సాలమన్స్‌లోని ఆస్ట్రేలియన్ ఎడ్మిని స్ట్రేటివ్ ఉద్యోగులను కోస్టువాచర్లుగా ఎన్నుకొన్నతరువాత ఈ సౌకర్యం ముఖ్యస్థానం అందుకుంది. పెరల్‌హార్బర్ తరు వాత ఈ కోస్టువాచర్‌సర్వీసు నౌకాదళంలో ఒక విభాగ మైంది. విమానం, సబ్‌మెరీన్, నాటుపడవలద్వారా వీరు శత్రుస్థావరాలవెనుక చేరేవారు.

జపానువారికి వీరిఉనికి తెలియకుండా చాలాజాగ్రత్త పడేవారు. జపానువారుఒంటరిగానున్న కోస్ట్‌వాచర్లను నిర్దాక్షి ణ్యంతో వేటకుక్కలతో వేటాడించేవారు. ఈదళం సంకేత నామం 'ఫెర్డినాండ్'. మన్రోలీఫ్ అనే కార్టూనిస్టు సృష్టిం చిన ఎద్దు 'పెర్డినాండ్' బట్టే ఈపేరు పెట్టుకున్నారు. ఆఎద్దుకి చెట్టుకిందకూచుని అడవిపువ్వులను ఆఘ్రాణించడం చాలా ఇష్టం. ఫెర్డినాండ్‌లాగే వీరు కూచుని సమాచారం సేకరించ డమేతప్ప యుద్ధం వారిపనికాదు. ఎటొచ్చీ లెఫ్టినెంట్ ఇవాన్సులాటివారు మాత్రం ఆస్ట్రేలియా నౌకాదళానికి చెందిన ఉద్యోగులు.

రెగ్ ఇవాన్సు సన్నటి చురుకైన మనిషి. ఎర్రగావుండే వాడు. పొడుగాటి కోలమొహం. నిదానస్థుడు. అనుభవజ్ఞుడు. చాలా సరదామనిషి. ఒక సివిల్ ఉద్యోగి ముగ్గురుసంతానం లోనూ పెద్ద. 1905 మే 14 న సిడ్నీలో జన్మించాడు. స్టేట్ స్కూళ్ళలో చదివిన తరువాత 1929 లో కొబ్బరితోట అసిస్టెంటు మేనేజరుగా న్యూహెబ్రిడెస్‌కి వెళ్ళాడు.

తోటని ఓ ఫ్రెంచికంపెనీ కొనడంవల్ల ఆస్ట్రేలియాకి తిరిగివచ్చి బరన్స ఫిల్ప (సౌత్ సీ) కంపెనీ లిమిటెడ్ (ట్రాడర్స అండ్ షిప్పర్స) లో చేరాడు. ఈమారు అతన్ని సాలమన్సకి పంపారు. అక్కడ ద్వీపాలమధ్య తిరిగే స్టీమర్ "మముటూ" లో సూపర్ కార్గో ఉద్యోగం లగాయతు రక రకాల పనులు చేశాడు.

ఈ సమయంలో సాలమన్ ద్వీపాల గురించీ, మెలనేషియా వాసుల గురించీ చాలా తెలుసుకున్నాడు. టులగీకి స్నేహితులతో విహారం వచ్చిన గెర్‌ట్రూడ్ స్లేనీ అనే అడిలేడ్ అమ్మాయితో అయిన పరిచయం పెళ్ళిగా పరిణమించింది.

ఇవాన్స కోస్టువాచరవగానే భార్యపేరు పొడక్షరాలు జి. ఎస్. ఇ. తన ప్రసార సంకేతాక్షరాలుగా పెట్టుకున్నాడు. ఈవిధంగా గెర్‌ట్రూడ్ స్లేనీ ఇవాన్స అనే అమ్మాయి ద్వితీయ ప్రపంచయుద్ధ చరిత్రలోకి ఎక్కిపోయింది.

యుద్ధం ఆరంభమైన సమయానికి ఇవాన్స సైన్యంలో చేరి రెండేళ్ళు మధ్యప్రాచ్యంలో పనిచేశాడు. 1942 జూలై

లో నౌకాదళానికి బదిలీ అయి కోస్టువాచర్ దళంలో చేరాడు. గాడల్ కెనాల్‌లో కొన్నాళ్ళున్న తరువాత 1943 ఫిబ్రవరిలో కోలంబంగారాకి వెళ్ళవలసిందిగా ఉత్తర్వులొచ్చాయి. అంచీలుగా అక్కడికి చేరుకున్నాడు. ఫ్లోరిడాద్వీపం నుంచి ఒక పి. బి. వై. సహాయంతో సెజీ పాయింట్‌లోకి చీకటిలోకి దిగాడు. సెజీపాయింట్ న్యూజార్జియా ఆగ్నేయ మూల కొసానవుంది. ఇంకా శత్రుపక్షంలోనే వుంది. సెజీ పాయింట్‌లోవున్న కోస్టువాచర్ పేరు డోనాల్డ్ సి. కెనెడీ. న్యూజిలాండు దేశస్థుడు. తెల్లివైనవాడు. గట్టివాడు. డోనాల్డ్ కెనెడీ చాలామంది ద్వీపవాసుల్ని చేరదీశాడు. తనున్న గుప్త ప్రదేశం దరిదాపులకి వందమంది పైగా జపాన్ సోల్జర్లు వచ్చినాసరే, వీరు వారిని దొంగచాటుగా ఇట్టే మట్టుపెట్ట గలరు. వీరేకాక అతను స్కూనర్ల (రెండు తెరచాపస్థంభాలు కల ఓడలు) మీాద ప్రయాణంచేసే మనుష్యుల్నికూడా ఏర్పాటు చేసుకున్నాడు. ఓమారు అతను తన పదిటన్నుల "ఫ్లేగ్‌షిప్" "దడావతా" తో ఒక జపనీస్ వేల్‌బోట్‌ను గుద్దేసి, దానితాలూకు సిబ్బందిని హేండ్‌గ్రెనేడ్స్ (చేతి బాంబులు) తో పేల్చేశాడు. తన మనుషుల సహాయంతో మూడుపడవల శత్రుసైనికుల్ని మట్టుపెట్టాడు. ఇరవైమంది జపానీస్ పైలట్లను పట్టుకున్నాడు. ఇరవైరెండుమంది అమెరికన్ పైలట్లను రక్షించాడు. మిత్రుడైనాసరే శత్రువైనాసరే బతికున్న పైలట్‌ని తన కేంప్రదానికి తీసుకొచ్చినవాడికి ఓ బస్తా బియ్యం, డబ్బాలో పదిలపరచిన మాంసం బహుమతిగా ఇచ్చేవాడు. ఫలితాలు బ్రహ్మాండంగా వుండేవి.

రెండువారాలబాటు లెఫ్టినెంట్ ఇవాన్స్ సెజీ పాయింట్ స్థానంలో వున్నాడు. ఈలోగా డోనాల్డ్ కెనెడీ గాడల్ కెనాల్ వెళ్ళివచ్చాడు. రాగానే ఇవాన్స మలాంగా అనే అతనితో చేత్తో తొలిచిన నావలో కోలంబంగారా బయలుదేరాడు. మిషన్ స్కూల్‌లో కొన్నాళ్ళున్నందువల్ల మలాంగాకు కొద్ది ఇంగ్లీషు తెలుసు. వారు పగలంతా పొంచి వుండి రాత్రిమాత్రమే ప్రయాణం సాగించేవారు. ముండా విమానాశ్రయం పక్కనించి వెళ్ళినపుడు చీకట్లో జపనీస్ లారీల చప్పుడు వినిపించేది. ఇంతకుముందే రెండోవా కోస్ట్ వాచర్ లెఫ్టినెంట్ డి. సి. హోర్టన్ ఇవాన్స రాకవిషయమై కోలంబంగారాకు కబురుపంపాడు. దాని ఫలితంగా రోవూ అనే వృద్ధనాయకుడుతో సహా ఒకబృందం ఎదురొచ్చి ఇవాన్స్‌కి స్వాగతంచెప్పి దక్షిణపుటొడ్డున ఎత్తుగా ఓగుడిసె కట్టిచ్చారు.

ఈఎత్తునుంచి అతనికి విలాయేకాక బ్లేకెట్ స్ట్రెయిట్ ఫెర్గుసన్ పాసేజ్‌నుంచి వానావానా, గిజో కూడా కనిపించేవి. అంటే వెలుతురున్నప్పుడే ఇవి కనిపించేవి. ఈరాత్రి 1943 ఆగస్టు 1-2 రాత్రి. అతనికి తనగడియారం అంకెలుతప్ప మరేమీ కనిపించలేదు.

రాత్రి 9-30 కల్లా రెండోవానుంచి వచ్చిన పదిహేను బోట్లూ వాటి వాటిస్థానాలు చేరుకున్నాయి. "సి" దళం ఫెర్గుసన్ పాసేజ్ అవతల గస్తీ తిరుగుతోంది. మిగతావి బ్లేకెట్ స్ట్రెయిట్‌లో గస్తీవున్నాయి. ఇక్కడ సముద్రం వైశాల్యం ఎక్కువ. బ్లేకెట్ స్ట్రెయిట్‌లో కలిసే పాయలన్నీ ముఖ్యంగా వెల్లా గల్ఫ్‌తో కలిసి వానావానానుంచి వెల్లా లావెల్లా వరకు ఇరవైమైళ్ళుగా వ్యాపించివుంది. మడుగు ఎక్కడా ఐదుమైళ్ళ వెడల్పుకి తక్కువలేదు. గిజోకితూర్పున ఎదురుగావున్న చిన్నచిన్న ద్వీపాలకీ కోలంబంగారాకీ మధ్యనున్న ప్రాంతమే కాస్త వెడల్పు తక్కువ. అక్కడే చాలా మటుకు బోట్లు కేంద్రీకరించివున్నాయి.

గంటలు గడుస్తున్నాయి. బోట్లు నిశ్చలంగా నల్లగా వున్న నీటిమీద జంట జంటలుగా కదులుతున్నాయి. "బి" దళం రెండుభాగాలైంది. లెఫ్టినెంట్ బ్రాంటింగ్‌హామ్ పి. టి. 159 లెఫ్టినెంట్ లీబినోవ్ పి. టి. 157 తో జతపడింది. లెఫ్టినెంట్ లోరీ పి. టి. 162 లెఫ్టినెంట్ కెనడీ పి. టి. 109 తో జతచేరింది. బ్రాటింగ్‌హామ్, లోరీ రెండుభాగాలకు నాయకులు.

పి. టి. 109 మీద కెనడీ వీల్‌దగ్గర నించునివున్నాడు. మెగ్యూర్ పక్కనున్నాడు. ఉండుండి కాక్‌పిట్‌లోంచి ఎన్‌సైన్ థామ్ ఇవతలికివంగి కెప్టెన్‌తో ఏదోమాట అనేవాడు. ఎప్పటిలాగే మెగ్యూర్ కెనెడీని ఏదోప్రశ్న వేసేవాడు. "చర్చిల్ ఎలా వుంటాడు?" సంభాషణ ఇలా కాసేపుసాగేది. మళ్ళీ అందరూ మౌనం పాటించేవారు.

సిబ్బంది అంతా ఎప్పుడేం వచ్చిపడుతుందో అని వేచి వున్నారు. చాలామందికి అంతకంటె ఏంచెయ్యాలో తోచ లేదు. బోట్లన్నీ నిశ్శబ్దంగా వున్నప్పుడు రేడియో రిసీవర్ మీద చిన్నశబ్దం మాత్రమే వినబడేది.

ఉండుండి మెగ్వ్యార్ దైవప్రార్థన చేసేవాడు. లుంబే రీలో పరిచయం పురస్కరించుకొని ఎన్సైన్ రాస్ ఆల్బర్ట్తో కబుర్లు చెప్పేవాడు. అతనూ, కెనెడీ, ఎన్సైన్ థామ్ తప్పితే రాస్కి బోటుమీద మరెవరూ తెలీదు. మెక్ మహాన్, జార్ స్టన్, జిన్సన్ వంతులవారీగా ఇంజన్రూమ్ డ్యూటీ పాటించేవారు. టులగీ వద్ద వున్నప్పు డున్నంత పకడ్బందీగా లేకపోయినా బోటు బాగానే నడుస్తోంది. ఎటొచ్చీ నావికులన్నట్టు బోటు కిందిభాగానికి 'గడ్డంమొలి చింది.' అంటే బోటుకిందిభాగం శుభ్రపరిచేందుకు అవకాశం లేకపోగా నాచూ, చెత్తా అడుగుఅంచునంతా అంటుకుని వున్నాయి.

గస్తీవున్నవారంతా రాత్రి పన్నెండుదాటడం గమనిం చారు. ఆగష్టు 2 సోమవారం వచ్చేసింది.

పి. టి. 159 కాక్ పిట్ పక్కన ఆతృతగా నించున్న లెఫ్టినెంట్ బ్రాంటింగ్ హామ్ కి కిందనుంచి 'రాడార్ కాంటాక్ట్' అన్న కేక వినిపించింది.

పి. టి. 159 కాక్ పిట్ పక్కన లెఫ్టినెంట్ బ్రాంటింగ్ హాం ఆత్రతతో నించునివున్నాడు. కిందనుంచి 'రాడార్ కాంటాక్ట్' అన్న కేకవినగానే నిచ్చెనదిగి చార్ట్ హౌస్ లోకి వెళ్ళాడు. రాడార్ తెరమీద వరసగా నాలుగుచుక్కలు మెరిశాయి. అవి ఒడ్డుకు బాగా దగ్గరవున్నందువల్లా చాలా చిన్నవిగా వుండడంవల్లా శత్రువులతాలూకు చిన్నచిన్న నావ లనుకున్నాడు. అవి రెండుమూడుమైళ్ళ దూరంలోవున్నట్టు అంచనావేశాడు.

ఆ నాటురకం రాడారుసెట్టు ఓడల్ని కనుక్కోడంలో అట్టే ఉపయోగపడదని తెలిసిన బ్రాంటింగ్ హాం గబగబా డెక్ మీదకు పరిగెట్టి ఆ చుక్కలుతోచిన దిక్కువైపు చూశాడు. చీకట్లో ఏమీ కనబడకపోగా మళ్ళీ రాడార్ స్క్రీన్ దగ్గరకు పరిగెట్టాడు. ఇలా కొన్ని నిమిషాల్లో అరడ జనుసార్లేనా కిందికీమీదికీ పరిగెట్టాడు. ఆ చుక్కలు రాను రాను దగ్గరకొస్తున్నట్టుమాత్రం తెలుస్తోంది. కానీ అవి నావ లేనని అతనినమ్మకం. పేల్చడానికి సిద్ధంకమ్మని బోటుకి ఆర్డ రిచ్చాడు.

సాధారణంగా చీకట్లో నావలపైకే కాల్పులు జరుగుతాయి. కానీ పి. టి. 159 మీద గన్నర్లను కిందికి గురిపెట్టి పేల్చమన్నాడు.

ఆ రాత్రి పి. టి. దళాన్ని అల్లకల్లోలంచేయనున్న జాపనీస్ సన్నాహాలు రూపుదాలుస్తున్నాయి. ఆ నాలుగు చుక్కలూ నావలు కాదు. విలాకు కొన్నినిమిషాలలో చేరనున్న జపాన్ డిస్ట్రాయర్లు-'అమగిరి', 'హగికాజె', 'అరాషి', 'షిగురె'.

బ్రాంటింగ్‌హాం కాల్పులు మొదలెట్టనున్నాడన్న సంగతి మిగతా పి. టి. బోట్లకు తెలీనే తెలియదు. 159 సిబ్బంది ఈ వార్త మిగతాబోట్లకు తెలియజేసివుండరు. లేదా ప్రసారం సరిగాలేక వార్తచేరివుండకపోవచ్చు. ఏదేమైనా కెనెడీకి రాడారులేనందువల్లా, ఈవార్త రానందువల్లా శత్రునౌకలు అంతదగ్గరలో వున్నట్టు తెలియలేదు. బ్రాంటింగ్‌హాం కాల్పులుసాగించడానికి బయలుదేరాడన్న సంగతి కెనెడీకేకాక మిగతా కెప్టెన్లెవ్వరికీ తెలియలేదు.

బ్రాంటింగ్‌హాందగ్గరకు రాగానే జపానీస్‌వారు కాల్పులు మొదలెట్టారు. వాటిపరిమాణంబట్టి ఆ ఓడలు డిస్ట్రాయర్లని తెలుసుకున్నాడు. వెంటనే కాల్పులుచేదామన్న ఊహ మానుకున్నాడు. పద్ధెనిమిదివందలగజాల దూరం వుండగా కాక్‌పిట్ పానెల్‌మీద ఎత్తునవున్న రెండుమీటలు నొక్కాడు. వెంటనే గొట్టాల్లోంచి రెండుటార్పెడోలు దూసుకొచ్చాయి. ఓ క్షణంతరువాత మరో రెండు టార్పెడోలను సముద్రంలోకి వదిలాడు. ఆ రోజుల్లో పి. టి. లలో పాతకాలం మార్కు VIII టార్పెడోలు వుండేవి. అవి ఇప్పుడుగురితప్పడమే కాకుండా ఒకటి గొట్టంలోని లూబ్రికేటింగ్‌గ్రీజ్‌కు

నిప్పంటించింది. ఆ మంటలకాంతిలో పి. టి. 159 ఉనికి తెలిసిపోయింది.

ఇంతలో బ్రాంటింగ్‌హాం సెక్షన్ మేట్ పి. టి. 157 లెఫ్టినెంట్ లిబెనో డిస్ట్రాయర్లలో రెంటిని గుర్తించి పి. టి. 159 కి సహాయంవచ్చాడు. అతనూ రెండుటార్పెడోలను వదిలాడు. అవీ గురితప్పాయి. ఈలోగా 159 తాలూకుటార్పెడో గొట్టం మంటలు జపానువారికి స్పష్టమైనగురిగా తోచాయి. ఇక లాభంలేదనుకుని, శత్రువులను దట్టమైనపొగతో కలవర పెడుతూ అతివేగంగా వంకీలుతిరుగుతూ వారిద్దరూ అక్కడి నించి తప్పుకున్నారు. బోట్లచివరనుంచీ ఇలా పొగలువదిలితే దూరానికి అవి బోట్లలాకనబడి శత్రువులకు అసలు గురితేలీ కుండా కలవరపెడుతుంది. ఈవిధంగా 159, 157 బోట్లు బ్లేకెట్‌నుంచి గిజోస్ట్రెయిట్‌కి చేరుకున్నాయి.

విలావైపు నాలుగు డిస్ట్రాయర్లూ క్షేమంగా గశేరె దారిగా వెళ్ళినపుడు లెఫ్టినెంట్ బెరంట్‌సన్ 'ఎ' దళం మొదటిబోటు పి. టి. 171 రాడార్‌మీద మెరిశాయి. అతనికి 'బి' దళం దాడిసంగతి తేలీదు. రాడార్‌మీది ఆ పచ్చటి చుక్కలు 'ఎక్స్‌ప్రెస్' తాలూకువని తోచింది.

171 నాయకుడు వర్జీనియా చార్లొటిస్‌విల్‌కు చెందిన ఎన్‌సైన్ విలియం కలెన్ బేటిల్ టార్పెడోదాడికోసం అతన్ని పదినాట్లవేగంతో దగ్గరగా బోటుని మళ్ళించమన్నాడు. పది హేనువందల గజాలదూరంలో రెండో డిస్ట్రాయర్‌ని గురి చూసి వరసగా నాలుగుటార్పెడోలను వదిలాడు. నాలుగు టార్పెడోగొట్టాలూ అంటుకున్నాయి. టార్పెడోలను తప్పిం

చుకునేందుకు డిస్ట్రాయరు బెరంట్‌సన్ వేపు మళ్ళీ కాల్పులు మొదలెట్టింది. 171 సిబ్బందిమీదంతా నీళ్ళుఎగజిమ్మాయి. వెంటనే 171 బ్లేకెట్‌స్ట్రెయిట్ ద్వారా గిజోస్ట్రెయిటుకి దూసుకువచ్చేసింది. 'ఎ' దళంలోవున్న మిగతా మూడు బోట్లకీ అసలీసంగతే తెలీలేదు.

'ఆర్' 'సి' దళాలకుకూడా ఇలాంటి అనుభవమే అయింది. అవీ ఎన్నిటార్పెడోలను వదలినా నిష్ఫలమే అయింది. నాలుగుదళాలూ మొత్తం ముప్ఫైఏటార్పెడోలను వదలినా 'అమాగిరి', 'హగికాజె', 'అరాషీ', 'షిగురే' ఒక్క దెబ్బైనా తగలకుండా విలాకు సురక్షితంగా చేరాయి.*

ఇక్కడింత తతంగంజరుగుతూంటే పి.టి. 162 లోరీతో బాటు కెనెడీ ఏమీ తెలియకుండా గస్తీతిరుగుతూనేవున్నాడు. పైనించివచ్చిన ఆదేశంప్రకారం టిబివై రేడియోద్వారా లోరీ బ్రాంటింగ్‌హాం దగ్గరనుంచివచ్చే వార్తలకోసం కాచుకొని వుండాలి. వస్తే ఆవార్త లందుకోడానికి కెనెడీ దగ్గరలోనే వుండాలి. కానీ బ్రాంటింగ్‌హాం, లీబెనో ఇలా టార్పెడో దాడి జరిపినట్లు ఏవిధమైన సమాచారమూ రాలేదు.

కోలంబంగారా దగ్గర ప్రేలుళ్ళు కాల్పులు కనబడు తున్నందువల్ల కెనెడీ, లోరీ, వారిసిబ్బందీ, అక్కడేదో జరుగుతోందని తెలుసుకున్నారు. కానీ అవి శత్రు డిస్ట్రా

యర్లు అని అనుకోలేదు. ఒడ్డునున్న జపాను దళం పి. టి. లను పేలుస్తున్నారనుకున్నారు. అంతలో ఒకడిస్ట్రాయర్ తాలూకు సెర్చిలైటు కిరణం, రెండుగుళ్ళూ 109 కి దూసుకుపోవడం తోటి ఒడ్డునున్న శతఘ్నులకి తాము గురి కుదిరామేమోనని సిబ్బంది భయపడ్డారు. కెనడీ "జనరల్ క్వార్టర్స్" అని కేకేసి అందరినీ వారి వారి స్థానాల్లో సిద్ధంకమ్మన్నాడు.

ఈపరిస్థితుల్లో లోరీ కోలంబంగారానుంచి మళ్ళీ బ్లేకెట్ స్ట్రెయిట్ ద్వారా వెల్లాలావెల్లావైపు జారుకున్నాడు. తన సెక్షన్ లీడర్ని అనుసరిస్తూ కెనడీ అక్కడ జరుగుతున్న సంగతేదేనా తెలిసిందా అని లోరీని అడిగాడు. లోరీ లేదని జవాబిచ్చాడు. కాల్పులు ఒడ్డునుంచి వస్తున్నాయేమోనన్నాడు. కానీ 109 రేడియోలోంచి "ఫెర్గుసన్ పాసేజ్లోంచి తరుముతున్నారు. కాల్పులు సాగిస్తున్నాం" అనీ, "అయితే అక్కడనుంచి త్వరగా తప్పుకో" అనీ అప్పుడప్పుడు మాటలు వినిపించసాగాయి. ఎక్కడో బోట్లు కాల్పులు సాగిస్తున్నాయని తోచింది.

కెనడీ, లోరీ, బ్లేకెట్ స్ట్రెయిట్లోకి జారుకుంటున్న సమయంలో 'ఏ' దళం పి. టి. 169 లెఫ్టినెంట్ పాటర్ చీకట్లోంచి వచ్చి చేరుకున్నాడు.

బ్రాటింగ్హాం తరువాత బెరంట్సన్ని కూడా డిస్ట్రాయర్లు తరిమికొట్టినందువల్ల పాటర్కి తన దళంలోని మిగతా రెండు బోట్ల ఆచూకీ తెలియలేదు. బ్రాంటింగ్హాం లిబనోల

పలాయనంవల్ల లోరీ కెనెడీలకి మిగతా దళంవారి ఆచోకీ ఎలా తెలియలేదో పాటర్‌కీ అలాగే జరిగింది.

తమ వ్యూహాలన్నీ ఇలా పాడవడంతోటి కెనెడీ, లోరీ, పాటర్ స్ట్రెయిటులోనే వేచియున్నారు. కటిక చీకటి. ముగ్గురూ ఒకరికొకరు కనబట్టంలేదు. చివరికి ముప్ఫైఎనిమిది మైళ్ళ దూరానున్న రెండోవాకు తాము ఏంచెయ్యవలసిందీ కబురుచెయ్యడానికి నిశ్చయించుకున్నారు. గస్తీ కొనసాగించమని రేడియోద్వారా ఉత్తరువొచ్చింది. తాము ఎటువైపునుంచి వచ్చామోకూడా లోరీకి తెలియలేదు. కెనెడీని అడగ్గా అతను వంగావంగాదరిదాపులకి దారిచూపాడు.

ముగ్గురూ అక్కడ గస్తీ సాగించారు. అటువైపు నాలుగు డిస్ట్రాయర్లు వెళ్ళాయనీ త్వరలో రాబాల్‌కి వెడుతూ అటు తిరిగివస్తాయనీ ఎవ్వరికీ తెలీదు. ఇంకా జపాన్ ఓడలు వస్తాయనే కాచుకు కూచున్నారు.

# 8

"ఎక్స్‌ప్రెస్" విలాని రాత్రి పన్నెండున్నర ప్రాంతా లకి చేరింది. హాగికజె, అరాషి, షిగురె బ్లాంకెటు స్ట్రెయిటు దిగువన ఒడ్డుకు వెయ్యిగజాల దూరంలో సరకు దింపడానికి సిద్ధంగా ఆగాయి. కోలంబంగారా అరుండేల్ ద్వీపాలమధ్య నున్న సన్నటి జలసంధినుంచి ఎవరూ అటకాయించకుండా 'అమాగిరి' వెనుక కాపు కాసింది. అమాగిరి అంటే జపాన్ భాషలో "దివ్యమైన పొగమంచు."

వెంటనే కోలంబంగారానుంచి హాంగ్‌కాంగ్ హార్బర్‌లో ఓడలచుట్టూ జన్క్-పడవల్లాగ డజన్లకొద్దీ నావలూ, సరకు దింపుకునే పడవలూ వచ్చి మూడు డిస్ట్రాయర్లచుట్టూ చేరాయి. నావికులు ఆహార పదార్థాలూ, మందుగుండు సామాను పెట్టెల్లో దించసాగారు. సోల్జర్లు దింపుకోడానికి లేండింగ్ వలలు వేశారు.

అంతా అతి చురుగ్గా వేగంగా జరగసాగింది. ఇంజన్లు ఆపేసివున్నందువల్ల డిస్ట్రాయర్లు శత్రునౌకలుగాని విమా నాలు, సబ్‌మెరైన్లు కంటబడితే సులభంగా పేలిపోయే

ప్రమాదం వుంది. పొద్దుపొడిస్తే అమెరికన్ ఫైటర్ విమానాల ప్రమాదం వున్నందువల్ల నావికులు ఎంతత్వరగా అయితే అంతత్వరగా పనిముగించుకుని బయలుదేరుదామని చూస్తున్నారు.

దిగుతున్న సైన్యాన్ని తొందరచేయసాగారు. చీకట్లో తడబడుతూ దిగుతున్న సైనికులకు చిరాకేసింది. రాబాల్‌కి తిరిగివెళ్ళేది తాముకాదుగా ఎందు కింత తొందర అనిపించింది.

ఎంత సణుగుడూ కంగారూ అయినా సరుకు, సైన్యం దిగడం చకచకా సాగిపోయింది. చిన్న ఆఫీసర్ల చేతుల్లో అప్పుడప్పుడు కాయితా లంటించిన బేటరీలైట్ల మసక వెలుగు తప్పితే అంతా చీకటే. మూడుడిస్ట్రాయర్ల మీదా ఒకో - దానిమీద పాతికేసి నావికులున్న నాలుగు దళాలు సరకు దింపారు. నాలుగుదళాలూ ఒకో ఓడమీద ముందూవెనకా నాలుగువైపులా వున్నారు. నావలు ఆయా స్థలాల్లో వరసగా వచ్చాయి. ఓనావ సరకుతో నిండగానే అది తప్పుకుని వెనకున్న నావ ముందుకొచ్చేది.

డిస్ట్రాయర్ల బ్రిడ్జీలమీద మసక జేసిన సిగ్నల్ దీపాలున్నాయి. ఒకోఓడకి ఒకోరంగుదీపం స్థిరపరచివుంది. వచ్చిన అరగంటలోగానే 'హగికాజె' మీది మసకబారిన ఎర్రదీపం 'తిరిగి వెళ్ళొచ్చు' అని సంజ్ఞచేసింద. అప్పటికే తొమ్మిది

వందల సైన్యం, డెబ్భై టన్నుల పైగా సరకూ ఒడ్డు చేరుతోంది.

డిస్ట్రాయర్ల ఇంజన్లు స్టార్టయ్యాయి. వేడి అందుకోడానికి అయిదునిమిషాలు ఆగి 'హగికాజె' ఫ్లాగ్‌షిప్‌లో వున్న కెప్టెన్ కాజు సుగియురె బయలుదేరమని సంజ్ఞచేశాడు. బ్లేకెటు జలసంధిలో పి. టి. బోట్లు పొంచివుండివుంటాయన డానికి తగిన కారణాలున్నా జపానువారు కోలంబంగారా దక్షిణపుటొడ్డు చుట్టే వెళ్ళేవారు. కులా సిందుశాఖలోవున్న డిస్ట్రాయర్లు క్రూయిజర్లమీద పి. టి. లే తక్కువప్రమాదం అని వారివుద్దేశం. కెప్టెన్ బర్క్, కోలంబంగారా ఉత్తరాన ఆరు డిస్ట్రాయర్లతో వేచి ఉన్నాడని వారికి తెలియక పోయినా అనుభవం ఆ సంగతి స్ఫురింపచేసింది. పి. టి. బోట్లు ఎంతకంగారుపెట్టినా డిస్ట్రాయర్లు క్రూయిజర్లతాలూకు బలమైన శతఘ్నులముందు ఇవి ఫరవాలేదని జాపనీస్ నావికుల అభిప్రాయం. డిస్ట్రాయర్లువున్న విలాలో నలభైఅయిదు నిమిషాలూ అమగిరిమీదున్న కమాండరు హనామీకి నిమిష మో యుగంగా తోచింది. బ్లేకెటుజలసంధి దిగువ తారట్లాడుతూ ఎప్పటికప్పుడు ఏ పి. టి. బోటు, డిస్ట్రాయరు పిచివైల కంటబడతాయోనని కంగారుపడుతూ నేవున్నాడు.

చుట్టూవున్న దీవుల్లో అంతా జపానీస్ సైన్యమే. అయినా జపానీస్ నౌకలకు ఈ సన్నటిపీటిపాయలు ప్రమాద భరితమైనవి. ఎటుతిరిగినా అటు ఒక అమెరికన్ 'మేక్ ఆఫ్ వార్' నౌక వుండవచ్చునని కమాండర్ హనామీకి తెలుసు. నీటికిందున్న రాళ్ళమూలంగా అక్కడ రాత్రి ఓడనడపడం

ప్రమాదకరం. సాలమన్స్‌లో ఈ ప్రాంతం ఎగుడుదిగుళ్ళు మొదలైనవి తెలిపే మ్యాప్‌లులేవు. పైగా అమాగిరికి రాడార్ లేదు. కానీ లెన్ అఫిక్సెడ్ వైడ్ యాంగిల్ నైట్ బైనాకులర్సుతో చీకట్లోకూడా పరిసరాలు క్షుణ్ణంగా తెలుసుకోగల సుశిక్షితులైన మనుష్యులు అప్రమత్తులై పరిశీలిస్తూవుంటారు.

హగికాజె, అరాషి, షిగూరె కోలంబంగారా ఒడ్డు పక్కనించి తిరిగిబయలుదేరుతున్నాయని కెప్టెన్ సుగియురె సంజ్ఞచెయ్యగానే కెప్టెన్ హనామిామనసు తేలికపడింది. వెంటనే కాక్స్‌మెయిన్ (ఓడనడిపేవాడు) కి వేగంపెంచించి ఆ డిస్ట్రాయర్లను కలుసుకోమని ఇర్డరిచ్చాడు.

దాదాపు అమాగిరి వెడుతున్నదారిలో కొన్నిమైళ్ళ అవతల పి. టి. 109 వుంది. పి. టి. 162, 169 ల వెనుకగా కెనెడీ పి. టి. 109 ని కోలంబంగారానుండి గిజీవైపు ఉత్తర దిక్కుగా నడుపుతున్నాడు. వంగావంగా అవతల గస్తీవుండి ఏమవుతూందో గమనించమనితప్పితే కెనెడీకి వేరే ఉత్తర్వు రాలేదు. ఆ కటికటిలో చీకశత్రునౌకరాక కేవలం ఊహించడమే సాధ్యం. చూపుకేమీ ఆనటంలేదు.

బ్లేకెట్ జలసంధి మధ్యన శత్రునౌకల జాడలేమీ కన బడకపోగా కెనెడీ ఒక ప్రమాదమైన నిర్ణయానికివచ్చాడు. పాటర్, లోరీల బోట్లదగ్గరకువెళ్ళి తాము ముగ్గురూ వెనక్కు తిరుగుదామని సూచించాడు తాము మొదట చెల్లాచెదరైన ప్రాంతంలోకి తిరిగివెడితే మిగతాబోట్లుఆచోకి తెలుస్తుందని అతనినమ్మకం. మిగతాఇద్దరూ సరేనన్నారు. మూడుబోట్లూ

వెనక్కుతిరిగాయి. ఇప్పుడు కెనెడీబోటు ముందుంది. ఆగ్నేయ దిక్కుగా అంటే అమాగిరి ముప్ఫైనాట్లవేగంతో వస్తున్న దిక్కుగా బయలుదేరారు.

విశాలంగావుండే వెల్లాసింధుశాఖ ఎప్పుడొస్తుందాఅని కమాండర్ హనామీ అమాగిరి బ్రిడ్జి కుడివైపుననుంచుని చీకట్లోకి దీక్షగాచూస్తున్నాడు. ఎడంవైపున కెప్టెన్ యిమాషిరో పచార్లుచేస్తున్నాడు. ఇద్దరిమధ్యనా తనసిబ్బంది తయారుగా ఉన్నారోలేదో చూసుకుంటూ టార్పెడో ఆఫీసరు లెఫ్టినెంట్ (జెజి) హిరోషిహొసాకా నుంచునివున్నాడు. కాక్స్‌వేన్ కజూటోడోయ్ వీల్‌తిప్పుతూ ఓడనడుపుతున్నాడు.

ఓడమీది సిబ్బందిఅంతా వారివారిస్థానాల్లో సిద్ధంగా వున్నారు. 'లుక్ఔట్' ప్రత్యేకసిబ్బంది బైనాకులర్సుద్వారా పరిసరాలన్నీ పరిశీలిస్తున్నారు. వైద్యోద్యోగి లెఫ్టినెంట్ నకాజిమా బ్రిడ్జివెనకాల తనగదిలో వేచివున్నాడు. పెట్టీఆఫీసరు 2/సి మిట్సువాకీ సవాడా, రాబాల్‌కి ప్రమాదంలేకుండా తిరిగి వెళ్ళగలమా అనుకుంటూ ముందున్న గన్‌టరెట్ కిటికీలోంచి బయటకుచూస్తున్నాడు. గన్నరీఆఫీసరు లెఫ్టినెంటు (జెజి) షిగియో కనజావా బ్రిడ్జిపైకప్పుమీద పొంచివున్నాడు.

ఇక్కడ పి. టి. 109 మీద ఫోర్‌డెక్‌పైన 37-మిలిమీటర్‌గన్‌పక్కన ఎన్‌సైన్ రాస్ నుంచునివున్నాడు. అతని వెనక వీల్‌వద్ద కెనెడీ వున్నాడు. అతనికుడివైపున మెగ్వ్యార్, మెగ్వ్యార్‌కి వెనుక ఎగువన ఫార్‌వార్డుగన్‌టరెటులో మార్నీ ఉన్నారు. కెప్టెన్ ఎడమవైపున కాక్‌పిటుకి బైట ఎన్‌సైన్

థామ్ డెక్ మీదపడుకునివున్నాడు. కాక్‌పిట్ వెనకాల మావర్ నించున్నాడు. చెల్లాచెదరైన బోట్లు ఈ జలసంధి ప్రాంతాల్లోనే ఉండిఉండాలి' వాటిని కెనెడీ అన్నట్టు కలుసుకోలేక పోతామా అనుకుంటూ పరిచితమైనఆకారం ఎక్కడైనా గోచరిస్తుందేమోనని మావర్ చీకట్లోకి శ్రద్ధగాచూస్తున్నాడు.

మధ్యభాగాన ఆల్బర్టు గస్తీవున్నాడు. ఆఫ్‌డ్యూటీలో వున్న హేరిస్ కుడిప్రక్కనవున్న టార్పెడోగొట్టం డేరూంకే నోపీలమధ్య డెక్ మీద నిద్రపోతున్నాడు. తన కేపోక్ జాకెటు తీసి తలగడాకింద పెట్టుకుని పడుకున్నాడు. మెక్ మహావ్ ఇంజనుగదిలో అప్రమత్తుడై వున్నాడు. ఇంజనుగది కెళ్ళే ద్వారంపక్కన డెక్ కుడివేపున జాన్‌స్టన్ కునికిపాట్లుపడుతున్నాడు. జిన్సర్ ఆదగ్గరే నించునివున్నాడు. వెనకున్న గన్‌టరెట్‌లో స్టార్కీ గస్తీవున్నాడు. కిర్క్‌సీ డ్యూటీలో లేనందువల్ల కుడివేపున పడుకునివున్నాడు.

బోటు నిశ్శబ్దంగా కదులుతోంది. చీకట్లోకి పరికిస్తున్న రాస్‌కి మెల్లగావీస్తున్నగాలి బోటుకి కొట్టుకొంటున్న అలల శబ్దంమధ్య ఇంజనుశబ్దం వినిపించీవినిపించనట్టుంది. అతనికి చక్కగా తెరచాపపడవమీద హాయిగా తేలిపోతున్నట్టుంది. అక్కడ నీరులోతుకనక కిందరాళ్ళభయంకూడా లేదు.

'ఓడ కనిపిస్తోంది' అని కమాండరు హనామీకి హెచ్చరిక వినవచ్చింది.

"మళ్ళీచూడు" అన్నాడు హనామీ.

గన్‌టరెటులోంచి మార్నే కెనెడీని ఉద్దేశించి "షిప్ ఎట్ టూ ఓ క్లాక్" అని అరిచాడు.

కెనెడీ వాలుగా అటువేపు చూశాడు.

భాస్వరంతో వెలిగిన ఓ కెరటం వెనక ఉన్నట్టుండి రూపుదాలుస్తున్న ఆకారంవేపు రాస్ వేలుచూపాడు. ఓక్షణం సేపు కెనెడీ అదిచెల్లాచెదురైన ఓ పి. టి. బోటు తాలూకు దనుకున్నాడు. మావర్ కూడా అదే తలచాడు. ఆ క్షణంలో అమాగిరిని చూసిన పి. టి. 162 పి. టి. 169 సిబ్బందికూడా ఇదే అనుకున్నారు. ఆ ఆకారం రానురాను పెద్దదవగానే కెనెడీ, మావర్ అది పి. టి. బోటుకాదని తెలుసుకున్నారు. పి. టి. 169 మీదనుంచి పాటర్ రేడియో ద్వారా ప్రమాదం తెలియజేశాడుకానీ అది 109 కి ప్రసారమైనా అవకపోయివుండాలి; లేక అంతాఅయిపోయిన తరువాతేనా వచ్చివుండాలి.

కెనెడీ చాలా మామూలుధోరణిలో 'లెన్నీ! ఇటు చూడు' అన్నాడు.

ఎన్‌సైన్ థామ్ లేచి నించున్నాడు.

ఆ తరవాత జరిగినది నలభై సెకన్లలోపు కాలంలో జరిగిపోయింది.

అమాగిరి ఫార్వార్డుగన్ టరెట్టూలోని పెట్టీఆఫీసరు సవాడాకి కాల్పులు మొదలెట్టమని ఉత్తర్వొచ్చింది. ఆ చిన్న బోటుకి డిస్ట్రాయరు బాగాదగ్గరకొచ్చేసినందువల్ల శతఘ్నులు కిందికివాల్చి గురిచూడ్డానికికూడా వీలులేకపోయింది.

పి. టి. 199 ఫోర్ డెక్ మీద రాస్ వ్రైకితోందరలో ఒకగుండు 37-మిలిమీటర్ శతఘ్నిలోకి దట్టించప్రయత్నిం

చాడు. అది మధ్యలో ఎక్కడో ఆగిపోయింది. మళ్ళీ దట్టించ డం అసాధ్యమని అతనికి తెలుసు.

కమాండరు హనామీ ముందున్నది అమెరికన్ పి. టి. బోటని తెలుసుకున్నాడు. దాన్ని గుద్దెయ్యడమే ఉత్తమ మార్గమని నిశ్చయించాడు.

"హర్డు ఎ-స్టార్ బోర్డు" అని అరిచాడు.

ముందున్నది పి. టి. అని ఎప్పుడు తెలిసిందో కాక్స్ వేన్ డోయ్ కూడా ఇలాటిపరిస్థితుల్లో అలాచేయడమే క్షేమ మని వినిఉన్నాడుకనక వెంటనే అర్థంచేసుకున్నాడు. కుడివైపు పదిడిగ్రీలకోణంలో వీల్ తిప్పాడు.

రాస్ మొదట డిస్ట్రాయర్ తమబోటుకి సమాంత రంగా నడుస్తోందనుకున్నాడు. కానీ ఇపుడు చూస్తే దాని సన్నటి మాస్ట్ హీల్ స్పష్టంగా పి. టి. 109 వేపే తిరిగి వస్తు న్నట్టు గమనించాడు.

"జనరల్ క్వార్టర్సు అని హెచ్చరించు" అని కెనెడీ మెగ్వార్ కి చెప్పాడు.

మెగ్వార్ వెనక్కితిరిగి కాక్ పిట్ లోంచి రెండడు గులు ముందుకేసి "జనరల్ క్వార్టర్సు" అని అరిచాడు.

"అంతా సిద్ధంగావుండాలట" అన్నాడు ఆల్బర్టు స్టార్కితో. స్టార్కి-స్థానం అప్పర్ స్టార్ బోర్డుటార్పెడో అయి నందువల్ల పోర్టుగన్ టరెట్ నుండిదిగి డెక్ మీాదనుంచి పరి గెట్టాడు.

కాక్‌పిట్‌కి తిరిగివెళ్ళిన మెగ్యూర్ తనమెడని గొలుసు కున్న మహత్తుగల తాయెత్తుబిళ్ళను స్పృశించాడు. రాస్ బోగన్‌కింద దూరాడు.

అమాగిరిమీద లెఫ్టినెంట్ హోసాకా టార్పెడోలను వదలుదామనుకున్నాడుగానీ ఆ ఆలోచన విరమించు కున్నాడు. పి. టి. 109 బాగా దగ్గరున్నందువల్ల టార్పె డోలో దానికిందనించే వెళ్ళిపోతాయిగానీ పేలవు.

కెనెడీకికూడా అమాగిరిమీద టార్పెడోలను వదులుదా మన్న ఆలోచనవచ్చింది. కానీ ఓడ చాలాదగ్గరకొచ్చేసి నందుమూలంగా టార్పెడోలు ఓడకితగిలినా పేలివుండేవి కావు. పైగా పి. టి. 109 మూడింటిలో రెండుఇంజన్లు ఆగి వున్నాయి. బోటు మందంగా నడుస్తోంది. డిస్ట్రాయరు దూకుడు తప్పించుకోడం కలలోనిమాట.

ముందుఏమొస్తోందో చూడగానే మెగ్యూరు తాయెత్తు ముట్టుకుని ప్రార్థనప్రారంభించాడు. ఇంతలోనే ఉక్కుతో చేసిన అమాగిరి ముందరిభాగం పి. టి. 109 కుడిప్రక్కన కాక్‌పిట్ పక్కన వచ్చి గుద్దింది.

గాయపడిన కోవాల్‌బదులు ఫార్‌వర్డుటరెట్‌లోవున్న కొత్తవాడు హెరాల్డ్‌మార్నె బహుశా ఆ తాకిడికి నలిగి చచ్చిపోయాడు. తరువాత అతనిశవంకూడా కనబడలేదు.

కెనెడీ చేతుల్లోని వీల్ ఎవరో లాగేసినట్టయింది. కాక్‌పిట్ వెనక గోడకి విసిరివేయబడ్డాడు. ఓమా రెప్పుడో బెణికివున్నవీపుకాస్తా ఒక ఇనపచట్రానికి కొట్టుకుంది. తాకిడి

ఓకోణంలో జరిగిందికానీ లేకపోతే అతనూ మార్నేలాగే నలిగిపోయివుండేవాడు. డిస్ట్రాయరు గన్‌టరెట్‌లోనుంచి చొచ్చుకునివెళ్ళి కిందపడివున్న కెప్టెన్‌కి కొద్దిఅడుగుల తేడాలో కాక్‌పిట్ వెనుకగా ఏటవాలుగా చీల్చుకొని పోయింది. డిస్ట్రాయరు తనబోటు ముందుభాగాన్ని వెనక వేపు స్టారుబోర్డుప్రాంతాన్ని వేరుచేస్తూ భయంకరంగాచీల్చి చెండాడుతూ సాగిపోవడం కెనెడీ నిస్సహాయంగా చూస్తూవుండి పోయాడు.

ఇంజన్‌గదిలోనున్న మెక్‌మహన్‌కి ఈ ప్రమాదం గురించి అసలు తెలీదు. మేనిఫోల్డ్సు వేడెక్కకుండా గమ నిస్తూ ఇంజను చల్లబడడానికి సముద్రపునీరువచ్చే స్కూప్ కంట్రోళ్ళను సరిచూచుకుంటూ మామూలుగా నించుని వున్నాడు. ఉండుండి అన్నీ ఒకేసారి వేడెక్కకుండా ఒక ఇంజనుతర్వాత మరోఇంజనుని స్టార్టుచేస్తూవచ్చాడు.

ఉండుండి అతనిదృష్టి కొలమానం యంత్రం ఒకదాని మీదికి పోయింది. ఏదోవింతగాతోచింది. సరిగ్గాచూద్దామని మెషీనుమీదకి ఎక్కబోతూవుంటే పెద్దకుదుపు స్టార్‌బోర్డు బల్క్‌హెడ్‌మీదకి విసిరేసింది. ఆక్సిలరీజెనరేటర్‌పక్కన చతి కిలబడ్డాడు. డేరూంనుంచి ఇంజనుగదిలోకి ఎర్రటి మంటల ప్రవాహం జొరబడడంచూసి తెల్లబోయాడు. రెండుగదులకీ మధ్య అడ్డుంది. దాన్ని రెండోవాసించి బయలుదేరేముందు తనే సరిచూశాడు. మరి మంటలు ఎలా వస్తున్నాయో అత నికి అర్థంకాలేదు. ఆ అడ్డుగోయ్యా, బల్క్‌హెడ్డూ రెండుగా చీలివున్నాయనీ ఒరిపిడిమూలంగాలేచిన నిప్పురవ్వలవల్లో ఎలె

క్ట్రిక్ కేబిల్ తెగిపోయినందువల్లో డేరూంపైనున్న గెసొలీన్ టాంకులు అంటుకున్నాయనిగానీ అతనికి తెలియలేదు.

మంట లతన్ని చుట్టుముట్టాయి. చొక్కా, పేంటు పైకి మడిచివున్నాయికనక మోకాళ్ళూ, చేతులూ, మొహమూ మాడిపోయాయి. మంటలు ఊపిరితిత్తులలోకి వెళ్ళకుండా గాలి ఎగబట్టాడు. అంతటిమంటల్లోనుంచి మరుక్షణంలో నీళ్ళల్లో వున్నట్టు తెలుసుకున్నాడు. ఊపిరితిత్తులు పేలిపోయేట్లు వున్నాయి. డిస్ట్రాయరు చీల్చేసినందువల్ల మండుతున్నబోటు వెనకభాగం ఇంజన్లబరువువల్ల నీటిలోనికి దిగిపోయింది. అసలు ఈ విషయమే అంతుచిక్కని మెక్ మహాన్ పైకి తేలు దామని ప్రయత్నించాడు. కిందనుంచి పైనీరు మంటలతో ఎర్రగా కనిపిస్తోంది. ఎట్టకేలకు నీటిపైకిలేచిన మెక్ మహాన్ కు చుట్టూరా దావానలం కనిపించింది. నీటిమీద వ్యాపిస్తున్న, పెట్రోలుమంటలు కొద్దిమైళ్ళ దూరంలో కొండమీద వున్న లెఫ్టినెంట్ ఇవాన్స్‌కి కూడా కనిపించాయి. ఏ ఓడో అంటు కున్నదని గ్రహించి దానిగురించి కొంతసేపట్లో వార్తవస్తుంది కదా అని అతను వూరుకున్నాడు.

జాన్స్టన్ కూడా మెక్ మహాన్ వున్న పరిస్థితిలోనే వున్నాడు. నిద్రలోవున్న అతన్ని, ఆతాకిడి, బరువైన ఆర్మీ బూట్లు, ఉక్కుటోపీ, నీలంచొక్కా, లాగూ, కేపక్ లతో సహా నీటిలోకి విసిరేసింది. కళ్ళు తెరవగానే డిస్ట్రాయర్ హాల్ కనిపించింది. కంగారుగా పైకిచూస్తే డెక్ మీద జపనీస్ నావి కులు పరుగులెడుతున్నారు. బోటును చీల్చుకుంటూ వెళ్ళిన అమాగిరి వెనుకభాగం దాకా వచ్చేసరికి ఆతాకిడి అతన్ని

నీటిలోనికి పీల్చేసింది. సుడిగుండంలాగా అతన్ని తలక్రిందులుగా లోనికి లాక్కుపోయింది.

జాన్‌స్టన్‌కి అవే తన చివరిఘడియలేమో ననిపించింది. దేవుణ్ణి తలుచుకోలేదు. భార్య నెతాలీ గుర్తొచ్చింది. సుడిగుండం ధాటీ కొంచెంతగ్గి కొంచెం పైకిలేచాడు. ప్రయత్నం నిష్ఫలమేమో ననిపించింది. తాను ఎంతలోతున వున్నాడో అంతు తెలియలేదు. చావుకి సిద్ధపడ్డాడు. వెంటనే భార్య గుర్తొచ్చింది. తను పిరికివా డనుకోదూ! మళ్ళీ పైకిరాడానికి ప్రయత్నించాడు. ఊపిరితిత్తులుఉబ్బి పేలిపోయేట్లువున్నాయి. అంతా చీకటి అవడంతో ఇంకా తను అగాధంలోనే వున్నాననుకున్నాడు. ఇక అసలు లాభంలేదేమో! కాదు కాదు నా ప్రయత్నం లేకపోతే నెతాలీ తన్ను పిరికివాడికింద జమకట్టేస్తుంది. ఆశ వొదులుకో కూడదు. మెల్లిగా పైకిలేవబోయాడు. పైన మంటల ఎరుపు తోచింది, ఆశ చిగురించింది. చేతులూ కాళ్ళూ కొట్టుకుంటూ మంటలు దగ్గరికి రాకుండా జాగ్రత్తపడుతూ మొత్తానికి పైకిలేచి గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు.

పి. టి. 109 ని అమాగిరి చీలుస్తూన్నపుడు కెప్టెన్ యమాషిరోకి మాదికాలిన వాసనవేసింది. లెఫ్టినెట్ హానాకాకి బ్రిడ్జిమీాద వేడితగిలింది. వైద్యదళానికి చెందిన పెట్టీ ఆఫీసర్ యొషిటకా యమజాకి డెక్‌మీాదనుంచి సిక్‌బేకి దారితీస్తూండగా ఎవరో–ముందు పి. టి. బోటు ఓటుందని అరిచారు. ఢప్‌మని శబ్దంవినిపించి మంటలు ఎగజిమ్మడంతోటి

అమెరికన్లు అమాగిరిమీద టార్పెడో వదిలారేమోనని వణికి పోయాడు.

టార్పెడో స్థానంనుంచి పెట్టీ ఆఫీసర్ మసయోషి టకాషిమా "ఏమైంది ఏమైం"దని అరిచాడు.

పోర్ట్ పక్క నిప్పంటుకుందని పిగియోటా కేమురా చెప్పాడు. టా కేమురా టార్పెడో సిబ్బందికి చెందిన కమ్యూని కేషన్స్ మనిషి. అమాగిరిచెయ్యలేనిపని శత్రువుల టార్పెడో సిబ్బంది సాధించారని అనుకున్నాడు. మంటలు డిస్ట్రాయర్ లోంచే వస్తున్నా యనుకున్నాడు.

స్టార్ బోర్డు ఇంజన్ గదిలో పెట్టీ ఆఫీసర్ షిగియో యోషికవా కంగారుపడ్డాడు. లెఫ్టినెంట్ షిగెరునిషినోసోనో ఓడ ఇంజన్లు అటూఇటూ కదులుతున్నట్టు గమనించాడు. పోర్ట్ ఇంజన్ గదిలో పెట్టీఆఫీసర్ యోషిగిహిరామట్సుకి ఓడబయట భాగానికి ఏదోగీసుకున్న శబ్దం వినవచ్చింది. ఓడకిందిరాళ్ళ కేదేనా తగులుకుందేమోనని భయపడ్డాడు. కుడివేపు ప్రొపెల్లరు కడ్డీ అదరడం గమనించాడు. ఆక్సిలర్ ఇంజన్ గదిలో పెట్టీఆఫీసర్ టకావోటాన్ దభేల్ మన్న శబ్దం విని టార్పెడో తమఓడను కొట్టిందేమోనన్న భయంతో డెక్ మీదకు పరిగెట్టుకుని వచ్చాడు.

అమాగిరి ఆగలేదు. పి. టి. 109 మీదికి రెండు కాల్పులు సాగించింది. రెండూ గురితప్పాయి. ఈలోగా అదరడం ఎక్కువైనందువల్ల సంగతేమిటో కనుక్కుందామని హనామీ ఓడ వేగం తగ్గించమన్నాడు. స్టార్ బోర్డు ప్రొపె

ల్లర్ రెక్క ఒకటి చెక్కుకు పోయివుంది. అందువల్లే ప్రొపె ల్లర్ షాఫ్టు అదురుతోంది. ఓడ ముందుభాగం సొట్టపడింది. ఇవితప్పితే వేరేనష్టమేమీ కలగలేదు. ఎవ్వరికీ దెబ్బలు తగల్లేదు.

ఓడవేగం ఇరవైఎనిమిదివాట్లకి తగ్గిస్తే అదురుతగ్గింది. హనామీ ఓడను అలాగే నడిపించాడు. హగికాజె, మంట లెందుకొచ్చాయని కనుక్కోగానే ఓపి.టి. బోటును ముం చేశామని మిగతా మూడుఓడలకీ రేడియోద్వారా తెలియ జేశాడు. పిగురే ఓడమీదవారు నెత్రి ఆనందంతో జయధ్వా నాలు చేశారు. తమపని అంత విజయవంతంగా పూర్తిచేసు కుని నాలుగు డిస్ట్రాయర్లు రాబాల్ కి తిరిగి చేరుకున్నాయి.*

అమాగిరి ధాటికి అటూఇటూ ఎగిరిపడినా కెనెడీ, రాస్, మావర్, మెగ్వ్యార్ పి. టి. ముందుభాగంమీదే వున్నారు. ఆభాగం కింద గదులు నీరుచొరకుండా కట్టడిచేసి వున్నందున ఇంకా తేలుతూనేవుంది. డెక్ మీద విసురుగా పడిన మావర్ కి కుడిభుజం దెబ్బతింది. మెగ్వ్యార్ కాక్ పిట్ లోనుంచి డేరూం కేనొపీమీదికి ఎగిరిపడ్డాడు. అతని హెల్మెట్ కనుబొమలమీదికి దిగిపోయింది. బలవంతాన దాన్ని పైకి

---

* ఎనిమిది నెలల అనంతరం కమాండర్ హనామీ బదిలీఅయిన కొద్ది కాలానికే 'అమగిరి' ని ముంచివేయడం జరిగింది. ఆయసాంతపు మందుగుండుగని పేలి జరిగిన ఈ ప్రమాదంలో చాలామంది ప్రాణాలు కోల్పోయారు. ఈ సంఘటన బోర్నియో సమీపంలోని బాలిక్ పాపన్ జలసంధివద్ద జరిగింది.

లాగే సముద్రానికి పక్కనించి చీల్చుకు వెళ్ళిపోతున్న అమా గిరి కనబడింది.

డిస్ట్రాయర్ తాకిడికి డెక్ ఎడంవేపుకి ఒరిగింది. రాస్ బో గన్ నీటిలోకి వదిలేశాడు. లేకపోతే దానితోబాటు తననీ నీటిలోకి లాగేస్తుందేమోనని భయమేసింది. మొదట లేచిన మంటల్ని చూసి సెర్చిలైటు అనుకున్నాడు. ఇహ శత్రువులు కాల్పులు సాగిస్తారని భయపడి కుడివైపున నీటిలోకిదిగి బోటు పక్కన దాక్కున్నాడు. పెట్రోలు ఆవిరి పొగలు ఉక్కిరి బిక్కిరి చేసి మూర్ఛపోయాడు.

కాక్‌పిట్ మూలనించి కెనెడీ లేచాడు. అతనికొచ్చిన మొదటి ఆలోచన వేడికి పెట్రోలు టాంకేదేనా పేలుతుం దేమోనని. "అందరూ నీటిలోకి దూకం"డని అరిచాడు.

"నాకోసం కాస్త ఆగండి" అన్నాడు మెగ్వ్యార్. అతని రబ్బరు లైఫ్‌బెల్ట్ ఊదితే పనిచెయ్యలేదు. చార్ట్ హౌస్‌లో మరోటివుంది. కానీవెళ్ళి తెచ్చుకునేలోగా తనను వది లేసి వెళ్ళిపోతారేమోనని అతనిభయం. కెనెడీ అతనువచ్చే దాకా ఆగాడు. అక్కడున్న చెత్తాచెదారంమీద చేయేసి నీటి లోకి దూకాడు. మెగ్వ్యార్, మావర్ కూడా దిగారు. కెనెడీకి ఒంటిమీద నొప్పివమీ తోచలేదు. అమాగిరి వెళ్ళినపుడొ చ్చిన కెరటాలు కెనెడీ దూకినచోట మంటల్ని పక్కకి తోసే శాయి.

ముగ్గురూ క్షేమప్రదేశానికి ఈదుకువెళ్ళారు. పి. టి. 109 ముందుభాగం చితికిపోయి వంటరిగా, రెండువందల నిలు

వులలోతు నీటిలో బుసలుకొడుతూన్న మంటలమధ్య తేలుతూ కనిపించింది. వెనుకభాగం పూర్తిగా నీటిలో మునిగిపోయింది.

చావు ముంచుకొచ్చేస్తోందన్న నమ్మకంతో వున్న ఆండ్రూ జాక్సన్ కిర్క్సీ మార్క్సీతో బాటు మరణించాడు. కిర్క్సీ డిస్ట్రాయరు వెనుకభాగంవేపు చీల్చుకువచ్చినచోట స్టారుబోర్డువైపు పడుకునివున్నాడు. అతను అమాగిరి తాకిడికి చనిపోయి నీళ్ళల్లోకి విసిరికొట్టబడేనావుండాలి లేక నలిగిపోయి బోటు వెనుకభాగంతో బాటు మునిగిపోయేనావుండాలి. ఎవ్వరికీ తెలీదు. ఎన్సైన్ థామ్, మెక్మహన్, జాన్స్టన్, ఆల్బర్టు, హేరిస్, స్టార్కీ, జిన్నర్, ఎన్సైన్ రాస్లాగే ఆ మంటల్లో ఆ ఆవిరిపొగల్లో తేలుతున్నారు. కొందరు స్పృహతప్పి ఉన్నారు.

డెక్ మీద లైఫ్బెల్టు తలగడాగా పెట్టుకున్న హేరిస్ పీడకలవచ్చినట్లు ఉలిక్కిపడ్డాడు. ఒకపెద్దఓడ తనవేపే కత్తిలా చీల్చుకుంటూరావడం చూశాడు. ఎగిరిగంతేసి టార్పెడో గొట్టంమీదనుంచి పక్కకిదూకేశాడు. అతనింకా నీటిని తాకకముందే అమాగిరి పి. టి. 109 లోకి చొచ్చుకుపోయింది. బోటులోని ఓభాగం-బహుశా గొట్టంతాలూకు ముక్కఅయి వుండచ్చు-ఎగిరివచ్చి ఎడంతొడకి నొప్పిపుట్టేట్లు తగిలింది. క్షేమంగా నీటిలో దిగుదామనుకున్నవాణ్ణల్లా మరో కొన్ని గజాలదూరానికి విసిరేసింది. చీకట్లోంచి మంటలులేవడం చూశాడు. నీటిలో చతికిలపడ్డట్టుబడ్డాడు. లైఫ్బెల్టు ఒంటికిముడేసి లేకపోయినాకూడా వున్నందుకు ఆశ్చర్యపోయాడు. సంతోషించాడు.

ఓ క్షణంక్రితం దిండులాపనిచేసిన ఆ కేపోక్ ఇప్పుడు గుండెచుట్టూ చుట్టుకునివుండి తేలేట్లుచేసింది. పడుకున్నవాడు లేచిగెంతి నీటిలోకిదూకే మధ్య నెప్పుడో దాన్నికూడా లాక్కునిఉంటాడు. కానీ అతని కేమీ గుర్తులేదు. కళ్ళల్లోంచి ఉప్పునీరు తుడుచుకుని చూసేప్పటికి డిస్ట్రాయరు వెనుకభాగం చీకటిలోకి అదృశ్యమవడం కనిపించింది. రెండుకాల్పులు విని పించాయి.

జిన్సర్ గానీ స్టార్కుగానీ అసలు అమాగిరిని చూడనే లేదు. డెక్ మీద జిన్సర్ కి 'జనరల్ క్వార్టర్సు' అన్న కేక వినిపించిన మరుక్షణం గాలిలోకి ఎగురుతున్నాడు. ఓ క్షణం మంటలు కనిపించాయి. వెంటనే స్పృహతప్పింది. కుడివైపు టార్పెడోగొట్టంవద్ద తనస్థానానికి నడిచివెడుతూండగా స్టార్కుని ఏదో తిప్పితిప్పికొట్టింది. శతఘ్నిగుం డనుకున్నాడు. హెల్మెట్ లేచిపోయింది. చితికిపోయి మంటలుకమ్ముకున్న ఓ గదిలో పడ్డాడు. నరకమంటే ఇలాగే ఉంటుందేమో నను కున్నాడు. స్పృహతప్పి పడిపోయాడు.

బోటుచుట్టూరా నీటిమీద మంటలు ఆరిపోగానే ఇక పెట్రోలుటాంకు పేలడానికి అవకాశంలేదని కెనెడీ గ్రహిం చాడు.

మెగ్వ్యార్, మావర్లతోకలిసి బోటుదాకా ఈదుకెళ్ళి డెక్ ఎక్కాడు. కెన్నెడీచెప్పగా మెగ్వ్యార్ 'బ్లింకర్' తీసు కొచ్చాడు. బ్లింకర్ అంటే రెండడుగులగొట్టం. లోపల లైటుంటుంది. ఇంకా ప్రాణాలతోవుండి నీటిలోతేలుతున్న

వారికి తమఉనికి తెలియజేయడానికిగాను కెనడీ ఆ బ్లింకర్ ఆర్పుతూ వెలిగిస్తూ బోటుచుట్టూరా తిరిగాడు.

కెనడీకి మెగ్యూర్ మావర్నామినహా మిగతాసిబ్బంది ఏమయ్యారో అంతుచిక్కలేదు. మిగతా పిటిబోట్లు వచ్చి ఆదుకుంటాయేమోనని చాలాఆతృతగా చూశాడుగానీ ఎవరూ రాలేదు. ఈ ఢీ జరిగేముందు పిటి 162 లోగీ అమా గిరిమీద టార్పెడోలు వదిలాడు. గానీ అవి పేలలేదు. అతను నైఋతిదిక్కుగా వెళ్ళిపోయాడు. ఢీ జరిగిన మరుక్షణం పిటి 169 వదిలిన టార్పెడోలకీ అదేగతిపట్టడంతోటి పాటరుకూడా ఆ దరిదాపులనుంచి తప్పుకున్నాడు. మిగతాబోట్లవారు పి టి 109 సిబ్బంది మంటల్లో చనిపోయివుంటారని అనుకున్నట్లు న్నారు. బ్లేకెట్ జలసంధిలో జాపనీస్ డిస్ట్రాయరుకి అడ్డు పడ్డం క్షేమకరంకాదని భావించి అక్కడనించి పూర్తిగా తప్పుకునివుంటారు. నిస్సహాయంగా యుగాలనిపించే గంటలు గడిచిపోతూంటే ఒక్కరూవచ్చి ఆదుకోరేమా అని పిటి 109 సిబ్బందికి చిరాకేసింది. కానీ ఆచిరాకు ఫలానామనిషనీ ఫలానాబోటనీ ఉద్దేశించి కలగలేదు.

మావరు బ్లింకరుతో సిద్ధమవగానే కెనడీ జోళ్ళూ, చొక్కా, ఆయుధాలూతీసేసి రబ్బరులైఫ్‌బెల్టు వేసుకొని మిగతావారిని వెతకడానికినీటిలోకిదూకాడు. తరువాతదాదాపు ముప్పైఆరుగంటలు నీటిలోనేఉండే పరిస్థితి ఏర్పడింది. అదృష్టవశాత్తూ నీరు వెచ్చగానూ ప్రశాంతంగానూ వుంది.

"మిస్టర్ థామ్ మునిగిపోతున్నాడు. పడవతీసుకురండి" అంటూ జిన్సర్ గొంతు వినిపించేసరికి బోటుమీదున్న

మెగ్వ్యార్, మావర్ ఇంకా తమవారు కొందరు బతికివున్నా రని అనుకున్నారు. మెగ్వ్యారుకి మళ్ళీ పెట్రోలు ఆవిరిలోకి దిగడం భయమేసింది. కానీ ఓ తాడుసంపాదించి ఓకొస విరిగిన టార్పెడోగొట్టానికి కట్టి రెండోకొస తననడుంకి చుట్టుకున్నాడు. దేవుణ్ణోమారు తలచుకుని నీటిలోదిగి జిన్సరు గొంతు వినిపించినవేపు ఈదుకెళ్ళాడు. మిగిలిన ఆ పిటి 109 బోటు ముక్కమీద మావరుఒక్కడూ మిగిలాడు. మూడు నెలల్కితం అతను సరిగా ఇలాటిపరిస్థితే అనుభవించాడు.

కళ్ళుచెదిరేమంటలో స్పృహతప్పిన రాస్ చీకట్లోకి మేల్కొన్నాడు. తను ఎక్కడున్నదీ ఏంచేస్తున్నదీ అర్థం కాలేదు. కాస్తకుదుటబడగానే అంతదూరంలో ఇద్దరుమనుష్యులు కనబడ్డారు. వారిదగ్గరగా ఈదుకువెళ్ళాడు. ఒకడు జిన్సర్. కానీ అతనిపేరు తనకి తెలీదు. రెండవది థామ్. జిన్సరు మూలుగుతున్నాడు. థామ్ ఏదో పలవరిస్తున్నాడు. రాస్ అతన్ని కుదపగానే థామ్ బలంగావున్న తనచేయి చాచి మూలంమీదెక్కినట్లు తనమీద ఎగబాకసాగాడు. రాస్ అతన్ని వారిస్తూ "లెన్నీ, లెన్నీ! నేను-నేను" అని అరిచాడు. నీళ్ళలో కొంచెం గొడవఅయినతరువాత థామ్‌కి తెలివొచ్చింది. బాగానే వున్నట్టు కనిపించాడు. జిన్సరూ బాగానే వున్నాడు. అందరూ మిగతావాళ్ళకోసం కేకలెయ్యడం మొదలెట్టారు.

మెగ్వ్యార్ వారి వైపు ఈదుకుంటూ వచ్చాడు. పెట్రోలు ఆవిరి ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. స్పృహతప్పకూడ దని దేవుణ్ణి ప్రార్థించాడు. వారి కేకల్నిబట్టి వారి ఉనికి సుల భంగా కనుగొన్నాడు.

"థామ్! ఏమీ అవలేదుగదా?" అని అడిగాడు.

"నేను బాగానే వున్నాను" అన్నాడు థామ్.

"ఈదగలవా?"

"ఆ!"

రాస్ అప్పుడప్పుడు సాయంచెయ్యాటం తప్ప జిన్నర్ కి వేరేసాయం అక్కర్లేదని మెగ్వ్యార్ గమనించాడు. మూవర్ చేతులోని లైటుగుర్తుగా మెగ్వ్యార్, రాస్, జిన్నర్, థాయ్ మెల్లిగా బోటువద్దకు చేరుకున్నారు. ఆల్బర్టుకూడా వచ్చి కలుసుకున్నాడు.

అమాంగిరి తాకిడి తప్పించుకోడానికి నీటిలో దూకిన హేరిస్ వంటరిగా తేలుతున్నాడు. దూకుతూంటే తగిలిన దెబ్బమూలాన ఎడంకాలులో విపరీతంగా నొప్పి కలిగిందికానీ దరిమిలా కాలు కొయ్యబారి నిరుపయోగమైపోయింది. తన లైఫ్ బెల్ట్ లో తేలుతూ అందరిలోనూ తనొక్కడే ప్రాణా లతో మిగిలాననుకున్నాడు. ఈఊహ అతన్ని కలవరపెట్టింది. అంతలో అరవై అడుగుల ఎదరన మంటల్లోంచి ఓ ఆకారం

తేలుతూ రావడం కనిపించింది. ఎడంకాలు ఈడ్చుకుంటూ హేరిస్ అతి కష్టంతో అటువైపు ఈదుకెళ్ళాడు. ఆమనిషి హెల్మెట్ తలను సగం కప్పేసివుండడంవల్ల అత నెవరో గుర్తుపట్టలేకపోయాడు. ఆ మనిషి బాగా షాక్ తినిఉండడం వల్ల గొంతుకూడా ఆనవాలుపట్టవీలులేకుండావుంది. కాని అతను తనచేతు లుపయోగించడానికి వీల్లేకుండా వుందనీ, హెల్మెట్ తలమీంచి వూడదీయమని అడుగుతున్నాడనీ గ్రహించాడు. హెల్మెట్ తీశాకగానీ అతను పేట్ మెక్ మహన్ అని తెలియలేదు. అంతచీకట్లోకూడా మెక్ మహన్ చాలా ప్రమాదస్థితిలో వున్నాడని హేరిస్ గ్రహించాడు.

హేరిస్ కి ఏంచెయ్యాలో, ఎక్కడకెళ్ళాలో తెలియ లేదు. మెక్ మహన్ పక్కనే నీళ్ళల్లో తారట్లాడాడు. మంటలు చల్లారిపోయాయి. అంతా కటికచీకటి. తామిద్దరే బతికి వున్నా మనుకున్నాడు హేరిస్. ముం దేం జరుగుతుందో అయోమయంగా తోచింది. మిగతా సిబ్బంది అంతా చనిపోయారన్న ఊహాతో వున్న అతనికి ఎక్కడినుంచో ఎవ రిదో గొంతు వినిపించేసరికి ఉలిక్కిపడ్డాడు.

"మిస్టర్ కెనెడీ! మిస్టర్ కెనెడీ" అని అరిచాడు.

"ఇక్కడ-ఇటువేపు" అంటూ కెనెడీ జవాబు వినిపించింది.

"మెక్ మహాన్ బాగా దెబ్బతిని వున్నాడు" అని హేరిస్ చెప్పాడు.

"నేను ఇటువే వున్నాను. నువ్వెక్కడున్నావ్?" అని కెనెడీ అడిగాడు.

"ఇటు" అన్నాడు హేరిస్. కెనెడీ ఈదుకుంటూ వస్తున్నట్టు శబ్దంవినిపించింది. ఆ శబ్దం చాలాదూరంనుంచి వస్తున్నట్లనిపించింది. ఉండుండి కెనెడీ "ఎక్కడున్నావ్?" అని అడిగేవాడు. హేరిస్ జవాబిచ్చేవాడు. రాను రాను ఈత అలికిడి ఎక్కువైంది. కెనెడీ కనిపించాడు. మెక్ మహాన్ తన కేపక్‌లో నిస్సహాయంగా తేలుతున్నాడు. చల్లటినీళ్ళల్లో వున్నా ఒళ్ళంతా అతనికి వెచ్చగానే తోచింది.

"మెక్ మహాన్‌కి బాగా దెబ్బలుతగిలాయి. ఈదలేడు" అన్నాడు హేరిస్ కెనెడీతో.

"ఫరవాలేదు. నేను తీసికెడతా. బోటులో ఓభాగం ఇంకా తేలుతూనే వుంది" అన్నాడు కెనెడీ.

కెనెడీ ఇంకేం చెప్పకపోయినా దూరాన మాటలు వినిపించేసరికి హేరిస్‌ప్రాణం లేచొచ్చింది. మెక్ మహాన్ మాత్రం అలాగే వున్నాడు. అతని చేతులు పూర్తిగా స్వాధీనం తప్పాయి.

"కెప్టెన్ నా పనయిపోయింది. నువ్వు పద" అన్నాడు కెనెడీతో.

కెనెడీ మెక్ మహన్ కేపక్ పట్టుకుని బోటువైపు ఈడ్చుకుంటూ ఈదసాగాడు. ఈలోగా బోటు మరికొంత దూరం కొట్టుకుపోయింది. బోటుమీా దున్నవారు మాత్రం తా మెక్కడున్నదీ తెలియచేయటానికి గట్టిగా అరుస్తూ వచ్చారు. కెనెడీ ఆ పిలుపువచ్చేటిశకు దారితీశాడు. మొదట్ల తనకాలు కొయ్యబారినా హేరిస్ కెనెడీ, మెక్ మహన్‌స్ల కంటె ముందేవుండి ఈదడం మొదలెట్టాడు. రాను రాను నీరసంవల్ల వెనకబడ్డాడు. "పదపద" అని కెనెడీ ప్రోత్సహించాడు. హేరిస్ మళ్ళీ ఈత మొదలెట్టాడుగానీ విపరీతంగా బాధపడ్డాడు. ఎడంకాలు వేలాడుతోంది. మత్తు కప్పేస్తోంది- హాయిగా కేపక్ లో ఒరిగి నీరు ఎటుతీసికెడితే అటు తేలి పోదామన్నంత నిస్త్రాణ వచ్చేసింది. దూరం అవుతున్నకొద్దీ కెనెడీ పిలిచేవాడు. వెంటనే కాసేపు ఈదేవాడు. మళ్ళీ నీరసంవచ్చి నీటివాలువేపు కొట్టుకుపోయేవాడు. బోటు చీలకముందు డెక్ మీాద చలేస్తే జాకెట్, చొక్కాలమీాద స్వెటర్ తొడిగి నిద్ర కుపక్రమించాడు. ఆ బట్టలమూలానా, బూట్లమూలానా కదలిక కష్టమైంది. ఒక విధమైన ఉదాసీనత ఆవరించింది. ఏమైతే అవుగాక అన్న నిర్లక్ష్యం ఏర్పడింది. కెనెడీపిలుపు వినబడటంలేదు. సత్తువఉంటే ఈదేవాడు. లేకపోతే అలాగే వుండిపోయేవాడు.

అరగంటపైగా అలాగే ఒంటరిగా వున్నట్టనిపించింది. అంతలో "హేరిస్! ఎక్కడున్నావ్" అంటూ కెనెడీ ఈదుకు రావడం వినిపించింది. కెనెడీ కనిపించగానే హేరిస్ "ఇహ ఈదడం నావల్ల కాదు" అని చెప్పాడు.

"బాస్టన్ వాడివనా ఇంతహడావుడిచేస్తున్నావ్ హేరిస్' అంటూ కెనెడీ కోప్పడ్డాడు.

హేరిస్ కెనెడీని తిట్టాడు. కసురుకున్నాడు. తనకాలు ఎంతబాధపెడుతూందో కెనెడీ గ్రహించలేకుండావున్నాడే అని ఉక్రోషం వచ్చింది. "ఇక పద" అని బలవంతంచేశాడు కెనెడీ. హేరిస్ తనని పైకెత్తి పట్టుకోమన్నాడు. కెనెడీ అతని భుజం గట్టిగాపట్టుకుని పైకెత్తాడు. హేరిస్ తన కేపక్ వదులు చేసి స్వెట్టర్, జాకెట్ విప్పేశాడు. నీరసించి నిస్పృహతో వున్న హేరిస్ కెనెడీపట్టులోంచి ఏమాత్రంజారినా సముద్ర గర్భంలోకి వెళ్ళిపోయి వుండేవాడు. కానీ బరువైన బట్టలూ బూట్లూతీసేసి మళ్ళీ కేపక్ తగిలించుకోగానే కదలికకొంచెం తేలికయింది. కెనెడీతో మెల్లగా బోటుకి ఈదుకుంటూ వెళ్ళాడు.

ఈలోగా జాన్‌స్టన్‌ను రక్షించడం థామ్‌కి ఇంకా అవస్థయింది. ప్రొపెల్లర్ రెక్కలనుంచి తప్పించుకుని నీటి బయట తేలేసరికి జాన్‌స్టన్ నోట్లోకీ ముక్కులోకీ పెట్రోలూ

ఆవిరిపొగలూ జోరబడ్డాయి. కక్కడానికి ప్రయత్నించ డంలో ఊపిరితిత్తుల్లో మరింత ఆవిరిపొగ నిండుకుంది. బుర్ర తిరిగిపోయి మందగించింది. అంతా అయోమయంగా అనిపించింది. కడుపులో తిప్పేసింది. సగంస్పృహతప్పింది. మెడంతా కాలిపోయింది. నీటిమీద తేలుతూ బోటు ముందుభాగం, దానిమీద మనుషులూ కనిపించారు. గట్టిగాపిలిచేసరికి థామ్ విని పక్కకు ఈదుకొచ్చాడు. అతనొచ్చేసరికి జాన్‌స్టన్ దాదాపు అసహాయస్థితిలో వున్నాడు. థామ్ బలవంతంమీద కాళ్ళుచేతులూ కొట్టుకుని కాసేపు ఈదేవాడుగానీ అంతా మరిచిపోయి హాయిగా నిద్రపోవాలన్న కోరిక ఎక్కువైంది.

"బిల్! పద పోదాం" అంటూ థామ్ కుదిపేవాడు. జాన్‌స్టన్ ఓమారు ఈతకిప్రయత్నించి మళ్ళీ మగతలో పడిపోయాడు. బోటుచేరుకోవడమన్నది దేవుడికి తెలుసు.

"ఆగవద్దు. పదపద" అంటూ థామ్ బతిమాలాడు. అతనూ అంతంతమాత్రమే ఈతగాడు. జాన్‌స్టన్‌ని బోటుదగ్గరకు చేర్చేసరికి చాలాసేపు పట్టింది.

అందరికంటె చివరవచ్చినది స్టార్క్. అతనువున్న బోటుభాగంకాస్తా వెంటనే మునిగిపోయింది. అది మునగ్గానే అతను తేలాడు. చుట్టూ జపానువారిమధ్య తనొక్కడూ చిక్కుపడిపోయాడేమో అని భయంతో వణికిపోయాడు.

పైగా సొరచేప లుండొచ్చన్న సంగతి మరీ కలవరపెట్టింది. "ఓ మై గాడ్, ఓ మైగాడ్" అనుకున్నాడు. ఏంచెయ్యాలో తెలీలేదు. అంతలో పక్కన విరిగినబోటుతాలూకు ముక్కాచెక్కా కనబడింది. ఓ పరుపుమీద కెక్కి కూచున్నాడు. అతనిముఖమూ చేతులూ కాలివున్నాయి. భార్య కేమిలి గుర్తుకొచ్చింది. నాలుగేళ్ళకుమార్తె షర్లీ గుర్తుకొచ్చింది. పెరల్‌హార్బర్ తరవాత తాను సైన్యంలోచేరిన రోజు గుర్తుకొచ్చింది. అంతలో చీకట్లో తేలుతున్న బోటు ముందరిభాగం కనిపించింది. అది రెండువందలగజాల దూరంలో వున్నట్టున్నా ఆదృశ్యం అతనికి ధైర్యాన్నిచ్చింది. బూట్లువిప్పేసి అక్కడికి ఈదుకుంటూవెళ్ళాడు. కొందరు డెక్ మీదా, కొందరు బోటు అంచుపట్టుకుని నీళ్ళలో తేలుతూనూ కనిపించారు.

కెనెడీ సిబ్బందిని పేరుపేరునా పిలిచాడు. మార్నీ, కిర్క్‌సీతప్ప మిగతాఅందరూ పలికారు. వారిద్దరిసంగతీ ఏదేనా తెలిసిందా అని అడిగాడు. ఎవరికీ తెలియదు. "కిర్క్‌సీ, మార్నీ..." అంటూ రాత్రంతా కెనెడీ, అతనితోబాటు మిగతావారూ పిలుస్తూనేవున్నారు. కానీ జవాబు రాలేదు.

మెక్‌మహన్, జాన్‌స్టన్ మినహా మిగతాఅందరూ బాగానేవున్నట్టు కనబడ్డారు. మెక్‌మహన్ చేతులు రెండూ బాగా కాలిపోయాయి. ముఖం, భుజాలూ, కాళ్ళూ, పాదాలూ

కూడా ఓమాదిరి కాలివున్నాయి. నీళ్ళల్లోవుండగా ఆట్టే తెలీలేదు గాని డెక్ మీాదికి సాయంపట్టగానే ఒళ్ళంతా భగ భగా మండిపోయింది. పుళ్ళు ఒరుసుకోకుండా కొన్నిబట్టలు విప్పేశారు. కానీ కాసేపటికే విపరీతంగా చలివేసి ఆ తడిసిన బట్టలే మళ్ళీ తొడుక్కున్నాడు.

జాన్‌స్టన్‌కి వుండుండి స్పృహతప్పేది. డోకులు తెరలు తెరలుగా వచ్చేవి. నోట మాటలేదు. మిగతావారు కంగారు పడ్డారు. మెగ్వ్యాయర్, జాన్‌స్టన్ చివరిదశలో వున్నాడనే అను కున్నాడు. అతను డెక్కమీాదనించి నీటిలోకి దొర్లిపోకుండా పట్టుకోడం ఓపెద్దపని అయింది. అతన్ని బోటుకి తాళ్ళతో కట్టేదామని ఎవరో సలహాఇచ్చారు. దానిమీాద పెద్ద తర్జన భర్జన జరిగింది. ఒకవేళ బోటు అమాంతం మునిగితే దాంతో జాన్‌స్టనూ అడుక్కివెళ్ళిపోయే ప్రమాదంవుందని మరొకరు సూచించారు. చివరికి అతనిమీాద తాళ్ళువేసి అటూఇటూ లాగిపట్టుకున్నారు.

రాత్రిగడుస్తున్నకొద్దీ చాలామటుకు బోటుమీాది కెక్కి-డెక్ మీాదనించి దొర్లిపోకుండా కాళ్ళు దేనికోదానికి గట్టిగా పెనవేసుకుని కూచున్నారు. తెల్లారగానే ఎవరో ఒకరొచ్చి రక్షించకపోతారా అని మెల్లిగా మాట్లాడుకుంటూ కూచు న్నారు. కొందరు తమకోసం పిటిలే వస్తాయన్నారు. మరి కొందరు పిబివై వచ్చి తీసికెళ్ళొచ్చన్నారు.

వానావానామీద తెల్లవారగానే దక్షిణాన ముప్ఫై ఎనిమిదిమైళ్ళ దూరంలో రెండోవాళిఖరం కనిపించింది. తా మెక్క డున్నదీ తెలిసొచ్చింది. ఈపాటికి మిగతాబోట్లు స్థావ రం చేరుకునివుంటాయి. లుంబేరీ హడావుడిగా వుండివుం టుంది. పిటి 109 రాలేదని తెలియగానే వెంటనే వెతు క్కుంటూ వస్తారు. ఆశ చిగురించింది.

ఆ సమయంలోనే బ్లేకెట్ జలసంధి బైనాక్యులర్ను ద్వారా పరిశీలిస్తూన్న కోస్టువాచర్ ఇవాన్స్‌కి రాత్రిమంటలు లేచినచోట ఏదో తేలుతున్నట్టు కనిపించింది. న్యూజార్జియాకి గాడాల్ కెనాల్‌కి ఉదయం పంపించిన నివేదికలో...

నాలుగుడిస్ట్రాయర్లూ పశ్చిమదిక్కుగా వెళ్ళాయనీ సంబియావద్ద తరువాత గవేరీదగ్గర విమానం బాంబులు వేసిందని, గవేరీఅవతల చిన్నపడవలాంటిది తేలుతూ కనిపిస్తోం దనీ పేర్కొన్నాడు.

ఇవాన్స్ వార్తలకు సాంకేతికాక్షరాలు కె ఇ ఎన్. కోస్టువాచరుగా ప్రసిద్ధికెక్కిన లెఫ్టినెంట్ కమాండర్ హ్యూమెకెన్‌జీ గౌరవార్థం ఈ అక్షరాలు పెట్టుకున్నాడు.

మెకెన్‌జీ గాడాల్‌కెనాల్ ముఖ్యకేంద్రంగా సాలమన్స్‌లోని కోస్టువాచర్లకు కమాండరుగా వున్నాడు.

ఉదయం తొమ్మిదిన్నరకు పిటి స్థావరంనుంచి వార్త రాగానే ముండాదగ్గర కోస్టువాచరు (కాల్ అక్షరాలు పి. డబ్ల్యుడి) ఇవాన్స్‌కి-

మెరెసుకోవ్ రెండుమైళ్ళలో బ్లేకెట్ జలసంధిలో పిటి 109 తప్పిపోయిందనీ సిబ్బందిమొత్తం 12 గురనీ దానిసంగతి ఏదేనా తెలిస్తే చెప్పమనీ కబురుపంపాడు.

ఇక్కడ పిటి 109 మీాద మనుషులకు చీకటిభయం పోయినా శత్రువులకంటబడతామేమోనన్న కొత్తభయం పట్టుకుంది. సహాయంరావచ్చున్న ఆశవున్నా వెలుతురు తమ ఉనికిని బట్టబయలుచేస్తోంది. రెండోవాశిఖరం కొంచెంధైర్యం ఇస్తున్నా బ్లేకెట్ జలసంధికి బాగాదూరంలో ఉండిపోయింది. ఆపదకొండుమందిలా మెరికన్ల చుట్టూవున్న ప్రాంతమంతాజపాన్ వారితో నిండివుంది. కోలంబంగారా గిజోలమిాది భవనాలు కనిపిస్తున్నాయి. లుంబేరీలో తమకిచ్చిన హెచ్చరికల ప్రకారం గిజోలో శత్రుసేన లుండచ్చు. అందువల్ల అటువేపుచూస్తూనే కంగారుపుట్టింది. ఆరుబయట నీటిమిాద వారు దాక్కోనేం దుకుకూడా వీలులేకపోయింది. కోలంబంగారా, గిజోల మిాదున్న శత్రుదళాలకీ వారికీ మహావుంటే కొన్నిమైళ్ళ

దూరం. ఇవాన్స్‌కంటికానినట్లే వీరిని జపానువారు ఇట్టేగుర్తు పట్టచ్చు. పైగా పసిగట్టి పేల్చెయ్యొచ్చుకూడా. ఈలోగా ఆ ప్రయత్నంమీదే వున్నారేమో !

"ఎదురునిల్చి పోరాడతారా ? లొంగిపోతారా" అని కేనెడీ సిబ్బందిని అడిగాడు.

"దేంతో పోరాడేది ?" అని ఎవరో అన్నారు.

ఆయుధాలు ఎన్నున్నాయో లెక్కవేసుకున్నారు. డెక్‌కి తాడేసికట్టిన 37-మిలిమీటర్ గన్ ఊడి నీళ్ళల్లో ఎందుకూ పనికిరాకుండా వేలాడుతోంది. రాస్‌కళ్ళకి అది ఓ పెద్దచేపల ఎరలా కనిపించింది. మెగ్వ్యార్ చార్టుహౌస్‌లోంచీ ఒక థామ్సన్ సబ్ మెషీన్‌గన్ తీసుకొచ్చాడు. మొత్తం ఆరు .45 తుపాకులూ, కెన్నెడీ రోషాంబూ నౌకలో వున్నప్పుడు సంపాదించిన .38 తుపాకీ, ఒక పెద్దచాకు, ఒక చిన్నచాకు, ఒక బుల్లిచాకూ చేరాయి. ఫస్టు-ఎయిడ్ సామాను ఢీ లో ఎక్కడో పోయింది.

కొంచెమేనా జాగ్రత్తపడదామని కెనెడీ బోటు ఎడమ వైపున నీటిలోకి జారి జాన్‌స్టన్, మెక్‌మహన్‌లు మినహా మిగతా అందరినీకూడా దిగమన్నాడు. ఒకవేళ జపానువారు వస్తే ఏంచెయ్యాలి అన్నసంగతి ఎత్తాడు.

“ఇలాంటి పరిస్థితుల్లో ఏంచెయ్యాలన్నది మన కెవరూ చెప్పలేదు. మీలో చాలామంది పెళ్ళిఅయినవారు. కొందరికి పిల్లలుకూడా వున్నారు. ఏంచేద్దామనుకుంటున్నారు. నావిష యం వదిలెయ్యండి. నాకు పోయే దేంలేదు” అన్నాడు కెనెడీ.

మెగ్వ్యార్ కి చివరిమాట వింతగా తోచింది. కోటీశ్వ రుడు మంచిభవిష్యత్తున్న యువకుడు అయిన కెనెడీ అందరి కన్న ఎక్కువనష్టపోతా డనిపించింది.

మెక్ మహన్ ఎంతబాధలోవున్నా లొంగిపోవడం అన్నది ఎంతమాత్రం కుదరదని అన్నాడు. మిగతావారికి కూడా ఇష్టంలేదు. బందీలను జపానువారు క్రూరంగాహింసిస్తా రని వారు వినిఉన్నారు. మరి ఎదిరించి యుద్ధంచెయ్యడానికి ఏమాత్రం వీలుంటుందని కొందరికి సందేహం వచ్చింది. అంత సేపు నీళ్ళలోనానిన తుపాకులు పనిచేయకపోవచ్చు. ఎండబెట్ట డానికి వీలులేదు.

“ఒకవేళ శత్రువులొస్తే మననిచేరుకొనేలోగా దూరం నుంచే పసిగట్టవచ్చు. ఏమాత్రంవీలున్నా ఎదిరిద్దాం. కానీ మూడునాలుగు పడవలనిండా సైన్యంవస్తే లొంగిపోదాం. చచ్చిసాధించే దేముంది?” అన్నాడు మావర్. ఎటొచ్చీ కెనెడీ ఏంచెబితే అది చేస్తానన్నాడు.

శత్రువు వచ్చినప్పుడు బలాబలాలు చూచినతరువాతే ఏసంగతీ తేల్చుకుందాం అని జిన్సర్ అన్నాడు. ఎవరికీ ఇంకేం తోచక అప్పటికి అలాగే కానిమ్మన్నారు. పదిఅయేసరికి కుడి వైపు బరువు ఎక్కువై బోటు తలక్రిందులైంది. కాని మునగ లేదు. మిగతావారు మెక్‌మహన్‌ని జాన్‌స్టనుని పైభాగానికి చేర్చారు.

11-15 గంటలకి ఇవాన్సు ముండా పి డబ్ల్యుడికి ఈ క్రిందివిధంగా వార్త పంపాడు :

రెఫరెన్సు 0930/2 ఇంతవరకూ బతికి బయటపడ్డ వారెవరూ కనిపించలేదు. అదేదో ఇంకా మెరెసూ గిజోల మధ్య తేలుతూనే వుంది. వంగావంగాలో మూడుటార్పెడోలు.

బోటులో మిగిలిన ఆ ముందుభాగం తలక్రిందు లవగానే కెనడీకి సాయంరావడం ఆలస్యమైతే వెంటనే జాగ్రత్తపడా లని తట్టింది. బోటు మెల్లిగా నీటిలోకి దిగుతోంది. ఒకవేళ రాత్రి అదికాస్తా మునిగిపోతే అందరూ చీకట్లో చెల్లాచెదరై పోతారు. కొందరు మునిగిపోవచ్చు. బోటు మునగక తేలితే సిబ్బందంతా ప్రవాహంలో ఎటో కొట్టుకుపోవచ్చు. ఆపోత పోతా తిన్నగా శత్రుమధ్యంలోకి పోవచ్చు. కొన్నిగంటల్లో ఎవరూ సహాయంరాకపోతే బోటువదిలేసి చీకటిపడేలోగా ఒడ్డుకు ఈదుకెళ్ళవలసిన అవసరం ఏర్పడేట్లు తోచింది. ఏఒడ్డు

వైపువెళ్ళడమా అన్నది సమస్యఅయి కూర్చుంది. చేరుకునే ద్వీపం తాము పదకొండుమందీ దాగిఉండేందుకు వీలుగా వుండాలి. జపాను సైన్యంగానీ, అబ్జర్వేషను కేంద్రంగానీ వుండకుండా ఏ దుంటుంది?

అప్పుడప్పుడు దూరాన విమానం కనిపించేది. అది మిత్రదళంవారిదేమోనన్నఆశతో చేతులూపేవారు. విమానం తనదారంట తను పోయేది. శత్రువుల కంటబడే ప్రమాదం ఉండబట్టి కెనెడీ చేతులూపడం ఆపమనేవాడు.

సిబ్బందిఅంతా యుద్ధాన్ని తిట్టుకున్నారు. నౌకా దళాన్ని లుంబేరీస్థావరాన్ని తమరక్షణార్థం ఉరకలేసుకుంటూ వచ్చివుండవలసిన పిటిబోట్లనీ, రానివిమానాలనీ తిట్టుకున్నారు.

"బతికిబయటపడితేమాత్రం జన్మలో మళ్ళీ పిటిబోటు ఎక్కను" అంటూ ఒకడు శపథంచేశాడు.

"పిబివై వచ్చేస్తుందిలే" అన్నాడు స్టార్కీ ఆశతో.

హేరిస్ ఎడమకాలు మోకాలుపైన వాచింది. థామ్ పరీక్షించి ఎముకలేమీ విరగలేదని చెప్పాడు. సొరచేపలున్నా యన్నసంగతి ఎవరో ప్రస్తావించారు. తెల్లవారినప్పటినించీ గండుమీనుచేపలు కనిపించాయి. అటూఇటూ ఎగురుతూ

ఆటలాడే ఈరికంచేపలకి సొరచేపలు దూరంగావుంటాయని విన్నందువల్ల వారు కొంచెం కుదుటపడ్డారు.

మధ్యాహ్నం 1-12 నిమిషాలకి గాడాల్ కెనాల్ కి కె ఇ ఎస్ నుంచి ఇవాన్స్ కి ఈ కిందివిధంగా వర్తమానం వచ్చింది.

క్రితంరాత్రి బ్లేకెట్ జలసంధిలో వంగావంగాకీ గిజోకి ఆగ్నేయంగావున్న ద్వీపసమూహానికీ మధ్యప్రాంతంలో పిటి ఒకటి ధ్వంసమయినట్లు ఖచ్చితంగా తెలిసింది. రాత్రి ఒంటి గంటకి మంటుతూకనిపించింది. సిబ్బంది మొత్తం పన్నెండు గురు. ప్రమాదంతప్పి కొందరు వంగావంగానికానీ ద్వీపాలను కానీ చేరుకోవచ్చు. ఈ వర్తమానం నిజానికి కాస్తదగ్గరగానే వుంది.

కెనెడీదృష్టి చుట్టూవున్న ద్వీపాలను వెతుకుతోంది. బ్లేకెట్ జలసంధిఅంతా తనకుబాగా తెలిసినదే. అందువల్ల నీటిఅంచుమీదనించిచూసినా వాటినిగుర్తుపట్టగలడు. తూర్పుకి రెండుమైళ్ళదూరంలో కోలంబంగారా వుంది. అది జపాన్ సైనికులస్థావరం ఫెర్గుసన్ పాసేజ్ నుంచి వస్తూంటే బ్లేకెట్ జల సంధి ఆవలిఒడ్డున వున్నందువల్ల పిటిబోట్లు వెళ్ళేదారిలో లేదు. ఆ బోటు అంతఅనుకూలమైనది కాదు.

పశ్చిమాన మూడున్నర మైళ్ళ దూరంలో గిజో నైఋతికోన మొదలుకొని లంగరు ఆకారంలో ఓ ద్వీపసమూహం వుంది. ఆ చిన్నద్వీపాలలో జపానీస్ నిఘా కేంద్రాలు ఉండాలేతప్ప లేకపోతే కొనమున్న ద్వీపాలు గిజోలోవున్న జపాన్ సైన్యం చూపుమేరలో ఉండవు. పైగా లంగరు ఆకారం కిందిభాగం ఫెర్గుసన్ పాసేజ్ అంచుకి దగ్గరలోవుంది. రాత్రిపూట రెండోవానుండి రాగల పిటిబోట్లకు తమఉనికిని తెలపడం వీలుగావుంటుంది.

ఆ ద్వీపాలలో చాలావాటికి రెండుమూడు పేర్లున్నాయి. సాలమన్స్ ప్రాంతంలో ఇది మామూలే. అక్కడ నివాసంఏర్పరచుకున్న యూరోపియన్లు ఓ పేరుతో పిలిస్తే, రోవియానాభాషమాట్లాడే ద్వీపవాసులు మరోపేరుతో పిలిచేవారు. లంగరు ఆకారంమధ్య కడ్డీప్రాంతంలోవున్న ఒక ముఖ్య దీపాన్ని బంబంగాఅనీ, లాంగ్ ఐలెండ్ అనీ పిలిచేవారు. దాని కిందది ఓలసానాద్వీపం. అట్టడుగునవున్నది నారూ లేక క్రాస్ ఐలెండ్. నారూపక్కన లియోరావా అనేచిన్నదిబ్బ. ఆపక్కన క్రీపామ్ ఐలెట్ అనబడే బుల్లిద్వీపసమూహం. చివర ప్లమ్ పుడ్డింగ్ లేక కాసోలో అనే ద్వీపం కలిసి బ్లేకెట్ జలసంధిలోకి వ్యాపించి లంగరు రెక్కలాగ అగుపిస్తాయి.

ఒకటిరెండుచోట్లతప్ప ఆ ద్వీపాలన్నీ నీటిఅడుగున కలిసేవున్నాయి.

ఒంటిగంట అయింది. చీకటిపడేలోగా పిటి 109 వది లేసి ఏదో ఒక ఒడ్డుచేరుకోవాలని కెనెడీ చెప్పాడు. గిజో తూర్పునవున్న ద్వీపసమూహంకేసి వెడదామన్నాడు. ఆ ద్వీపాల్లో దేనినిచేరడం మంచిదనేవిషయంపై ఆలోచించారు. ఒడ్డుకి ఈదుకుంటూ వెడితే శత్రువుల కంటబడే ప్రమాదం వుందని అందరికీ తెలుసు. ఎవరికీ ఇష్టంలేదు. బోటుదగ్గర మరింతసేపు వుండడంకంటె అలాచేయడమే నయమని గ్రహిం చారు. కాలంగడుస్తున్నకొద్దీ శత్రుభయం ఎక్కువైంది.

ప్రవాహంతోబాటు బోటూ, బోటుతో వారూ కొట్టుకుపోతూ ప్రస్తుతం నారూద్వీపం దరిదాపుల్లో వున్నారు. లియోరావా, త్రీపామ్ ఐలెట్ కూడా దగ్గరగానే వున్నాయి. కానీ పదకొండుమంది మనుష్యులు దాగివుండడానికి వీలైనంత పెద్దవి కావు. కానీ నారూ పెద్దద్వీపం. ఆకారణంచేతా ఫెర్గుసన్ పాసేజ్ కి ఎదురుగా వుండడంవల్లా దానిమీద జపాను వారినిఘా వుండవచ్చుఅని కెనెడీఅనుమానపడ్డాడు. అతనిదృష్టి ప్లమ్ పుడింగ్ ఆకారంలో వుండి ఆపేరు తెచ్చుకున్న ద్వీపంమీద పడింది.అదిఇంకాదూరంలోవున్నా చిన్నదైనందువల్లదానిమీద జపానువారు వుండేందుకు ఆట్టేఅవకాశం వుండ దనిపించింది. ఏసంగతీ ఖచ్చితంగా ఊహించేందుకు వీలులేకుండావుంది. చివరికి ప్లమ్ పుడింగ్ చేరుకోడానికే నిశ్చయించాడు.

సిబ్బందిలో కొంతమంది మిగతావారికంటె చురుకైన

ఈతగాళ్ళు. అంతదూరం అందరూ కలిసికట్టుగా వెళ్ళడం కుదరదు. పైగా మెక్ మహన్ ఒళ్ళంతా కాలినపుళ్ళతో నిస్స హాయస్థితిలో వున్నాడు. అందరూ బయలుదేరబోతూంటే ఒకబల్లచెక్క కెనెడీకంటబడింది. క్రితంరోజు రెండోవా రేవులో 37-మిలిమీటర్ గన్‌కింద కొన్నిబల్లచెక్క లేసి కట్టారు. వాటిల్లో ఎనిమిదడుగుల పొడుగు రెండడుగుల వెడల్పావున్న ఓ చెక్క తాడుకి వేలాడి నీటిలో తేలుతోంది. ప్రస్తుతసమస్యకి పరిష్కారమార్గం తోంచింది. "థామ్‌నాయ కుడుగా మీరందరూ ఈ బల్లచెక్క ఆసరాగా ఈదుకురండి. నేను మెక్ మహన్‌ని తీసుకొస్తా" అన్నాడు కేనెడీ.

ఇంకా బూట్లతోవున్నవారు అవి విప్పేసి చెక్కకి కట్టారు. బోటుతాలూకు బేటిల్ లేంటర్ను ఊడదీసి నీటిలో మునగకుండా కేపక్ లో చుట్టి దాన్ని చెక్కకి చుట్టారు. ఈ దీపం పదిపౌనులబరువుంది. నలుచదరంగా బూడిదరంగులో వున్నది. మెగ్యూర్ సీక్రెట్ రేడియో కోడ్ పుస్తకం నీళ్ళ ల్లోకి విసిరేశాడు.

"బతికి బయటపడతా మంటావా?" అని ఎవరో అన్నారు.

"తప్పకుండాను" అన్నాడు కెనెడీ.

పిటి 109 ని కడసారి చూసుకున్నారు. బల్లచెక్క తాడు కోశారు. కేపక్‌లు (లైఫ్‌బెల్ట్) బిగించుకున్నారు. చెక్కకు ఇటునలుగురు అటునలుగురూ చేరారు. తొమ్మిదో వాడు థామ్ ఆచివరినుండి ఈచివరకి తిరుగుతా చెక్కని వెనకనించీతోసి ముందునించీ లాగుతూ సహాయపడ్డాడు. పక్కలనున్నవారు ఓచెయ్యి చెక్కమీదవేసి రెండోచేతిని తెడ్డులాగా ఉపయోగించారు. కాళ్ళు కొట్టుకుంటూకూడా ఈదారు. ఇలా చెయ్యడంతో త్వరగావెళ్ళడమేకాక సొర చేపలను చెదరకొట్టొచ్చని జిన్సర్ అన్నాడు. హేరిస్, మెగ్వ్యార్‌లుమాత్రం తమని జపానువారు ఈపాటికి చూసే ఉంటారనీ, ఏక్షణంలోనైనా మీదపడొచ్చనీ అనుకున్నారు. ఇప్పుడు తిరగబడి పోరాడ్డానికికూడా వీలులేదు.

మెక్‌మహాన్ అవే తన ఆఖరిఘడియ లనుకున్నాడు. అసలు నోటపలుకులేదు. కెనెడీ అతన్ని నీటిలోకి దింపగానే ఒంటిమీదపుళ్ళన్నీ భగ్గుమన్నాయి. అతని కేపక్ వెనకాల పైనించి కింద ఒక చిన్న కొంకీదాకా మూడడుగులబద్దీవుంది. కెనెడీ అతనివెనక్కి ఈదుకెళ్ళి ఆ బద్దీని కొంకినుంచి ఊడ దీద్దామని ప్రయత్నించాడు. నీటిలోనాని బిగుసుకుపోయినందు వల్ల అది ఊడిరాలేదు. ఇదంతా చాలా మామూలుగా రోజూచేసేపనిలా కెనెడీ చేస్తూంటే మెక్‌మహాన్ ఆశ్చర్య పోయాడు. రెండుమూడుమార్లు లాగితే రాకపోయేసరికి

కెనెడీ చాకుతో దాన్ని కోసేశాడు. కొసని పంటబట్టి బార్ తకి ఉపక్రమించాడు. అతనూ మెక్‌మహన్ వీపూవీపూఆని వున్నారు. మెక్‌మహన్ కిందుగా కెనెడీఉండి ఈదుతున్నాడు. మెక్‌మహన్ వెల్లకిలా తేలుతున్నాడు. అతనితల కెనెడీతల వెనకాల వుంది.

4-45 గంటలకి కోలంబంగారానించి కె. ఇ. ఎన్. కి ఇవాన్స్ ఈ క్రిందివిధంగా వార్తపంపాడు :

ఒడ్డంతా వెతుకుతున్నాము. అద్దరిఎవరైనా చేరితే గిజోలోవున్న మనుషులు సహాయపడతారు. శాల్తీ నుసాటుపీ ద్వీపంవైపు కొట్టుకువెడుతోంది.

పి. టి. బోటునుంచి ఎవరైనా తప్పించుకుని తేలుతూ కనిపిస్తే రక్షించమని ఇవాన్సు తన స్థానికసహాయకులకి చెప్పాడు. ఆమాటే మిగతావారికికూడా అందజేయమన్నాడు.

# 9

ప్లమ్‌పుడింగ్ కోలగా పచ్చగావుండే ద్వీపం. తెల్లటి ఇసుక లైఫ్‌బాయ్ రబ్బరుచక్రంలా చుట్టూ అంచుకట్టివుంది. చుట్టూ నీరు లోతున్నచోట నీలకాంతితో మెరుస్తోంది. కోస్తాకు చేరేసరికి నీటిఅడుగునవున్న పగడపుకాంతులు సంతరించుకుంటోంది. ద్వీపం ఇంచుమించు వందగజాల పొడుగుంది. మధ్యన డెబ్భైగజాల వెడల్పుంది. కొన్ని తాటిచెట్లున్నాయి. కానీ ఎక్కువ సరుగుడుచెట్లే. ఇసకనేలమీద సరుగుడుఈనెలు తివాచీలా పరచుకునివున్నాయి. పైన కొమ్మలు చిక్కగా పందిరివేసివున్నాయి. 'నాకీనాకీ' చెట్లనుండిరాలిన ఆకులు చక్కటి వాసనవేస్తున్నాయి. తెల్లటిపూలతోవున్న కిడోకిడోగా పొదలకింద నత్తగుల్లపెంకులూ చిప్పలూ వెదజల్లినట్లున్నాయి. ఒడ్డున నాటిలస్‌చిప్పలూ, కవరీచిప్పలూ వున్నాయి. వాటిమీద మ్యాప్‌లలాగా గీతలుండడంవల్ల స్థానికులు వాటిని గ్రామపటం చిప్పలని అనేవారు. భుజస్కంధాల మీద భూగోళం మోసేఅట్లాస్‌ని గుర్తుచేస్తూ పెద్దపెద్దఎండ్రికాయలు అటూఇటూ పాకుతున్నాయి. ద్వీపం ముఖ్య

వాసులు పక్షులే. తెల్లటివేడింగ్‌పక్షులు ఒడ్డంబటే తపతపా తిరుగుతున్నాయి. ఫ్రిగేట్‌పక్షులు పైనచక్రాలు తిరుగుతున్నాయి. సాయంత్రం అయేసరికి వేలకొద్దీ నల్లగల్‌పక్షులు దీవిమీాద గూళ్ళకి చేరుకుంటాయి.

ఆగస్టు రెండవతేదీ సూర్యాస్తమయ సమయం. కెనెడీ పేట్ మెక్‌మహన్, ప్లమ్‌పుడింగ్ ఆగ్నేయకొస చేరుకొన్నారు. కెనెడీ ఆ ప్రయాస భరించలేకపోయాడు. ప్రాణం చాలొచ్చింది. మెక్‌మహన్ కేపక్‌బద్దీపంటితోపట్టుకొన్నందువల్ల దవడలు లాగేస్తున్నాయి. ఆ బద్దీమీాద కెనెడీ పంటిగుర్తులు పడివున్నాయి. కొంతసేపటిదాకా తల ఇసుకలో వాల్చి కాళ్ళు నీటిలోనేవుంచి వగరుస్తూ పడిపోయాడు. అక్కడ ఒక్క జపానుసైనికుడున్నా అతన్ని ఇట్టే హతమార్చివుండేవాడు. అదృష్టవశాత్తూ ద్వీపంమీాద ఎవ్వరూ లేరు. పుళ్ళుబడినకాళ్ళతో మెక్‌మహన్ నీటిలోంచి బయటపడి మోకాళ్ళమీాద దేక్కుంటూవచ్చి నీరసంగా కెనెడీని లేవనెత్తాడు. నోటిలో బద్దీకరచుకునివున్నందువల్ల కెనెడీ ఉప్పునీటిని మింగేశాడు. లేచినిల్చున్నాడో లేదో భళ్ళున డోక్కుని నిస్త్రాణవచ్చి మళ్ళీపడిపోయాడు. మెక్‌మహాకె చేతులు భయంకరంగా ఉబ్బివున్నాయి. కదిత్తేచాలు యమయాతనగావుంది. ఒడ్డునుంటే శత్రువులకంటబడే ప్రమాదం వుంది. పదిఅడుగుల మేరనున్న ఇసకలోంచి కెనెడీని ద్వీపం

లోకి లాక్కెళ్ళడానికి ప్రయత్నించాడు. అసలు తనే కదల లేకుండావున్నాడు. మెల్లిగా దేకసాగాడు. ఈలోగా కెనెడీ కొద్దిగా కోలుకున్నాడు. ఇద్దరూ దేకుతూ అంచీలంచీలుగా పొదలమాటుకు చేరుకొని కూలబడిపోయారు. కొంతసేపటి తరువాత కెనడీ కొంచెంసత్తువ కూడదీసుకుని లేచికూర్చు న్నాడు. మిగతా సిబ్బందికూడా బల్లచెక్క ఆసరాతో ఒడ్డుకు చేరుకోడం చూశాడు.

తలకిందులైన పిటి 109నుంచి బ్లేకేట్ జలసంధిఅడ్డంగా ప్లమ్‌పుడింగ్ దాకావున్న మూడున్నరమైళ్ళు ఈదడానికి వారికి సరిగ్గా నాలుగుగంటలు పట్టింది. ముందర అందరూ కలిసేవున్నారు కానీ దరిమిలా మెక్‌మహన్‌తో కెనడీ ముం దుగా ఈదుకొచ్చేశాడు. కెనెడీకి హార్వర్డు ఈతదళంలోవుండి నందువల్ల బాగాఅనుభవం వుంది. మెక్‌మహన్ బరువుకూడా వున్నందువల్ల పదిహేనునిమిషాలు గబగబా బారీతవేసి, కాసే పాగి మరల పదిహేనునిమిషాలు ఈదుతూ ఈవిధంగా వచ్చాడు.

"ఇంకా ఎంతదూరం?" అని మెక్‌మహన్ అడిగే వాడు. "ఫరవాలేదుబాగానేవెడుతున్నాం"అని కెనెడీ ధైర్యం చెప్పేవాడు.

"ఒంట్లో ఎలావుంది మెక్!" అని అడిగేవాడు. మెక్

మహాన్ "నాకేంఫరవాలేదు. మీసంగతేమిటి" అని జవా బిచ్చేవాడు.

మెక్‌మహాన్‌ది సున్నితమైన మనస్సు. వీపు దెబ్బ తిన్నా కెనెడీ తనను వేసుకుని మూడుమైళ్ళదూరం ఈదు కెడుతున్నాడని తెలిస్తే అది ఎంతయాతనో అతడు గ్రహించి వుండేవాడు. ఆసంగతి పూర్తిగా తెలీకపోయినా తనబాధ ఉండనేవుంది. కాలి పుళ్ళుపడిన చేతులు నీళ్ళల్లో వేలాడుతూ వెల్లకిలా తేలుతున్న తనకి ఆకాశం, కోలంబంగారాఅంచూ తప్ప మరేమీ కనబడలేదు. మిగతాసిబ్బంది కనబడక పోయినా వారు వగరుస్తూ ఈతకొడుతున్నశబ్దం వినిపిస్తూనే వుంది. కెనెడీకూడా కనబడకపోయినా అతను ముందరకి జరుగుతూ తనను లాగడం తెలుస్తూనేవుంది. శ్రమతో ఊపిరి పీల్చుకోడం, వదలడం వినిపిస్తూనేవుంది.

అపుడపుడు తనూ కాళ్ళూచేతులూఆడించి ఈదుదా మని ప్రయత్నించేవాడు. కానీ నిస్త్రాణ కమ్ముకొనేది. తమ ప్రయాణం అనంతంగా తోచింది. గమ్యం సుముఖంగాతోచ లేదు. ఆకలేస్తోంది. దాహంతో నోరెండిపోతోంది. సొరచేపల భయం ఒకపక్క పీకుతోంది. ప్రవాహం సొరచేపలు, శత్రువులమీాద తన దుర్బలత్వం గుర్తొచ్చినకొద్దీ దిగు లెక్కువైంది. తనప్రాణం కెనెడీ పంటినున్న బద్దీకొస

నుందని తెలుసు. ఆ పరిస్థితుల్లో దేవృసుకూడా గుర్తుకు రాలేదు. కెనెడీమీదే పూర్తిభారం వుంచాడు.

బల్లచెక్కమీదనున్న థామ్, రాస్, హేరిస్, జాన్స్టన్, స్టార్క్, జిన్నర్, ఆల్బర్ట్, మావర్, మెగ్వ్యార్‌లు తమ పోకడ చాలానెమ్మదిగా జరుగుతున్నట్టు గ్రహించారు. మొదట మంచిఈతగాడైన రాస్ చెక్కచుట్టూరా తిరుగుతూ మిగతావారికి సహాయంచేశాడు. "కాలు ఉపయోగించి చూద్దాం" అన్నాడు హేరిస్‌తో. దెబ్బతినివున్నా హేరిస్ చూపించాడు. "ఫరవాలేదు. సరిగ్గానే ఈదుతున్నావ్" అంటూ రాస్ ధైర్యంచెప్పాడు. వారు తేలుతూవుండడానికి వారి కేపక్‌లైఫ్‌జాకెట్లుతప్పితే బల్లచెక్క అట్టేఉపయోగపడలేదు. కెనెడీ ఊహించినట్లు వారందరినీ కలిసికట్టుగావుంచింది. అందరూ ఒకేచోట కలిసివుండడం ఓవిధమైన ధైర్యాన్నిచ్చింది. అపుడపుడు వారిలో బాగాఈతవచ్చినవాళ్ళుమాత్రం పీతనడకఅని విసుక్కున్నారు.

"ఇహ ఇలాఅయితే అయినట్లే" అంటూ ఒకరు కసురుకున్నారు.

మావర్ అంతబాగా ఈదలేదు. "నన్నడిగితే నేనిక్కడేవుంటా; కావలిస్తే నువ్వెళ్ళు" అన్నాడు.

"ఇప్పుడే చెబుతున్నా. నేను మీ నాయకుణ్ణి. అందరూ కలిసే వుండితీరాలి" అని థామ్ అరిచాడు.

కానీ మళ్ళీ ఆలోచించిచూస్తే చెక్కవొదిలేస్తే తొరగా వెళ్ళొచ్చేమోననిపించింది. విడివిడిగా కొందర్ని ఈదుకెళ్ళమన్నాడు కానీ ఫలితం బాగులేదు.

"ఇది లాభంలేదు. అందరూ మళ్ళీ చెక్కనిచేరండి" అన్నాడు.

రాస్ తనబూట్లను చెక్కకికాకుండా మెడకి వేలాడేసుకున్నాడు. రానురాను బరువెక్కువై నీటిలోకి వదిలేశాడు. ఇలా చేసివుండకూడదని తర్వాత తెలిసొచ్చింది. ఇంకా చాలాపోయాయి.

మెగ్వ్యార్ దగ్గర సబ్ మెషిన్ గన్ వుంది. నీటిలో కాసేపు నానగానే దానితాలూకు చెక్కభాగం వూడిపోయింది. మిగిలిన లోహపుభాగం చాలాబరువనిపించింది. ఇహ అది వుండుపయోగపడుతుందని మెగ్వ్యార్ దాన్ని నీటిలోకి వదిలేశాడు.

అందరూ ఒకేసారి ఈదడానికి ప్రయత్నంచేయలేదు. కాళ్ళూ చేతులూ ఆడిస్తూ బల్లచెక్కని తోసుకుంటూ పోయారు. ఇలా వెళ్ళడం ముఖ్యంగా ఒళ్ళుకాలివున్న జిన్సర్

లాటివారికి చాలాకష్టమనిపించింది. కమిలినందువల్ల తనఎడం చేతిమీదవున్న పచ్చబొట్టు అమ్మాయి నీలిరంగు తెల్లగా వెలిసిపోవడం జిన్నర్ గమనించాడు. రాత్రి ప్రమాదం జరిగిన తరువాత ఓగమ్యంతో కదలడం వారికి ఇదే ప్రథమం. ఈ ఆలోచన కొంచెం ధైర్యంఇచ్చింది. బోటుపక్కనించి వచ్చేసినందువల్ల శత్రుప్రమాదం కొంచెంతగ్గినట్లే భావించారు. ఎవరూ ఎక్కువ మాటాడలేదు. అసలెవరికీ ఓపికకూడాలేదు.

ద్వీపం దగ్గరవుతున్నకొద్దీ భయం ఎక్కువైంది. తిన్నగా జపానువారి ఒడిలోకి వెళ్ళిపోవడంలేదుకదా ! అప్పటికి కెనెడీ, మెక్‌మహన్ క్షేమంగా చేరారోలేదో తేలీదు. ఇంకో రెండుగంటలే వెలుగుండచ్చు. చీకటిపడేలోగా ఎవరేనా సహాయంరావచ్చన్న ఆశ సన్నగిల్లుతోంది.

చివరకు ద్వీపంచేరగానే చెట్లచాటునుంచి కెనెడీ చేతులూపాడు. కెనెడీకనిపించగానే అందరికీ ప్రాణంలేచొచ్చింది. ప్రవాహం తీవ్రతవల్ల బల్లచెక్క ఒడ్డుకిచేర్చడం కష్టమైంది. ఒడ్డుముందు పగడాలున్నమేర దాటడమే చాలాయిబ్బంది పెట్టింది. మోకాళ్ళు కొట్టుకుపోయాయి. పాదాలు చీరుకుపోయాయి. తొడలు గాయపడ్డాయి. కాలుజారితే గరుగ్గావున్న పగడాలు గీచుకునేవి. నీటిప్రవాహం కాలుపెట్టాలన్నచోట పెట్టనిచ్చేదికాదు. ఎట్టకేలకు చెక్కను ఒడ్డుపట్టించారు.

ఓడప్రమాదంగండంగడిచి బైటపడ్డారని వాళ్ళవాలకం చెప్పకచెబుతోంది.

అందరూ కెనెడ్డీ, మెక్‌మహాన్లపక్క పొదలమాటున దాక్కున్నారు. సంభాషణేం జరగలేదు. కేపక్‌లు విప్పేసి వగరుస్తూ బ్లేకేట్ జలసంధిమీదుగా కోలంబంగారావైపు చూస్తూ కూచున్నారు.

సరిగ్గా అయిదారుమైళ్ళ దూరంలో ఎదురుగావున్న లెఫ్టినెంట్ ఇవాన్స్ ఆరోజు ఆఖరివార్తపంపే ప్రయత్నంలో వున్నాడు. మిత్రవిమానాలు తిరగడంచూసి అవి పి టి సిబ్బంది కోసం చూస్తున్నాయనుకున్నాడు. KEN (కె.ఇ.ఎన్)కి గిజో మీద తిరుగుతున్న పి ఫార్టీ విమానాలకి ఎవరేనా కనిపించారా తెలియజేయవలసింది అంటూ వార్తపంపాడు. రాత్రి ఏవిధమైన సమాధానం రాలేదు.

ముందర ఎవరు విన్నారో తెలియదుకానీ ఫెర్గుసన్ పాసేజ్ దిక్కునుంచీ బోటువస్తున్నచప్పుడు వినిపించి సిబ్బంది యావన్మందీ కొయ్యబారిపోయారు. అందరూ నేలకి కరుచుకొని పడుకుని ఒడ్డువైపునున్న పొదలవైపు పాక్కుంటూ వెళ్ళారు. రెండువందలగజాలదూరంలో బ్లేకెట్ జలసంధిమీద మస్గురునలుగురు మనుషులతో మోటారుఅమర్చిన జపాను నావ కనబడింది. వారు తాము ఈదుకొస్తుండగా చూశారా?

పట్టుకోడానికి వస్తున్నారా? మామూలుగావచ్చే గస్తీదళమా? ద్వీపంలోని కొచ్చి అంతా వెతుకుతారా? సాయుధులైన ఆ శత్రువులు పైబడితే ఏంచెయ్యాడమనే సమస్య మళ్ళీ వారిని బాధించింది. చేతులో సబ్ మెషిన్‌గన్ లేదు. మిగిలిన ఆయుధాలు పనిచేస్తాయో లేదో నమ్మకంలేదు.

నావ మెల్లిగా కదులుతోంది. కానీ ద్వీపంవైపు తిరగ లేదు. సిబ్బంది ఊపిరిబిగబట్టి చూస్తున్నారు. శత్రునావ వారు పొంచివున్న పొదలపక్కనించి వెళ్ళి నాలుగుమైళ్ళదూరంలో గిజోమీదున్న శత్రుస్థావరంవైపు దారితీసింది. కొంచెం ముం దొచ్చివుంటే కెనెడీని సిబ్బందినీ నీటిలోవుండగానే చూసుండే వారు. చూస్తే పట్టుకునేవారు. లేదా కాల్చిపారేసేవారు.

శత్రునావ వెళ్ళిపోయినా వారికి భయంతగ్గలేదు. చుట్టూరా శత్రువున్నా డన్న సంగతి బాగా అవగతమైంది. ఇంకా ఎన్నినావలొస్తాయో! జపానువారు యింకా ఎక్క డెక్క డుండివుంటారో! ఆ ద్వీపంమీదే వున్నారేమో! ఆ పొదలు ఒడ్డుప్రాంతం దాటివెళ్ళడానికి భయమేసింది. మాటలుకూడా రహస్యంచెప్పుకున్నట్టే మాట్లాడుకున్నారు.

గన్నర్ సహాయకుడు హేరిస్ ఆయుధాలన్నీ ఒక తడి చొక్కామీదచేర్చి విడివిడిగా విప్పి పొడైనంతలో ఎండ బెట్టాడు. అందరూ భోజనంగురించీ, ఎవరేనా సహాయంవస్తా

రేమోననీ మాత్రమే ఆలోచిస్తున్నారు. సూర్యాస్తమయ సమయానికి ఈ రెండువిషయాలే మాట్లాడుకున్నారు. 109 సిబ్బంది ఇహదొరకదని మిగతావారు తీర్మానించుకొని వుండ చ్చని వారికి తట్టనే లేదు. మెల్విల్‌లో కెనెడీ పి టి సర్వీసు నుంచి తీసేస్తానని బెదరించిన ఎన్‌సైన్ పాల్ ఫే లుంబేరీలో కూచుని నిస్పృహతో సోదరికి ఉత్తరంరాస్తున్నాడు- "జార్జి రాస్ ఆదర్శవాది. దేశసేవంటే మా అందరికన్నా దీక్ష పూనినవాడు. దానికే ప్రాణాలు అర్పించాడు. రాయబారి కొడుకు జాక్ కేనెడీకూడా ఆబోటుమీదే వుండి మృతి చెందాడు. యుద్ధంఅన్నది దేశంలోని ప్రతిభావంతుల్ని బలి గొంటుందని ఎవరన్నారోగానీ ఆమాట ఒకభయంకర సత్యా నికి అతిశయోక్తిమాత్రం ఎన్నడూ కాదు"- అని పేర్కొ న్నాడు.

ఆఫీసర్లు కెనెడీ, థామ్, రాస్ ముగ్గురూ పక్కకెళ్ళి ఆలోచించారు. కెనెడీ ఒకటే ప్రశ్న వేశాడు. "ఇక్కడనుంచి బయటపడడం ఎలాగ ? కొంతసేపుచర్చించినతరువాత ఓనిశ్చ యానికొచ్చారు. ఫెర్గుసన్‌పాసేజ్‌లోకివచ్చే పి టి బోట్లను చీకట్లో కష్టమయినాసరే కలుసుకోడానికి ప్రయత్నించాలి. రాత్రి తనే పాసేజ్‌లోకి ఈదుకెడతాననీ, రివాల్వరు, బేటిల్ దీపం సహాయంతో పిటిలను ఆకర్షించడానికి ప్రయత్నిస్తా ననీ అన్నాడు. రాస్ వద్దన్నాడు. కానీ కెనెడీ చర్చఆపివేసి

మిగతా సిబ్బందికి ఈవిషయం చెప్పాడు. మెక్‌మహాన్‌కి ఇది కోరికోరిచావు తెచ్చుకోడం అనిపించింది. మెగ్వ్యార్ కెనెడీని వెళ్ళొద్దని బతిమాలాడు. రాత్రి ఒడ్డుమీదగ స్త్రీఉండమని కెనెడీ ఉత్తరువిచ్చాడు.

"బోటేదేనా తగిల్తే దీపం రెండుమాట్లు చూపిస్తాను. సాంకేతికపదం 'రాజర్!' సమాధానం 'విల్కో!' " అని చెప్పాడు.

పై బట్టలు ఊడదీశాడు. నడుంచుట్టూ రబ్బరు లైఫ్ బెల్టు తగుల్చుకున్నాడు. నీటికింద రాళ్ళుగుచ్చుకోకుండా బూట్లుతొడుక్కున్నాడు. .38 తుపాకి మెడకున్న తాటికి తగిలించుకొన్నాడు. మూతి కిందివైపుఉండేట్టుగా రివాల్వరు నడుంకి వేలాడదీశాడు. మునగకుండాఉండేట్లు బేటిల్ లేంటర్నుదీపాన్ని కేపక్‌లో చుట్టాడు.

అతను నీటిలోదిగే సమయానికి బ్లేకెట్‌జలసంధిమీద మసకచీకట్లు ఆవరించాయి. ఈ సమయానికే పి టి బోట్లు రెండోవాహార్బరునుండి బయలుదేరతాయని అతనికి తెలుసు. వార్‌ఫీల్డు ఆరోజు బోట్లని వెల్లాలావెల్లా దక్షిణకొసకిపంపించాడన్న సంగతి తెలీదు. ఆరాత్రి బోట్లు ఫెర్గుసన్‌పాసేజ్‌లో కాకుండా ఉత్తరాన దూరంగావున్న గిజోజలసంధిలో గస్తీ వుంటాయి.

సిబ్బంది చెట్లచాటునుంచి కెనెడీ వెళ్ళడం చూస్తూనే వున్నారు. అందరికీ దిగులేసింది. ఇంకా ఒంటరిగాళ్ళయి పోయినట్లు భావించారు. ఎన్‌సైన్ థామ్ ఒడ్డున గస్తీఏర్పాటు చేశాడు. ఇద్దరిద్దరు రెండుగంటల కోమారు నిఘావుంటారు. వారు ఒడ్డున ఎదురెదురుదిక్కులు పరిశీలిస్తూ పొంచివుండాలి. కొంచెంసేపట్లో కెనెడీ నీళ్ళల్లో దూరంగా నలకలాకనిపించి మాయ మయ్యాడు.

నీటిఅడుగునవుండే రాతిప్రదేశం ప్లమ్‌పుడింగ్ నుండి దక్షిణంవైపు తిరిగి లంగరుఆకారంలో రెక్కఅంచంబడే ఫ్రీహామ్ ఐలెట్ నుండి రూనాద్వీపం పక్కనున్న యిసుకదిబ్బ లియొరావాదాకా వ్యాపించివుంది. అక్కడనుండి వంపుతిరిగి లంగరు చివరికొసదాకా వుంటుంది. అదే ఫెర్గుసన్‌పాసేజ్ పైసరిహద్దు. ఆ దారంబడే ఫెర్గుసన్‌పాసేజ్ దగ్గరలో లియొరావాదాకా వెళ్ళి అక్కడనుండి పాసేజ్‌లోకి ఈదుకెడదామని కెనెడీఉద్దేశం. కొంతవరకు నడుంలోతు నీటిలోనూ భుజంలోతు నీళ్ళల్లోనూ నడవగలిగాడు. సందువచ్చినప్పుడల్లా ఈదుకుంటూ వెళ్ళి కాలికిరాయితగిలితే మళ్ళీ నడిచేవాడు. కాలికి విశ్రాంతియివ్వడానికి అప్పుడప్పుడు నీటిమీద పడుకుని పగడాలరెమ్మలు చేత్తో తోసుకుంటూ ముందుకెళ్ళేవాడు.

చీకటిపడినకొద్దీ దారి సుముఖంగా కనబడలేదు. కాలి కిందినుండి ఏదో జలచరం పరిగెట్టేది. నీటిలో పగడాలమధ్య

చాలా జలచరా లున్నట్లు గ్రహించాడు. ఒకమారు ఒక పెద్ద చేపకనిపించింది. సొరచేపలు ఒక్కరక్కడ. చేపలవల్ల వికలాంగులైనవారి కథలు గుర్తొచ్చి భయమేసింది. దీపం వెలిగించి చేతులూ కాళ్ళూ తపతపాకొడితే ఆచేప వెళ్ళిపోయింది. కింద నాచు జారుడుగావుంది. జారితే ఏరాయో కాలికి గీటు పెట్టేది. కొన్నిసార్లు తెలీకుండా గోతిలో దిగిపోయేవాడు.

చీకటిపడినతరువాత బ్లేకేట్ జలసంధి ఎడారికన్నా నిర్మానుష్యంగా కనబడింది.

ద్వీపాలగుర్తులు మాయమవుతున్నకొద్దీ కెనెడీకి దారి తెలీటంలేదు. నీటిలోంచి అక్కడక్కడ భాస్వరం చుక్కలు మెరుస్తున్నాయి. కెరటాలచప్పుడు గాలిచప్పుడు తప్పితే మరోధ్వనిలేదు. నీరువెచ్చగావున్నా కెనెడీకి అప్పుడప్పుడు చలి వేసేది. చీకటివల్ల తను ఎంతదూరం వెళ్ళాడో, ఎంతదూరం వెళ్ళాలో, ఎంతత్వరగా వెడుతున్నాడో ఏమీ అంతుబట్టడం లేదు. కాలికితగులుతున్న రాళ్ళు ఒక్కటే గుర్తుగా మిగిలాయి. రాతిప్రదేశం అంతమవగానే అవతలున్నరాతిఅంచు తగులుతుందన్నఆశతో తిన్నగా ఈదుకెళ్ళేవాడు.

రెండుమూడుమైళ్ళు అలాగ పడుతూలేస్తూ జారుతూ ఈదుతూ చివరికి ఫెర్గుసన్ పాసేజ్ చేరుకున్నాడు. అలసట తీర్చుకోడానికి ఆగాడు. పాదరక్షలు విప్పేసి లైఫ్ బెల్టుకి కట్టు

కున్నాడు. కేపక్ లో చుట్టివున్న దీపాన్ని ఈదుచుకుంటూ పాసేజ్ మధ్యప్రదేశానికి దారితీశాడు. మెడలోని తాటికి కట్టివున్న .35 తుపాకి నీళ్ళల్లో జీరాడుతూవచ్చింది.

ఫెర్గుసన్ పాసేజ్ మధ్యకి వచ్చినతరువాత సాలమన్ సముద్రందిక్కుగా చూసి చెవులు రిక్కించాడు. పి టి లు రాగానే గాలిలో మూడుమార్లు తుపాకీపేల్చి దగ్గరలో ఉన్న బోటుకి తెలిసేలా దీపంచూపించాలని అతనిఉద్దేశం. పాసేజ్ మధ్యలో కెన్నెడీ ఒక్కడూ అర్ధరాత్రి ఇలా ఈదుతూ కావ డంచూసి బోటుకెప్టెన్ ఆశ్చర్యపోడూ ? ఈ చక్కటికల మాత్రం నిజమవలేదు. కెనెడీకి గిజో అవతల ఆకాశంలో సంజ్ఞలకోసం ఉపయోగించే తారాజువ్వలు కనబడ్డాయి. ఒక వేళ బోట్లన్నీ అటు గిజోపశ్చిమాన గిజోజలసంధికి వెళ్ళిపో లేదుకదా ! గంటలుగడచినకొద్దీ ఆ సంగతే నిజమనిపించింది.

అంతసేపు నీటిలోవున్నందువల్ల అతను అలసిపో యాడు. రాతిగట్టువైపు తిరిగి ఈదడం ప్రారంభించాడు. ఒంటి మీాద ప్రతిఅవయవమూ మొద్దుబారివుంది. బరువు తగ్గించు కోడానికని బూట్లు లైఫ్ బెల్టునుండి విప్పేశాడు. రాతిగట్టు కాళ్ళని కోసేస్తుందని తెలిసినా వాటిని నీటిలోకి వదిలేశాడు. ఈతసాగించాడు. తను ఒడ్డుచేరగలడా అని అనుమానం వచ్చింది. ఎంతకీ గట్టు తగలడంలేదు. ఎందుచేతనంటే నీటివడి పక్కలకి లాగేసి బ్లైకేట్ జలసంధిలోకి తీసుకుపోతోంది.

ప్లమ్‌పుడింగ్ ఒడ్డున అర్ధరాత్రి దాటింది. గ స్త్రీవున్న హేరిస్‌కి నీటిమీద దీపం కనబడినట్టు తోచింది. కెనెడీ పిటెలను కలుసుకుని సహాయం తెచ్చేస్తున్నాడనే అనుకున్నాడు. కెనెడీ అస లాపరిధిలో లేడు. భాస్వరమో నీటిలో ప్రతిబింబించిన నక్షత్రమో అతనికలా కనిపించి వుంటుంది. హేరిస్ మిగతా వారిని లేపాడు. వారూ దీపంచూశామన్నారు. చూశామని అనుకునివుంటారు. థామ్ ఏకంగా నీటిలోకి నడిచి వెళ్ళి 'జాక్ జాక్ !' అని పిలిచాడు. కొందరికి సమాధానం వినిపించినట్లే అనిపించింది. కొంతసేపయినతరువాత సిబ్బంది చల్లబడ్డారు. తాము కావాలనుకున్నది నిజంగాజరిగినట్టు భ్రమపడ్డామని గ్రహించారు. కాలంగడిచింది. కేనెడీరాలేదు. నారూ అవ తలగట్టున కొట్టుకొంటున్న కెరటాలహోరు లీలగా వినిపిస్తోంది. ద్వీపంమీద జల్లుపడింది. దాహంగావున్న సిబ్బంది ఆకులను నాకారు. వాననీరు వెగటేసింది. ఆకులన్నీ పక్షిరెట్టలతో కప్పబడివున్నాయి. తర్వాత వారు కాసోలో లేక ప్లమ్‌పుడింగ్ ద్వీపానికి పక్షిద్వీపంఅని పేరెట్టారు.

తెల్లవారింది. తను యింతాకష్టపడితే యింకా ఫెర్గుసన్‌పాసేజ్ బ్లేకేట్ జలసంధి కలుసుకునేచోటే ఉండిపోయాడని కెనెడీ గ్రహించాడు. నీటిమీద వెలుగువరుచుకొంటున్న కొద్దీ కెనెడీ తానున్నచోటు గుర్తించాడు. ఓపిక లేదు. కష్టం మీద లియోనాావాద్వీపానికే ఈదుకెళ్ళవచ్చు. లియొరావా

ఒకచెట్టు, చారెడుపొదలూవున్న బుల్లిద్వీపం. ఒడ్డుచేరగానేనిద్ర లోకి ఒరిగిపోయాడు.

ఇక్కడ ఫెర్గుసన్‌పాసేజ్‌లో కెనెడీ నిష్ఫలంగా ఈదుతూన్నసమయంలో జపానువారు గిజోద్వీపం ఉత్తరపుటంచున కెక్కుల్లవాటాబేదగ్గర రెండుమూడువందలసైన్యాన్ని దింపుకున్నారు. ఇక్కడికీ ప్లమ్‌పుడింగ్‌కీ మధ్యనున్న సెహోద్వీపం లోని స్థానికులు ఇదిగమనించారు. వారు లెఫ్టినెంట్ ఇవాన్స్ సహాయకులు. ఈసంగతి వెంటనే కోస్టువాచర్‌కు తెలియజేయాలి. ఆగష్టు 3వ తారీఖు మంగళవారం ఉదయం బియుకు గోసా, ఎరోనీ కుమానా అనే యిద్దరుద్వీపవాసులు ఒకనావఎక్కి బ్లేకేట్‌జలసంధివైపు బయలుదేరారు. వెడుతున్నపని చిన్నదేకానీ దానిఫలితం అప్పటికి వారు ఊహించలేదు. ఇందువల్ల యునైటెడ్‌స్టేట్స్ నేవీఆఫీసర్లు, సిబ్బంది మొత్తం పదకొండుగురిని రక్షిస్తామనీ, వారిలో ఒకరు తమ జీవితకాలంలోనే యునైటెడ్‌స్టేట్స్ అధ్యక్షపదవి నలంకరిస్తారనీ వారిద్దరూ కలకూడా కనివుండరు.

బియుకు, ఎరోనీలు చామనచాయకు ఓచాయతక్కువ. మెలనేషియన్లు. పొడుగుకాకపోయినా చక్కటిఅవయవ పటిష్ఠంగలవారు. ఎరోనీముఖం గంభీరం. బియుకు చలాకీ మనిషి. సాధుస్వభావం. ఇద్దరిదీ పందొమ్మిదేళ్ళప్రాయం.

బియుకు జన్మస్థలం వానావానాద్వీపం. ఆస్ట్రేలియన్లు నడిపే మెథాడిస్టు మిషన్‌స్కూల్లో కొద్దిరోజులు వున్నాడు. మతం అంటే నమ్మకం. ఆంగ్లం ఆట్టే తెలియకపోయినా అతను "ఇన్ గాడ్ వి ట్రస్టు" (దైవాన్నే నమ్ముతాము) అంటుంటే పూర్తినమ్మకం ధ్వనిస్తుంది. ఎరోనీ జన్మస్థలం గోనూన్గా ద్వీపంమీాది లేల్ గ్రామం. యుద్ధంముందు అతనూ మెథాడిస్టుస్కూలు కెళ్ళాడు. ఇద్దరూ బ్రిటిషువారి నమ్మినబంట్లు. సాలమన్ దీవుల్లో యుద్ధంచెలరేగినపుడు బ్రిటిషువారి మిత్రులకు సాయపడ్డానికి వెనుదీయలేదు.

ఇద్దరూ చాలాసేపటిదాకా నావనడిపినా బంచంగాదీవి అవతల ఏదోతేలుతున్న శాల్తీతప్ప మరేమీా కనిపించలేదు. నీటిలో ఓచిన్నపెట్టె దొరికింది. దానిలో ఒక రేజరూ, క్షవరం బ్రష్షూ, ఒకషేవింగ్‌క్రీమ్ ట్యూబూ వున్నాయి. చేత్తో రాసిన ఉత్తరమొాటి వుంది గాని వారికి చదవడం రాదు. వానావానాలో చిన్నమజిలీవేసినపుడు బెంజమిన్ కెవ్లూ అనే మరోద్వీపవాసికి చూపారు. అతను జపానువారి దాడిముందు గిజోలో బ్రిటిష్ పోస్టుఆఫీసులో పనిచేసినందువల్ల ఇంగ్లీషు చదువనూ, మాట్లాడనూ తెలుసు. ఆ ఉత్తరంమీాద రేమండ్ ఆల్బర్టు అన్నాయనసంతకం వుందని చెప్పాడు. ఆల్బర్టు ఎవరో ఎక్కడివాడో తెలీలేదు. ఉత్తరంసంగతి ఏమీాఅర్థం కాలేదు.

బియుకు, ఎరోనీ మళ్ళీ కోలంబంగారామీదున్న లెఫ్టినెంట్ ఇవాన్స్ దగ్గరకు బయలుదేరారు.

ఆగష్టు 3 మంగళవారం ఇవాన్స్‌కి పనిరద్దీ తగిలింది. గిజోమీద పి-40విమానాలసంగతి తెలుసుకోడానికి రాత్రంతా వేచివున్నాడు. ఆ విమానాలు పిటి సిబ్బందిని వెతకడానికి కాదనీ, వేరేదో పనిమీద వెళ్ళాయనీ వార్తవచ్చింది. తర్వాత న్యూజార్జియా పి.డబ్ల్యు.డి. నుండి మరోవార్త వచ్చింది.

"ఇక్కడి ఎయిర్ ఇంటలిజెన్స (వైమానిక గూఢ చారిదళం) నిన్నసాయంత్రం ఎంతవెతికినా ఎవరూ కనిపించ లేదని చెప్పమన్నారు" అని వుంది ఆవార్త.

విమానాల అన్వేషణే నిష్ఫలమైందికదా! తెగించి వార్‌ఫీల్డ్ శత్రుసమీపంలోకి బోట్లుపంపినా ప్రయోజన ముంటుందా? ఆగస్టు 2 న పగటిపూట తాను పిటి 171 వేసుకుని బ్లేకెట్‌బలసంధికి వెడతానన్నాడు. ఎన్‌సైన్ బేటిల్ వెళ్ళివుంటే పిటి 109 తేలుతున్న భాగంపక్కన అంటుకుని వున్న సిబ్బందిని కనుగొనేవాడు. కానీ అప్పటిపరిస్థితుల్లో అతనువెళ్ళడానికి అనుమతిదొరకలేదు. తేలుతున్న శాస్త్రీ ఇవాన్స్‌కే కనబడితే పట్టపగలు అయిదున్నరమైళ్ళుమాత్రమే వెడల్పున్న ఆ ప్రాంతంలో విమానాలకి సిబ్బందితాలూకు పదకొండుమందీ ఎందుకు కనబడలేదు? ఎయిర్ ఇంటలిజెన్స

యిచ్చిన సమాచారం ప్రకారం సాయంసమయంలో అన్వేషణ జరిగింది. అంటే ఆ కంగారులో ఆలస్యమై గిజోమీదకి విమానాలువచ్చే సమయానికి సిబ్బందిఅందరూ ప్లమ్‌పుడింగ్ చెట్ల చాటుకి చేరుకున్నారన్నమాట.

ఇవాన్స్ పంపడానికి మంచివార్త ఏమీదొరకలేదు. KEN (కె. ఇ. ఎన్.) కి అన్వేషణ నిష్ఫలమైంది. పిల్‌పిలిలో మరో టార్పెడో కనిపించింది అని వార్తపంపాడు.

బియుకు, ఎరోనీ కోలంబంగారాకు దారితీస్తున్న సమయంలో లియోరావామీద పడుకున్న కెనెడీ మేల్కొన్నాడు. బాగాపొద్దెక్కింది. చలేస్తోంది. మనసంతా కంగాళీగావుంది. తనసిబ్బందికీ తనకూ ఇంకా ఒకటీమువ్పాతిక మైళ్ళదూరం వుంది. బేటిల్ లేంటర్న్‌దీపం వెలిగిస్తే వెలగలేదు. అవతల పారేశాడు. కాలికి బూట్లు లేవు. లైఫ్‌బెల్టు రివాల్వర్‌తో నీటిలోకి దిగాడు. రాతిగట్టు పాదాలను కోసేస్తోంది. పయనం సాగించాడు.

తెల్లారి కెనెడీజాడ కనబడకపోయేసరికి సిబ్బంది దిగులు పడ్డారు. మునిగిపోయాడేమోనని భయపడ్డారు. జాన్‌స్టన్ ఇంకా మగతలోనే వున్నాడు. మెక్‌మహన్‌కి బాధ భరించ గానిదిగావుంది. ఉంఉండి పుళ్ళు ఉప్పునీటిలో కడిగేవాడు. భగ్గున మండేవి. కానీ ఏదోఒకటిచెయ్యాలి. ఆకలి, దాహంతో

పిచ్చెక్కిపోతున్న మావర్ కొబ్బరిచెట్టెక్కి కాయలుకోద్దా మని నిశ్చయించాడు. సగంఎక్కగానే ఒకపెద్ద గండుచీమ కుట్టింది. జరజరా కిందికిజారి దాన్ని జలగనిఊడదీసినట్లు పీకె య్యాల్సివచ్చింది. మళ్ళీ ఎక్కాడు. పచ్చిగావున్న మూడు కాయలను కోశాడు. కిందికిదిగి ఒకదాన్ని అతికష్టంతో చాకు పెట్టి ఒలిచాడు. నోరెండిపోయివుండడంవల్ల వెచ్చగా చప్పగావున్న ఆ కొబ్బరినీరు తాగేశాడు. మెక్‌మహన్‌కి కొంచెం ఇవ్వరాదా అన్నాడు జాన్‌స్టన్.

"ఇంకా రెండున్నాయి లేవోయ్" అన్నాడు మావర్ కిందున్న రెండుకాయలనూ చూపిస్తూ.

మావర్ తాగగానే థామ్ అతనివేపు కసిగాచూసి "కడుపునిండిందా" అన్నాడు. మావర్ మెక్‌మహన్‌వైపు చూశాడు. అతని మొహంలో కించిత్తయినా కోపచిహ్నాలు లేవు. మెక్‌మహన్‌గానీ జాన్‌స్టన్‌గానీ తమంతటతాము కాయఒలుచుకోడానికికూడా వీలులేనిస్థితిలో వున్నారు. ఒళ్లు చచ్చిపడినట్లయింది. ఎలాజరిగిందో తెలీదుగానీ అసలు వారిద్దరిసంగతే గుర్తురాలేదు.

పిస్తోళ్ళకి నూనెలేదని బాధపడుతున్న హేరిస్‌కి కొబ్బరి కాయలు చూడగానే ఓఆలోచన తట్టింది. కొబ్బరిగుజ్జులో నూనెవుంటుందని తెలుసు. .45 పిస్తోళ్ళనన్నిటినీ విడివిడిగా

ఊడదీసి కీళ్ళల్లో గుజ్జు రాశాడు. ఉక్కు మీద గుజ్జు బంకలాగా అంటుకుంటే తప్పితే ఫలితం కనబడలేదు.

మధ్యాహ్నకాలం సమీపిస్తోంది. సిబ్బంది పొదల చాటున కూచుని బ్లేకేట్ జలసంధిమీద గల్ పక్షులు చేపల్ని పడుతూంటే చూస్తున్నారు. "అదుగో కిర్క్సీ" అని అరిచాడు మెగ్వ్యార్. ఈదుకొస్తున్నది కిర్క్సీ కాదు; కెనెడీ. థామ్ అందరినీ చాటున అక్కడేవుండమని రాస్‌తో బాటు ఎదురెళ్ళాడు. రాస్ కెనెడీచుట్టూ చేతులేసిపట్టుకున్నా అతను డోక్కుంటూ కిందపడిపోయాడు. నిద్రలేక అలసిపోయి చిక్కిపోయి కనిపించాడు. గడ్డం మాసింది. జుట్టు చిక్కడి నుదుటిమీద వేలాడుతోంది. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. ఒళ్ళు పసుపుచాయ తేలింది. థామ్, రాస్, అతన్ని సాయంపట్టి ఇసకమీదనించి పొదలమాటుకి తీసికెళ్ళారు. మెగ్వ్యార్ "ఎలావుందని అడిగితే కెనెడీ మూలిగాడు. కాసేపున్న తరువాత పిటిబోట్లేవేనా కనబడ్డాయా అని ఎవరో అడిగారు. లేదన్నాడు. పీటిపోటులో ఎక్కడికివెడుతున్నదీ తెలియలేదంటూ ఏదో గొణిగాడు. కడుపుతిప్పేసి వెంటనే నిద్రలో సోలిపోయాడు. మిగతావారికి ఏంచెయ్యాలో తోచలేదు. చాలాసేపు మాట్లాడకుండా కూచున్నారు. ఒకమారు మాత్రం కెనెడీ లేచి రాస్‌వైపు చూసి "బార్నీ రాత్రి నువ్వెళ్ళు" అని మళ్ళీ నిద్రలో పడిపోయాడు.

ఫెర్గుసన్ పాసేజ్‌కి వెళ్ళినందువల్ల లాభంలేదని రాస్‌కి తెలుసు. కానీ ఉత్తర్వు ఉల్లంఘించలేదు. కెనెడీ పరిస్థితి చూసినందువల్ల యింకా వెలుగుండగానే పాసేజ్ చేరేట్లు నాలుగింటికే బయలుదేరాడు. ఆ ప్రాంతాలతో అతనికి పరిచయం లేదు. తిరిగివచ్చేటప్పుడు తప్పిపోకుండాగుర్తుంచు కుంటూ వెడుతున్నాడు. ఆ ద్వీపాల్లో ఎక్కడేనా దారితప్పి పోతానేమోఅని అతనికి పెద్దభయం. బోటుకనిపించి తమ సంగతి చెప్పగలిగితే సరేగాని లేకపోతే రాత్రికి తనను ఎదురు చూడొద్దని సిబ్బందికిచెప్పాడు. పనిజరక్కపోతే తెల్లారేదాకా ఏదేనాదీవిలో వుండిపోతానని చెప్పాడు. కెనెడీదగ్గరనుంచి స్మిత్, వెసన్ తుపాకీలు పుచ్చుకుని మెడ కోతాడువేసి దానికి కట్టుకున్నాడు. తన తెల్లటికాళ్లు సొరచేపలకు కనపడకుండా కాకీలాగు తొడుక్కున్నాడు. నీటికిందిరాతిఅంచంబటే వెడు తూంటే మూడునాలుగు అడుగులపొడుగున్న శాండ్ షార్కులు కనిపించి గుండెగుభేల్మంది. ఫెర్గుసన్ పాసేజ్ చేరు కునేసరికి చీకటిపడుతోంది. పాసేజ్ మధ్యలోకి వెడదామంటే పూర్తిగా చీకటిపడేదాకా ఆగాలి. ఈలోగా అటూయిటూ వెతికి ఓ పగడపుగట్టు కాలికితగలగానే గుండెలోతునీళ్ళల్లో దానిమీద నించున్నాడు. చుట్టూరా నిశ్శబ్దం భరించరాని దిగా వుంది. ఏదోఓటిచేయాలని తిరిగివెళ్ళడానికి వీలుగా చుట్టూప్రదేశం గుర్తులుపెట్టుకున్నాడు.

కాసేపటికి నిశ్శబ్దంతోబాటు కటిక చీకటి వ్యాపించింది. కెరటాలు గట్టుమీదించి తోసేస్తున్నా మళ్ళీ తడుముకుంటూ వచ్చి నుంచునేవాడు. పిటిబోట్లు మామూలుగావచ్చే వేళ దాకా అక్కడేవున్నాడు. ఫెర్గుసన్ పాసేజ్ లోకి వంటరిగా ఈదుకెళ్ళాలంటే భయమేసింది. క్రితంరాత్రి కెనెడీ వెళ్ళి ఉండకపోతే తనూ ఆ పనికి సాహసించేవాడు కాదు. "అతను వెడితే నేనూ వెళ్ళగలను" అంటూ తనకుతానే ధైర్యంచెప్పుకున్నాడు.

ఇరవై నిమిషాలు ఈదాడు. ఆ మేర చాలో, ఇంకొంచెం వెళ్ళాలో తోచలేదు. ఇంకా ముందు కెళ్ళడ మంటే భయమేసింది. అక్కడే తారట్లాడాడు. పిటి బోట్లు మళ్ళీ వెల్లాలావెల్లా వైపు వెళ్ళాయని అతనికి తెలీదు. కానీ అతనికి అనుమానం కలగకపోలేదు. .38 రివాల్వరు తీసి మీట లాగాడు. పేలింది గానీ ఆరుబయట చప్పుడు బాగా వినిపించలేదు. ఉండుండి ఇంకో రెండుమార్లు పేల్చాడు. చాలాసేపు చూచిచూసి మళ్ళీ రాతిచట్టుకి ఈదుకొచ్చాడు. ద్వీపం ఒకటి కనిపించగానే సంతోషించాడు. అది క్రితం రాత్రి కెనెడీ విశ్రమించిన లియోరావా దీవి. ఒడ్డెక్కి వెంటనే నిద్రలో ఒరిగిపోయాడు.

ఆగస్టు 4 బుధవారం పొద్దున లేచాడు. లేత ఎండ వెచ్చగా వుంది. చుట్టూ చూచాడు. 'ఇది నా రాజ్యం. దీనికి

నే రాజుని’ అనుకుని నవ్వుకున్నాడు. మిగతా సిబ్బంది ఇపుడు తనను చూస్తే బావుండును. యుద్ధం అయిన తరువాత స్వదేశానికి వెళ్ళినపుడు సౌత్ పసిఫిక్‌లో తన సాహస యాత్రలు చెబుతూంటే అందరూ తెల్లబోయి వింటారు. ఆ ఆలోచనకే మురిసిపోయాడు. ఓడ మునిగిపోయి అందమైన అమ్మాయితో వంటరిగా చిన్న ద్వీపం చేరినట్లు పత్రికల్లో వేసే కార్టూన్లు గుర్తొచ్చాయి. ఎటొచ్చీ తన పక్కన అమ్మాయి లేదంతే. కాళ్ళకి చెప్పుల్లేవు. లాగు నలిగిపోయి వుంది. జుట్టు చెల్లాచెదురుగా ఎగురుతోంది. దట్టంగా నల్లటి గడ్డం పెరిగి వుంది. 1941 లో ప్రిన్స్‌టన్ క్లాసులో బట్టల విషయంలో కంగాళీవాడని తెచ్చుకున్న పేరుకి తగ్గట్టు ఉన్నాడు.

రాస్ ప్లమ్‌పుడింగుకు బయదేరే సమయానికి బియుకు, ఎరోని కెక్కుల వాటాబేలో జపాన్ వారు దిగినట్లు వార్త మోసుకుని ఇవాన్స్ వున్న కొండ చేరారు. గిజో ప్రాంతం దీవుల్లో పిటి 109 బోటు సిబ్బంది ఎవరేనా కనిపించారా, వాడి సంగతేదేనా తెలిసిందా అని ఇవాన్స్ అడిగాడు. వారు లేదన్నారు. 10-25 నిమిషాలకి ఇవాన్స్ పి.డబ్ల్యు.డి.కి గిజోవద్ద ఎవరూ కనబడలేదు అని వార్త పంపించేశాడు

బియుకు, ఎరోన్ సెపోదీవికి బయలుదేరుతూంటే గిజో ప్రాంతంలో ఎవరేనా వున్నారేమో మళ్ళీ చూడమన్నాడు ఇవాన్స్. 11-30 కి కె. ఇ. ఎన్ నించి ఇవాన్స్‌కి ఇంకో వార్త వచ్చింది:

"కాలుతున్న పిటిబోటు భాగం ఎక్కడ కనిపించింది? ఇంకా తేలుతూంటే ధ్వంసంచెయ్యాలి. దాని ప్రాంతంలో జపాన్‌వారు ఎవరేనా వుంటే తెలియపరచవలసింది."

రద్దీ ఎక్కువగా వున్నందువల్ల ఇవాన్స్ కె. ఇ. ఎన్. కి సాయంత్రం అయిదింటిదాకా సమాధానం పంపలేకపోయాడు—5-5 నిమిషాలకు.

నేను చూసిన శాల్తీ పిటిబోటు తాలూకుదని ఖచ్చితంగా చెప్పలేను. నేను చూసినపుడు శాల్తీ బంబాంగాకు ఈశాన్య దిక్కున దాదాపు రెండు మైళ్ళ దూరంలో వుండి దక్షిణ దిక్కువైపు కొట్టుకెడుతోంది. మధ్యాహ్నం తరువాత కనిపించలేదు. పి-40 విమానాలు దాని మీదుగా ఎగిరి వెళ్ళాయి. గిజోలోని నా సహాయకులకు శాల్తీగురించిగానీ, అక్కడ జపాన్‌వారున్నారనిగానీ, లేరనిగానీ తెలియదు" అని వార్త పంపాడు.

రాస్ ఆట్టే కష్టపడకుండానే ప్లమ్‌పుడింగ్ చేరుకున్నాడు. కెనెడీ కొద్దిగా కోలుకున్నట్టు కనిపించాడు.

ఎటొచ్చీ ఈ రెండో ప్రయత్నంకూడా విఫలమైనదని తెలియ
గానే అంతా నిరుత్సాహపడ్డారు. జాన్‌స్టన్ పరిస్థితి కూడా
కాస్త మెరుగే గానీ అతనికి భయం పట్టుకుంది. కానీ బయ
టకు కనబడనివ్వలేదు. స్టార్క్ పూర్తిగా డీలా పడిపోయాడు.
నౌకాదళంలో చేరడమే తప్పు అనుకునేదాకా పోయాడు.
అసలీ నౌకాదళం గొప్పేమిటి — అమెరికా యుద్ధంలో
ఎందుకు చేరాలి—తను జీవితంలో సాధించే దేమిటి అంటూ
రకరకాల ఆలోచనలు కలవరపెట్టాయి.

అందరికీ నౌకాదళం అంటే చిరాకు పుట్టుకొచ్చింది.
కొందరు బయటకి అనేశారు. కొందరు అనలేదంతే! "అసలీ
బోట్లన్నీ ఎక్కడ చచ్చాయి" అనుకున్నారు. తమ సహా
యార్థం ఎవరినీ పంపనందుకు కెనెడీకి లుంబేరీ స్థావరంమీద
కోపంవచ్చింది. ఈమాట మిగతా ఆఫీసర్లు థామ్, రాస్‌లతో
అన్నాడుగానీ మిగతా సిబ్బందికి తెలియనివ్వలేదు. వారి
అవస్థ అర్థంచేసుకున్నాడు. అపుడపుడు ఏదో అని నవ్వించే
వాడు. "ఇప్పుడు ఒక్కటిన్ను బత్తాయిరసం దొరికితే
ఏం చేయమన్నా చేసేస్తా" అన్నాడు జన్సర్‌తో. అలసట తగ్గి
నందువల్ల లేచి ఏదోపని కల్పించుకుని అటూయిటూ తిరుగు
తున్నాడు. త్వరలోనే తమకి ఈ అవస్థ తప్పుతుందనీ, అంతా
నవ్యంగా జరుగుతుందనీ సిబ్బందికి ధైర్యం చెప్పాడు.

కాలిన తన చేతులు చూసుకుంటే జన్సర్ కి తన మీద తన కేజా లేసేది. వెంటనే మెక్ మహాన్ కేసి చూసేవాడు. మెక్ మహాన్ దారుణ పరిస్థితి చూస్తే మిగతావారందరికీ వణగడానికికూడా సిగ్గేసేది. కెనెడీకి గుండెబద్దలయేది. కంటి రెప్పలు కాలి కమిలినందువల్ల మెక్ మహాన్ కి చూడ్డానికి కూడా వీలులేదు. అరచేతులు మూడంగుళాల మేర వుబ్బి వున్నాయి. పెట్లిపోయివున్నాయి.వుళ్ళనుంచి వచ్చే దుర్గంధం మిగతావారికి ఎక్కడ చిరాకుకలిగిస్తుందోనని మథనపడి పోయే వాడు.

మనసులో కూడా దేవుడి సహాయం కోరలేదు గానీ బతికి బయటపడి ఇల్లు చేరితే తన పద్ధతంతా మార్చేసుకో దలచుకున్నాడు. అసలు ఇల్లు చేరగలనా అనిపించింది.

అందరికీ ఆకలి దహించేస్తోంది. ఆదివారం మధ్యా హ్నం మావర్ పెడితే తిన్నతిండి. ఇవాళ బుధవారం. మధ్యాహ్నమైంది. తినడానికి కొబ్బరికాయలకోసమనీ, పెర్గు సన్ పాసేజ్ కీ బోట్లుకీ దగ్గరుంటుందనీ రాస్ రాగానే ఓలసానా దీవికి వెళ్ళడానికి నిశ్చయించాడు కెనెడీ. ఆ దీవి లంగరు ఆకారం కడ్డీచివరన వుంది. దానికీ పాసేజ్ కీమధ్య ఒ కేద్వీపం అడ్డు. ఓలసానా నైఋతిదిక్కుగా ప్లమ్ పుడింగ్ కి ఒకటిముప్పా తికమైళ్ళ దూరంలో వుంది.

మళ్ళీ బల్లచెక్క నీటిలోకి ఈడ్చారు. మళ్ళీ కెనెడీ మెక్‌మహన్ కేపక్‌బద్దీ నోటకరచుకుని తీసికెళ్ళారు. నిర్మానుష్యంగావున్న ప్రదేశం వదిలివెడుతున్నారు. వెళ్ళే చోట జపాన్‌వారు ఉండచ్చు. చెప్పలేము. కానీ ఓలసానా ప్రాంతంలో అలికిడిలేదు. లెక్కలేనన్ని కొబ్బరిచెట్లున్నాయి. అలసిపోయివుండడంవల్ల నీరు హాయనిపించింది. మెక్‌మహన్‌కి కూడా గమ్యంచేరుకుంటామన్న ఆశ చిగురించింది. ప్రయాణం కొన్నిగంటలుపట్టింది. బ్లేకెట్‌జలసంధిలోకన్నా దీవులదగ్గర ప్రవాహం తీవ్రంగావుంది. కెనెడీ, మెక్‌మహన్ ఓలసానా ఒడ్డుచేరుకున్నారు. మిగతాసిబ్బంది వారిదాపులో కొన్ని వందలగజాల దూరంలోనైనా ఒడ్డుపట్టడానికి ఇబ్బందిపడాల్సి వచ్చింది. ఒడ్డువద్దకు చేరుకుంటూంటే ఆల్బర్టు చెక్కవదిలేసి ముందు ఈదుకెళ్ళాడు. అక్కడినించి రండిరండని అరిచాడు. అతని కేకలు జపాన్‌వారు ఎక్కడ వింటారోనని మిగతావారికి మండిపోయింది.

పదకొండుమందీ వంపుతిరిగిన ఓలసానా ఆగ్నేయకొన ఒడ్డుమీద చెట్లచాటుకు చేరుకున్నారు. అక్కడినుండి తిన్నగా అరమైలుదూరంలో ఫెర్గుసన్‌పాసేజ్ అంచునున్న నారూద్వీపం కనిపిస్తోంది. ఇప్పుడేంచేదాంఅని గుసగుసల్లో మాట్లాడుకున్నారు. దీవిలోనికివెళ్ళిచూద్దామా? దీవి ప్లమ్‌పుడింక్‌కి రెండింత లుంది. కోరికోరి ప్రమాదం తెచ్చుకోడం ఎందుకని

ఎవరో అన్నారు. అది నిజమేననిపించింది. వారున్న చోటుకి యాభై గజాల మేర దాటి ఎవరూ వెళ్ళలేదు. కొబ్బరికాయలు దింపి తిన్నారుగానీ కెనెడి, మెక్‌మహన్ మరికొందరికి కడుపులో తిప్పేసింది. కొంతతమూషాకని రాస్ పాకుతున్న నత్తని నోట్లో వేసుకున్నాడు. భయంకరంగా వుంది. ఒకరు మెట్టపీతని పట్టుకున్నారుగానీ ఇంకా ఎవరూ దాన్నికూడా తినేసేటంత ఆకలితో లేరు. దాన్ని విసిరేశారు. మంచినీరు దొరుకుతుందేమోనని జిన్సర్ తవ్వి చూశాడు. రాయి తగిలి గోళ్ళు చీలాయి తప్ప ఫలితం కనబడలేదు. నౌకాదళం తాను తప్పిపోయాడని తన భార్యకు తెలియజేస్తే ఆవిడ తను పోయాడని కంగారుపడుతుందేమోనని కలవరపడ్డాడు.

చీకటిపడేసరికి అంతదూరం ఈదివచ్చినందువల్ల డస్సిపోయారు. ఆ మూడు రోజుల్లో ఆరాత్రే ఎవరూ ఫెర్గుసన్ పాసేజ్ వైపు వెళ్ళలేదు. ఆ మూడు రోజుల్లో ఆరాత్రే బోట్లు ఫెర్గుసన్ పాసేజ్ గుండా వచ్చాయి. బ్లేకెట్ జలసంధిలో తొమ్మిదిన్నర కల్లా గస్తీవున్నాయి.

వెచ్చదనం కోసం అందరూ చీకట్లో దగ్గర దగ్గరగా ఒదిగి పడుకున్నారు. పగలంతా వేడిగావున్నా పొట్టి లాగులు, తడిసిన బట్టలు వేసుకున్నందువల్ల రాత్రి చలిగానే వుంది. నీటికింది జాతిచట్టుపైన సముద్రం హోరు వినిపిస్తోంది. గాలివల్ల ద్వీపం మీది చెట్లలో వింతవింత ధ్వనులు వినబడ్డాయి.

కొన్ని చప్పుళ్ళు ఏమిటో తెలీక సిబ్బందిని కంగారు పెట్టాయి. అటువైపు శత్రువున్నా వుండచ్చు. ఉంటుండి ఒక వికృత మైన ధ్వని వారి నందరినీ భయపెట్టింది. గాలికి రెండు కొమ్మలు రాచుకుంటున్నాయని తెలిశాక కుదుటబడ్డారు. ఆల్బర్ట్‌కి వంటరిగాతోచి అందరిలోకీ పరిచయస్థుడైన రాస్ పక్కన పడుకున్నాడు.

రాత్రి జల్లుపడింది. నోరెండిపోయివున్న మెక్‌మహాన్ ఆకుల్ని నాకుదామని లేచాడు. చీకట్లో అడుగెయ్యగానే ఓదృశ్యంచూసి కొయ్యబారిపోయాడు. ఇరవైఅడుగుల దూరంలో ఎదురుగా స్తబ్ధంగానించున్న బలమైనఆకారం కని పించింది. మెక్‌మహాన్ శిలేఅయిపోయాడు. తనని తేరిపార చూస్తున్నవి జపానీయుడికళ్ళే అని ఊహించాడు. ఏం చెయ్యాలో తెలియలేదు. కాలినకాళ్ళతో వాడికంటె వేగంగా పరుగెట్టలేడు. నేలకుకరచుకుంటే వాడు మీాద దూకొచ్చు. చేతిలో పిస్తోలుగానీ చాకుగానీలేదు. అరుద్దా మంటే భయమేసింది. అల్లా మాన్పడిపోయి చూస్తున్నాడు. ఇద్దరూ అలా ఇంకాసేపు ఒకరినొకరుచూస్తూ నిలబడ్డారు. అవతలివాడు సాయుధుడైన జపానీయుడుకాడేమో? అయితే మీాదపడుండేవాడు. వెంటనే ఆ ఆకారం మెగ్వ్యార్‌దని గమ నించాడు. అవతల మెగ్వ్యార్ పరిస్థితీ ఇతనిలాగే వుంది. ఈ మూాడురోజుల్లో తమని శత్రువులు ఎక్కడో అక్కడ చూసే

వుంటారనీ, ఏక్షణంలోనైనా వచ్చిపడతారనీ మెగ్యూర్ నమ్మకం.

ఆగస్టు 5 గురువారం మిత్రరాజ్యాలకు ఆనందకరమైన దినం. ముండా ఆక్రమించుకున్నారు. కాని ఓలసానాదీవిలో ఒంటరిగావున్న పదకొండుగురికి పొద్దు నిరుత్సాహంగానే పొడిచింది. వారికది నాలుగోరోజు. ఈ దీవుల్లోవున్నకొద్దీ జపానువారు తమనుకనుగొనేప్రమాదం ఎక్కువవుతోంది. సమస్యకు పరిష్కారమార్గం కనబడుటలేదు. ఏదోముప్పు ముంచుకొచ్చేస్తోందని వారిలో చాలామంది అనుమానపడసాగారు. క్రితంరోజు ఒకరు "ఇహమనకి రోజులుమూడాయి. అందరం పోతాం" అని మూలిగితే జాన్స్టన్కి కోపంవచ్చి "ఏడిశావ్ ఊరుకోవోయ్. నువ్వెలా చస్తావ్? మంచివాళ్ళే త్వరగా పోతారు" అని కసిరాడు. ఇప్పుడు అతనికే అనుమానం వస్తోంది. మెగ్యూర్ మెడనున్న జపమాలనుచూస్తూ "దండ కోమారుపనిపట్టించు" అన్నాడు. ఇలాంటిపరిస్థితుల్లో సమూహ ప్రార్థనలు ఫలిస్తాయని ఎక్కడో విన్నానని మెగ్యూర్ అన్నాడు. అందరూ ఒకేమారు ప్రార్థనలుజరిపితే? థామ్ ఒప్పుకోలేదు. వఠినాటకంలా వుంటుందన్నాడు. తమలో చాలామందికి అసలు మామూలుగా ప్రార్థన అలవడలేదు. కష్టంలోవున్నామని అందరూ ప్రార్థనలుమొదలెడితే ఎబ్బెట్టుగా వుంటుందన్నాడు.

సిబ్బంది ఆలోచనల్లో పిటి 109 వెనుకబడినా లెఫ్టి నెంట్ ఇవాన్సూ, అతని అనుయాయులూమాత్రం దానిసంగతి మరిచిపోలేదు. పొద్దున్న 9-30 కి కె. ఇ.ఎన్. కి ఈ విధంగా వార్తపంపాడు :

"నేను చూసినలాటిశాల్రీ ఫెర్గుసన్ పాసేజ్ లో దక్షిణంగా కొట్టుకెడుతూ కనిపిస్తోంది. గ్రాస్ దీవికి ఆగ్నేయ దిక్కులోవుంది. ఇంకో ఇరవైనాలుగుగంటలదాకా అదేమిట్లో పరిశీలించడానికి వీలులేదు."

ఇంకోరెండుగంటల్లో కె. ఇ. ఎన్. కి– "శాల్రీ చిన్న బోటుతాలూకు ముందుభాగంలా కనబడుతోంది. ఇప్పుడు గ్రాస్ దీవి దక్షిణాన రాతిచట్టుమీద వుంది" అని తెలియజేశాడు.

ఇంకా సేపున్నతర్వాత -

"శాల్రీ యింకా రాతిచట్టుమీదే వుంది. గాలికి పోటుతో కొట్టుకుపోవచ్చు. ఇక్కడనుండి దాన్ని ధ్వంసం చెయ్యడం పడదు. కెరటాలమూలంగా నాకు లోపలి దగ్గరకి వెళ్ళడం కష్టం."

కెనెడీ సిబ్బందినుండి కొంచెందూరంజరిగి రాస్ ని థామ్ ని పిలిచాడు. "ఏంచేద్దాం" అని అడిగాడు. శాల్త్రీపూర్తి

ఫెర్గుసన్ పాసేజ్ కి వెళ్ళిచూశారు. దీవి మారారు. బోట్లుగానీ విమానాలుగానీ వస్తాయేమో గమనిస్తూవుండమని సిబ్బందికి చెప్పారు. ఇంకా ఇంతకన్నా ఏంచెయ్యగలరు ? కెనెడీకి ఏం తోచలేదు. చెట్లనీడని రోజంతా కూచోడం అతనికి ఇష్టం లేదు. బయటపడడానికి ఏదో ప్రయత్నం జరుగుతూనేవుందిఅని సిబ్బంది ధైర్యంచెప్పుకోడానికైనా ఏదోఒకటి చెయ్యాలి. నారూదీవికేసి చూశాడు అరగంటలో ఈదుకెళ్ళొచ్చు. దాని అవతలిగట్టు ఫెర్గుసన్ పాసేజ్ ముఖంగా వుంది. ఉంటేమాత్రం ఏంలాభం? మిత్రనౌకలు పగటిపూట అటురావు. నారూకి వెడదామంటే బలమైనకారణం ఒక్కటీ కనిపించడంలేదు. "ఏమైతేఅయింది ఓమాటు యిదిచూసొద్దాం" అన్నాడు రాస్ తో.

సరిగ్గా అదేసమయానికి బియుకుగాసా, ఎరోనీకుమానా వానావానాదీవిలో తమనావఎక్కి ఫెర్గుసన్ పాసేజ్ దాటి బ్లేకెట్ జలసంధిమీదుగా సెపోదీవి చేరడానికి బయలుదేరారు. క్రితంరోజు ఇవాన్స్ కి సమాచారంఅందించి. కోలంబంగారా నుంచి బయలుదేరి రాత్రికి వానావానాదీవినున్న రారమన గ్రామంలో విడిదిచేశారు. అక్కడివారిస్నేహితులవద్ద శలవు తీసుకొని సెపోవైపు తెడ్డేశారు. వారిదారి రారమననించి ఫెర్గుసన్ పాసేజ్ కి అడ్డంగావచ్చి నారూద్వీపంపక్కనించి వెడుతుంది.

మొన్న అటుమొన్నకన్న తేలికగానే ఈదుతూ రాస్, కెనెడీ నారూచేరారు. సమయం మధ్యాహ్నం పన్నెండు దాటింది. నారూద్వీపం లంగరుఆకారం అట్టుకునుంన వుంది. సన్నగా నాలుగువందలగజాల పొడుగుంది. ఒడ్డునున్న తెల్లటి ఇసక దాటారు. చెట్టూచేమా దట్టంగావుంది. పైన నల్లటి సీతాకోకచిలుకలు ఎగురుతున్నాయి. నేలంతా పీతకన్నాలు. రాతిచట్టుమీద విరిగిపడుతున్న కెరటాలహోరు ఒడ్డునున్న కొబ్బరి, సరుగుడు చెట్లలో ప్రతిధ్వనిస్తోంది. కెనెడీ, రాస్ ఫెర్గుసన్ పాసేజ్ దిక్కుగా పొంచిపొంచి జరిగారు. పాసేజ్ కి ఎదురుగా వుండడంవల్ల మిగతాఅన్ని దీవులమీదా నారూదీవే జపాన్ వారికి అనువైన నిఘాస్థలం. పైగా తాము ఓలసానా నుండి బయలుదేరుతున్న సమయంలో పాసేజ్ వైపున్న ప్రాంతంమీద న్యూజిలాండ్ పి- 40 విమానాలు దూసుకుంటూ దాడిచెయ్యడం చూశారు. అందుచేత అక్కడ జపాన్ కేంద్రం వుండుండాలి అనిపించింది. ఈ కారణంవల్ల వారు నారూమీద పొదలచాటునేవుండి చాలా జాగ్రత్తగా మసిలారు.

దీవివెడల్పు తక్కువైనందువల్ల ఫెర్గుసన్ ఒడ్డు చేరడానికి ఆట్టేసేపు పట్టలేదు. చెట్లచాటునుంచి రెండోవా శిఖరం స్పష్టంగా కనిపించింది. దాదాపు ముప్పైఎనిమిదిమైళ్ళ దూరంలోవుంది. కాని ఆరుబయట నీటిమీద చిన్నచిన్నదీవుల

మీాంచిచూస్తే అంతదూరం అనిపించటంలేదు. పదకొండు మంది అక్కడ చేరుకోడానికి వేరేమార్గం వుండితీరాలి.

ఎడమవైపు ఒడ్డంబటే బయలుదేరారు. ఒడ్డునుంచి దాదాపుమైలుదూరంలో రాతిచట్టుమీాద కూలిపోయిన చిన్న జపాన్‌బోటు కనబడింది. ఇందాకటి పి-40 లదాడి దీని మీాదేఅయివుంటుంది. ఇంకొంతదూరం నడిచేసరికి దాని తాలూకుసామాను ఒడ్డుకికొట్టుకొచ్చి పడివుండడం గమనించారు. తాడుతోకట్టివున్న పెట్టెని ఆశతోవిప్పారు. బొప్ప కణాల ఆకారంలో కేండీమిఠాయిచూసేసరికి వారిఆనందానికి అంతులేదు. ఒక్కక్షణంసేపు నారూద్వీపంమీాద క్రిస్‌మస్ పండుగ ఉత్సాహం వెల్లివిరిసింది. క్షణకాలం యుద్ధం బోటు ప్రమాదం సర్వం మరిచిపోయారు. మిఠాయిచీకుతూ నూతనోత్సాహంతో అడుగేశారు. దీనిపరిశీలించినతరువాత మిఠాయి సిబ్బందికి తీసికెడదామన్నాడు కెనెడీ.

ఫలానాకారణంలేకుండా నారూద్వీపానికి వచ్చినందుకు ఫలందక్కిందనుకున్నారు. నిక్షేపందొరికినట్లే మురిసిపోయారు. ఇద్దరేమనుషులు అరమైలుమేర ఉప్పునీటిలోంచి ఆ పెట్టెని చేరవేయడం ఎలాగా అనిపించింది రాస్‌కి.

ఇంకోఇరవైగజాలదూరం వెళ్ళగానే పొదల్లో ఎవరో వదిలేసిన నావ కనబడింది. దానిలో ఓడనిండా వాననీరువుంది.

స్థానికగూఢచారులు దీవులంతటా అక్కడక్కడ ఈవిధంగా నావలూ, నీరూ దాచివుంచేవారు. ఆసంగతి వీరికి తెలీదు. నావపక్కకూచుని కొంచెంకొంచెం నీరు తాగేరు.

బియుకు, ఎరోనీ అవతలనించి పాసేజ్ దాటి నారూ దీవి సమీపించగానే వారికీ ఆ కూలిపోయిన జపాన్ బోటు కనబడింది. ఏదేనా దొరుకుతుందేమో చూదామని కుతూహలపడ్డారు. రాతిచట్టుచేరగానే నావని కొంచెందూరంలో లంగరువేసి బోటుఎక్కారు. యిక్కడ రాస్, కెనెడీ మంచినీటితో దప్పికతీర్చుకొనే సమయంలో అక్కడ బియుకు, ఎరోనీ డెక్ మీద చెల్లాచెదురుగాపడివున్న మేపులూ, బోటు యంత్రాలముక్కలూ మొదలైనవి కెలికి చూస్తున్నారు. వారికినచ్చినవి అక్కడున్న జపానీస్ రైఫిల్సు చెరోటీతీసుకుని బోటుదిగగానే యిక్కడ కెనెడీ, రాస్ బీచిఒడ్డుమీదికొచ్చారు.

మైలుదూరంలో రెండుజంటలూ ఒకరినొకరు చూశారు. ఎరోనీ, బియుకు వీరిద్దరూ బోటునుండి తప్పించుకున్న జపాన్‌వారనుకున్నారు. పేలుస్తారేమోనని భయమేసి గబగబా నావకేసి పరుగెట్టారు. ఆ కంగారులో ఎరోనీ తన రైఫిల్‌ని వదిలేశాడు. ఇహ నేముంది? చివరికి జపాన్‌వారు తమను పసిగట్టేశారనుకుని కెనెడీ, రాస్ పొదలచాటుకి దూకారు. అసలు వారిద్దరూ ఎవరు ? తమని చూసేవుంటారా?

వెంటనే వారు జపాను కేంద్రానికి ఈ సమాచారం చెబితే ద్వీపాలన్నీ గాలించేస్తారేమో! సంతోషంగా మొదలైన నారూ ప్రయాణం యిలా పరిణమించిం దేం?

ఎరోసీ, బియుకు నారూనుండి బ్లేకెట్ జలసంధిలోకి అతివేగంగా దారితీశారు. లియోరావా ఇసకతిప్పచుట్టగానే సెపోదీవికి వెళ్ళిపోవచ్చు. అలాగే వెళ్ళుంటే ఈ పదకొండు గురూ కనిపించివుండివుండరు. సెపో చేరుకుని నారూమీద కని పించినజంటని మరిచేపోయివుందురు. అప్పటికి వారికి ఒకటే ఆలోచన-ఆ యిద్దరినించీ తప్పించుకొని సాపోకి ఎలాగోలా వెళ్ళిపడదామని. ఇంకొంతదూరం అలాగే వెళ్ళివుంటే ఆ పసిఫిక్ దీవుల్లో ఒకదానిమీద దిక్కులేక అలమటిస్తున్న ఆ పదకొండుగురిసంగతీ పత్తావుండేది కాదు. కానీ ఏమాలో చించారో దారిమళ్ళి ఓలసానాదీవివైపు తెడ్డేశారు.

ఈ కంగారులో బియుకి దాహంవేసింది. ముందు తెడ్డే స్తున్న ఎరోసీకి నచ్చజెప్పి ఓలసానాకెళ్ళి కాసినికొబ్బరినీళ్ళు తాగుదామన్నాడు. ఎడంవైపుకిమళ్ళి దగ్గరలో అంటే దీవి ఆగ్నేయకోసనున్న ఒడ్డుకి నావ పట్టించారు.

రాస్‌తో నారూకి బయలుదేరినపుడు కెనెడీ, సిబ్బంది భారం థామ్‌కి వప్పచెప్పి వెళ్ళాడు. తొమ్మిదిమంది చెట్ల చాటున ఒడ్డుకనిపించేలా కూచుని కెప్టెన్ నారూగురించి,

తెలిపేవిశేషాలకోసం ఎదురుచూస్తున్నారు. అంతలో ముగ్గురు నలుగురికి యిద్దరుమనుషులతో వస్తున్న నావ కనిపించింది. కొయ్యబారిపోయారు. ఇంతాఅయింతరువాత చివరికి శత్రువులచేతుల్లో చిక్కిపోతామా? పట్టుబడితే చిత్రహింస, దారుణ మరణం తప్పదు. అందరూ ఒకేసారి గుసగుసలాడుకున్నారు. ఆ యిద్దరూ శత్రువాళ్ళు. గిజోమీదున్న జాపనీస్ పంపిన గూఢచారులేమో? ఒకవేళ కాకపోయినా వారిద్దరూ తమకు సహాయంచేస్తారన్న నమ్మకమేమిటి? వారిని పేల్చేస్తే? లేక యింకా లోపల చెట్లచాటుకెళ్ళి దాక్కోవచ్చు. వారికంట బడకుండా తప్పించుకునేందుకు అవకాశం లేకపోలేదు. బియుకు, ఎరోసీవచ్చి దాహంపుచ్చుకొని ఏమీ తెలియకుండా వెళ్ళిపోవచ్చు.

ఈ పరిస్థితిలో థామ్ ఒకమేలైననిశ్చయానికొచ్చాడు. ముందుజరిగేదానిమీద తమ అందరిప్రాణాలూ ఆధారపడి వున్నాయని తెలిసినా సాహసించిలేచి ఆ యిద్దరికీ కనిపించేట్లుగా ఒడ్డుమీదికి నడిచివెళ్ళాడు. అప్పటికి వారు ఒడ్డుకి ముప్పైఅడుగులదూరంలో వున్నారు.

తెల్లటిగడ్డంతో చింకిగుడ్డలతో పెద్దశరీరంతో థామ్ ఆకారం ప్రత్యక్షమయేసరికి బియుకు,ఎరోసీలగుండెలు గుభేలుమన్నాయి. ఇలాంటిదృశ్యం కనబడుతుందని వారసలు కలగనలేదు. కేవలం భయంతో శక్తినంతా ఉపయోగించి

వెనక్కి తెడ్డేయడం మొదలెట్టారు. థామ్ నీటిలోకి పరిగెట్టు కెళ్ళి కుడిచెయ్యూపుతూ పిలిచాడు. "రండి రండి" అని కేకే శాడు. వీరుకూడా జపానువారేఅయుంటారని భయపడి వారు నావ వెనక్కి పట్టించేశారు. అమెరికన్లకి పెద్దసమస్య వచ్చి పడింది. వారెళ్ళి బహుశాజపానువారికి తమసంగతిచెప్పొచ్చు. కేవలం ఆత్మరక్షణకి తుపాకీ ఉపయోగించిఅయినాసరే వారి నెలాగోఅలాగ ఆపాలి. తుపాకీ గురితప్పితే పేల్చారన్న కోపం కొద్దీఅయినా వారెళ్ళి శత్రువుకి తమసంగతి చెప్పెయ్యొచ్చు. పైగా వా రెళ్ళిపోతే ఇక తమకు సహాయంవచ్చేయోగం వుండకపోవచ్చు.

థామ్ "నేవీ-నేవీ-అమెరికన్స అమెరికన్స" అంటూ అరుస్తూ బతిమాలాడు.

ఎరోనీ, బియుకు క్షేమకరమనుకున్నంతమేర వచ్చేసి వుండడంవల్ల ఆగి విన్నారు. చిక్కేమిటంటే వారికి థామ్ ఏంచెబుతున్నాడో అర్థంకాలేదు. వారి అనుమానం గ్రహించి థామ్ తన కుడిచేతి చొక్కా పైకి మడిచి తెల్ల చర్మం చూపుతూ "నేను జపాన్‌వాణ్ణికాను" అంటూ అరి చాడు. బియుకు, ఎరోనీ లకి ఇంకా అనుమానం వదల్లేదు. థామ్ ఇంకోవిషయం ఎత్తి "నాకు జానీ కారీ తెలుసు" అన్నాడు. జానీకారీ వానావానాద్వీపవాసుల పెద్ద. గూఢ

చాటిగా వుండి సహాయంచేస్తూ లుంబేరీకి వచ్చి పోతూండడం వల్ల పి. టి. ల సిబ్బందికి పరిచయస్థుడు. అప్పటికీ బియుకు ఎరోసీల వద్దనుంచి సమాధానం రాలేదు. థామ్‌కి వెంటనే ఓటి తట్టింది.

"వైట్‌స్టార్ (తెల్లనక్షత్రం) వైట్‌స్టార్" అంటూ ఆకాశం వైపు చూపించాడు.

బియుకు, ఎరోసీలకు ఇది అర్థమైంది. థామ్, చెట్లచాటు నించి ఒక్కొక్కరే బయటికొస్తున్న సిబ్బందీ మిత్రులేనని నమ్మకం కుదిరింది. మెల్లిగా ఒడ్డుకి చేరారు. అమెరికన్ విమానాలమీదుండే చిహ్నం తెల్లటిగీతమీద తెల్లటి నక్షత్రం. కోస్ట్‌వాచర్లు, తమ సహాయకులందరికీ తెల్లనక్షత్రం వున్న విమానాలు కూలిపోతే వాటితాలూకు సిబ్బందికి సాయంవెళ్ళి సాధ్యమైనంత త్వరలో కోస్ట్‌వాచర్ల కేంద్రానికి తీసుకురావాలని చెప్పివున్నారు.

థామ్, సిబ్బందీ బియుకుఎరోసీలకు సాయంవెళ్ళి వారి నావను రెండుకొబ్బరిచెట్లచాటుకు చేర్చారు. అందరూ పొదలచాటుకు చేరారు. ఇద్దరికీ కూడా ఏం మాట్లాడాలో కొంచెం ఇబ్బందిగానే వుంది. బియుకు ఎరోసీలు బిడియపడు తున్నారు. వారికి ఇంకా కొత్తపోలేదు. ఇటుసిబ్బందికీ ఇంకా వారంటే పూర్తినమ్మకం కలగలేదు. సంజ్ఞలుచేస్తూ మెల్లి

మెల్లిగా సంభాషణ మొదలెట్టారు. బియాకు ఎరోనీలు నారూ వైపుచూపి అక్కడజపానీస్ వున్నట్టు తెలియచేశారు. వారింకా కెనెడీ రాస్‌లు జపాన్‌వారే అనుకుంటున్నారు. సిబ్బందికి కంగారుపుట్టింది. నారూ కెళ్ళిన తమ ఆఫీసర్లకి ఎక్కడ కీడు మూడుతుందో అని కలవరపడ్డారు.

నిజంగాచూస్తే అప్పటికి పరిస్థితులు అనుకూలించటం మొదలెట్టాయి.

ఆ మధ్యాన్నం ఇవాన్స్, కె ఇ ఎన్‌కి "రేపు స్థలం మారుస్తున్నాను. ఎక్కడ చేరేదీ పొద్దున్న తెలియబరుస్తా" అని వార్తపంపాడు.

ఇవాన్స్‌కి ఫెర్గుసన్ పాసేజ్‌లోనూ బ్లేకెట్ జలసంధి పడమటి ప్రాంతంలోనూ ఏం జరుగుతుందో కోలంబంగారా మీాదున్న తన కేంద్రంనుంచీ అంతబాగా కనబడటం లేదు. ఇంకొంచెం మధ్యకి జరిగితే వీలుగా వుంటుందని నిశ్చయించుకున్నాడు. మర్నాడు తన కేంద్రం గోము ద్వీపానికి మార్చబోతున్నామని తన సహాయకులందరికీ కబురంపాడు. గోము ద్వీపం, బ్లేకెట్ జలసంధి దిగువన గ్రాస్‌ద్వీపం అనికూడా పేరున్న నారూ ద్వీపానికి తూర్పున దాదాపు ఏడుమైళ్ళ దూరంలో వుంది. వానావానా ద్వీపానికి ఉత్తరాన వున్న చిన్నచిన్న ద్వీపాలలో గోమూ ఒకటి. ఆ మధ్యాహ్నమే

అంటే ఆగస్టు ౬ వ తేదీన పి.డబ్ల్యు.డి. నించి ఆరోజు విమా నాలు కూలిపోయిన పి. టి. ని పరిశీలించాయనీ, అది బాగా దెబ్బతిని వుందనీ ఎయిర్ ఇంటలిజన్స్ వాళ్ళు తమకు తెలిపా రనీ అందువల్ల ఆ పి. టి. గురించి పట్టించుకో నక్కరలేదనీ కబురు వచ్చింది.

పి. టి. 109 గురించి వచ్చిన ఆఖరి వార్త ఇదే!

ఇక్కడ కెనెడీ, రాస్ చాలాసేపు పొదల్లో బెదు రుతూ బెదురుతూ దాక్కున్నారు. అలికిడేమీ లేకపోయే సరికి మరల బయటికొచ్చి అటూఇటూ తిరిగారు. ఏమీ కన బడలేదు. కెనెడి, తాను అంతకుముందు పొదల్లో చూసిన నావను ఏదోవిధంగా ఉపయోగించాలనుకున్నాడు. ఈది వెళ్ళడంకన్నా నావలో వెడితే పి. టి. బోట్లను కనుక్కోడం సులభమనిపించింది. ఆ రాత్రే ఫెర్గుసన్ పాసేజ్‌కి నావలో వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

చీకటి పడకమునుపే దొరికిన మిఠాయీ, మంచినీరూ ఓలసానాలో వున్న తన సిబ్బందికి చేరవేద్దామనుకున్నాడు. తెడ్డుకోసం కర్రపెట్టెలోంచి ఓ చెక్క విరిచాడు. రాస్‌ని అక్కడే ఉండమన్నాడు. తను బయలుదేరేసరికి రాస్ ఒడ్డునే నిద్రపోయాడు.

ఇక్కడ థామ్‌కి కూడా ఓనావ దొరికినందువల్ల తాము బయటపడేందుకు ఏపద్ధతి అవలంబించాలా అని సిబ్బందితో సంప్రదించాడు. చివరకి స్టార్కీని, బియుకు ఎరోసీలలో ఒకరిని తీసుకుని తనే రెండోవా రేవుకు వెళ్ళి సాయం తీసుకొస్తానన్నాడు. నావమీద అంతదూరం వెళ్ళడం కష్టమే కానీ ప్రయత్నంచేయాలని నిశ్చయించుకున్నాడు.

బియుకు ఎరోసీలుమాత్రం వప్పుకోలేదు. థామ్ పట్టు బట్టగానే వారిద్దరూ ఎదురుచెప్పలేదు. థామ్, స్టార్కీలతో బాటు బియుకు నావనెక్కాడు. నారూ ద్వీపం దాటారో లేదో ఫెర్గుసన్ పాసేజ్ వైపు ప్రవాహం మహావడిగా వున్నదని తెలిసొచ్చింది. కెరటాలు నావనిఊపేశాయి. బియుకు ఓలసానాకి తిరిగిపోదామన్నాడు. థామ్ స్టార్కీలు వినకుండా మొండిగా తెడ్డేశారు. రెండోవా చేరేలోగా నావ ఇక్కడే తలకిందు లవుతుందని వారికి తెలిసొచ్చింది. అయిష్టంగానే మళ్ళీ ఓలసానా ద్వీపానికి తిరిగివచ్చేశారు.

దాదాపు అదే సమయానికి కెనెడీ నారూ నించి వచ్చి చేరాడు. సిబ్బంది ఆనందం వర్ణనాతీతం. బియుకు ఎరోసీలను చూసి ఆశ్చర్యపోయాడు. అంటే— తనూ, రాస్ నారూమీద చూసినవారు వీరేనని కెనెడీకి తెలియదు. వారు తాము నారూమీద ఖచ్చితంగా జపానీస్‌ని చూశామని అంటూంటే వారు ఎవర్నిచూసి అలా అనుకున్నారో కెనెడీకి అర్థంకాలేదు.

తానెరుగున్న జాపనీస్ విషయం, కూలినబోటు ఒడ్డుకి కొట్టుకొచ్చిన మిఠాయిలూ. ఆకలితో మలమలలాడిపోతున్న తన సిబ్బందికి ఆ మిఠాయికాస్తా పంచిపెట్టాడు. మంచినీటి డబ్బాకూడా అక్కడేవదిలేసి రాస్‌ని తిరిగి కలుసుకోడానికి ఫెర్గుసన్ పాసేజ్ వైపు బయలుదేరాడు. ఆరాత్రే వార్‌ఫీల్డ్ ఉత్తర్వుమీద బ్లేకెట్ జలసంధిలో గస్తీకి పి. టి. బోట్లు ఫెర్గుసన్ పాసేజ్ ద్వారా వస్తున్నాయని తెలిస్తే అతని ఉత్సాహం మిన్నుముట్టేది.

కానీ మొదటినుండి కెనెడీ, రాస్‌లు కష్టాలే ఎదుర్కో వలసివచ్చింది. థామ్, స్టార్క్, బియుకులని వెనక్కుమళ్ళిం చిన కెరటాలు రాతిచట్టుమీద బీభత్సంగా విరిగిపడుతు న్నాయి. గాలి విజృంభిస్తోంది. బుల్లినావతో ఆ వాతావరణా నికి ఎదురీగడం తెలివితక్కువపని అనుకున్నాడు రాస్. ఆమాటే పైకిఅన్నాడు. కెనెడీమాత్రం "బార్నీ, తప్పదోయ్ మనం వెళ్ళితీరాలి" అన్నాడు. రాతిచట్టుదాటారు. సముద్రం ఉవ్వెత్తుగా లేచిపడుతోంది. తెడ్లుగాఉపయోగిస్తున్న కర్ర చెక్కలతో నావని అదుపులోవుంచడం కష్టమైపోయింది. నావలోకి నీరొచ్చేసింది. వెనకవున్న రాస్ ఓకొబ్బరిచిప్ప తోటి నీరుతోడబోయాడుకాని లాభంలేకపోయింది. ఇంకా నిండిపోయింది. వెనక్కితిరిగిపోదామాఅని కేకేసుకునేలోగా

అయిదడుగుల ఎత్తున ఓ కెరటంవచ్చి నావని తలకిందులుచేసింది. చీకట్లో తడుముకుంటూ నావనిపట్టుకున్నారు.

"సారీ! ఇదంతా నామూలానేనోయ్ బార్నీ" అన్నాడు కెనెడీ.

"ఇలాటప్పుడే నేచెప్పలే అంటూ వాదించవచ్చుగానీ ఆమాట అననులే" అన్నాడు రాస్.

కెరటాలు సుడిగుండంతిప్పినట్లు తిప్పేస్తున్నాయి. దిక్కు తెలియడంలేదు. కానీ ఓదీవి ఆకారం కనిపించింది. దాన్నివైపు బయలుదేరారు. జాతిచట్టు తగిలింది. అదే ప్రతిబంధకమై కూచుంది. దానిమీద చేరుకున్న కెరటాలలో చిక్కుకుని అక్కడే అటూఇటూ ఊగిసలాడిపోయారు. ఆ ఊపు ఎక్కువై ఎక్కువై కెనెడీని రాస్ని నావనీ కొన్ని టన్నుల నీళ్ళతోసహా గాలిలోకి విసిరికొట్టింది. ఒడ్డంబట పగడాలతో ఎగుడుదిగుడుగా వున్న గుంటల్లోకి వెళ్ళిపడ్డారు. చీకట్లో కెనెడీకి రాస్ జాడ తప్పింది. "బార్నీ" అని పిలిచాడు. జవాబులేదు. రాస్ ఏమయ్యాడో! దానికి కారణం తనేకదా అన్న బాధతో మళ్ళీ ఊపిరితిత్తులు బద్దలయేలాగ కేకేశాడు. "ఇటువైపున్నా" అంటూ రాస్ దగ్గరనుంచి సమాధానం వచ్చింది. నావకి కూడా దెబ్బతగల్లేదు. కర్రచెక్కలూ దగ్గరలోనే తేలుతున్నాయి.

(చేత్తో తొలిచిన ఈ నావలు చాలా మందంగానూ పటిష్టంగానూ వుంటాయి. ఒకోనావ ఒకేచెట్టుమొదలునుంచి దొలుస్తారు. సాధారణంగా గోలిటిచెట్టుమొదలునే ఎక్కువ వాడతారు. ద్వీపవాసులు నావదొలచడం ప్రారంభించినప్పుడు ఆనవాయితీగా దగ్గరలో ఓకర్రమీద కొబ్బరికాయని గుచ్చు తారు. రెండుమాసాల్లో కాయ మొలక ఎత్తగానే నావ పూర్తవుతుందని వారినమ్మకం).

పగడపురాళ్ళు ఇద్దరి పాదాలనూ చీల్చేశాయి. మరీ సూదుల్లా రాళ్ళున్నచోట తెడ్డుచెక్కలు వేసుకుని దానిమీద అడుగేశారు. మొత్తంమీద ఒడ్డుచేరి నిస్త్రాణవచ్చి నిద్రపో యారు.

పి. టి. బోట్లు మాత్రం అల్లకల్లోలంగా వున్న ఆ సముద్రంలోంచి దారిచేసుకుని బ్లేకెట్ జలసంధికి 9-15 కల్లా చేరుకున్నాయి.

# 10

ఆగస్టు 6 శుక్రవారం. ఓలసానా మీదున్న సిబ్బంది లో నూతనోత్సాహం పొడచూపింది. అంటే తరణోపాయం కనబడిందనీకాదు' బ్రహ్మాండమైన ఉపాయం తోచిందనీకాదు. అయినా నారూద్వీపం మీదున్న కెనెడీకీ, ఓలసానామీదున్న సిబ్బందికీకూడా మరల తమవారిని చేరుకోడానికి ఏదోఒకటి సాధించగలమన్న నమ్మకం మొలకెత్తింది. మొత్తం రెండు నావలున్నాయి బియుకు, ఎలోసీ ఇంకా తమతోటేవున్నారు. వారిద్దరూ రాత్రి తమతోటే ఓలసానామీద పడుకున్నారు. కర్రలను రాచి చిన్న మంటకూడా పెట్టారు. సిబ్బందిలో కొంతమందికి మాత్రం వారంటే అనుమానం పోలేదు. నిద్ర పోతున్నట్టు నటించి వారినిద్దరినీ గమనిస్తూనే వున్నారు. ఉదయం అందరూ ఉత్సాహంగానే లేచారుగానీ రాత్రికి రాత్రి ఎవరో డబ్బాలోవున్న మంచినీరు యావత్తూ తాగేసి నట్టు తెలిసి చిరాకుపడ్డారు.

రాత్రి ఫెర్గుసన్ పాసేజ్‌లో అంత యాతనపడ్డా కెనెడీ తెల్లవారేలేచేసి రాస్ ఇంకామేలుకోక పూర్వమే ఓలసానా

మీాదున్న తనసిబ్బందిని చూడవెళ్ళాడు. రాస్ లేచి చూస్తే కెనెడీ లేడు. అతని కేమీాఆశ్చర్యం వెయ్యలేదు. కెనెడీ కసలు కాలునిలవదని అతనికి తెలుసు. ఎప్పుడూ ఏదో చేస్తూనే వుండాలి. బార్నీరాస్ కళ్ళు గుంటలుపడ్డాయి. గడ్డం బాగా మాసింది. చూస్తే అబ్రహాంలింకన్ గుర్తొచ్చేట్లున్నాడు. ఏదెలావున్నా అతను బాగానే వున్నాడు. కొంచెం భయమేసినా అయిదురోజులూ క్షణం క్షణం భయమన్నది వెంటాడుతూనే వుండడంవల్ల అతని కది అలవాటయిపోయింది.

ఓలసానాకు ఈదుకుని వెళ్ళాడు. నావలనూ, ఇద్దరు నావికులనూ ఎలా ఉపయోగించుకుందామా అన్న విషయం పై చర్చ సాగుతోంది. బియుకు ఎరోసీల మీాద కొందరికున్న అనుమానంతో కెనెడీ, థామ్ ఏకీభవించలేదు. పూర్తినమ్మకం వుంది.

ఇక్కడ ఈచర్చ సాగుతూండగా లెఫ్టినెంట్ ఇవాన్స కె. ఇ. ఎన్. కు పొద్దున్న 11-10 నిమిషాలకు:

'మధ్యాహ్నం రెండుగంటలకల్లా కేంద్రంమూసేస్తున్నాను. మరల రేపు ఉదయం వార్తపంపుతాను'.

అని రేడియోద్వారా చెప్పాడు. తన ఆయుధాలూ పరికరాలూ మిగతా సామానంతా సర్దుకుని స్థానిక సహాయకుల సహాయంతో కొండదిగువకు చేరాడు. చీకటి పడేదాకా

కోలంబంగారాలోనేవుండి అప్పుడు గోముద్వీపానికి నావమీద వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

కెనెడీ ఇంకాఖచ్చితంగా ఏంచెయ్యాలో నిశ్చయించుకోలేదు. మళ్ళీ ఓమాటు ఫెర్గుసన్ పాసేజ్ చూదామని, బియుకుకి సంజ్ఞలద్వారా నచ్చచెప్పి నారూ దీవికి పదమన్నాడు. ఆఇరువురు స్థానికులతో సంభాషణంతా ఇలా అభినయపూర్వకంగానే నడిచినందువల్ల కెనెడీకి ఇవాన్స అంటూ ఒకాయన దగ్గర్లో ఉన్నాడన్న సంగతే తెలియలేదు. దాదాపు నీటిమట్టానికున్న దీవులమీదనుంచి పాసేజ్‌కి అద్దరి రెండోవా శిఖరం కనిపిస్తోంది. బియుకు ఎరోసీలను తిన్నగా లుంబేరికి పంపిస్తేనే ఏదేనా పని జరిగేట్లు తోచింది.

బియుకుకి రెండోవా శిఖరం చూపిస్తూ "రెండోవా, రెండోవా" అన్నాడు. బియుకు అర్థమైనట్లు తల తాటించాడు. "ఇలారా" అన్నాడు కెనెడీ. కొబ్బరిచెట్లు దట్టంగా వున్న ప్రదేశానికి దారితీశాడు. ఒకకాయ బియుకుకి ఇచ్చి ఒలవమన్నాడు. తెల్లవాడికన్నా పదింతలు వేగంగా అతను వాడిగా వున్న కర్రమీద కాయదింపి చకచకా ఒలిచేశాడు. కెనెడీ, చాకుతీసి కొబ్బరి పెంకుమీద, పి. టి. స్థావరం కమాండర్‌ని ఉద్దేశించి వార్త చెక్కాడు :

స్థానికుడికి అచూకీ తెలుసు.

దారిచూపుతాడు. 11 మంది ఇంకా

బతికివున్నాం. చిన్నబోటు కావాలి.

కెనెడీ"

ఓలసానామీాదున్న థామ్‌కికూడా ఇదే ఆలోచన వచ్చింది. ఎటాచ్చీ కొబ్బరిపెంకు అవసరంలేకపోయింది. మెగ్యూర్ దగ్గర ఒకపెన్సిలుముక్క వుంది. ఎక్కడో ఓకాయితంముక్క దొరికింది. అది యుద్ధంరాకముందు గిజోలోవున్న బరన్స్‌ఫీల్డ్ (సౌత్ సీ) కంపెనీలిమిటెడ్ బ్రాంచిఆఫీసుతాలూకు బిల్లుకాయితం (నెం. 2860). ఆ బిల్లుకాయితం వెనకాల థామ్ తన సమాచారంవ్రాశాడు:

"కమాండింగ్ ఆఫీసర్ (ఓక్-0) కి పి. టి. 109 (ఓక్-14) దగ్గరనుండి—

విషయం : ఆగస్టు 1 ఆదివారంనుండి పదకొండుగురం శత్రువులతాకిడి ధర్మమా అని దారితప్పివున్నాం. స్థానికుడికి మే మెక్కడున్నదీ తెలుసు. ఫెర్గుసన్‌పాసేజ్ దగ్గర నారూ ద్వీపం ఇవతలవున్న ఈ దీవుల్లోకి అతను పి టిబోటుకి దారి చూపగలడు.

కొంతమందికి బాగా ఒళ్ళుకాలివున్నందువల్ల వారిని బోటుకి చేర్చడానికి చిన్నపడవ కావలసివుంది.

రాత్రిసంజ్ఞ-మూడు డేష్‌లు (- - -) పాస్‌వర్డు-రాజర్-జవాబు-విల్కో-.

పగలయితే విమానంగానీ పిబివైగానీ మంచిది. ఏదో ఒకటి ఆలోచించి వెంటనే సాయంపంపవలసింది. అత్యవసర పరిస్థితిలో వున్నాయి.

ఈ స్థానికులను పూర్తిగా నమ్మవచ్చు.

ఎల్. జె. థామ్
ఎన్స్. యు. ఎన్. ఎన్. ఆర్.
ఎక్సెక్ 109"

కెనెడీ ఓలసానాకు తిరిగిరాగానే రెండువర్తమానాలు బియుకు, ఎరోనీలకు ఇచ్చారు. వారుకూడా కెనెడీ, ఇవాన్స లలాగా తామూ మిత్రరాజ్యాలసైన్యంలో ఓప్రముఖపాత్ర ధరిస్తున్నట్లే అనుకున్నారు. వారు చెయ్యబోతున్నపని అవసరం, ప్రాముఖ్యం పూర్తిగా అవగాహనచేసుకున్నారు. ముప్పైఎనిమిదిమైళ్ళున్న రెండోవాకు బయలుదేరారు. దారిలో రారమనదీవివద్ద ఆగి ఇంగ్లీషుతెలిసిన బెంజమిన్ కేవుకి సిబ్బందిగురించి చెప్పారు. బెంజమిన్‌కు ఇవాన్స తన కేంద్రం మారుస్తున్నట్లు తెలుసు. వెంటనే గోముదీవికి ఒక మనిషినిపంపి ఇవాన్స అక్కడకు చేరేదాకా వేచివుండి ఈ సమాచారం అందజేయమన్నాడు. రారమననుండి బియుకు

ఎరోస్ కాలినడకన వానావానామీదున్న మూడో గ్రామా నికి వెళ్ళి జాన్‌కారి అనే మనిషినికూడా ఎక్కించుకుని రెండోవారేవుకి తెడ్డేశారు.

ఈలోగా పొద్దుకూకేసమయానికి ఇవాన్స్ గోమూ చేరుకున్నాడు. పదకొండుగురు అమెరికన్లసంగతీ అక్కడ తన కోసంవేచివున్న మనిషిద్వారా తెలుసుకున్నాడు. వెంటనే తను ఏంచెయ్యలేడని తెలుసు. అక్కడ తనసామానంతా యింకా అమర్చాలికనుక ఆరాత్రి రేడియోమీద వార్తపం పించడం కుదరదు. కానీ తెల్లారగానే ఒకపెద్దనావలో తన స్థానికసహాయకులను కొందరిని ఓలసానాకు పంప నిశ్చయిం చాడు. వారితోబాటు పెన్సిలుతో రాసి ఓచీటీకూడా పంపాడు.

ఆ చీటీలో "ఆన్ హిస్ మెజస్టీస్ సర్వీసు- నారూ ద్వీపంలోవున్న సీనియర్ ఆఫీసర్‌కి.

శుక్రవారం రాత్రి 11 గం. మీరు నారూమీద వున్నట్లు ఇప్పుడే తెలిసింది. మీరుపంపిన యిద్దరూ రెండో వాకు వెళ్ళిపోయారు. మీరు వెంటనే ఈ నావలోఎక్కి యిక్కడికి రావలసింది. మీరువచ్చేలోగా నేను రెండోవాతో మాట్లాడుతూవుంటాను. మీరు రాగానే ఏం చెయ్యవలసింది

ఖచ్చితంగా తేల్చుకుని మీ మిగతాసిబ్బంది విషయం చూడొచ్చు.

లెఫ్టినెంట్ ఎ. ఆర్. ఇవాన్స్.
ఆర్. ఎ. ఎన్. వి. ఆర్.

'మీరు నావలో ఫెర్గుసన్‌పాసేజ్ దాటుతున్నారని విమానదళానికి తెలియపరుస్తాను' అని వ్రాశాడు.

ఆగస్టు 7 శనివారం తెల్లవారగానే బియుకుఎరోనీ జాన్‌కారీ బ్లాంచెఛానెల్ చేరుకున్నారు. ముండావద్ద రోవి యానాదీవిమీదనౌకాదళానికిఒకస్థావరంవుంది. రెండోవాకన్న యిది దగ్గరఅవడంవల్ల ముగ్గురూ అక్కడఆగి కెనెడీయిచ్చిన కొబ్బరిపెంకూ, థామ్‌ఇచ్చినచీటీ అక్కడో ఆఫీసర్‌కి చూపారు. ఆయన వెంటనే ఒక వేల్‌బోటులో వారిని న్యూజార్జియా కోస్తాదిగువనున్న సెసవేల్‌ద్వీపం స్థావరానికి పంపించాడు. అక్కడనుండి ఓ పిటిబోటులో రెండోవా చేరారు.

ఇవాన్స్‌దగ్గరనుండి అప్పుడే వార్త వచ్చినందువల్ల లుంబేరీఅంతా హడావుడిగావుంది. ఇవాన్స్ ఉదయం 9-20కి కె. ఇ. ఎన్. కి ఈ క్రిందివిధంగా వార్తపంపాడు :

'పిటిబోటు సిబ్బందిమొత్తం పదకొండుమంది గ్రాస్ ద్వీపంమీద వున్నారు. వెంటనే వారు సీనియర్ ఆఫీసర్‌ని ఇక్కడకు రమ్మంటూ ఓడ ఉత్తరం, ఆహారం పంపించారు. నావలు ఫెర్గుసన్ పాసేజ్ దాటుతున్నట్లు విమానాలకు చెప్పవలసింది'

11-30 గంటలకు ఇవాన్స్‌కి పి. డబ్ల్యుడి. నుంచి-

"శుభవార్త! పిటిస్థావరం కమాండర్‌కి- మీవార్త అందినవెంటనే స్థానికులు (అంటే బియుకు బృందం) వచ్చి సిబ్బందిపంపిన కబురందించారు. సిబ్బందిఉన్న బోటు చెప్పారు. కొంతమంది బాగా గాయపడ్డట్లు చెప్పారు. సహాయం పంపమన్నారని చెప్పారు. మీరు నావలు పంపారని కబురుపంపాము. మీరుచేసిన ఏర్పాట్లకు అడ్డురాకుండా అలా చెప్పాము. మేము ఏవిధంగా సహాయంచెయ్యమంటారో తెలియచేయండి. మీ నావలు తిరిగివచ్చేటపుడు కలుసుకునేట్లు బోట్లు వస్తాయి. లేక మీరు ఏవిధంగా చెయ్యాలంటే లుంబేరిలోని పిటిఆఫీసర్లు ఆవిధంగాచేస్తారు. మీకు హృదయపూర్వకమైన కృతజ్ఞత తెలియజేయమన్నారు. మీవద్దనుంచి వార్తకోసం ఎదురుచూస్తూవుంటాము. దాన్నిబట్టి చేస్తాము" అని వార్తవచ్చింది.

12-45 కి జవాబిచ్చాడు.

"పాసేజ్ దాటడానికి ఒకనావకంటె ఎక్కువపంపలేక పోయాను. అది ఇంకా తిరిగిరాలేదు. మీరుమాత్రం వెంటనే బోట్లుపంపండి. దాంతోబాటు (ఒడ్డుకెళ్ళిరావడానికి) బల్లకట్లు గానీ, నావలుగానీ పంపండి. నేనున్నప్రదేశానికివస్తే సిబ్బంది వున్నచోటుకి మళ్ళిస్తాను. చేసేదంతా తెలుపుతూవుండండి."

ఇవాన్స్ కెనెడీకోసమని మోసెస్ సెసా- జోనాథన్ బయా, జోసెఫ్ ఎటా, స్టీఫెన్ హిటు, కోలుఇగోలో, ఎడ్వార్డు కిడో, బెంజమిన్ కేవు అనే ఏడుగురు సహాయకులను పంపాడు. ఈ బృందానికి కేవు నాయకుడు. రెండోవావెళ్ళేదారిలో బియుకు, ఎరోసీ రారమన గ్రామంలో ఆగినపుడు అమెరికన్ సిబ్బంది ఓలసానాదీవిమీద వున్నారని చెప్పారుగానీ, దీవిమీద ఏదిక్కునవున్నారో తెలీదు. దీవి చేరడానికి దాదాపు రెండుగంటలు పట్టింది. వారు చేరిన తావున ఎవరూకనబడలేదు. ఏమీవినబడలేదు. రెండుభాగాలుగాచీలి ఒకబృందం కుడి వైపుకి, ఒకటి ఎడంవైపుకి బయలుదేరింది. ఎడంవైపుకి వెళ్ళిన బృందానికి ముందర మోసెస్ సెసా నడుస్తున్నాడు. ఒక చోట ఆగాడు. అందరినీ ఆగమన్నాడు. పొదల్లోకి నీలి గుర్తులు కనిపించాయి. దీవిచుట్టుపక్కల జపాన్ వారు ఉన్నందు వల్ల అతిజాగ్రత్తగా ఆ గుర్తులను అనుసరించారు. సిబ్బంది కనబడ్డారు.

ఓలసానాకు ఇవాన్స్ సహాయకులు వచ్చినతరువాత అంతా కలలోజరిగినట్లు జరిగిపోయింది.

నవ్వులన్న మాటే దాదాపు మరిచిపోయిన కెనెడీ ఫక్కున నవ్వుకున్నాడు. మొలగుడ్డతో మాత్రమే వున్న ఓ నల్ల మనిషి "ఆన్ హిస్ మెజెస్టీస్ సర్వీసు" అన్న మాటతో మొదలైన చీటీలు సలాంఛనంగా అందించడం వింతగా తోచింది. మాసిన గడ్డంతో, ఒళ్ళంతా కంపుకొడుతూ ఒంటి నిండా గాయాలూ పుళ్ళతో కట్టబట్టలేక సొరచేపలతో నిండి వున్న నీళ్ళమధ్య దిక్కుమాలిన దిబ్బమీద చెట్టూ చేమా కింద నించున్న తనను లండన్‌లో తనతండ్రి రాయబారికార్యాలయంలో వున్నట్లు సంబోధిస్తూంటే నవ్వొచ్చింది. "ఏమైనా బ్రిటిషు వాళ్ళు బ్రిటిషువాళ్లే" అన్నాడు రాస్‌తో.

నావను చూస్తే అక్షయపాత్ర అనిపించింది. ఆవురావురుమని ఆకలితో చూస్తున్న సిబ్బందికళ్ళముందునుండి పళ్ళూ, బియ్యం, ఉర్లగడ్డలు, ఊడ కేసిన చేపలు, చెల్సిసిగరెట్లు, కాల్చిన గొడ్డుమాంసం కైమా, సితరగతి రేషను భోజనం దిగుతున్నాయి. కొందరు గబగబా కోతుల్లాగా కొబ్బరిచెట్లకు ఎగబాకి కాయలు దింపారు. మరికొందరు కొబ్బరిమట్టలు చేర్చి మెక్ మహాన్‌కి చిన్నగుడిసె వేశారు. ఇంకొందరు వంటకి మూడు కిరసనాయిలు బర్నర్ కుంపట్లు వెలిగించారు. ఇన్నాళ్ళూ గరిట పుచ్చుకోడానికి వీలులేకపోయిన మావర్ సి తరగతికి మించి వుండేట్లు కైమా తయారు చేయాలని సంకల్పించాడు. రంగంలోకి దిగాడు. స్థానికులు కొబ్బరిచిప్పలు పళ్లెలుగానూ, మట్టలు చెంచాలుగానూ తయారు చేశారు.

బెంజమిన్ చకచకా ఇంగ్లీషుమాట్లాడేస్తుంటే సిబ్బందిలో కొందరు సిగ్గుతో తలవంచుకోవాల్సివచ్చింది. అతడు మెథాడిస్టు మిషన్‌స్కూల్లో చదవనూ రాయనూ నేర్చుకున్నాడు. 1930 నాటికి భాష బాగాపట్టుబడింది. గిజోలో బ్రిటిష్ సాలమన్ ఐలండ్సు ప్రొటెక్టొరేట్ కింద ట్రెషరీలోనూ పోస్టుఆఫీసులోనూ గుమాస్తాగా ఉద్యోగం సంపాదించాడు. తెల్లవారి ఆచారమర్యాదలు అలవరచుకున్నాడు. చాలా మర్యాదస్థుడు. గిజోలోవుండగానే వివాహమాడి పిల్లల్ని కన్నాడు. జపాన్‌వారు దాడిచేస్తారనగా బ్రిటిష్‌వారు తాము స్థాపించినవన్నీ ధ్వంసంచేసి స్థానికులను కోస్టువాచర్లకు సహాయంగా పంపించారు. బెంజమిన్ పెళ్ళాంబిడ్డలను నావలో రారమనకుచేర్చి కోస్టువాచర్లకు సహాయకుడుగా కుదిరిపోయాడు.

పిటి సిబ్బంది స్థానికులను తమపంక్తిని భోజనానికి పిలిచారుగానీ వారువద్దని వేరే తిన్నారు. భోజనంఅవగానే బెంజమిన్ కెనెడీతో గోముకివెళ్ళేవేళయింది రమ్మన్నాడు. ఏడుగురు స్థానికులు తెడ్డేస్తూంటే ఆ నావలో ఒక్కడే అమెరికన్ దాక్కుని వెళ్ళడానికి వీలుంది. ఇవాన్స్ "సీనియర్" ఆఫీసరే రమ్మని కబురంపిఉండడంవల్ల కెనెడీకి తనసిబ్బందిని వదలి వెళ్ళడం ఇష్టంలేకపోయినా వెళ్ళకతప్పిందికాదు.

బ్లేకెట్ జలసంధి చేరగానే కెనెడీమీద కప్పడానికి కొబ్బరిమట్టలు తెచ్చి నావలో పడేశారు. లుంబేరినుంచి సాయంవచ్చేవారు రావలసినదారి, ఇబ్బందులగురించి ఆలో చిస్తున్నాడు కెనెడీ. రాతిచట్టుమధ్యన బోటువెళ్ళగలిగేటంత మేర ఖాళీగావెతకాలంటే రాత్రిసాధ్యపడదు. నావ ఓలసానా వదిలి చట్టుమధ్యనున్న ఖాళీలోంచి బ్లేకెట్ జలసంధి ప్రవేశిం చినపుడు సరిగ్గా ఆ ప్రాంతంలోవున్న దీవిభాగం గుర్తుపెట్టు కున్నాడు. రాత్రిసమయమైనాకూడా గుర్తుపట్టేవిధంగా ఆ ప్రాంతమంతా నిశితంగా చూసుకున్నాడు. తరువాత నావ ఎదరభాగంవైపు కాళ్ళుపెట్టి నావమధ్యగా పడుకున్నాడు. బెంజమిన్ కెనెడీ కనపడకుండా కొబ్బరిమట్టలూ ఎండు ఆకులూకప్పి అతనితలవైపున మోకాళ్ళమీదకూచుని తెడ్డేస్తూ అప్పుడప్పుడు కబుర్లుచెపుతున్నాడు.

గోమూ యింకా సగందూరం వుందనగా విమానం ఇంజనురొద వినిపించింది. ఒక జపానువిమానంవచ్చి సరిగ్గా వారిపైన తిరగడంమొదలెట్టింది. అంతలో విలానుంచి మరో రెండు శత్రువిమానాలు వచ్చిచేరాయి. తమనావలో అమెరి కన్ వున్నట్లు జపానీస్ తెలుసుకుని మొత్తం అందరినీ ధ్వంసం చెయ్యడానికి వచ్చారని నావలోనివారు భయపడ్డారు.

"ఏమిటి సంగతి" అని అడిగాడు కెనెడీ ఆకుల్లోంచి.

బెంజమన్ "జాపనీస్ విమానాలు" అని చెప్పాడు. కదలకుండా అలాగే పడుకోమన్నాడు.

ఏ మెరగనట్లు స్నేహపూర్వకంగా చేతులూపమని జొనాతన్ బియా బెంజమిన్‌కి సలహాయిచ్చాడు. అలాచేస్తే శత్రువులు యింకా అనుమానపడతారేమోనని బెంజమిన్ భయపడ్డాడు.

"లేచి చూడబ్బా!" అన్నాడు కెనెడీ.

"నోనోనో-కదలకండి బాబూ" అని కోప్పడ్డాడు బెంజమిన్.

జోనాథన్‌తో కాసేపు తర్జనభర్జనపడి చివరకు బెంజమిన్ లేచి చేతులూపాడు. జోనాథన్ చెప్పినదే నిజమైంది. జపానువారు అక్కడినుండి వెళ్ళిపోయారు. నావలో అయిదుగురు మెథాడిస్టులు ఇద్దరు సెవెన్త్‌డే ఎడ్‌వెన్టిస్టులూ అయినందువల్ల తమ ఆనందాన్నిపట్టలేక గొంతెత్తిప్రార్థనగీతాలు పాడారు.

అక్కడ గోముమీద ఇవాన్స్ ఆతృతగా ఎదురు చూస్తున్నాడు. ఆరుగంటల ప్రాంతంలో బైనాకులర్స్‌లో నావ కనిపించింది. నావలో అమెరికన్ ఎవరూ కనబడక పోయేసరికి ఆశ్చర్యమేసింది. అమెరికన్‌ని బైటికి కనబడ

కుండా నావలో దాచివుంచివుంటారని తరువాతగాని తట్ట లేదు. నావ ఒడ్డుతగలగానే కెనెడీ కొబ్బరిమట్టల్లోంచి తొంగి చూసి, ఇవాన్స్ కేసి తిరిగి నవ్వాడు.

"హలో-నా పేరు కెనెడీ" అన్నాడు.

ఇవాన్స్* తన పేరు చెప్పాడు. కరచాలనం చేసుకున్నారు. తను ఎదురుచూస్తున్న సీనియర్ ఆఫీసరు కుర్రవాడిలా కనిపించ గానే ఇవాన్స్ ఆశ్చర్యపోయాడు. ఆరోగ్యంగానే కనిపించాడు.

"కాస్త టీతాగుదాం ర" మ్మని పిలిచాడు. ఒడ్డునుండి ద్వీపంమీద చెక్కలతో కట్టిన ఒకపాతఇంట్లోకి వెళ్ళారు. ఇవాన్స్ పొట్టినిక్కరు వేసుకునివున్నాడు. కెనెడీ స్కివీస్‌లో

---

*బాగా అలసిపోయి ఉద్రిక్తపరిస్థితిలోనున్న కెనెడీ ఇవాన్స్ పేరు మరచిపోయాడు. ఇవాన్స్ పంపిన చీటిఉందిగానీ దానిమీద అతనిసంతకం ఎ. ఆర్. ఇవాన్స్ అన్నది కలిపిరాతలో ఎ. రిన్వాన్స్‌లాగ కనిపించింది. తరువాత పదిహేడుసంవత్సరాలబాటు కెనెడీకి ఆపేరే గుర్తుంది. హెర్సీ తనవ్యాసంలో ఇవాన్స్ పేరు మార్చిరాశాడు. వ్యాసంవచ్చిన సమ యం యుద్ధకాలం. అప్పటికి కోస్టువాచర్ దళం విషయం ఇంకా రహస్యంగానే వుంచవలసివచ్చింది. అందువల్ల ఇవాన్స్‌ని న్యూజిలాండ్ సైన్యాధికారి లెఫ్టినెంట్ విన్‌కోట్ అని పేర్కొన్నారు. ఆ మనిషి సిడ్నీలో ఎకౌంటెంటుగా పనిచేస్తున్న రెగ్ ఇవాన్స్ అనీ, అతనే కోస్టువాచర్‌గా వున్నపుడు కెనెడీకి సహాయంచేశాడనీ కెనెడీ అధ్యక్షుడైన తరువాత తెలిసింది.

వున్నాడు. కాలికి చెప్పుల్లేవు. టీసేవిస్తూ ముందుచెయ్యవలసిన పనిగురించి ఆలోచించారు.

లుంబేరీనుండి మధ్యాహ్నం 1-51 కి పి. డబ్ల్యు. డి. పంపినవార్తను ఇవాన్స్ కెనెడీకి చూపాడు.

"రాత్రి మూడు పిటిబోట్లను పంపుతున్నాము. పదిగంటలప్రాంతానికి గ్రాస్‌ద్వీపం చేరుకుంటాయి. కూడా బల్లకట్లు మొదలైనవి వుంటాయి. పనిజరిగినవెంటనే తెలియబరుస్తాం."

కెనెడీ మరల నావఎక్కి వానావానామీదుగా రెండోవా వెళ్ళిపోతే ఈలోగా పిటిబోట్లువచ్చి సిబ్బందిని తీసికెడతాయని ఇవాన్స్ సూచించాడు. కెనెడీకి ఈఏర్పాటు నచ్చలేదు. రాత్రివేళ సిబ్బంది ఏప్రాంతంలోవున్నదీ కనుక్కోడం చాలాకష్టమని అన్నాడు. పైగా సిబ్బందిబాధ్యత తనమీద వుంది. వారుసురక్షితంగా రెండోవాచేరేవరకూ వారికితోడుగా ఉండడం తనవిధి. ఆ వచ్చే పిటిబోట్లను కలుసుకుని వాటితో ఓలసానాద్వీపానికి వెడతానన్నాడు. ఇవాన్స్‌దగ్గరున్న పటాల సహాయంతో ఇద్దరూ కొత్తఏర్పాట్లు ఆలోచించారు. 6-50కి పి. డబ్ల్యు. డి. ఇవాన్స్ ఈ ఏర్పాట్లు తెలియజేసి లుంబేరీకి తెలుపమన్నాడు.

రాత్రి పిటిబోట్లకు తనే దారిచూపడంమంచిదని లెఫ్టినెంట్ కెనెడీ అభిప్రాయపడుతున్నాడు. బోట్లకోసం అతను

పట్‌పరన్ దీవివద్ద వేచివుంటాడు. పిటిబోటు రాత్రిపదింటికి సాధ్యమైనంతదగ్గరగా వాయువ్యదిక్కునుంచి దీవికి చేరాలి. వచ్చినట్లుగుర్తుగా బోటువారు నాలుగుమాట్లుతుపాకికాల్చాలి. కెనెడీకూడా ఆవిధంగానే జవాబిచ్చి నావలో బోటుపక్కకు చేరతాడు. మిగతాసిబ్బంది గ్రాస్‌దీవి వాయువ్యదిక్కున దీవిమీదవున్నారు. అవుట్‌బోర్డు మోటార్‌బోటయితే మంచి దని కెన్నడీసూచన. పట్‌పరన్ మకుటినుంచి 204 డిగ్రీలలో ఒకటిన్నరమైళ్ళదూరంలో వుంది."

ఎనిమిదిఅవగానే సహాయకులు కెనెడీని పట్‌పరన్‌కు తీసుకువెళ్ళడానికి సిద్ధమయ్యారు. వాతావరణం చల్లబడింది. కెనెడీ ఇవాన్స్‌దగ్గరనుండి కట్టుకోడానికని రెండుబట్టలు తీసుకున్నాడు. బోట్లమీదకెక్కగానే తిరిగిపంపేస్తానన్నాడు. సరిగ్గా బయలుదేరేసమయానికి తన .38 తుపాకీలో మూడే గుళ్ళున్నాయని గమనించాడు. ఫెర్గుసన్‌పాసేజ్‌కి వెళ్ళినపుడు రాస్ మిగతావి పేల్చేశాడు. లుంబెరీకి తాముపంపిన వార్త ప్రకారం తను నాలుగుమాట్లు తుపాకీకాల్చాలి. ఇప్పుడు అది మార్చాలంటే వీలులేదు. అక్కడ పిటిబోట్లు ఈపాటికి బయలుదేరివుంటాయి. అందుకని కెనెడీ ఇవాన్స్‌దగ్గరున్న జాపనీస్‌రైఫిల్ అడిగిపుచ్చుకున్నాడు. బట్టలతోబాటు దాన్ని నావలోపంపేస్తానని చెప్పాడు. అసాధారణపరిస్థితుల్లో కలుసుకున్న కెనెడీ, ఇవాన్స్ కరచాలనంచేసి వీడ్కోలుచెప్పు

కున్నారు. మళ్ళీ ఒకరినొకరు కలుసుకుంటారో లేదో ఇద్దరికీ తెలియదు.

కెనెడీ పట్‌పరన్ చేరాడు. పదిదాటి చాలాసేపటికి గానీ పిటిబోటు ఇంజన్ల చప్పుడూ, నాలుగు కాల్పులూ వినిపించ లేదు. నావలో లేచినుంచుని తన రివాల్వరుతో మూడు మార్లు పేల్చాడు. తర్వాత రైఫిల్ మీటలాగాడు. ఆ ప్రేలుడు వెనక్కితన్ని నీటిలోపడ్డంతపనయింది. సహాయకులు నావను లెఫ్టినెంట్ లయన్‌బో పిటి 157 పక్కకు చేర్చారు.

"ఏమోయ్ జాక్" అని ఓకంఠం వినిపించింది.

"ఇన్నాళ్ళూ ఎక్క డేడిచావోయ్" అన్నాడు కెన్‌డీ.

"భోజనం తెచ్చాం నీకోసం" అన్నా రెవరో.

"థాంక్సు. అక్కర్లే. ఇప్పుడే కొబ్బరికాయ పుచ్చు కున్నా" అన్నాడు కెనెడీ నిర్లక్ష్యంగా.

ఆనందోత్సాహాలతో కెనెడీని బోటుపైకి లాగారు. రెండవ స్క్వాడ్రన్ కమాండర్ లెఫ్టినెంట్ క్లస్టర్ అక్కడే వున్నాడు. బ్రాంటింగ్‌హామ్ కూడా వున్నాడు. వారిపక్కన బియుకు, ఎరోసి వున్నారు. అంతేకాక పలువురు పత్రికా విలేకరు లున్నారు. కెనెడీ ఇవాన్స్ వద్దనుండి తెచ్చినబట్టలను

నావలోకి విసిరేశాడుగాని ఆ గందరగోళంలో రైఫిల్ సంగతి మరచిపోయాడు.

ఓలసానా ఒడ్డున "బోట్లు వచ్చేశాయి" అన్న కేక మిన్నుముట్టింది. అర్ధరాత్రి దాటింది. సాయం ఎప్పుడొస్తుందా అని సిబ్బంది ఎదురుచూస్తున్నారు. మధ్యాహ్నం కెనెడీ వెళ్ళిపోయినతరువాత సిబ్బంది చాలాసేపు అలా వేచివున్నారు. యుద్ధసమయంలో సాలమన్ దీవుల్లో అనుకోని సంఘటనలు అనుకున్న ఏర్పాట్లను తరచు తలక్రిందులు చేసిన సంగతి సిబ్బందికి తెలుసు. కేకవిని సిబ్బంది కొందరు పరుగునా, కొందరు కుంటుకుంటూ ఒడ్డుకు వచ్చారు. వారంరోజుల్లో మొదటిసారి భోజనంచేసి స్థానికులు ఏర్పాటుచేసిన గుడిసెలో పడుకున్న మెక్ మహన్ దేక్కుంటూ వచ్చాడు. రాస్ దెబ్బతిని వాచివున్న మోకాలతో కుంటుకుంటూవచ్చాడు. థామ్ ఇంకా అనుమానంగానేవున్నా మొలలోతునీటిలోకి చొచ్చుకు వచ్చాడు. చిరపరిచితమైన కంఠం "లెన్నీ-ఏయ్ లెన్నీ" అని పిలవడం విని ముఖంవిప్పారింది.

కెనెడీని ఎక్కించుకున్నతర్వాత లియన్‌బో బోటును ఫెర్గుసన్ పాసేజ్ దాటించి నారూదీవినుంచి ఉత్తరంగా ప్లమ్ పుడింగ్ వరకూ లంగరు రెక్క ఆకారంలోవున్న రాతిచట్టు చేరాడు. లియోరావా ్రీపామ్ ఐలెట్ మధ్య నోచోట రాతిచట్టులో ఖాళీవుందని కెనెడీ చెప్పాడు. సిబ్బంది సందేహం

చూసి మధ్యాహ్నమే తను ఆ ఖాళీలోంచే చట్టుని దాటానని గట్టిగా చెప్పాడు. చీకట్లో కళ్ళతో శ్రద్ధగా ఆ ప్రాంతమంతా తను మధ్యాహ్నం గుర్తుపెట్టుకున్న ఓలసానాదీవి ప్రాంతం ఆకారం తెలిసేదాకా వెతికాడు. మిగతావారుమాత్రం ఇంకా సందేహంగానేవున్నారు. ఒకవేళ బోటు చట్టుఎక్కితే అక్కడే ఆగిపోవాల్సివస్తుంది. కదలడానికికూడా వీలుండదు. అది మరీప్రమాదం. పిటిబోట్లు ఈవిధంగా మెరకప్రదేశంలో చిక్కడిపోవడం కద్దు. ఇప్పుడు చిక్కడిపోతే పిటి 157 మీదున్నవారికేకాక ఓలసానామీది సిబ్బందికికూడా ముప్పు. తెల్లవారేసరికి జపాన్‌వారువచ్చి అందరినీ పేల్చిపారేస్తారు.

కెనెడీ ఓ తెప్పకనకవుంటే దారిచూపుతానన్నాడు. పక్కనించి రబ్బరుతెప్ప ఒకటి దింపారు. ముందు దారిచూసు కుంటూ బియుకు ఎరోనీ బయలుదేరారు. పిటి 157 మెల్లిగా అనుసరించింది. రెండునిమిషాల్లో బోటు చట్టును సురక్షితంగా దాటింది. కెనెడీకి తనెక్కడున్నాడో ఖచ్చితంగా తెలిసిపోయింది. కెనెడీ ఉత్సాహంగా థామ్‌ని కేకవేశాడు. శత్రువుకి ఎక్కడ వినిపిస్తుందోనని భయపడి మిగతా ఆఫీసర్లు కెనెడీని ఊరుకోమన్నారు. కాని అతను ఊరుకునేస్థితిలోలేడు. "లెన్నీ! హేయ్ లెన్నీ!" అని కేకేశాడు. జవాబుగా మరో కేక వినిపించింది. లియొబెనోవ్‌కీ సిబ్బందికీ ఎదరమాటలు వినిపించాయి. ఇంజన్లు ఆపేశారు. దీవికి ఒక తెప్ప వెళ్ళింది.

కొంతసేపట్లో ఇద్దరితో తిరిగివచ్చింది. ఇంకాసేపట్లో పిటి 109 తాలూకుసిబ్బంది పదకొండుగురూ సురక్షితంగా బోటు చేరు కున్నారు.

రెండోవాకు తిరుగుప్రయాణం మహాతమాషాగా జరిగి పోయింది. సౌత్ పసిఫిక్ లో అమెరికన్ నౌకాదళం అంతవింత ప్రయాణం ఎన్నడూ చేసివుండివుండదు. నిబంధనలను అనుస రించిబోటుమీాద వైద్యసిబ్బంది109సిబ్బందికి బ్రాందీ యిచ్చారు. బ్రాందీ ఇంతతమాషాచేయిస్తుందని నేవీసర్జన్ జనరల్ కూడా అనుకొనివుండివుండడు. బియుకు, ఎరోసీ మిషన్ స్కూలులో చదివారని తెలియగానే జాన్స్టన్ యిద్దరినీకూచోబెట్టి-

"జీసస్ లవ్స్ మి, దిస్ ఐ నో

ఫర్ ది బైబిల్ టెల్స్ మి సో..."

...అన్న పాటను తిరిగితిరిగీ పాడించుకున్నాడు.

జపాన్ ఓడ దారిలోనుంచి తప్పించుకోలేకపోయినం దుకు 109 సిబ్బందిని తమాషాకోసం "బోటు పోగొట్టు కున్నావా ముసలమ్మా" అంటూ వేళాకోళం ఆడారు.

లెఫ్టినెంట్ క్లస్టర్, మెక్ మహాన్ని 'వంట్లో ఎలా వుం'దని అడిగాడు.

అతను "బాగానేవుందండీ, థాంక్స్" అని జవాబిచ్చాడు.

పిటి 109 స్థావరంవదిలిన వారంరోజుల తర్వాత ఆగష్టు 8, ఆదివారంనాడు 109 సిబ్బందితో పిటి 157 రెండోవారేవులోనికి మళ్ళీసరికి పొద్దుపొడిచింది. టాడ్ సిటీలో జాన్ మెగ్వ్యార్ మహాఆత్రుతతో తనకోసం ఎదురుచూస్తున్న తనసోదరుడు బిల్‌ను కలుసుకున్నాడు. జాన్‌కి అతన్ని గట్టిగా కౌగిలించుకోవా లనిపించిందిగానీ అందరూ వుండడంవల్ల చెయ్యిపట్టుకుని వదిలేశాడు.

"అమ్మకి ఈసంగతి రాయలేదుకదా!" అని అడిగాడు. వారితల్లి చాలాజబ్బుగావుంది.

"లేదు. రాయలేకపోయాను" అన్నాడు బిల్.

తిరిగివచ్చిన సిబ్బంది స్మారకంగా ప్రార్థన ఏర్పాటు చేశారని స్థావరంలో చెప్పారు.

తర్వాత హ్యానిస్‌పోర్టు మసాచుసెట్స్‌లో ఫోన్ మోగింది. కెనెడీతల్లి రిసీవర్ తీసుకుంది.

"జాక్ సురక్షితంగా చేరాడు" అని ఓస్నేహితుడు చెప్పాడు.

ఆవిడ "ఎక్కడనించి ?" అని అడిగింది. ఆవిడకి అసలు ఏమీ అర్థంకాలేదు.

ఆవిడభర్త గుర్రపుసాలవద్ద నున్నాడు. ఆయనతో ఇలాగ ఫోన్ వచ్చిందని చెప్పింది. ఈ శుభవార్త ఆయనను కదల్చివేసింది. సౌత్ పసిఫిక్‌లో తనకుమారుడు కనబడటం లేదని రెండుమూడురోజుల క్రితం ఆయన వినివున్నాడు. విన్నపుడు ఆవిడకి ఆమాట చెప్పడానికి నోరురాలేదు.

పిటి 109 మునిగిపోయిన ఏడాదితర్వాత 1944 ఆగస్టు 12 న తన పెద్దకుమారుడు జో జూనియర్ గురించి జోసెఫ్ కెనెడీకి మరోవార్త వచ్చింది. బెల్జియన్ కోస్తాలో బాంబింగ్ దాడికివెళ్ళిన జూనియర్ కనబడడంలేదని తెలిసింది. కానీ ఈసారిమాత్రం శుభవార్త అందలేదు.

# 11

లెఫ్టినెంట్ జాన్ కెనెడీ ఇంతటితో పి. టి. బోట్
లకు నమస్కారంపెట్టి పోలేదు; పసిఫిక్ యుద్ధరంగాన్ని వదలి
పోలేదు.

సముజ్జ్వలమైన ఈ సాహసయాత్ర తర్వాత అతను
మరోబోటు పిటి 59 పై మరోఅద్భుతమైన సాహసోపేతమైన
ఉద్యమం నిర్వహించాడు. ఆ ఘట్టంలో బోటుమీద కెనెడీ
బంక్ లో ఒక నావికుడు చచ్చిపోయాడు. ఆ ఘట్టంలోనే
ఒకనాటిరాత్రి బోటుమీద 55, 65 మంది నావికులను ఎక్కిం
చుకుని తాహతుకుమించిన బరువుతో కెనెడీ శత్రుప్రాంతం
ప్రవేశించాడు. శత్రువుల శతఘ్నులక్రిందనే, చీకట్లతో
ఆబోటు కోస్తానంటిపెట్టుకు ఊపిరిబిగబట్టుకుని కూర్చుంది.
కదలితే తన స్థావరం చేరుకోడానికి కావలసిన పెట్రోలు లేదు.

బ్లాకెట్ స్ట్రెయిట్ లో గండంగడిచి బయటపడిన
కెనెడీని, అతనిసిబ్బందిని లుంబేరీతీసుకువెళ్ళి రెండుపూటలుంచి
అక్కడనుండి టులగీహార్బరులోని ఆస్పత్రికి చేర్చారు.
లుంబేరీనుండి బయలుదేరేముందు ఆపద్బాంధవులు బియుకు,

ఎరోసీలకు కెనెడీ మరోసారి కృతజ్ఞత తెలియజేసుకున్నాడు. తన జ్ఞాపకార్థం ఇద్దరికీ చెరో ట్రింకెట్ బహూకరించాడు. తన పసిఫిక్ థియేటర్ రిబ్బన్‌ను ప్రత్యేకించి బియుకుకు కానుకగా యిచ్చాడు.*

టులగీహార్బర్ వైద్యశిబిరంలో పడుకుని పిటి 109 గురించే ఆలోచించేవాడు. త్వరలో ఫుల్ లెఫ్టినెంట్ అవబో తున్నాడు. పిటి 109 సిబ్బంది రక్షణవిషయంలో ప్రదర్శించిన ధైర్యసాహసాలకు పర్పుల్ హార్ట్ నేవీ అండ్ మెరీన్ కోర్

---

*బియుకు, ఎరోసీలు ఈనాటికీ ఆ కానుకలను గొప్పగా మిత్రులకు చూపించుకుంటూవుంటారు. కెనెడీ అమెరికా అధ్యక్షుడు కాగానే వారిద్దరికీ తనఫొటోలను సంతకంచేసి పంపించాడు. కెనెడీ ఎన్నికకాగానే ఈ మారుమూలప్రాంతంలోని న్యూజార్జియా, గిజో, కోలంబంగారా వానావానాదీవులలోవారంతా అందుగురించి చాలా ఆనందించారు. గర్వించారు. నిజానికి వీళ్ళెవరికీ అమెరికాగురించి ఏమీతెలియదు. అధ్యక్షపదవి గురించి అంతకన్నా తెలియదు. వాళ్ళకితెలిసిందల్లా ఒకటే-తాము కాపాడిన చిన్నవాడు ఏదోదేశంలో చాలాగొప్ప "కులపెద్ద" అనీ, ప్రపంచంలో అతనికి చాలాపలుకుబడి వుందనీ, అంతే! దీవులమధ్యతిరిగే బోట్లకు రేడియోలున్నాయి. రేవులదగ్గర కూచుంటే హోనియారా, గాడల్ కెనాల్‌లనుంచివచ్చే వార్తాప్రసారాలలో "ప్రెసిడెంట్ కెనెడీ ఇలా అన్నారు. ప్రెసిడెంట్ కెనెడీ అలాచేశారు" అంటూ వినబడేవి. పేరు వినగానే గుర్తుపట్టేవారు. తాము అప్పుడు ఆదుకోనివుండకపోతే ఆయన అంతవాడయే అవకాశం కలిగివుండేదికాదని వారికి తెలుసు.

పతకంఇచ్చి సత్కరించారు. అయినాకూడా సౌత్ పసిఫిక్ లో తనుచేసిన ఘనకార్యం ఏదీ లేదన్న అసంతృప్తి మిగిలిపోయింది. నేవీనిబంధనల ప్రకారం ఓడమునిగి గండంగడిచిన ఆఫీసర్లు వెంటనే ఇంటికితిరిగిపోవచ్చు. లేదా ఇంటికి వెళ్ళేందుకు వీలు దొరికేదాకా వారి కిష్టమైనపని ఎన్నుకోవచ్చు. లెఫ్టినెంట్ క్లస్టర్ ఈసంగతి గుర్తుచేశాడుకానీ కెనడీ యింటికివెళ్ళ నన్నాడు. యింతదూరం సౌత్ పసిఫిక్ వచ్చి తను సాధించినది ఏమిటని అన్నాడు. వీలైతే తన కింకో బోటు ఇవ్వమన్నాడు.

శత్రునౌకలకు దీటుగావుండేట్లు ఒక పిటిబోటును మచ్చుకి గన్ బోటుగా తయారుచేయాలని ఓఆలోచనవుంది. సిబ్బందిని కూర్చుకుని ఆ బోటు తీసుకుంటావాఅని అడిగాడు క్లస్టర్. కెనడీ ఎగిరిగంతేశాడు. క్లస్టర్ అతన్ని పిటి 59 కి నాయకుణ్ణిచేశాడు. స్థూలంగా పిటికిజరిగేమార్పు లేమిటంటే నాలుగు టార్పెడోగొట్టాలబదులు ఆర్మర్ కవచాల వెనుక అదనంగా మెషిన్ గన్లు అమర్చడం, బోటుచివరనున్న 20మిలి మీటర్ విమానవిధ్వంసక శతఘ్నిబదులు ముందూవెనకా కూడా 40 మిలిమీటర్ గన్ లు వుంచడమూనూ. అప్పటికే 109 సిబ్బందిలో చాలామందిని వేరువేరు స్థానాలకు బదలా యించారు. 109 సిబ్బందిని రక్షించినందుకు థామ్ కికూడా

నేవీ ఎండ్ మెరీన్ కోరు పతకం బహూకరించారు. మరో బోటుకి నాయకుణ్ణిచేశారు. 1

రాస్ ఎక్సిక్యూటివ్ ఆఫీసరయ్యాడు. అతనుకూడా మరో పిటిబోటుకి నాయకత్వం పుచ్చుకున్నాడు. 2

109 మునిగినతరువాత వారంరోజుల్లోను కెనెడీ రాస్‌ల మధ్య బాగాపరిచయం ఏర్పడింది. తర్వాతకూడా తరచుగా కలుసుకునేవారు. మెక్ మహన్, జాన్‌స్టన్‌లుమాత్రం బాగా గాయపడివున్నందువల్ల ఇక యుద్ధానికి పనికిరారన్నారు.

---

1. యుద్ధానంతరం థామ్ స్వదేశానికి తిరిగివెళ్లి తను కాలేజీ రోజుల్లో మనసిచ్చిన అమ్మాయి కేట్‌హోల్వేను పెళ్లాడి ఇద్దరుపిల్లల్ని కన్నాడు. 1946 లో ఓహియోరాష్ట్రంలో మాస్టర్సు డిగ్రీకి చదువుతూ ఇన్సూరెన్సు ఏజంటుగా పనిచేశాడు. ఇళ్లకొరతవల్ల అతనిఅత్తవారు యంగ్స్‌టౌన్‌లో వుండేవారు. అక్టోబరు నాలుగోతారీఖున అక్కడికి కారులో వెడుతూంటే రేవెన్నా (ఓహియో) వద్ద రైలుకుగుద్దుకొని మర్నాటికల్లా కన్నుమూశాడు. అప్పటికి కెనెడీ మసాచుసెట్స్ పద కొండోజిల్లాకి అభ్యర్థిగా నిలబడుతున్నాడు. ఈవార్త వినగానే తనప్రచార కార్యక్రమం ఆపుకుని యంగ్స్‌టౌన్‌కి వెళ్లాడు.

2. 1961 లో ప్రెసిడెంట్ కెనెడీ రాస్‌ను ప్రెసిడెంట్‌కమిటీ ఆన్ జువెనైల్ డెలిన్‌క్వెన్సీ అండ్ యూత్‌క్రైమ్ (బాల, యువ నేరస్థుల విచారణకై అధ్యక్షుడు నియమించిన సంఘం) సిబ్బందిలో చేర్చుకున్నాడు.

ఆల్బర్ట్ తిరిగి పిటి 163 మీద ఎన్‌సైన్ ఎడ్ వద్ద హెచ్. క్రూస్ జూనియర్ సిబ్బందిలో చేరాడు.*

చేరిన కొన్నివారాల్లో దారుణమృత్యువాతబడ్డాడు. అక్టోబర్ 6-7 రాత్రిపూట వెల్లాలావెల్లాయుద్ధంలో ఒక అమెరికన్ టార్పెడో యుగుమోఅనే జాపనీస్ డిస్ట్రాయర్‌ను ముంచేసింది. డిస్ట్రాయర్ తాలూకు సిబ్బంది ఎవరేనా బతికి వుంటే ప్రశ్నార్థం తీసుకురమ్మని పిటి 163 ని 'స్లాట్' కు పంపారు. క్రూస్ శతఘ్నులు గురిపెట్టి భయపెడితేగానీ ఆ జాపనీస్ నావికులు బోటుఎక్కలేదు. బందీలను గుడ్డలిప్పించేసి ఫోర్ డెక్ మీద పడుకోబెట్టారు. కాక్‌పిట్‌కు ఇరువైపులా సబ్ మెషిన్‌గన్‌లతో ఆల్బర్ట్, మరోనావికుడూ కాపలా వున్నారు. చీకటిపడబోతూంటే పిటి 163 స్థావరం సమీపించింది. పట్టుకున్నప్పుడు నానాఇబ్బందీపెట్టిన ఖైదీఒకడు ఆల్బర్ట్‌ని జాలిగా దాహంఅడిగాడు. ఆల్బర్ట్‌కు అనుభవంలేదు. ఉన్నది లేతవయసు, లేతహృదయం. కప్పుతో మంచినీళ్ళు అందించాడు. జపాన్‌వాడు కప్పుబదులు ఆల్బర్ట్ భుజాన వేలాడుతున్న సబ్ మెషిన్‌గన్ లాక్కున్నాడు. ఆల్బర్ట్ పెనుగులాడాడుగానీ శత్రువుదే పైచెయ్యి అయింది. గన్ ఆల్బర్ట్ గుండెలమీదఆనించి ట్రిగ్గర్ నొక్కాడు. మిగతా

---

*తరువాత ఆయన ఇండియానాలో డెమొక్రాటిక్‌పార్టీకి ప్రతినిధిగా ఎన్నికఅయ్యారు.

ఖైదీలుకొందరు తటాలున లేచారు. ఆల్బర్ట్ హంతకుడూ, ఆ ఖైదీలూ చేసిన ఆఖరిపని అదే. అవతల కాపలావున్న నావికుడు పైకి లేచిన ప్రతిఒక్క ఖైదీని కాల్చిపారేశాడు.

ఇహ 109 సిబ్బందిలో మిగిలినవారు మెగ్వ్యార్(1) మావర్ కోవల్(2), డ్రెవిచ్, డ్రెడీ మాత్రమే. వారంరోజుల యమయాతన తరువాత వెంటనే తన దగ్గర చేరమని అడగడం భావ్యం కాకపోయినా తనతో పిటి- 59 కి వస్తే చాల సంతోషిస్తానని అన్నాడు కెనెడీ. అందరూకూడా హృదయపూర్వకంగా వచ్చిచేరారు. సిబ్బందిలో కొత్తవారు హెల్మర్, క్రిష్టియన్‌సన్, క్లైన్, అలెగ్జాండర్, సెర్వేషియస్, స్లేగిల్, స్టెర్చ్‌నర్, స్ట్రిక్‌లాండ్, ఫాక్టో.

కెనడీ తన ఎక్సిక్యూటివ్ ఆఫీసర్‌గా లెఫ్టినెంట్ (జెజ) రాబర్ట్ లీ రోడ్స్ జూనియర్‌ను ఎన్నుకున్నాడు. రోడ్స్‌కి ఇరవైఒక్క ఏళ్ళయినా రాటుదేరినవాడు. ఒక్కపల్చగా అతి చురుగ్గా వుండేవాడు. కేలిఫోర్నియా మేరిటైమ్ అకాడ

(1) 1961 లో ప్రెసిడెంట్ కెనెడీ మెగ్వ్యార్‌ని ఫ్లోరిడా దక్షిణజిల్లాలకు యునైటెడ్ స్టేట్స్ మార్షల్‌గా నియమించాడు.

(2) 1961 లో నేషనల్‌పార్క్ సర్వీసులో కోవాల్ నియామకానికి అడ్డంకి రాకుండా ప్రెసిడెంట్ కెనెడీ ఎగ్జిక్యూటివ్ ఆర్డర్ ప్రకటించాడు.

మీలో శిక్షణ పూర్తి చేసుకునే సమయంలో పెరల్ హార్బర్ మీద జపానీస్ దాడి జరిగింది. 1942 జూన్‌లో నౌకా దళంలో ఎన్‌సైన్‌గా నియామకం అయ్యాడు. 1943 జూన్ ౨౩ న గాడల్ కెనాల్, సేన్ క్రిస్టాబాల్‌ల మధ్య జపానీస్ సబ్‌మెరిన్ ముంచేసిన లిబర్టీ నౌక ఆలుడ్రాలో నావిగేటర్‌గా పనిచేశాడు. లైఫ్‌బోట్ సహాయంతో తేలుతూంటే సైక్లార్క్ అనే డిస్ట్రాయర్ నౌక వచ్చి కాపాడింది. దాంట్లోనే ఎస్పిరిటు సేంటో చేరాడు. అక్కడినించి నూమేకు బదిలీ అయ్యాడు. పిటి బోట్లలో పనిచేస్తానని అడుగుతే సెసాపీకి పంపారు.

కెనెడీ, రోడ్స్ సెప్టెంబర్ 1 బోటుమీద డ్యూటీలో చేరారు. పిటి- 59 ని గన్‌బోట్‌గా మార్చడానికి నెలరోజులు పైగా పట్టింది. సిబ్బందిలో చాలామంది పాటలు వింటూ, కూచునేవారు. ద్వీపవాసులకు గొడ్డుమాంసం ఇచ్చి అరటి పళ్ళు పుచ్చుకునేవారు. చాటుగా ఆల్కీకోసం వెదికే వారు. సరదాగా కాలంగడిపేవారు. కెనెడీ, రోడ్స్ మాత్రం రిపేర్‌షిప్‌మీద వుండేవారు. పనివాళ్ళు బోటు మరమ్మతు చేస్తూంటే వూరికేచూస్తూ కూచునేవారు. పని సరిగ్గా జరుగు తోందో లేదో చూడ్డానికి వున్నారా అనిపించేది. ప్రతిరాత్రీ వార్డ్ రూంలో బైటకి వెళ్ళే ఉత్తరాలు చదువుతూ కూచో డం కెనెడీకి విసుగెత్తింది. చివరికి బోటు మరమ్మతులో

తనకీ రోడ్స్‌కీ కలిపి ఏదోఒక అర్థం లేని పని కల్పించు కున్నాడు.

ఓ రోజున పిటి- 59 కి అమర్చుతున్న ఆర్మర్ ప్లేట్ శాంపిల్ ముక్క పట్టుకుని ఒడ్డుకు వెళ్ళారు. దానిమీద .30, .50 కేలిబర్ మెషిన్‌గన్లు పేల్చి చూశారు. తిన్నగా దూసుకొచ్చిన తుపాకీ గుళ్ళకి తట్టుకోలేక అది కాస్తా అప్ప డంలా తుక్కయిపోయింది. కెనెడీ పెదవి విరిచాడు. రోడ్స్ కూడా దిగులు పడ్డాడు. ఇపుడు చేసే దేం లేదు. తుపాకీగుళ్ళు పక్కనించి గానీ, దూరంనుంచి గానీ వచ్చిపడితే తట్టుకుంటుం దిలే అని సమర్థించుకున్నారు.

అక్టోబరు 7 కి మార్పులన్నీ పూర్తయ్యాయి. అడుగు భాగం రంగుపూసి, ప్రొపెల్లర్లు, షాఫ్టు కడ్డీలు అమర్చగానే కెనెడీ తా నెరిగిన రస్సెల్స్‌దారి పట్టించాడు.

పిటి- 109 ముక్కలోంచి మరమ్మత్తు చేసిన టూల్ షెడ్, ఫ్యూయల్ డాక్ (ఇంధనం వుండే స్థలం) ల వద్దా, మొసళ్ళుండే ప్రాంతం వద్దా ఒక రాత్రి గడిపి అక్టోబరు 10న రెండోవారేవు చేరారు. సిబ్బంది కొత్తమనుష్యుల్లో ఒకరు పని లేనపుడు పొద్దుపోవడానికి దారిలో .45 తో సీగల్ పక్షుల్ని కొట్టడం మొదలెట్టాడు. అతనిగురి చూసి మిగతావారు అతన్ని గన్నర్‌గా వెయ్యకపోతేనే మేలని అనుకున్నారు.

బ్లాంచి ఛానెల్ ఆఖరి మైలు వచ్చేసరికి కెనెడీకీ, పాత సిబ్బందికీ చిన్నప్పటినుంచీ ఎరిగున్న స్థలానికివచ్చి నట్లనిపించింది. మూడు నెలల క్రితం చూసినప్పటికన్నా రెండోవా రేవులో ఇప్పుడున్న నౌకల సంఖ్య బాగా ఎక్కువగా వుంది. లుంబేరీలో సౌకర్యాలన్నీ బాగా అభివృద్ధి అవడంలో 'బా' దీవి కూడా లాభం పొందింది.

కెనెడీ తన బోటుకీ, సిబ్బందికీ తరిఫీదు ఇస్తూ రెండోవా లోనే వారంరోజులు గడిపాడు. శతఘ్నులు సరిగా వున్నాయో లేదో తెలుసుకోడానికీ, వాటిని ఎవరి చేతులో పెడితే సరిగ్గా వుంటుందో ఎన్నుకోడానికీ అక్టోబరు 11 న సముద్రంలో ఖాళీ నూనెడబ్బాలను విసిరేసి శతఘ్నులు పేల్పించారు. మరుసటి రోజు పరీక్షలో సెంటర్ స్క్రూ మార్చుకోవాలని తెలిసింది. దిక్సూచి లేకుండా బోటు నడిపి చూశారు. మరికొన్ని ఖాళీ డబ్బాలను పేల్చి చూశారు. అక్టోబరు 18 మధ్యాహ్నం 1-15 కి బయలుదేరారు. ఫెర్గు సన్ పాసేజ్ దాటి బ్లేకెడ్ జలసంధి గుండా, బాగా గుర్తుండి పోయిన నారూ, ఓలసానా, ప్లమ్‌పుడింగ్, గిజో, కోలంబంగా రాల పక్కనించీ వెళ్ళి, నాల్గున్నర కల్లా వెల్లాగల్ఫ దాటి లంబూలంబూకోవ్ చేరుకున్నారు. అక్కడ కెనెడీ లెఫ్టినెంట్ బెరండ్‌స్టన్‌కు తన రాక తెలియబరచుకున్నాడు. బెరండ్ స్టన్ ఆ మధ్యనే లుంబేరీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ నుంచి లంబూ లంబూ స్థావరానికి కమాండర్‌గా నియామకం అయ్యాడు.

బెరండ్ స్టన్ నౌకాయానంకోసమనే పుట్టాడు. ఆయన తాతగారు స్వీడన్‌లో నావ కెప్టెన్‌గా వుంటూ రాజుగారిని తరచు సముద్రంమీద తీసికెళ్ళేవాడు. తండ్రి పధ్నాలుగో ఏటనే నావలు నడిపాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో యునైటెడ్ స్టేట్స్ నౌకాదళంలో పనిచేశాడు. కేలిఫోర్నియా హవాయిల మధ్య తిరిగే లుర్‌లైన్ అనే మేట్సన్ లైనర్‌కు మొదటి కెప్టెన్ ఆయనే. లుర్‌లైన్ అన్ని సౌకర్యాలతో కూడిన లక్షరీ ప్రయాణీకులనౌక. ఆర్థర్ ఓక్‌లాండ్ హైస్కూల్లో చదివాడు. అన్నాపోలిస్‌లో 1940 లో పట్టా పుచ్చుకున్నాడు. మొదట ఎంటర్‌ప్రైస్ నౌకలో గన్నర్ డివిజన్ ఉద్యోగిగాపనిచేశాడు. గాడల్ కెనాల్ దాడిలో పాల్గొన్న తర్వాత పిటి ఆఫీసరు శిక్షణకి మెల్విల్ పంపారు. తిరిగి సాలమన్స్ చేరుకున్నాడు. ఈలోగా తండ్రిఆధిపత్యంకిందవున్న లుర్‌లైన్ రవాణానౌకగా మారినందువల్ల సౌత్‌పసిఫిక్‌లో తండ్రీకొడుకులు చాలామాట్లు కలుసుకున్నారు.

కెనెడీకి చూపించడానికి లంబూలంబూలో ఏమీలేదు. లోపలికి చొచ్చుకొచ్చిన ఆ కాస్తమేరా వెల్లాలావెల్లా ఉత్తరకోస్తామీద వుంది. స్లాట్‌కి అభిముఖంగావున్నదీవి రెండువందలగజాల వెడల్పుంటుంది. అక్కడనుండి ఘాయిసూల్‌దీవి మధ్యప్రాంతానికి తిన్నగా గీతగీస్తే ముప్ఫైఅయిదు మైళ్ళుంటుంది. కానీ ఘాయిసూల్‌దీవి పైకోసనున్న వారి

యర్ నది ఛాయిసూల్ బే ప్రాంతానికయితే లంబూలంబూ నుండీ దాదాపు అరవై అయిదు మైళ్ళుంటుంది. వెల్లాలా వెల్లా ఛాయిసూల్ మధ్యనున్న సముద్రప్రాంతం గురించి ద్వీపవాసులు కథలు చెబుతారు: అక్కడ నీటిదెయ్యాలుంటా యనీ, అప్పుడప్పుడు నౌకలదగ్గరికి తెల్లటిదీపాల్లాగావచ్చి పక్కచేరగానే పంచరంగుల్లోకి విచ్చుకుని మాయమవుతూ వుంటాయని వారినమ్మకం.

ముండా ఎపుడయి తేపట్టుబడిందో సాలమన్ దీవులమీద జపానీస్ వారిపట్టు సడలజొచ్చింది. ఇపుడు పోరాటం న్యూజార్జియా-గిజో-కోలంబంగారా కలిపితే వుండే త్రికోణాకార ప్రదేశాన్నుండి వెల్లాలా వెల్లా-ఛాయిసూల్ - బోగన్ విల్లి ప్రాంతానికి జరిగింది. ఆగస్టు 15 న మిత్రసైన్యాలు వెల్లాలా వెల్లాలో దిగినతర్వాత జపాన్ వారు క్రమక్రమంగా అక్టోబరు మొదటివారంనాటికి దీవివదిలి వెళ్ళిపోయారు. బోగన్ విల్లి మీద దాడికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

యుద్ధంపూర్వం లంబూలంబూ చైనావారి హయాంలో చిన్నవర్తక కేంద్రంగా వుండేది. కర్రలమీద కట్టిన గుడిసె ఒక్కటంటే ఒక్కటుండేది. చాలా చిన్నఎత్తున బెర్న్ డ్ స్టన్ ఏర్పాటుచేసుకున్న పిటిస్థావరం. అంతకంటెమించి లేదు. పిటిలు ఆగడానికికట్టిన డాక్ (రేవుస్థలం) తప్ప అక్కడ చెప్పుకోతగ్గకట్టడం మరోటి లేదు. ఎల్. ఎస్. టి. లు వచ్చి

పెట్రోలుడబ్బాలు ఒడ్డుమీద పడేయ్యగానే వాటిని కిందంతా గజిబిజిగా అల్లుకొనివున్న మేన్‌గ్రోవ్ వేళ్ళమీదనించి నావికులు కేవలం భుజబలంతో దొర్లించుకెళ్ళి డాక్‌కి చేరవేసేవారు. ఈగలూ దోమలూ సమృద్ధిగానూ ప్రాణాంతకంగానూ వుండేవి. ఎప్పుడూ ఆహారం కొరతగానే వుండేది. వేడిఅధికం. వానజల్లులవల్ల అంతా ఉక్కగా, మడ్డిగా, చిరాగ్గా వుండేది. చెమటకి బట్టలెప్పుడూ తడిసేవుండేవి. లుంబేరీ ఎడారి అనుకుంటే లంబూలంబూ అడివి. అడుగుపొడుగున్న పచ్చటి బల్లులు బురదలోవున్న చెట్లవేళ్ళమీంచి పాకుతూవుండేవి. కిందఆగితే పిటిబోట్లలోకి చెట్లమీదనించి తేళ్ళుపడేవి.

లంబూలంబూ చిన్ననదిలో కలుస్తుంది. స్థానికంగా దాన్ని కటపాకూఅని పిలుస్తారుగానీ దాన్ని వైతరణిఅంటే బావుండేది. భయంకరమైన వాసనతో అంతకంటె భయంకరమైన రంగుతో నల్లటి మేన్‌గ్రోవ్ వేళ్ళమీదనించి దట్టమైన అడవిలోకి చొచ్చుకుపోయే నీళ్ళను చూస్తూంటే అది వెళ్ళి వెళ్ళి ఏ భయంకరమైన గుహలోకి మాయమవుతుందో నని పిస్తుంది. ఆకులమధ్యనుంచి వింతవింతపక్షులకేకలు వినిపిస్తూ వుంటాయి. రాత్రిపూట అడవికుక్కలు కూస్తాయి. ఈ కుక్కలు విమానం ఎంతదూరంలోవున్నాసరే మనిషీ, యంత్రాలకన్న ముందరే పసిగట్టేస్తాయట.

పిటి 59 డ్రైబ్బేవడుఅడుగుల పొడుగున్న ఎల్కో-బోటు పిటి 109 కన్నా పాతదయినందువల్ల వసతిసౌకర్యం అట్టేలేదు. జంగిల్ హేమక్స్ తెచ్చుకున్న అదృష్టవంతులు వాటిల్లోనే పడు కునేవారు. మిగతావారు పిటిబోట్లకుకలిపికట్టి ఏర్పాటుచేసు కున్న గుడారాల్లో నిద్రించేవారు. కిందుండే మేన్ గ్రోవ్ వేళ్ళ మధ్యన ఎలుకలు విచ్చలవిడిగా తిరుగుతూవుండేవి. రాత్రి జోళ్ళిప్పి పడుకుంటే పొద్దుట మాయమేనాఅయేవి లేకపోతే కాలుపెట్టగానే లోపలవసతిఏర్పాటుచేసుకున్నప్రై తైనా తగిలేది.

ఈ కొత్తస్థావరంలో కెనెడీకి పాతస్నేహితుడొకడు తగి లాడు. అతను లెఫ్టినెంట్(జెజి) బైరన్ ఆర్.(విజ్జర్)వైట్ 1.

వైట్ అక్కడ బెరన్డ్సన్ ఇంటెలిజన్స (రహస్య గూఢచారి దళం) ఉద్యోగిగా పనిచేస్తున్నాడు. కొలరాడో యూనివర్సిటీ ఆటల్లో హాఫ్ బ్యాక్ గానూ, తర్వాత ఆల్ అమెరికన్ ఆటగాడుగానూ వుండేవాడు. అతను రోడ్స స్కాలర్ గా చదువుకునేటపుడు కెనెడీ లండన్ లోనూ తర్వాత యూరప్ లోనూ కలుసుకున్నాడు. ఓరాత్రి వైట్ కెనెడీతో బాటు గస్తీకివెళ్ళి మెషీన్ గన్ పేల్చి చూశాడు. గన్ లో ఓ శీల సరిగాపనిచేయనందువల్ల అరచేయి చీరుకుపోయింది.

---

1. 1961 లో ప్రెసిడెంట్ కెనెడీ వైట్ ని డెప్యూటీ అటార్నీ జనరల్ గా నియమించాడు.

కెనెడీ రెండోవాలో వున్నప్పుడున్నంత తరచుగానూ వెల్లాలావెల్లానుంచి గస్తీకి వెళ్ళేవాడు. పిటి 59 స్థావరానికి చేరినరోజు అక్టోబరు 18 న ఛాయిసూల్ దీవి వాయువ్యకోసన పిటి 169, పిటి 183 లతో సహా గస్తీవెళ్ళాడు. జాపనీస్ నౌకలకు ముఖ్యస్థావరాలలో ఒకటైన ఛాయిసూల్ బేకు ఉత్తర దక్షిణదిక్కులనుంచివచ్చే శత్రునౌకలను అటకాయించడం ఆ రాత్రిపెట్టుకున్న పనుల్లో ఒకటి. అర్ధరాత్రి పన్నెండున్నరకి పిటి బోట్లు రెడ్ మూన్ దీవికి అయిదుమైళ్ళు దక్షిణంగా వెడుతున్న సమయంలో ఒక సింగిల్ ఇంజన్ జపాన్ విమానం వారి దారిలోకి దూసుకొచ్చి రెండు బాంబులు పడేసింది. రెండూ పిటి 59 కుడిపక్క నీళ్ళల్లో పడ్డాయి. కెనెడి "కమెన్సు ఫైరింగ్" (కాల్పులు మొదలెట్టండి) అని అరిచాడుగానీ సిబ్బంది విమానం కూల్చలేకపోయారు.

ఛాయిసూల్ బేకి వెళ్ళే ఎమరల్డ్ ఎన్‌ట్రీకు పరిశీలించినతర్వాత బోట్లు దక్షిణానికి వారియర్ నదివైపుమళ్ళాయి. వారియర్ నది ఛాయిసూల్ దీవిపశ్చిమపుటంచుచుట్టి సేలవాయ్ రేవునద్ద స్లాట్‌లో కలుస్తుంది. కెనెడీ, సిబ్బందీ ఆనదిపేరు యింతకుముందు వినివుండకపోవచ్చుగానీ కొన్నిరోజులతర్వాత జరిగిన సంఘటన ఆపేరు జన్మాంతం జ్ఞాపకముండేటట్లుచేసింది.

నదీముఖానికి అరమైలుదూరంలో వుండగా కెనెడీ బోటునున్న రాడార్‌లో సముద్రంవైపు రెండుమైళ్ళదూరంలో రెండువిమానాలువస్తున్నట్లు కనిపించింది. "జనరల్ క్వార్టర్సు" అని కేకేసి అందర్నీ సంసిద్ధులుగావుండమన్నాడుగానీ విమానాలు వచ్చినట్లేవచ్చి మాయమయ్యాయి. లంబూలంబూకి తిరిగివస్తూంటే మరోశత్రువిమానం ఎదురొచ్చింది. పైలట్ బోట్ల మధ్యలో ఒక బాంబుపడేసి రెండోది వెయ్యడానికి సిద్ధమయ్యాడు. ఈమాటు బోటుశతఘ్నులు నల్లటిచీకటిని చీల్చాయి. పిటి 59 గన్‌బోట్‌గా మారినందువల్ల మిగతా వాటికన్నా ఆయుధసామగ్రి ఎక్కువుంది. కెనెడీ సిబ్బంది రెండు 40-మిలిమీటర్ విమానవిధ్వంసక శతఘ్నులతో బాటు .30, .50 కేలిబర్ మెషిన్‌గన్లుకూడా పేల్చారు. కానీ ఫలితం కనబడలేదు. విమానం ఉత్తరదిక్కుగా తప్పించుకుపోయింది. మూడుబోట్లూ లంబూలంబూకి క్షేమంగా తిరిగివచ్చాయి.

కెనెడీ రోడ్స్‌ని "భయమేసిందా?" అని అడిగాడు.

"లేకపోతే" అన్నాడతను.

"నాకూ అంతే సుమా!" అని కెనెడీకూడా ఒప్పుకున్నాడు.

అక్టోబరు 20-21 రాత్రి ఏడుగంటలకు పిటి 59 లంబూ లంబూ నించి బయలుదేరింది. ఇరవైమైళ్ళదూరంలో వెలు

గొచ్చి అకాశం ఎర్రబారినట్లు కనిపించింది. కానీ విమాన మేదీ కనబడలేదు. రేపు ఇతవలవున్న దీవులపక్కనుంచి ఛాయిసూల్ దేవద్దకు వెళ్ళారు. ఆ రాత్రి కెనెడీ బాగా ఉత్త రానికి పోరోపోరో, వెస్ట్ కేప్‌దాకా వెళ్ళాడు. అక్టోబరు 21-22 రాత్రి గాలి ఉధృతంగావుంది. తప్పితే ఛాయిసూల్ దే వద్ద గస్తీలో ఏమీజరగలేదు. ఓరోజు తెల్లారి గస్తీనుంచి తిరిగివస్తూంటే స్లాట్‌లోని ఓ చిన్నదీవిమీద జపానువారు నీటిమీదుగాకట్టుకున్న పాయిఖానాసిబ్బంది కంటబడింది. మొదటిసారి చూసినపుడు దాన్నిపేల్చెయ్యమాఅని అడిగారు. కెనెడీ వద్దన్నాడు. రెండోమాటు అడిగినపుడు "వెల్లాలావెల్లా నుంచి అంతదూరం పంపిస్తున్న మందుగుండుసామాను పాయి ఖానాలమీద ఉపయోగించడానికి వీల్లేదని కోప్పడ్డాడు. కానీ దాన్ని ఇట్టేగురిచూసి కొట్టొచ్చు. సిబ్బంది ఊరుకోలేదు. మళ్ళామళ్ళా అనుమతి అడిగారు. అక్టోబరు 26 న శత్రువిమా నాలు ఛాయిసూల్ ప్రాంతంలో బాంబులువేశాయిగానీ పిటి 59 సురక్షితంగా స్థావరంచేరుకుంది.

అక్టోబర్ 27 న రెండవ మెరీన్ పారచూట్‌దళం ఛాయిసూల్‌మీద దాడిచేసింది. దాడీ సముద్రమార్గంమీద జరిగింది. ఈ దాడికి ఛాయిసూల్ డైవర్షన్ అని పేరుపెట్టారు. చివరవరకూకూడా కష్టాలెదుర్కొంటూ రావలసివచ్చింది. బెటాలియన్‌కి లెఫ్టినెంట్ కలనెల్ విక్టర్ హెచ్. క్రులాక్

కమాండరు. దళం వెళ్లాలా వెళ్లా ఎదురుగా ఛాయిసూల్ నైఋతికోస్తాన దిగింది. కొండలతోటీ అడవులతోటీ జాపనీస్ సైన్యంతోడీ నిండివున్న ఆ దీవి ప్రవేశించారు. మిత్రరాజ్యాలు బోగన్ విల్లిమీద పెద్దఎత్తున దాడిచేయనున్నాయి. ఆ ప్రయత్నాలు తెలియకుండా కప్పిపుచ్చడానికే ఇక్కడ ఈదాడి ఏర్పాటుచేసుకున్నారు. ఇదికూడా భారీఎత్తునజరిగే దాడిలాగ శత్రువులకు తోచేట్లు చేయాలని వారిసంకల్పం. ఉత్తరదిక్కు సాలమన్సులోదిగిన ఆ చిన్నదళం శత్రువులను హడలగొట్టాలంటే వేలకొద్దీసైన్యం వచ్చిపడినట్లు హడావుడి చెయ్యాలి. విడివిడిగా చీలిపోయి ఎక్కడచూస్తే అక్కడ సైనికులున్నట్లు కనబడాలి. ముందుపరిసరాలన్నీ పరిశీలించి రావడానికి సాయుధులైన నావికులు ఎనభైఏడుమందిని నవంబరు 1 న ఒకదళంగా ఏర్పాటుచేశారు. వీరిలో చాలామంది జి. కంపెనీతాలూకువారే. ఈదళాన్ని కోస్తావెగువకు పంపారు. దారిలో ఎదురైన శత్రువులను ఎదుర్కొంటూ ఛాయిసూల్ బేలోనున్న జాపనీస్ కట్టడాలని పేల్చెయ్యమన్నారు.

పారచూట్ దళం దిగిన రెండుమూడురోజులక్రితం యుద్ధవస్తులతోవున్న ఒక మెరీన్ ఆఫీసర్-మెసెంజర్ వెళ్లాలా వెళ్లా మట్టిరోడ్లమీదుగా జీపులో బయలుదేరి లంబూ లంబూ పిటిస్థావరంచేరి లెఫ్టినెంట్ బెరండ్ స్టన్ కి సీలువేసిన కవరొకటి అందించాడు. కవర్లో అతిరహస్యమైన వార్త వుంది.

బోగన్‌విల్లి దాడినుంచి జాపనీస్‌వారిదృష్టి మళ్ళించడానికి చేసిన ఏర్పాట్ల ప్రకారం వెల్లాలావెల్లాలోవున్న రెండవమెరీన్ పారచూట్ బెటాలియన్ ఛాయిసూల్ దీవి ముట్టడిస్తుందనీ అవసరమొస్తే లంబూలంబూలోని పీటీలువచ్చి ఆదుకోవాలనీ ఆవార్తలో తెలియజేశారు.

ఛాయిసూల్ మీాదున్న ఎనభైఏడు మనుషుల దళానికి మేజరు వార్నర్ టి బిగ్గర్ కమాండర్. అతను ఇరవైఆరేళ్ళ వాడు. ఫ్లారిడాయూనివర్సిటీ పట్టభద్రుడు. అతనితండ్రికూడా నేవల్ ఆఫీసరు. మొబైల్‌బేలో డేవిడ్ ఫర్రాగుట్ ఫ్లాగ్ షిప్‌గా పేరొందిన హార్ట్‌ఫోర్డు నౌకలో పనిచేశాడు. పారచూట్ శిక్షణపొందేముందు మేజర్‌బిగ్గర్ హెలెనా, లూయిస్‌విల్లినౌకల్లో మెరీన్ ఆఫీసరుగా పనిచేశాడు. ప్రస్తుతం బెటాలియన్ ఎక్సిక్యూటివ్ ఆఫీసరుగా వున్నాడు. అతనికింద వున్నవాడు జి కంపెనీ కమాండరు అయిన కెప్టెన్ విలియం ఆర్. డే. కమాండరు డే మరుసటిరెండురోజులూ జరిగిన యుద్ధంనించి బతికిబయటపడ్డాడుగానీ ఇవోజిమాలో ప్రాణం కోల్పోయాడు. ఆ రెండురోజులూ తీరికలేకుండా పనిచేసిన వాడు వైద్యోద్యోగి నేవీలెఫ్టినెంట్ జాన్ ఎస్. స్టీవెన్సు ఇరవైఎనిమిదేళ్ళవాడు. కానెక్టికట్ బ్రిడ్జ్‌పోర్ట్ ప్రాంతం వాడు.

నౌకాదళ సైనికులు ఎనభైఏడుమందీ ఇద్దరు స్థానిక మార్గదర్శకులను తోడుతీసుకొని రెండు ఎల్ సి పి ఆర్‌లలో (విమానాలు దిగేందుకూ, సిబ్బంది ప్రయాణంచేసేందుకూ, మోటారుకార్లు మొదలైనవాటిని ఎక్కించుకొని ఒడ్డున దించేందుకూ సౌకర్యాలున్న నౌకలు) ప్రయాణించి కోస్తాదిగువ వారియర్ నదిదాకా బయలుదేరారు. దళాన్ని ఒడ్డుదింపడానికి నదిలోకి మళ్ళగానే ప్రతీదీ చుక్కెదురుకాసాగింది. పటాల్లోచూస్తే ఆ నది చిన్నచిన్ననౌకలు వెళ్ళేందుకుకూడా వీలుండేలోతున్నదని వుంది. ఇప్పుడుచూస్తే అడుగుసాపుగా వుండే ఎల్ సి పి ఆర్ కూడా వెళ్లేట్టులేదు. నదీముఖం దాటగానే బోట్లు మేటనెక్కడం మొదలెట్టాయి. తప్పించడానికి ఇంజన్ల వేగం హెచ్చించారు. హోరు మనే ఇంజన్లశబ్దం అడవి అంతటా ప్రతిధ్వనించింది. చప్పుడు జపానీస్ చెవిన పడి వుంటుందని బిగ్గర్ భయపడ్డాడు. తమని తూర్పుకోస్తాలో దించెయ్యమన్నాడు. ఎల్. సి. పి. ఆర్. లను కొన్ని మైళ్ళు వెనక్కి ఒడ్డంబటే వెళ్ళి సూకికివద్ద ఆగి మధ్యాహ్నం తాము వచ్చేదాకా అక్కడే వుండమన్నాడు. నది ఒడ్డున చిన్న స్థావరం ఏర్పరచాడు. దళంలో ముఖ్యభాగాన్ని తీసుకుని దీవిలోనికి చొచ్చుకు వెళ్ళాడు. అతని ఉద్దేశం, నది ఒంపు తిరిగిన చోటు చుట్టుకొని వెళ్ళి ఛాయిసూల్ బే చేరాలని.

మిట్టమధ్యాహ్నానికి తను అనుకున్నట్లు వారియర్ నది దాటి వెళ్ళడం అలావుంచి బిగ్గర్ సిబ్బందితోబాటు, చిత్తడి నేలమధ్య చిక్కడిపోయాడు. మార్గదర్శకులవెంట బురదలో అవస్థపడుతూ కొంతదూరం వెళ్ళిన తరువాత బిగ్గర్ వేరే మంచిమార్గం ఏదేనా చూపమన్నాడు. తమ కసలు దారి ఏదీ అంతుబట్టటంలేదని వాళ్ళిద్దరూ ఒప్పేసుకున్నారు. వారు ఛాయిసూల్‌లో మరో ప్రాంతంలో ఉండేవా రవడంవల్ల వారియర్ ప్రాంతం బొత్తిగా తెలీదు.

కథ ఇలాగే నడిస్తే చీకట్లో సిబ్బంది తప్పిపోయే ప్రమాదం వుంది. అందువల్ల బిగ్గర్ తను పెట్టుకున్న వ్యవధి రెండు రోజులకు పెంచుకున్నాడు. రాత్రికి అక్కడే ఆరు బయట మజిలీ చేశాడు. కొంత సిబ్బంది తోడు ఇచ్చి లెఫ్టినెంట్ రీ ఇ. డంకాన్‌ను నదిబడ్డుస్థావరానికి పంపించాడు. అక్కడి నుంచి, జరిగినదంతా రేడియోద్వారా క్రూలాక్‌కు తెలుప మన్నాడు. డంకన్ సమాచారం ప్రసారంచేసి కేంప్‌కి దగ్గరలోనే రాత్రి గడిపాడు. పొద్దున్న లేవగానే కేంపు చుట్టూరా జపానీస్ సైన్యం వుంది. ఇంజన్లశబ్దం పసిగట్టి వుంటారు. సరిగ్గా తనున్న కేంపుకీ బిగ్గర్‌కీ మధ్య నున్నాడు శత్రువు. రేడియోకూడా కేంపులోనే వుంది. బిగ్గర్ తిరిగి వచ్చి తమను చేరుకోవడానికి వీలుండదు. బిగ్గర్‌కి మాత్రం ఈ ప్రమాదం ఇంకా తెలీదు.

ఇప్పుడు సహాయంకోసం వెళ్ళాలి. శత్రువుకంటపడకుండా డంకన్ తన మనుషులతో బోటు చల్లగా అక్కడనించి జారుకున్నాడు. నుకికి చేరి ఒక ఎల్. సి. పి. ఆర్. తీసుకుని, క్రులాక్ కి బిగ్గర్ వున్న ప్రమాదపరిస్థితి తెలియజేయడానికి వోజాకి బయలుదేరాడు. క్రులాక్ ఫైటర్ల కోసమనీ, పిటి బోట్ల కోసమనీ ఒక అత్యవసర ప్రసారం చేశాడు.

నవంబర్ 2 మిట్టమధ్యాహ్నం. బెరన్డ్‌స్టన్‌కి రేడియో ద్వారా వార్త చేరింది. ఛాయిసూల్‌లో చిక్కడిపోయిన గస్తీదళాన్ని విడిపించవలసిందనీ, 'అర్జెం'టనీ తెలిసింది. ఆ ఎనభై ఏడుమంది ఆఫీసర్ల సిబ్బంది భవిష్యత్తు పిటిబోట్లు ఎంతవేగంగా వారియర్‌నదికి వెళ్ళి వారిని రక్షించగలవన్న దానిమీద ఆధారపడివుందని ఆ వార్త సారాంశం.

కొన్ని గంటల్లో చీకటి పడుతుంది. బెరన్‌డ్‌స్టన్ ఆరు బయటవున్న ఆపరేషన్స్ డగ్ అవుట్‌నించి పాతకాలంనాటి రేవుస్థలంకట్టడానికి పరుగెట్టు కెళ్ళాడు. ఎన్ని బోట్లు వున్నాయని ఆలోచిస్తే మొత్తం అయిదు తేలాయి. ఒకటి మరమ్మత్తులో వుంది - పనికిరాదు. మరో రెండు బోట్లని సి. టి. ఎఫ్. 31 నుంచి రోజూ వచ్చే ఉత్తర్వుల ననుసరించి రాత్రి గస్తీకి పంపించేశాడు. మిగిలినవి రెండు. పెట్రోలు కొట్టించివున్నారో లేవో తెలీదు. డాక్ వద్ద పెట్రోలు కొట్టించుకుంటున్న పిటి 59 కనబడింది. దాన్నింకా ఫలానా

చోటుకి వెళ్ళమని చెప్పలేదు. కెనెడీ పొట్టినిక్కరు కాకీ చొక్కా తొడుక్కుని ఆర్మీ ఫెటీగ్ టోపీ పెట్టుకుని డాక్ మీద నించుని వున్నాడు. సిబ్బంది మేన్ గ్రోవ్ వేళ్ళమీదనించి నూనెడబ్బాలు దొర్లించి బోటుపక్కకి చేరుస్తున్నారు.

బెరన్ డ్ స్టన్ కి పరుగెట్టుకొచ్చినందువల్ల ఊపిరందటం లేదు. "జాక్ ఇది చూడు" అన్నాడు. కెనెడీ వార్త చూశాడు.

"బోటుమీద పెట్రోలెంతుంది?" అని అడిగాడు బెరన్ డ్ స్టన్.

"డ్రాడీ – ఇప్పటికి ఎంత ఎక్కించారు?" అని కెనెడీ కేకవేశాడు. "ఏడువందల గాలన్లు" అని జవాబొచ్చింది. మొత్తం ఇరవై రెండువందల గాలన్లు పడుతుంది.

"వెళ్ళడానికి అది చాలు" అన్నాడు బెరన్ డ్ స్టన్.

"వెళ్ళడానికిమాత్రమే సరిపోతుంది" అన్నాడు కెనెడీ.

అక్కడున్న సిబ్బందిని ఎక్కించుకుని తిరిగి వచ్చేదెలా? వెళ్ళేది అతివేగంగా వెళ్ళాలి. ప్లాట్ మీదనించి వెళ్ళి వచ్చేందుకు ఉన్న పెట్రోలు చాలదు. మరికొంత ఎక్కించుకుందామంటే వ్యవధి లేదు.

బెరన్‌డ్‌స్టన్ ఐదో బోటుని కనుక్కొంటే దానికి పూర్తిగా పెట్రోలు ఎక్కించారని చెప్పారు. రెండు బోట్లూ కలిసివెళ్ళి అక్కడి సిబ్బందిని ఎక్కించుకోగానే పెట్రోలు నిండుకునే కెన్నెడీబోటుని రెండో బోటు లాక్కురావడానికి వీలుంటుంటా అని అడిగాడు. ఎలాగా? ఎనభై ఏడుమందికి ఒక బోటు సరిపోదు. ఇలాటి అత్యవసరపరిస్థితిలో అలా చేయడం కంటె వేరే మార్గం లేదు. ఆఫీసర్లు ఇద్దరూ ఒకరి కొకరు సహాయపడడానికి ప్రయత్నిస్తా మన్నారు.

"జాగేల పదండి" అనితొందరపెట్టాడు బెరన్‌డ్‌స్టన్. "వెళ్ళి వారిని ఎక్కించుకొచ్చేదాం బయలుదేరండి" అంటూ కెనెడీ బోటుఎక్కాడు.

కెనెడీ తనసిబ్బందికి ఛాయసూల్‌లో ఇబ్బందిలోవున్న మెరీన్‌దళాన్ని ఎక్కించుకురావడానికి వెడుతున్నామని చెప్పాడు. కెనెడీకి తను అత్యవసరమైన పనిమీద వెడుతున్నా డనితప్పితే వివరాలేమీ తెలీవు. బెరన్‌డ్‌స్టన్‌కి గాడల్ కెనాల్ నుంచి వచ్చినవార్త మెరీన్‌దళం ఎక్కడవుందో తెలియచేయ లేదు. దానిబదులు ఛాయిసూల్ కోస్తాలో ఫలానాచోట ఓబోటు పిటిలకోసం వేచివుంటుందనీ మెరీన్‌దళం వున్న చోటుకి దారిచూపుతుందనీ, తెలియజేశారు. ఆ బోటువుండే చోటు వివరం యిచ్చారు. బెరన్‌డ్‌స్టన్ పటంమీద ఆ చోటు గుర్తుపెట్టి కెనెడీకి యిచ్చాడు. రోడ్స్ దారి తెలిసి నడపడంలో ఘటికుడైనందువల్ల కెనెడీ ఆ పటాన్ని అతని కిచ్చాడు.

సాయంత్రం 4-35కు పిటి 59, దీని వెనుక సుమారంలో తోడువచ్చేబోటు స్లాట్ వేపు బయలుదేరాయి. పిటి 59 లో ఈ సాహసోద్యమం జయప్రదంచేసే బాధ్యతతీసికొని ధీమాగా బయలుదేరిన ముఖ్యులందరికీ గుండెలు పీచుపీచుమంటూనే వున్నాయి. నడిసముద్రంలో కటికచీకటిలో 65 మైళ్ళ దూరానఉన్న గైడ్ బోటు ఫలానాచోటఉందని గుర్తించడం సకాలంలో సక్రమంగాచేయగలనా అని రోడ్స్‌బెంగ. అతనికి ఉన్న ఆధారమల్లా కాంపాస్ (దిక్సూచి) ఒకటే! సాలమన్ ప్రాంతంలో అంతా చిన్నచిన్న గస్తీలమీద తిరుగుతూవచ్చిన పిటి బోట్లకు ఇన్నాళ్ళూ దిక్సూచితో పని అట్టేఉండేదికాదు. అందువల్ల వాటినివాడే అనుభవమూ అంతంతమాత్రమే! దీనికితోడు ఇంతకాలం వాడకుండా పడివున్న ఈ బోటు మీది దిక్సూచి ఇవాళ ఏదశలోవుందో సరిగా పనిచేస్తుందో లేదో అన్నది రోడ్స్‌కు మరోదిగులు. కాస్త అడపాతడపా దాన్నికూడా కనిపెట్టిచూచుకునివుంటే బాగుండేదిగదాఅని నాలిక్కరచుకున్నాడు. పోతే, ఇంజన్ రూములో డ్రాడీప్రాణా లన్నీ పెట్రోలుగేజ్ మీాదవున్నాయి. బోటుబారెడు ముందుకు వెళ్తే పెట్రోలు గజన్నరలోతుదిగిపోతున్నట్టు కనబడుతోంది. యుద్ధంలోచేరాక ఎన్నోరకాల కష్టాలుఉపద్రవాలువచ్చాయి. కాని ఇటువంటివె కనీవినీఎరగమని అతను పరిపరివిధాల బాధ పడసాగాడు. పైన స్టీరింగుదగ్గర సారథి కెనెడీకళ్ళు చిల్లులు

పడేలా ఛాయిసూల్ కోస్తా కొండలబారువేపు దృష్టిసారించి చూస్తున్నాడు. సకాలంలో అడంగుచేరి గట్టునున్న మెరైన్‌లను ఈబోటు ఎక్కించగలమా లేదా అని అతని తపన. ఇంకా కొద్దిసేపు వెలుతురుంటే ఎంతబాగుండేది అని దురాశపడ సాగాడు.

అక్కడ ఛాయిసూల్ దీవిమీద శత్రుస్థావరాలకోసం వెయ్యికళ్ళతో వెతుకుతూ ముందుచూపేతప్ప వెనకచూపు లేకుండాపోతున్న బిగ్గర్‌గాని, అతనిజట్టుగాని వెనుకపాటుగా శత్రువులు సమీపిస్తున్నారని కనుక్కోలేదు. ఆనాడు తెల్లవారుఝామునే వాళ్ళు చిత్తడినేలమీద అడవిమధ్యగా దారి చేసుకొంటూ ఛాయిసూల్ అఖాతంలో శత్రుస్థావరాలమీద కాల్పులు జరపడంకోసం యాత్రసాగిస్తున్నారు.

గమ్యస్థానంచేరేసరికి వారికి ముందుగా ఒక ఔట్ పోస్టు కనబడింది. అక్కడ ఇద్దరు జపానీయులు బట్టలు ఉతుక్కుంటున్నారు. ఒకడు కాపలానిలబడివున్నాడు. మరొకడు పాకలోపల వున్నాడు. బిగ్గర్‌దళంవారు నెమ్మదిగా పాకి దగ్గరగా వెళ్ళి బయటవున్న ముగ్గురినీ కాల్చిచంపేశారు. నాలుగో వాడు పారిపోయాడు. ఇప్పుడుజరిపిన ఈ కాల్పులధ్వనికి శత్రువులు మేల్కొని జాగ్రత్తపడతారని, ముఖ్యస్థావరంమీద కాల్పులుజరిపేలోగా శత్రుసైన్యంవచ్చి విరుచుకుపడుతుందని

బిగ్గర్‌కు భయంవేసింది. ఆ ముఖ్యస్థావరం చేరలేనిపక్షంలో అందుకు బదులుగా దగ్గరలోవున్న గప్పీద్వీపంలోని స్థావరాలపై కాల్పులు జరపవలసిందిగా అతనికి ఉత్తర్వులున్నాయి. ఈ పరిస్థితిలో రెండోమార్గమే మెరుగనితోచి అటుబయలు దేరాడు. కోస్తాలో చెట్లు బాగా పల్చబారివున్నందువల్ల 60 మిలీమీటర్ల మోర్టార్ గన్‌లను వాటిమొనలుమాత్రం నీటిమట్టానికి నాలుగైదంగుళాలు పైకివుండేలా వొంచివుంచి స్థావరం సమీపించాడు. తగినంతదగ్గరకురాగానే కాల్పులు జరపమన్నాడు. ఒక్కసారిగా 120 భారీగుళ్ళు బ్రహ్మాండమైన శబ్దంతో గప్పీదీవిమీదికి విజృంభించి విరుచుకుపడ్డాయి. కొద్దిక్షణాలలో శత్రుస్థావరంలోని నూనెటాంకులు బద్దలై మంటలు, నల్లటిపొగలు విరజిమ్మసాగాయి. ఈ హఠాత్సంభవానికి అదరిపడిన జపానుసైనికులు ఆ గంద్రగోళంలో దారీతెన్నూలేకుండాఎటుపడితేఅటుగా కాల్పులుజరిపారు. వచ్చినపని కాగానే మెరైన్ వళాలు వెనక్కుమళ్ళి కారియర్ రేవుకేసి పరుగెత్తాయి. అక్కడ ఎల్. సి. పి. ఆర్. బోటులు సిద్ధంగావుంటాయని వారిధీమా.

కాని అవి అక్కడ లేవు. కనుచూపుమేరలో ఎక్కడా లేవు. అందరూ నిశ్చేష్టులై పోయారు. ఇప్పుడో ఇంకాసేపటికో వస్తాయన్న ఆశతో పడమటి గట్టుమీద కూలబడ్డారంతా. బురద నేలలో తిరిగి పరుగులెత్తి అలసి ఒళ్ళంతా

చీదరగావున్న మెరైన్లు చాలమంది నదిలో దిగి స్నానం చేస్తా మన్నారు. కానిమ్మన్నాడు బిగ్గర్. గట్టుకి పదిహేను గజాల లోపు నే వాళ్ళు స్నానాలు చేస్తున్నారు. అంతలోనే ప్రశాంత మైన సాయంసంధ్య పెఠేలుమంటూ ప్రజ్వరిల్లింది. మరతుపా కుల-రైఫిళ్ళ అగ్నివర్షంఅంతా మారుమోగింది. అన్నీ పడమటి గట్టువైపునుండీ కాస్త పైనుండి వస్తున్నాయి. నిశ్చేష్టులైపో యిన మెరైన్‌లకు అప్పుడే తెలిసింది- శత్రువులు తామువున్న గట్టుమీద నేవున్నారని! ఇంకా వాళ్ళకి తెలియనిదీ, క్షణాల మీద తెలుసుకోవలసినదీఒక్కటే-శత్రువులుఎదరగట్టునకూడా వున్నారా అన్నది. అదే నిజమైతే మూడు వైపులా శత్రు వులు చుట్టుముట్టినట్టే. నాలుగోవైపు - సముద్ర ప్రవేశమే శరణ్యం.

ఇది ఇలావుండగా అటు పి. టి. 59 మీద ఛాయి సూల్ కోస్తాసమీపిస్తున్నకొద్దీ కెనడీ ఆమునిమాపు వెలుగులో తమను మెరైన్‌లోవున్న చోటుకు తీసుకువెళ్ళాల్సివున్నబోటు కోసం వెదికి అదికనబడకపోయేసరికి కంగారుపడసాగారు. కాస్త అటూఇటూఅయినా మొత్తంమీద చేరవలసినస్థలానికే చేరా మనిరోడ్సు ఎంతధీమాగాచెప్పినా దిగాలుపడిన కెనెడీకి గురి కుదరటంలేదు. ఆ మెరైన్‌లంతా ఇక్కడకాక ఇంకెక్కడో ప్రాణాలు గుప్పిటపట్టుకొని తమకోసం ఎదురుచూస్తూ వుంటా రని వారిబోటు దొరికేదాకా వెదకడమే కర్తవ్యమనీ నిశ్చ

యించాడు. తమబోటు అసలు కోస్తాకు బాగా దిగువగావచ్చి ఆగిందేమోనని అతనికి అనుమానం.

ఒక్కసారిగా యింజన్లను ఆపరగొట్టాడు కెనెడీ. పెట్రోలు గేజ్ చూస్తున్న డ్రాడీగుండె మరోసారి గుభేలు మంది. అప్పటికే సగంపెట్రోలు హరించిపోయింది. బోటు పుంజుకొంది. ఉత్తరదిశగా కొంతదూరం పోయాక ఒక దీవి కనబడింది. ఎర్రటి పర్వత శిఖరాగ్రాన్ని చూడగానే అది మోరీద్వీపం అని కెనెడీ రోడ్స్‌లు ఇద్దరూ గుర్తించారు. అంటే ఉత్తరంగా మరీ ఎదరకు వచ్చేశారన్నమాట! వెంటనే కెనెడీ దక్షిణాభిముఖంగా తిరిగాడు. బయలుదేరిన చోటు చేరబోతూవుండగా గట్టుకు మూడువందల గజాలదూరంలో విమానవాహకనౌక గోచరించింది. దానిని సమీపించేసరికి ఒకనాటి సాటి పి. టి. స్కిప్పర్ లూటినెంట్ (జె. జి.) రిచర్డ్ ఇ. కెర్సీ ఆబోటు గన్‌వేల్ దగ్గర కనుపించాడు. ఒంటరిగా ఉన్నట్టున్నాడు. అతని వాలకంచూస్తే తనువున్న పడవమీాద నించి పి.టి. 59 మీాదికి వచ్చిపడడానికి 50గజాలు దూరమన్నా దూకేసేట్టుంది. ఆబోటుకు మరమ్మతుల పని తగిలినందువల్ల అది అనుకున్న వేళకు ఎదురువచ్చి పి.టి. 59ని కలుసుకోలేక పోయిందిట.

కెనెడీ తనబోటును ఆనౌక పక్కగా పట్టిస్తూ "ఇక్కడేం చేస్తున్నావు డిక్!" అన్నాడు.

“ఏదో ఏడుస్తున్నానుగానీ, మనం తక్షణం బయల్దేరాలి” అంటూ కెర్నీ ఈ బోటుమీదకు దూకాడు.

“ఇక్కడ దగ్గరలోనే కొందరు మెరైన్లు చాలా ప్రమాదస్థితిలో ఉన్నారు” అని తెలియజెప్పబోయాడు.

బోటు వారియర్ నదికేసి పోసాగింది.

కెనెడీ కెర్నీలు లోగడ టులగీ హార్బర్‌లో తొలిసారి కలుసుకున్నారు. ఆనాడు కెర్నీ బోటు రాతిగట్టుకు ఢీకొని దెబ్బతింటే, కెనెడీ దీనిని డ్రైడాక్‌కు లాగుకొని వచ్చాడు. ఆతరవాత వేసవిఅంతా వారిద్దరూ రెండోవాలో కలిసి బ్లాకెట్ స్ట్రెయిట్‌లో పి. టి. 109 ప్రమాదానికి గురి అయి మునిగిపోయిన రాత్రి-ఆప్రాంతంలోనే కెర్నీ పి. టి. 105 కు పైలట్ చేస్తున్నాడు.

ఇప్పుడు ఛాయ్‌సూల్ దీవిదగ్గర పి. టి. స్థావరం ఏర్పాటుచేయడం అవసరమయే పరిస్థితిలో ఈ కోస్తామీద అందుకు అనువైన స్థలం ఎన్నికచేయడంకోసం మెరైన్లతో బాటు తనను కూడా పంపించారని చెప్పాడు కెర్నీ. ఇపుడు బిగ్గర్, అతనిబృందం చిక్కుపడివున్న ప్రాంతంగురించి అక్కడి పరిస్థితిగురించి తనికి తెలిసినంతా కెనెడీకి తెలియజెప్పాడు. ఎల్. సి.పి.ఆర్. బోట్లు గట్టుదగ్గరకువెళ్ళి వాళ్ళని ఎక్కించుకుంటాయని, వాళ్ళంతా షీటిమీదికి చేరేలోపల వెనుకనుండి

జపానీయులు కాల్పులు జరపకుండా పి. టి. బోటు ఇటునుంచి కాపుదల కాయడం చాలా అవసరమని అన్నాడు. వెంటనే కెనెడీ తనబోటుమీది సైనికులను ఆ స్థానాల్లో కాల్పులు జరపడానికి సంసిద్ధంగా ఉంచాడు.

అప్పటికే పి. టి. 59 ఉన్న స్థలానికి రెండుమైళ్ళ ఉత్త రాన జపాన్ సైన్యం బిగ్గర్ దళాన్ని చుట్టుముట్టడం ఆరంభించింది. బిగ్గర్ చాలా క్లిష్టపరిస్థితిలో పడ్డాడు. తూర్పుగట్టున డంకన్ దళం వుండే వుంటుందన్న ఊహతో బిగ్గర్ ఒక ఆఫీసర్ను, ఇద్దరు మెరైన్లను ఆవలిగట్టుకు ఈదుకువెళ్ళి వాళ్ళని కలుసుకురమ్మని పంపించాడు. కాని అప్పటికి రెండు మూడు గంటల క్రితమే డంకన్ దళం సహాయంకోసం తరలి వెళ్ళిపోయింది. వాళ్ళు అప్పటికే ఎల్. సి. పి. ఆర్. లను 'నుకుకీ' వద్ద కూడదీసికొని వీళ్ళని అందుకోవడానికని వారి యర్ నదిని సమీపిస్తున్నారు. పి. టి. 59 కి రెండుమైళ్ళ ఎదర వున్నారు వారు. అందువల్ల బిగ్గరు ఆవలిగట్టుకు పంపిన ముగ్గురిమీద ఆవలిగట్టునుంచే గుళ్ళవర్షం కురిసింది. ఇద్దరు ప్రాణాలు కోల్పోయారు. అన్నివేపులా శత్రువులు చుట్టుముట్టారని బిగ్గర్ తేల్చుకున్నాడు. చీకటి పడేసరికి ఆ అడవిలో అటూ యిటూ మరోసారి అగ్నిబాణాలు చెలరేగాయి. ఆ కాల్పులలో, ఎల్ మెట్ (ఇలినాయ్) కి చెందిన కార్పొరల్ ఎడ్వర్డ్ జేమ్స్ పెన్సెల్ తీవ్రంగా గాయపడ్డాడు. అతని

ఛాతీమీద కుడిభాగంలోకి ఒకగుండు చొచ్చుకు పోయింది. మెడికల్ ఆఫీసర్, ఒకప్పుడు ఫార్మసిస్టు సహాయకుడు అయిన లెఫ్టినెంట్ స్టీవెన్సు అతన్ని గట్టుమీదకు చేర్చాడు.

"డాక్టర్! నన్నిక్కడ వదలిపోకండేం!" అన్నాడు షెనెల్ దీనంగా.

"ఛ,ఛ! ఏమయినాసరే, నిన్ను వదలిపెట్టను" అని ధైర్యంచెప్పాడు స్టీవెన్స్.

అంతలోనే ఆ చీకటిలోంచి ఎల్. సి. పి. ఆర్. బోట్లు హఠాత్తుగా ప్రత్యక్షం అయ్యాయి. జపానీయులు ఆశ్చర్య పోయారు. మెరైన్లకు పోయినప్రాణం లేచివచ్చింది. ఒడ్డుకు సమీపిస్తున్న బోట్లమీద శత్రువులు కాల్పులు ఆరంభించారు.

ముందున్న బోటుమీద స్టీరింగు పట్టుకొన్న ఎన్సైన్ పరిస్థితిచూసి చెదిరిపోయాడు. ఇంత ఉధృతంగా కాల్పులు జరుగుతోంటే తట్టుకు నిలబడడం అసాధ్యమని ఓ నాక కేసి బోటును వెనక్కుతిప్పబోయాడు. మెరైన్ సెర్జెంట్ రాలెండ్ విల్సన్ తక్షణం తన .45 రివాల్వరు తీసి అతనిగుండెకు గురి చేసి "ముందుకు పద" అని గద్దించాడు.

రెండు బోట్లలోని మెరైన్‌లు కాపుదల కాల్పులు జరుపుతుండగా గట్టుమీది బిగ్గర్, అతనిదళం నీటిలోదిగి పగడపుఅచ్చులమీద జాగ్రత్తగా అడుగులువేస్తూ చుట్టూచేరి ఎగబ్రాకారు. ఐదుగురు కలిసి ష్నెల్‌ను చేతులమీద సాయం పట్టి మోసుకువచ్చారు. మొదటి బోటునిండిపోగానే అదికదిలి ఓజావేపు సాగిపోయింది. ష్నెల్‌ను రెండవ బోటుమీదికి ఎక్కించారు. బిగ్గర్, స్టీవెన్స్ వగైరాలంతా ఎక్కాక అది కూడా కదిలింది. అప్పటికి గట్టుమీద నుండి శత్రుసేనల కాల్పులు ఆగిపోయాయి. బ్రతుకు జీవుడా అని బోటుమీదకు చేరిన జనం అందరికీ ఇలా ఆఖరు క్షణంలో ఈ ఆపద్బాంధవులు వచ్చి ఆదుకోడం అత్యద్భుత సంఘటనే అనిపించింది.

ఆ సాయంత్రం ప్రొద్దువాలేముందునుంచీ సముద్రం పోటుమీదవుండి రెండోబోటు గట్టును సమీపించడంలో పగడపుగుట్ట దేనికోకొట్టుకుని, చిన్నచిల్లుపడింది. పడినప్పుడు అది చాలాచిన్నదని ఎవరూ పట్టించుకోలేదు. బోటు సాఫీగానే కదలిపోయింది. గండంగడచినవారంతా తీయని ప్రాణంలో తీయందనాన్ని తలచుకుంటూ అలసిన కన్నులను అరమూస్తున్నారు. గట్టునుచుట్టి బోటు సముద్రంలో ప్రవేశించేసరికి ఆ చిల్లులలోంచి నీరు జోరుగా వచ్చి ఇంజన్‌గదిని జలమయం చేయసాగింది.

ఇక ప్రాణాపాయం లేదన్నధీమా కేవలం పిచ్చిభ్రమ అన్నభావం అందరికీ కలిగింది. భయంతో బెంగతో కుంగిపోయారు. ఒకవంక తగనిబరువు, మరోవంక పోటుతగిలిన సముద్రపు కెరటాల తాకిడి. ఒకదానికొకటితోడై చిల్లులోంచి నీరు ఉధృతంగా ఎగజిమ్మి బోటుమునగడం ఆరంభించింది. ఇంజనుగదిలో నీరుపైకిరావడంతో ఇంజనులు ఆగిపోయాయి. ఒక్కసారిగా అందరికీ ప్రాణభయం పట్టుకుంది. బోటుసిబ్బంది ఎంతగా తంటాలుపడ్డా ఇంజను గుసుమనికూడా అనలేదు. అప్పటికే మొదటిబోటు కూతవేటుమారం, చూపుమేర దూరం దాటి చీకటిలోకి అదృశ్యం అయిపోయింది. ఇంజను పనిచేయనందువల్ల బోటు పోటుమీదవున్న కెరటాల తాకిడికి నెమ్మదిగా గట్టువేపు జరగసాగింది. అక్కడున్న జవాను వాళ్ళని తలచుకోనగానే గండం గడిచిందన్న ఆనందోత్సాహాలు గట్టెక్కాలన్న భయంతో ఇట్టే హరించిపోయాయి. ప్రాణాలమీద ఆశవదలుకొని నిరాశా నిస్పృహాలతో క్రుంగిపోతున్న మెరైన్‌ల మధ్యలో హఠాత్తుగా ఒకవ్యక్తి తలెత్తి పి. టి., 'పి. టి.' అని వెర్రిగా ఒక్క గావుకేక వేశాడు.

అంతా తలెత్తి చీకటిలోకి కళ్ళుచించుకొని చూశారు. కెరటాలను చీల్చుకొని వస్తున్న పి. టి. (59) నిజంగానే కనబడింది. ఇంజన్‌ల హోరు, ఎక్స్‌పోర్టుఘోష అందరికీ మనోహర సంగీతంలా వినిపించాయి. అప్పటికి బరువుతో వాళ్ళ

బోటు అంచు దాదాపు నీటిమట్టానికి దిగిపోయినందువల్ల దగ్గరకువచ్చిన పి. టి. బోటు ఏదో బ్రహ్మాండమైన ఓడలా, మీదికి విరుచుకుపడుతున్న భూతంలా కనబడింది. దానిమీద 40 మిల్లిమీటర్ల ఫిరంగులు రెండూ ఆకాశంలోకి ఎక్కుపెట్టి వున్నాయి. పక్కలమీద అటూఇటూ పూర్వపు టార్పెడోల స్థానాలలో బారులుతీరి అమరివున్న మరతుపాకులుగట్టుమీదికి గురిచేసి వున్నాయి. హెల్మెట్లు (ఉక్కుటోపీలు) పెట్టుకున్న నావికులు ఈ పి. టి. ని, ఎల్. ఆర్. సి. పి. దరిగా చేర్చడానికై అటూఇటూ పరుగులుపెడుతున్నారు.

కెనెడీ ఇంజన్ల జోరు తగ్గించి బోటును నెమ్మదిగా గట్టుకూ ములుగుతున్న బోటుకూ మధ్యగా పోనిచ్చాడు. ఏ క్షణంలోనైనా శత్రువులు ఒక్కసారిగా ఉధృతమైన కాల్పులు జరపవచ్చు. ఈ సమయంలో గనక తనబోటు మీద ఒక తుపాకిపేలినా తనబోటు ఆ వెలుగులో శత్రువులకు స్పష్టంగా కనుపిస్తుంది. ఉత్తరక్షణంలో వాళ్ళు అద్భుతంగా గురిచూసి కొడితే... ఆపైన ఆలోచించడానికే కెనెడీకి భయంవేసింది.

బోటు ఎల్. సి.పి. ఆర్. పక్కగా రాగానే నావికులు ఎల్. సి. పి. ఆర్. లో తడిసిముద్దై ప్రాణాలు అరచేతిలో పెట్టుకూర్చున్న మెరైన్లనుతమబోటుమీదికిలాక్కోసాగారు.

ప్రాణదానం పుచ్చుకుంటున్న ఆ జీవులందరికీ కృతజ్ఞతలో ఆనందంలో మాటలు తడబడ్డాయి. కదలలేని ప్నైల్‌ను బో ఎక్కించడానికి కెనెడీసాయం అడిగాడు స్టీవెన్సు.

"లెఫ్టినెంట్! ఇక్కడో మనిషి కదలలేనంత ప్రమాద స్థితిలో వున్నాడు" అన్నాడు.

"అతనికి చోటుచేద్దాం" అన్నాడు కెనెడీ.

దాదాపు నలభైయ్యొభైమంది మెరైన్లు పి. టి. లోకి వలస వచ్చేశారు. పి. టి. జనంతో కిటకిటలాడిపోసాగింది. కాలూనే చోటుంటే ఇద్దరుమనుషులు సర్దుకుంటున్నారు. డే రూమ్ టాపుమీద, ఫాంటెయర్‌మీద సిబ్బంది తాలూకు గదులలో అంతటా క్రిక్కిరిసిపోయారు. పి. టి. నావికులు అటూఇటూ తిరగడానికికూడా వీలులేనంతరద్దీ.

"ఇంకా ఎవరన్నా వున్నారా?" అంటూ కెనెడీ కాక్‌పిట్‌నుండి ఒక్కకేక వేశాడు. అప్పటికే ఆలస్యం అయిపోయింది. శత్రువులు గట్టుమీదనించికాల్పులు జరపడమేకాదు. బార్జిల(తెప్పలు) మీద అట్నించీ ఇట్నించీ దండెత్తి చుట్టూ కూడతారేమోనని కూడా భయపడసాగారు.

"మేజర్ బిగ్గర్! అందరూ బోటెక్కేసినట్టేనా? అని

ఇక్కడే ఆఫీసరెవరో అడుగుతున్నాడు” అంటూ మెర్సెన్ ఓ కేక పెట్టాడు.

“ఓ కె. బోటు కదలొచ్చు” అన్నాడు బిగ్గర్.*

జపాను ఫిరంగుగుళ్ళ గురికి దొరక్కుండా దూరంపోవాలని బోటులో ప్రతిమనిషీ ఆరాటపడసాగాడు. కెనెడీ త్రాటిల్స్ని బాగా నొక్కాడు. ఇంజన్ గింజుకోడమే తప్ప బోటు పుంజుకోలేదు. కారణం తలకు మించిన బరువైపోవడం. అసలు అప్పటికే పి. టి. 59 కి ‘ముసలితనం’ వచ్చేస్తోంది. దార్ఢ్యం తగ్గి దడదడలాడడం మొదలైంది. కొత్తగా అమర్చిన భారీమరతుపాకుల బరువే దాన్ని కొంత కుంగదీసింది. దీనికితోడు అదనంగా అరవైడెబ్భైమంది వచ్చిపడడంతో బరువు నిజంగానే దుర్భరమైపోయింది. ఇప్పుడో ఇంకోక్షణానికో గట్టిగా ఓ కెరటం ఓ దెబ్బకొడితే అది ముక్కచెక్కలైపోతుందనిపించేలా వుంది పరిస్థితి.

---

*ఈపుస్తకం రచనచేసే సందర్భంలో ఈ సంఘటనగురించి గుర్తున్న విశేషాలు చెప్పమని కర్నల్ బిగ్గర్ను, డాక్టర్ స్టీవెన్స్ను రచయిత అడగడం జరిగింది. ఛాయ్సూల్దగ్గర ఆనాటి కటిక చీకటిలో తమనుకాపాడిన పి. టి. బోటు స్కిప్పర్ ఎవరో వాళ్ళ కీనాటివరకూ తెలీదట! ఈనాటి ప్రెసిడెంట్ కెనెడీయే ఆ కెప్టెన్ అని చెప్తే నమ్మలేకపోయారు. “పోదూ బుకాయిస్తున్నావు” అంటూ డాక్టర్ స్టీవెన్స్ మందలించాడు.

కిటకిటలాడే జనంమధ్య సన్నటి దారిచేసి ష్నెల్‌ను మెల్లిగా మోసుకొని కాక్‌పిట్ కింద కెనెడీ బసలోకి తీసుకు వెళ్ళి అతనిబంక్‌లో పడుకోబెట్టారు. పైన డెక్‌మీద ఒక మెరైన్‌కు ప్రాణభయంతో ఉద్రేకం హెచ్చయి మతిచెదరి పిచ్చికేకలు వేయసాగాడు. అతన్ని శాంతపరచడానికి బిగ్గర్ తంటాలు పడసాగాడు. అక్టోబరు 27 న వెల్లాలావెల్లా కేంద్రంనుండి ఈ నావికులంతా దండయాత్రకు తరలివెళ్తున్న ప్పుడు కెనెడీ వాళ్ళను చూశాడు. అంతా హుషారుగా, పక డ్బందీగా ఉన్నారు. ఇంతదిట్టమైన జట్టునెప్పుడూ చూడలేదని పించిందానాడు కెనెడీకి. అటువంటివాళ్ళని ఇవాళ యీస్థితిలో చూసేసరికి ఆశ్చర్యం కలిగింది. వారంరోజుల్లో ఏనుగల్లాటి వాళ్ళు పీనుగుల్లా తయారయ్యారు. ఆకలిగొన్న జనానికి బోటులో ఉన్నదంతా అడుగూ బడుగూ ఊడ్చిపెట్టాడు మావర్. కింద ఇంజన్‌రూమ్‌లో పెట్రోలు గేజ్‌మీదే ప్రాణాలుపెట్టుకున్న డ్రాడీకి పెట్రోలు అడుగంటిపోతూ వుండడం, దానికితగ్గట్టే బరువులాగలేక ఇంజను వేడెక్కిపోతూ వుండడం చూశాక బాధకూడా చల్లారి చప్పబడిపోయింది. నిరాశతో నిట్టూర్చాడు.

ఈ జనాన్ని చేర్చవలసిన అడంగు 'హోజా' రేవుకేసి దారిలోపడినతరువాత కెనెడీ కాక్‌పిట్‌దిగి తనబంక్‌లోకివెళ్ళి ష్నెల్‌కు ఏమైనా ప్రథమచికిత్సచేయాలాఅని కనుకున్నాడు.

ప్లాస్మాబాటిల్ ఒకటి సంపాదించి ఉన్నపరికరాలతో వీలైనంత మేరకు గాయాలను కట్టివేస్తానన్నాడు స్టీవెన్స్.

"నాకేం ఫరవాలేదుగా డాక్టర్ !" అన్నాడు ష్నెల్.

"దిగులుపడకు జిమ్మీ...నీకేంభయంలేదు" అన్నాడు స్టీవెన్సు.

ష్నెల్ మెరైన్ కోర్‌లో చేరేనాడు అతను హైస్కూలు విద్యాభ్యాసంచేసిన విల్ మెట్ నగరం పోస్టుమాస్టరు అతని గురించి సిఫార్సుచేస్తూ -పసివాడు ష్నెల్ తనకళ్ళముందు పెరిగి పెద్దవాడయ్యాడని, తన దేశానికి సమర్థంగాసేవచేసి పేరు తెచ్చుకోగలడని వ్రాశాడు.

వోజూచేరాక మెరైన్‌లందరినీ విమానవాహకనౌక (లాండింగ్ క్రాఫ్ట్) లోకి బదలాయించారు. ష్నెల్‌పరిస్థితి మాత్రం బాగులేదు. కదపడంకూడ ప్రమాదంఅన్నందువల్ల అతని పి. టి. లోనే వెల్లాలావెల్లాకు తీసుకువెళ్ళాలని నిశ్చయించారు. 'స్లాట్' కు అడ్డంబడి బయల్దేరేసరికి అర్ధరాత్రి అయింది. బోటు నడుపుతూనే ఘడియఘడియకూ కెనెడీ బంకులోనికివెళ్ళి అతని పరిస్థితి కనుక్కుంటూవచ్చాడు. ఖాళీగావున్న ఆ మసకచీకటిగదిలో ష్నెల్ పడివున్నాడు. ఛాతీమీద వీపుమీద తగిలిన గాయాలను డాక్టర్ కట్టివే

శాడు. అతనే ష్నెల్ చెయ్యిపట్టుకుని తోడుగా కూర్చు న్నాడు. జీవకళతగ్గిపోయి కాంతులారిపోతున్న ష్నెల్ కళ్ళు చూస్తే ఇక ఆశలేదని తేలిపోయింది. చివరకు అలాగే నవం బరు 3 రాత్రి ఒంటిగంటవేళ నడిసముద్రంలోని ఆ బోటు మీద కెనెడీగదిలో ష్నెల్ నిశ్శబ్దంగా ప్రాణంవిడిచిపెట్టాడు.

ఆ క్షణాన కెనెడీ ఆ గదిలో లేడు. నిస్త్రాణవచ్చిన స్టీవెన్స్ నెమ్మదిగా పైకివెగబాకి అతనికి తెలియజేశాడు. కెనెడీ ఏమీఅనలేదు. మౌనంగా తలఊపాడు. తెల్లవారు ఝామున మూడుగంటలవేళ పెట్రోలు అయిపోవడంతో ఇంజన్లు ఆగిపూరుకున్నాయి. కూడావస్తున్న రెండో పి. టి. బోటు తాడుఅందించి అక్కడినుండి లంబూలంబూకు పి. టి. 59 ని లాక్కువెళ్ళింది.

కెనెడీకి సంబంధించినంతవరకు యుద్ధంలో అతని ఉద్యోగకాలం అయిపోవచ్చింది. కారణం–అతని ఆరోగ్యం. బ్లాకెట్ స్ట్రెయిట్ లో ప్రమాదసంఘటనవల్ల తిన్న దెబ్బ, ఆ హైరానా–ఆ తరవాత గంటలతరబడి నీటిలో ఈదడం – వీటిఫలితాలు ఒక్కొక్కటే బయటికురాసాగాయి. నడ్డినొప్పి

పట్టుకుంది. తరుచు నీరసం, నిస్త్రాణ వచ్చేవి. పక్కటెముక లలో ఐదవదానికీ శాక్రమ్ (నడ్డిపూస) కీ మధ్యనుండే బిళ్ళ దెబ్బతింది. ఉద్ధృతమైన బోటుతాకిడివల్ల, నిరంతరంగా ఈదిన యాతనవల్ల, కలిగిన విపరీతమైన తాకిడి, శ్రమ ఎడ్రినల్ గ్లాండ్స (మూత్రపిండాలకు పైగావుండే నాళం)పై శాశ్వతమైన దెబ్బతీసి పాడుచేశాయి. ఆ పైన-బహుశా, అటాబ్రిన్ మాత్రలు లేకుండా అడవులమధ్య దిక్కుమాలిపడివున్నరోజుల్లో మలేరియాకూడా పట్టుకుంది. వెళ్లాలావెళ్లాలోనే డాక్టరుదగ్గరకు వెళ్ళాడు. ఆయనదారిన ఆయన కేసు పరిశీలనచేస్తూవుండగానే తనదారిన తను కెప్టెన్‌గిరీ కొనసాగిస్తూనేవచ్చాడు.

ఆరాత్రి బిగ్గర్‌దళాన్ని సురక్షితంగా వోజాచేర్చినతరువాత పి. టి. 59 మరినాలుగుబోట్లుకలిసి ఛాయిసూల్‌కు తిరిగి వెళ్ళాయి. రెండవ మెరైన్‌దళం తలపెట్టినదాడి పూర్తిఅయినందువల్ల మరి మూడుబోటుల (లాండింగ్ క్రాఫ్ట్) మీద మెరైన్‌లు బయలుదేరారు. వాటిని ఈ పి. టి. లు తీసుకువెళ్ళాయి. నవంబరు 8-9 రాత్రి కెనెడీబోటు, మరి మూడు పి. టి. లు కలిసి ఛాయిసూల్ అఖాతంలో జపాన్‌వారి బార్జిలకోసం గాలించాయి. నవంబరు 11-12 రాత్రి మోరీ దీవినుండి ఛాయిసూల్‌కు పోతూపోతూ దారిలో ఎమరాల్డు ఎంట్రెన్సునుండి బయటకువస్తున్న రెండుబార్జిలనుచూసి వెంట తరిమాడు. కాని అవి వెనుదిరిగి హార్బరులోకి సురక్షితంగా పారిపోయాయి.

నవంబరు 13-14 రాత్రి కెనెడీ తిరిగి థాయిసూల్ అఖాతంవైపు వెళ్ళి పిపాసా, గప్పీ దీవులమీద కాల్పులు జరిపాడు. తిరిగి లంబూలం చేరుకుంటూవుండగా తెల్లవారు జామున 4-35 గంటలకు ఒకశత్రువిమానం పి. టి. 59 మీాదికి వచ్చింది. వెంటనే బోటుమీాది గన్నర్స్ కాల్పులారంభించారు. విమానం మాయమైపోయింది.

బోటుమీాది గన్నర్ (కాల్పుల) దళానికి ఆదినించీ చివరివరకూ దారిలో గట్టుమీాదవున్న జాపనీస్ మరుగుదొడ్డిని పేల్చివెయ్యాలన్న సరదా అలాగే ఉండిపోయింది. చివరి రోజుల్లో ఒకనాడు గస్తీముగించి రేవుకుపోతూండగా దారిలో అదివున్నదీవి తగలగానే గన్నర్లు గొడవపెట్టారు ఎప్పుడైనా దానిమీాద సైనికచర్య తీసికొనితీరాలని. ఇన్నాళ్ళూ సుత రామూ వీల్లేదని, మందుగుండుసామగ్రిని ఇలాటివాటిమీాద దండుగచెయ్యడం తప్పని కొట్టిపారేసిన కెనెడీకి ఈసారి ఎందుకో ఆ నియమాలను అంతగాపట్టించుకోవా లనిపించ లేదు. లక్ష్యశుద్ధికై కొంచెం సాధనచేస్తామని రేడియోలో అధికారులకుచెప్పి అనుమతితీసుకున్నాడు. 'ఫైర్' అంటూ ఉత్తర్వుజారీఅయింది. ఆ బీచిమీాద హిరోహిటో సామ్రాజ్యపు ఆఖరి 'భవనం' కాస్తా ముక్కచెక్కలైపోయి ధూళిలో కలిసిపోయింది.

పధ్నాలుగో తేదీన కెనెడీ తమ్ముడు రాబర్టుకు ఒక తమాషా ఉత్తరం రాశాడు. పదిహేడవ ఏట అతను నౌకా దళంలో ప్రవేశించాడన్న వార్త తెలిసి అభినందన పేరిట చిత్ర మైన వెటకారంతో ఆ ఉత్తరం రాశాడు.

రాబర్ట్ కెనెడీ
ది మిల్టన్ స్కూల్
మిల్టన్, కెనెక్టికట్.
నవం-14

డియర్ రాబర్టు! నేవీలో చేరుతూ నువ్వు ప్రమాణం చేస్తుండగా తీసిన ఫొటో, ఆ వార్త పడిన పత్రికను మనవాళ్ళు నాకు పంపించారు. పసివాడివైన నిన్ను ఫొటోలో చూస్తూ వుంటే నా హృదయం ద్రవించిపోయింది. ముఖ్యంగా లండన్ నుండి నేను తెచ్చుకున్న గళ్ళకోటు నువ్వు తొడుక్కున్నావన్న వైనం చూడగానే ద్రవించడం కాదు, నీరు కారిపోయిందంటే నమ్ము. నా కోటు తొడిగేసుకుని నువ్వక్కడ పోకు చెలా యిస్తూవుంటే- నే నిక్కడే సముద్రంలో ఎందు కఘోరిస్తూ న్నట్టు అని. ఎందుకూ అంటే పెద్ద లేవో కారణం చెప్పారనుకో- మన చిన్నారి చెల్లాయిలూ, చిట్టి తమ్ముళ్ళూ ఇంట్లో భద్రంగా కులాసాగా ఉండగలగడం కోసం మేమంతా తిరిగి యుద్ధాలు చేయాలని-నిజం చెప్పాలంటే నాకీ సంజాయిషీ అంతగా నచ్చ లేదనుకో-నువ్వు క్షేమంగా భద్రంగా ఉంటే నాకేం అభ్యం

తరంలేదు కాని—నా కోటేసుకుమాత్రం కాదు బ్రదర్-నా కోటుతోమాత్రంకాదు. ఆ బొమ్మలో నీవాలకంచూస్తే ఇప్పుడో ఇంకోక్షణానికో ఆగదిబయటికురికి తుపాకీ ఓటందుకొని భోజనాలవేళలోగా ఇంట్లో నౌకర్లందరినీ కాల్చేసారే ట్టుంది. నాన్నరాసినఉత్తరం చదివాక నీకళ్ళలో ఓడుతున్న ఆ దుర్మార్గపుచూపులకీ, ఆ కసికీ కారణం, గ్రోటన్‌తడాఖా అక్కడ తిప్పలుతలుచుకోవడకోవడ మేననిఅర్థమైంది. అక్కడ నువ్వు ఫిబ్రవరి 1 వరకూ ఉంటావని తెలిసింది. మంచిది. ఒంటికి చాలామంచిది. ఎందుకంటే మిల్టన్, గ్రోటన్ బహుశా ఛోట్ విద్యాపీఠాల క్రీడారంగంలోపడే బీజాలే తరువాతిసంవత్సరాలలో, ఇతరరంగాలలో నీకూ్కడా కుంగినవడ్డితోనో, విరిగిన మోకాలిచిప్పతోనో ఆస్పత్రిలో చేరడానికి దోహదం చేస్తాయి.

అంచేత ఓ దుర్మార్గుడా! గ్రాటీలను అదరగొట్టు. తుక్కురేగగొట్టు. తుక్కురేగిపోయి మూలబడుతున్నమీఅన్న సంగతి అడపతడప కనుక్కుంటూవుండు.

'ఫుల్ లూయీ' పదవికి ప్రమోషన్‌కోసం ఇప్పుడే శరీర దార్ఢ్యంలో పరీక్షయిచ్చాను. గుల్లగా దగ్గాను. గుడ్లు అటూయిటూతిప్పాను. రెండుమూడుసార్లు శ్లేశాను. కాని అంతా వృధా. కాని నిజాని కిక్కడ ఊరికే ఊపిరిపీల్చి వదలగలిగితే చాలు. 'ఎ వన్' (ఒకటవతరగతి) గ్రేడుయిచ్చేస్తారు. "ఎక్క-

డేనాసరే యాక్టివ్ డ్యూటీకి అర్థం" అని కితాబిచ్చేస్తారు. ఎక్కడేనాసరే అంటే ఏ ఎల్ మొరాకోవో అనిగాని, బాత్ అనిగాని, టెన్నిస్ క్లబ్ అనిగాని వాళ్ళ ఉద్దేశం అనుకోనేవు. ఎక్కడేనాసరే అంటే ఇప్పుడు నువ్వు పడున్నచోటే అని తాత్పర్యం. త్వరలోనే నిన్ను కలుసుకుంటాను-అనుకుంటూను. జాక్."

రెండవ ప్రపంచ యుద్ధంలో కెనెడీ పనిచేసిన ఆఖరురోజు నవంబరు 16-17 ఆరాత్రి రెడ్ మాన్ ద్వీపంచుట్టు పక్కల స్థితిగతులెలావున్నాయో చూదామని స్లాట్ దాటి గ్స్తీకి వెళ్ళాడు. విశేషాలేమీ జరగలేదు. నవంబరు 18 న పి. టి. 59 లాగ్ బుక్ లో యీ విధంగా రాసివుంది :

స్థావరంలో కట్టి వుంచబడింది. 0800-మస్టర్ (హాజరు పిలవడం) తీసుకోబడింది. ఎవరూ గైర్ హాజరు కాలేదు.

0900-బోటులో 700 గాలన్ల పెట్రోలు వేసుకోబడింది. తరవాత బులోవా* చేరుకుంది.

*దీన్ని బిలోవా అంటారు, వెల్లాలావెల్లా దక్షిణభాగంలో ఉంది. ఇక్కడ మిత్రరాజ్యాలకు ఒక విమానాశ్రయం ఉండేది.

లంబూలంబూలో ఉత్తర్వుల
ప్రకారం లూటినెంట్ జె. కెనెడీ
బోటును వదలి వెళ్ళిపోయారు.
(ఎన్సైన్ జె. మిచల్, పి. టి. 59
కొత్తకెప్టెన్‌గా వచ్చాడు).

పి. టి. 59 బిలోవాలో లంగరువేయగానే డెక్ మీదికివచ్చి సిబ్బంది అందరితో హాండ్‌షేక్ చేశాడు. అప్పటికి అతను బాగా చిక్కిపోయాడు. నీరసంగావున్నాడు. పి. టి. 109 లో తనతోఉన్న సిబ్బందిలో మాగ్వైర్, కోవల్, డ్రాడీ, డ్రెవిచ్, మావర్‌లు ఇపుడు 59 మీద ఉన్నారు. ముఖ్యంగా వారిదగ్గర సెలవుతీసుకోవడం చాలా కష్టమైంది.

"ఎప్పుడైనాసరే నావల్ల కావలసిందేమన్నావుంటే చెప్పండి. నేనెక్కడదొరుకుతానో ఎప్పటికప్పుడు మీకు తెలుస్తూనే ఉంటుంది" అన్నాడు కెనెడీ. కాలంగడచినకొద్దీ కెనెడీ ఎడ్రసు తెలుసుకోడం మరీసులువు కాసాగింది.

సిబ్బందిదగ్గర సెలవుతీసుకొని బోటును కొత్తకెప్టెన్ మిచెల్‌కు ఒప్పగించి విమానాశ్రయంవైపు నడిచాడు కేనెడీ.

ఇల్లుచేరేముందు దారిలో బెవర్లీహిల్స్‌లోదిగి రెండు మూడురోజులు స్నేహితులతో గడిపాడు. మెక్‌మహన్ భార్య లాసేంజెల్స్‌లో ఉందని తెలిసి టెలిఫోన్ చేశాడు. వెళ్ళిచూదా మనుకున్నాడుగాని మళ్ళా ఊళ్ళోకివెళ్ళేటంతఓపిక లేకపో యింది. అందుకని ఆవిడేవచ్చి ఓపూటవుండివెళ్ళింది. చాలా నీరసంగా పాలిపోయి వున్నాడనిపించిం దామెకు. బ్లాకెట్ స్ట్రెయిట్‌లోజరిగిన సంఘటనను విపులంగా వర్ణించి చెప్పాడు. ప్లమ్‌పుడ్డింగ్, ఓలసానా దీవులలో ఆమెభర్త పాటుపడినఅవస్థ లన్నీ వర్ణించాడు. టులగీఆస్పత్రిలో తాను అతన్నిచూసివచ్చే నాటికే బాగున్నాడనీ తేరుకుంటున్నాడనీ చెప్పాడు. తరు వాత కొన్నాళ్ళల్లో కాలినగాయాలన్నీ పూర్తిగా మాని పోయాయి.

మియామీలో కొద్దిరోజులపాటు పి. టి శిక్షణకార్య క్రమంలో డ్యూటీవేశారు కెనెడీకి. అక్కడుండగా మార్గ్వె ర్‌కు ఒకఉత్తరం టైప్ చేశాడు:

"మొన్న సర్వేబోర్డువారు పిలిపించారు. బయటకు పోతున్నట్టే లెక్క. మళ్ళా మామూలుపౌరుడుగా సినిమాకు వెళ్తే టిక్కెట్టుకు పూర్తి రేటు అచ్చుకోవడం అంటే తమాషాగా ఉంటుందనుకుంటాను. మొత్తంమీద మనవాళ్ళంతా బయటపడి ఇళ్ళుచేరితే తప్ప అంత తృప్తిగా ఉండదు. రేపు క్రిస్‌మస్ పండుగనాటి కిల్లుచేరి మావాళ్ళమధ్య ఉంటాను."

జార్జియాలో కెర్నీ యింటికి టెలిఫోను చేసి అతనికుటుం బానికి సానుభూతి తెలియచేశాడు. మెల్విల్ లో ఉన్న జాన్ స్టన్ కు కబురంపి స్ప్రింగ్ ఫీల్డులో మార్నీ కుటుంబాన్ని చూసి రమ్మని పంపించాడు. 1944 వ సంవత్సరములో ఆరోగ్యం బాగా దెబ్బతింది. బరువు 125 పౌనులకు తగ్గిపోయింది. బాస్టన్ లోని న్యూయింగ్లండ్ బాప్టిస్టు హాస్పిటల్ లో చేరి డిస్క్ ఆపరేషన్ చేయించుకున్నాడు. తరువాత అలాటిదే మరోటికూడా చేయించుకున్నాడు. అక్కడ వుండగా చూడ వచ్చిన వారిలో జాన్ స్టన్ ఒకడు రివాజైన బండపద్ధతిలో దూకుడుగా గదిలోకివచ్చి "ఏయ్! నిన్ను మార్చి మరమ్మతు చేశారా?" అన్నాడు. అక్కడ వుండగా మార్నీకుటుంబం కూడా కెనెడీని చూసి వెళ్ళింది.

ఆవేసవిలో కెనెడీ క్రమంగా కోలుకొన్నాడు. దక్షిణ పసిఫిక్ లోని సహచరులంతా తిరిగి మెల్విల్ చేరుకున్నారు. ఆగస్టులో థామ్, రాస్, ఫే, రీడ్ లను కెనెడీ హాయనీస్ పోర్టులో రెండురోజులు సరదాగా గడిపివెళ్ళమని పిలిచాడు. ఈపడుచుకారుకు హుషారులో వీళ్ళందరినీ మించిన ముసలి కారు—కెనెడీ తాతగారు హనీఫిట్జ్ జతపడ్డాడు. ఐరిష్ కథలూ కబుర్లూ చెప్పి, తెగనవ్వించాడు. ఇంకో రెండు తప్పుడుకథలు చెప్పి, చెప్పినందుకు భార్యచేత చివాట్లు తిన్నాడు.

దరిమిలాను ఒకసారి కెనెడీ, జాన్‌స్టన్, మాగ్వైర్, మెక్‌మహన్‌లు బాస్టన్‌లో 'వార్ బాండ్' విక్రయ కార్య క్రమంలో పాల్గొన్నారు. అప్పుడు మళ్ళీఓసారి హాయనీస్ పోర్టులో రెండురోజులు కులాసాగా గడిపారు. మెక్‌మహన్ జాన్‌స్టన్‌లు సతీసమేతంగా వచ్చారు. అప్పటికి పెట్రోలు రేషనింగ్ ఇంకా సమస్యగానే ఉంది. సౌత్ పసిఫిక్‌లో నేర్చిన విద్యలధర్మమాఅని మెక్‌మహన్ నెమ్మదిగా మెల్విల్ కేంద్రంలోని ఒక పిటి బోటులో కాస్త పెట్రోలు గ్రహించి తన 1936 ఫోర్డు శకటంమీద బయలుదేరి ఎలాగో చేరుకు న్నాడు. మళ్ళీ తిరుగుప్రయాణానికి పెట్రోలు కెనెడీ ఎలాగో సర్దుబాటుచేశాడు. 1946 లో జాన్సన్‌విల్ బీచిలోఉన్న మాగ్వైర్‌ను బాస్టన్‌లో జరిగే విదేశయుద్ధవీరులసభకు ఆహ్వా నించాడు కెనెడీ. అప్పుడే రాజకీయరంగంలో ప్రవేశిస్తున్న కెనెడీ ఆసభలో పాల్గొన్న ముఖ్య ఉపన్యాసకులలో ఒకడు. ఆయేడాది హేమంత ఋతువులో కెనెడీ ప్రతినిధుల సభ సభ్య త్వానికి అభ్యర్థిగా నిలబడి గెలిచాడు. ఎన్నికల ప్రచారంలో కాలిఫోర్నియానుండి ఫే వచ్చి తోడ్పడ్డాడు.

తరవాత కొన్నేళ్ళపాటు కెనెడీ తనసహచరులను కలుసుకోవడం అంతగా సంరర్భపడలేదు. వాళ్ళూ దేశం నలుమూలలా చెదిరిపోయారు. వాళ్ళ ఉనికి అతనికి తెలియక

పోయినా అతనిఉనికి, పురోభివృద్ధి వాళ్ళలో ప్రతిఒక్కరికీ వాళ్ళ ఇళ్ళనుండే గమనించే అవకాశంవుంది. కెనెడీ ముందడుగు వేసినప్పుడల్లా వాళ్ళు ఆనందంతో ఉప్పొంగిపోయేవారు. ప్రతినిధుల సభకు మూడుసార్లు ఎన్నిక అయి పేరు తెచ్చుకొని, ఆపైన సెనేట్‌కి ఎన్నికఅయినపుడు, దరిమిలాను 1956 లో షికాగోలో జరిగిన డెమోక్రటిక్ మహాసభలో దాదాపు ఉపాధ్యక్షపదవికి అభ్యర్థిత్వం సంపాదించేటంత దాకా వెళ్ళినపుడు వాళ్ళు గర్వపడ్డారు. ఆ ఎన్నికలో అతి కొద్ది ఓట్ల తేడాతో సెనేటర్ ఎస్టెస్ కెఫావర్ ఆ స్థానం సంపాదించుకున్నాడు.

కెప్టెన్‌కీ అతని సిబ్బందికీ ఎడబాటు అనేది 1960 లో కెనెడీ అధ్యక్షపదవికి పోటీచేయడంతో అంతమైంది. విస్కాన్సిన్ ప్రైమరీ ఎన్నిక సందర్భంగా మిల్‌వాకీలో ప్రచారోద్యమం ఆరంభించినవేళ ఆ కబురు అందుకుని జాన్‌స్టన్, రాస్‌లు వచ్చి కెనెడీకి తోడ్పడ్డారు.

లాసేంజెల్స్ సభలో కెనెడీకి అభ్యర్థిత్వం లభించిన నాటినుండి ఎన్నికలో అతని విజయంకోసం అతని పి. టి. బోటు సహచరులు చాలామంది చాలాకష్టపడి పనిచేశారు. ఇల్లినాయ్, బారింగ్‌టన్‌లో సిటిజెన్సు ఫర్ కెనెడీ సంఘానికి (కెనెడీని బలపరచే పౌరులసమితి) రాస్ అధ్యక్షుడయ్యాడు.

జాక్సన్‌విల్‌బీచిలో కెనెడీ పౌరసమితి కార్యాలయం నెల కొల్పడానికి మాగ్వైర్ ఒక వ్యాపారస్థుడిచేత ఒకస్టోరు విరాళంగా ఇప్పించాడు. అక్కడ కెనెడీకి వంద పైచిలుకు మెజారిటీతో మాటదక్కింది. ఇలినాయ్, షాంపేన్‌కౌంటే సమితికి డ్రేవిచ్ అధ్యక్షుడై పనిచేశాడు. రాష్ట్రమంతా తిరిగి ప్రచారం చేస్తూ ఎన్నోచోట్ల ఉపన్యాసాలిచ్చాడు. కాలిఫోర్నియా కెథిడ్రల్ సిటీలో మెయిల్ కారియర్‌గా పనిచేస్తున్న పాట్ మెక్‌మహాన్ దిగాలుపడి కూర్చున్నాడు. హాచ్ చట్టం క్రింద ఫెడరల్ ప్రభుత్వోద్యోగిగా అతను ఎన్నికల ప్రచారాలల్లో పాల్గొనడం నిషిద్ధం.

నాయకుడికీ, సహచరులకూ బ్రహ్మాండమైన పునస్సమాగం 1961 జనవరి 20 న వాషింగ్‌టన్‌లో సందర్భపడింది. ఆరోజున తమ పి. టి. సారథి దేశానికే సారథ్యం వహించే అధ్యక్షుడు అయ్యాడు. 35 వ ప్రెసిడెంటుగా వాషింగ్‌టన్‌లో ప్రమాణస్వీకారం చేయబోయే వేళ, ఆదృశ్యంచూసి ఆనందించి అభినందించడానికి సహచరులంతా ఎక్కడెక్కడివారో వాషింగ్‌టన్ చేరుకున్నారు. పదవీస్వీకారం రేపనగా ఇవాళరాత్రి వాళ్ళతో సమావేశం ఏర్పాటుచేసుకున్నాడు. కాని పి. టి. 109 పీడతాలూకు క్రీనీడ పూర్తిగా తొలగిపోలేదు కాబోలు-ఆరాత్రి కొన్ని దశాబ్దాలుగా వాషింగ్‌టన్

ఎరగనంత ప్రచండమైన హిమవర్షం విజృంభించి ఎక్కడ వాళ్ల నక్కడనిలిపివేసింది. ఎంతప్రయత్నించినా కెనెడీ అక్కడికి చేరలేకపోయాడు.

అధ్యక్షుడుకాగానే అతనుచేసిన మొట్టమొదటి కార్యాలలో చెప్పవలసినది ఒకటివుంది‒ ఆనాటి అభినందన స్వీకార కార్యక్రమంలో ఊరేగింపులు జరిగేవేళ‒అతని సహచరులంతా ఎక్కడో బ్రాకెట్ స్ట్రెయిట్ సముద్రంలో అట్టడుగున పడివున్న పి. టి. 109 కి ప్రతిరూపంచేయించి దానిమీదఊరేగి వచ్చారు. కెనెడీ ఆనందోద్వేగంతో చేయివూపి విశాలంగా, హాయిగా, గర్వంగా నవ్వి అభినందన లిచ్చిపుచ్చుకున్నాడు.

ఆ బోటుమీాద ప్రెసిడెంటు కెనెడీ గడించిన అనుభవాలు, దానివల్ల అతనికిగలిగిన బాధ అతనికి శక్తినిచ్చాయి. వివేకం యిచ్చాయి. ఆత్మవిశ్వాసాన్ని పెంచాయి. సమర్థుడుగా తీర్చిదిద్దాయి. బహుశా పి. టి. 109 మీాద పనిచేసివుండకపోతే కెనెడీ వైట్‌హౌస్‌పీఠం ఎక్కగలిగివుండేవాడు కాడేమో?

# రచయితని గురించి

వాషింగ్టన్‌లోని అగ్రశ్రేణి పత్రికా విలేఖరులలో ఒకరైన రాబర్ట్ జె. డోనవాన్ తన విలేఖరిజీవితాన్ని 1933 లో బఫెలో కొరియర్ ఎక్స్‌ప్రెస్‌తో ప్రారంభించారు. ఈనాడాయన న్యూయార్క్ హెరాల్డుట్రిబ్యూన్ పత్రిక వాషింగ్టన్ కార్యాలయాధికారి. అమెరికన్ అధ్యక్షుల ప్రపంచపర్యటన వార్తలనన్నిటినీ ఆయన అందించాడు. 1948 లో ప్రెసిడెంట్ ట్రూమన్ "విజిల్-స్టాప్" ప్రచారకార్యక్రమంలోను, జనరల్ మెకార్థతో సమావేశానికి వేక్ ఐలండ్‌కు ప్రెసిడెంట్ ట్రూమన్ వెళ్ళినపుడు వీరు విలేఖరిగా ప్రెసిడెంటుతో పర్యటించారు. 1952, 1956 లో ప్రెసిడెంట్ ఐసన్‌హోవర్ యూరప్, ఇండియా, దూరప్రాచ్యదేశాల పర్యటనల సందర్భంలోకూడా వీరు వెంటవున్నారు. "ది ఇన్‌సైడ్ స్టోరీ" "ది ఎస్సాసిన్స్" గ్రంథాలను రచించటమేగాక "మై ఫస్ట్ ఫిఫ్టీ ఇయర్స్ ఇన్ పాలిటిక్స్" గ్రంథాన్ని జోసఫ్ డబ్ల్యు. మార్టిన్

తో కలసి వ్రాశారు. 'ది న్యూయార్కర్' "ది సాటర్ డే ఈవి నింగ్ పోస్టు" 'హార్పర్స్' వంటి పత్రికలకు ఆయన విలేఖరిగా వ్యవహరించారు. జాన్ ఎఫ్. కెనడీ సెనెటర్ గా ఉన్న తరుణంలో రాజధానిలోని పత్రికావిలేఖరిగా ఆయనతో పరిచయమేర్పడింది. 1960 ఎన్నికలతరుణంలో డెమోక్రటిక్, రిపబ్లికన్ల ప్రచారాంశాల వివరణకు తను కాలాన్ని కేటాయించుకుని పనిచేశారు. తదుపరి కెనెడీ ప్రెసిడెంట్ పదవి అధిరోహించటానికిముందు ముఖ్యాంశాలవార్త లన్నిటినీ సంగ్రహించారు. పత్రికావిలేఖరిగా కెనడీ పర్యటనలో ఆయనకూడా నలుమూలలా పర్యటించారు.



క్షణకాలం విశ్రాంతి : సాల్ మన్స్‌లో లెఫ్టినెంట్ కెనెడి



తులగి నౌకాశ్రయంలో పిటి స్క్వాడ్రన్



సాలమన్ దీవులలో తులగి నౌకాశ్రయంలో లెఫ్టినెంట్
కెనెడి మొదటిస్థావరం—కల్విర్టుపిల్లా



జార్జి 'బార్నీ' రాస్ లియోనార్డ్ జె. థామ్ విలియంజాన్‌స్టన్



రేమండ్ స్టార్కి, పాట్రిక్ మక్‌మహన్, లియాన్ బ్రాడీ.



దక్షిణ పసిఫిక్‌లో ఒకానొకచోట 1943 జూలై ఆరంభంలో (న
పిటి నావికులతో జాన్ ఎఫ్. కెనెడి



తులగి స్థావరంలో ముందువరుస। లెఫ్టినెంట్ రీడ్' లెఫ్టినెంట్ కెనెడి'
లెఫ్టినెంట్ ఫీ' వెనుక లెఫ్టినెంట్ రాస్.



పటి- 109 చోదక చక్రంవద్ద లెఫ్టినెంట్ కెనడి.



గెరాల్డెజిన్సర్' జాన్‌యి మగారే' చార్లెస్ "బిక్కీ" హారిస్.



పిటి 109 స్థావరమైన సాలమాన్ దీవులకు రచయిత వెళ్ళి దీసుకు వచ్చిన ఛాయాచిత్రాలను పరికిస్తున్న ప్రెసిడెంట్ కెనెడీ రచయిత.



పద్దెనిమిదేళ్ళ క్రితం పిటి-109ను రక్షించిన స్థానికులి ఎవరితో కొలంబంగారా తీరానికి చేరుకుంటున్న రచయిత. ఛాయాచిత్రకారుడు ఇలియట్ ఎర్విట్.



బ్లాకెట్ జలసంధిలో 1943 అగష్టు 2వ తేదీన జపాన్ డిస్ట్రాయర్ 'అమగిరి' దెబ్బతో మునిగిపోతున్న పి టి-109.
యు. ఎస్. ఎన్. ఆర్ కెప్టెన్ గెరార్డ్ రిచర్డ్ సన్ తీసిన నౌకాదళ అధికార ఛాయాచిత్రం.



కెనెడీ తననావికులతో బాటు ఈదిన ప్లమ్ పుడ్డింగ్ దీవి తీరము.
ఒక చెక్క ముక్క పట్టుకుని నావికులు తీరానికి
ఈదుతున్న ఈదృశ్యం తిరిగి చిత్రించబడినది.



తునాతునకలైన తమనౌకనుండి కెనెడి, పరివారము ప్లమ్ పుడ్డింగ్ తీరానికి ఈదినమార్గాన ఈగ్రంథ రచయిత ఈదుతున్న ద్రశ్యం.



బైకు - ఎరోని

కెనెడి కొబ్బరితొక్క వార్తను
చెక్కిన చోటనే, ఆవార్తను
అందించిన బైకుతో
చిత్రీకరించబడింది.



ఆల్సానాదీవినుండి గోము దీవిలోని కోస్టవాచర స్థావరానికి కెనెడీని, చేరవేసిన ఏడుగురు స్థానికులలో ఆరుగురిని ఈ చిత్రంలో చూడవచ్చు.



లెఫ్టినెంట్ కెనెడిని అల్సానా నుండి
గోముదీవికి చేరవేస్తున్న
ఏడుగురు స్థానికులు.



ఇంగ్లీషు మాట్లాడ
గలిగినవారి
నాయకుడు
కేవూ.



అల్సానా తీరాన చావగా మిగిలినవారిని
రక్షించ వచ్చినవారి చిత్రం



పిటి_109సిబ్బందిని రక్షించటానికి అల్సానా చేరుతున్న ఏడు గురుస్థానికులు.



యుద్ధానంతరం కెప్టెన్ కెనెడి పరివారాన్ని గూర్చి కొలం
బంగారా దీవిలో పాడే జానపద గీతాలను ఆలపిస్తున్న
స్థానిక బాలురు.



కెనెడీ వార్త నుల్లేఖించిన కొబ్బరి డొక్క.



పి. టి - 109 ని 1943 ఆగష్టు 2వ తేదీన
తుత్తునియలు చేసి ముంచి వేసిన జపాన్
డిస్ట్రాయర్ ' అమగిరి '



జపాన డిస్ట్రాయర్ 'అమగిరి' కెప్టెన్ కొహిహానామి, ఆయన అనుచరులు. బృందంతో 1961 జూన్‌లో ఈ గ్రంథ రచయిత విందు ఆరగించబోవుటకు ముందు దృశ్యం.



11వ డిస్ట్రాయక్ ఫ్లొటిల్లా కమాండక్–పి టి. 109ని ముంచి
వేసిన రాత్రి అమగిరి నౌకలో ఉన్న ఉన్నతాధికారి
కెప్టెన్ యమాషిరో.



పి. టి నావగుర్తు – దోమ, టార్పెడో.



గెరాల్డ్ జిస్నర్, ఎడ్గార్ మావర్. మారిస్ కోవల్
మొదలైనవారు



1943 సెప్టెంబర్‌లో మొదటిసారిగా జలప్రవేశం చేయబడిన
పి. టి. 59 కాక్‌పిట్‌పై లెఫ్టినెంట్ కెనెడి కూర్చున్నారు.



యునైటెడ్ స్టేట్స్ నావీ కెప్టెన్ ఫ్రెడరిక్ యల్. కాంక్లిన్
1945లో లెఫ్టినెంట్ జాన్ ఎఫ్. కెనడీకి నావీ అండ్
మెరైన్‌కోర్ పతకాన్ని బహుకరిస్తున్న దృశ్యం



౩ నౌక ఢీకొని తాను కాక్‌పిట్ వెనుక భాగానికి కొట్టుకొని వెన్నుదెబ్బ తిన్న సమయంలో చోదక చక్రం వద్ద తన స్థానాన్ని ఒక నమూనా నావలో రచయితకు సూచిస్తున్న ప్రెసిడెంట్ కెనడీ.



1943 నవంబరు 2న మిగిలిన నౌకాగస్తి బృందాన్ని ఛైసూల్
దీవిలో వారియర్ నదీ తీరాన లెఫ్టినెంట్ కెనడీ మారిన్
గస్తీ దళాన్ని రక్షించిన చోట ఈ గ్రంథ రచయిత
త్రవ్వి తీసిన జపాన్ సైనికుని శిరస్త్రాణము-పుర్రె.